# జీవన చిత్రాలు

## ( రామాయణ పాత్రలు )

డాక్టర్
అప్పజోడు వేంకట సుబ్బయ్య
ఎం. ఏ. పిహెచ్. డి

# స్పందన

ప్రకృతిలో ఔన్నత్యానికి, ఉదాత్తతకు, ధైర్యానికి సంకేతం పర్వతం. వైశాల్యానికి, గాంభీర్యానికి, ఆర్ద్రతకు ప్రతిబింబం సముద్రం. భారతదేశంలో ఉత్తరాన చివర ప్రపంచంలో కల్లా ఎత్తైన హిమాలయాలున్నాయి. అవి హిమాలయాలు మాత్రమే కాదు — మహిమాలయాలు: హైందవ సంస్కృతికి దేవాలయాలు. అలాగే దేశానికి దక్షిణం చివర వ్యాపార కలుషితంగాని మహాసముద్ర సంగమం ఉంది అది ఏదో రెండు మహాసముద్రాల సంగమం మాత్రమే కాదు. భారత దేశంలోని భిన్న భాషలకు, భిన్న సంస్కృతులకు, భిన్న సంప్రదాయాలకు గల సమన్వయాని కది చక్కని తార్కాణం. అనేకత్వంలోని ఏకత్వానికి, అద్వైతానికి అది అచ్చుపు నిదర్శనం. ఆ మహాపర్వతం ముందు, ఈ మహాసాగరం దగ్గర నిలబడి చూసినపుడు ఒక్కసారి మీదికి, ముందుకు చూచి — అంతులేని ఈ విశ్వాంతరాళంలో, ఎంతో విశాలమైన ఈ భూగోళంలో తానెక్కడున్నాడో, తన గొప్పతనమెంతో ఊహించుకొంటే అతని ఆలోచనాక్రమమే మారిపోతుంది.

పవిత్ర భారతదేశంలో పుట్టి ఆ హిమాలయాలను, ఈ కన్యాకుమారిని దర్శించకుండ ఒక వ్యక్తి మరణిస్తే అతని భౌతిక జీవితం ఈ భూమి మీద ఎంత అసమగ్రమో అనిపిస్తుంది. అలాగే మన భారతీయ సాహిత్యంలో హిమాలయంలాంటి మహాభారతాన్ని, మహాసముద్రంలాంటి రామాయణాన్ని అనువాదరూపంలోనైనా చదివి ఆనందించకుంటే — అతని మానసిక జీవితం ఎంత నష్టపోయిందో అని అనిపిస్తుంది. అవి యావత్ప్రపంచము ప్రస్తుతించిన మహాగ్రంథాలు. మతరహిత రాజ్యాలేగాక, మతవ్యతిరేక రాజ్యాలు గూడ మనఃపూర్వకంగా గౌరవించిన మహాగ్రంథాలు.

మహాభారతం ఒకనాటి దేశచరిత్ర: మన ధర్మచరిత్ర: మానవ మనస్తత్వ చరిత్ర. రామాయణం మహోన్నతత్యాగ చరిత్ర: మహాపురుష చరిత్ర. ఒకటి మన సంస్కృతికి మెదడైతే మరొకటి హృదయం. ఒకటి ఆలోచనామృతమైతే మరొకటి అనుభూతి మధురం.

పవిత్ర హృదయంతో భారత భాగవత రామాయణ భగవద్గీతల్ని నిరంతరం పారాయణం చేసే పితృదేవులు ప్రియమార నన్ను తొడపై కూర్చుండబెట్టుకొని బాల్యంలో నూరిపోసిన ఆ మహాగ్రంథాల కథలు నా మనస్సులో బలంగా గూడు కట్టుకొన్నాయేమొ! పూజ్య గురుదేవులు శ్రీ శ్రీరాం వేంకట భుజంగరాయశర్మగారు తరగతి గదిలో రసోజ్జ్వలంగా చెప్పిన ఆ యాగ్రంథభాగాల పాఠాలు బలంగా నా హృదయాన్ని ప్రభావితం చేశాయేమొ! భారత భాగవత రామాయణాలను అధ్యయనం చేయ్యాలనీ, నా ఆలోచనలను, అనుభూతులను గ్రంథరూపంలో వెలయించాలనీ విద్యార్థి దశనుండే నాలో ఒక వింత కోరిక. దైవానుగ్రహం దానికి లభించినట్లుంది. విద్వద్వరేణ్యులు పూజ్యపాదులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు దయతో కల్పించిన అవకాశంతో పి.హెచ్. డి. పట్టం కొరకు మహాభారతం మీద పరిశోధన చేయటము, ఆ మహాగ్రంథంలో చిత్రితమైన మానవ స్వభావాన్ని వివిధ కోణాల్లో నుండి దర్శించటము, "మహాభారతము – మానవ స్వభావచిత్రణ" అనే గ్రంథాన్ని 1977 లో ప్రచురించటము జరిగింది. ఆ గ్రంథాన్ని గూర్చి అల్పవ్యవధిలోనే అందిన రసజ్ఞపాఠకప్రశంసలు వెంటనే నా దృష్టిని రామాయణం వైపు పరుగులెత్తించాయి. అయినా అనేక కారణాలవల్ల 1979 దాకా ఆ మహాకావ్యాన్ని చేపట్టటానికి పరిస్థితులు అనుకూలించలేదు.

రామాయణం అనగానే తెలుగులో ఏ రామాయణం అన్న ప్రశ్న ఎదురౌతుంది. అందుచేత వాల్మీకి రామాయణాన్నే చదివి, ఆ శ్రీరామచంద్రుని జీవిత మార్గంలో నేను దర్శించి, పులకించిన పాత్రల్నీ, సన్నివేశాల్నీ – నేను పొందిన అనుభూతుల్నీ పాఠకునికి ప్రత్యక్షమయ్యేలా చిత్రించాలని చేసిన ప్రయత్నఫలమే ఈ జీవన చిత్రాలు.

ఈ రచన పాత్రల ద్వారా పాఠకునికి రామకథ చెపుతుంది. ఆయా సన్నివేశాల్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించి చూపుతుంది. వివిధపాత్రల మనస్తత్త్వాలను, ఆదర్శాలను, అనుభూతులను అద్దంలో వలె ప్రదర్శిస్తుంది. మన సంస్కృతిని సంప్రదాయాలను ఆవిష్కరిస్తుంది.

అయోధ్య, కిష్కింధ, లంక—ప్రధాన కేంద్రాలుగా — నరులు, వానరులు, రాక్షసులు—ప్రధాన పాత్రలుగా ప్రవర్తిల్లిన రామాయణ మహాకథ నుండి ఇరవై యేడు పాత్రలను గ్రహించి ఇందు చిత్రించటం జరిగింది. వానిలో అహల్యవంటి పాత్రలు వివాదగ్రస్తాలు. బాలకాండలో ఆమెను గూర్చి ఉన్నదానికి, ఉత్తరకాండలో ఆమెను గూర్చి ఉన్నదానికి ఎంతో వ్యత్యాసం ఉంది. అయినా రెండింటినీ సమన్వయించి ఆ పాత్రను సమీక్షించటం జరిగింది. ఊర్మిళవంటి పాత్రలు రామాయణంలో నామమాత్రాలు. అయినా వాస్తవికతకు విరుద్ధం కాని విధంగా ఆ పాత్రను చిత్రించటం జరిగింది

అనుభూతి ప్రధానంగా సాగిన రచన కావటం చేత భావుకత విశేషంగా చోటు చేసుకొన్నా, అలంకారాలు అనేకం క్రొత్తవి రూపుదిద్దుకొన్నా అవి వాల్మీకి హృదయానికి భిన్నంగా లేవు. సామాన్య పాఠకుని చేత చదివించే గుణం రచనలో సాధ్యమైనంత ఎక్కువ ఉండాలన్న ఉద్దేశంతో ముఖ్యమైన మూల శ్లోకాలను గూడ మధ్య మధ్య ఉదాహరించకుండ వాటి భావాలనే వ్రాయటం జరిగింది.

మొత్తం మీద రామాయణ కావ్యం చదువని సామాన్య పాఠకునికి — రామకథ మీద రుచి పెంచటానికీ ఆ మహాకావ్యపాత్రల మీద మనస్సు మళ్ళించటానికి ప్రధానంగా ఉద్దేశించిన ఈ రచన—రామాయణాన్ని బహువారాలు పఠించిన పండితులను గూడ విశేషంగా ఆకర్షించగలదని నా విశ్వాసం.

అప్పజోడు వేంకట సుబ్బయ్య

# ఉషోదయం

రచన చేయుటకంటె ప్రచురించుట కష్టతరమైన ఈ రోజుల్లో
ఈ గ్రంథం వెలుగుచూడటానికి

తిరుమల తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహాయాన్ని అందించిన
కార్యనిర్వహణాధికారి -
మాన్యశ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
I. A. S. గారికి,

సంయుక్త కార్యనిర్వహణాధికారి -
శ్రీయుతులు డి. సుబ్బరాయులు,
I. A. S. గారికి,

సాహితీ తపస్వి, ప్రియవచస్వి,
మధురమనస్వి-పౌరసంబంధశాఖాధికారి -
శ్రీ రావుల
సూర్యనారాయణమూర్తి,
M. A. B. Ed. గారికి,

సప్తగిరి సంపాదక మహాశయుడు -
శ్రీ కె. సుబ్బారావు, M A. గారికి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి ఆ
సహాయాన్ని అందించిన ప్రియదర్శ
నవనవోన్మేష ప్రతిభా సంపన్న
సత్క్రియాచరణైకశీలురు
మాన్యశ్రీ పి. వి. ఆర్. కె. ప్ర
I. A. S.

మాన్యమహోదయులు, సాంస్కృ
వ్యవహారాలశాఖ డైరెక్టర్,
శ్రీ జి. వి. సుబ్బారావుగా

హృదయపూర్వక కృతజ్ఞతలు

# స్వగతం

జీవశక్తి గింజలోనే ఉన్నా అది మొలకెత్తటానికి, మీదికి ఎదగటానికి, ఫలవంతం కావటానికి పరిస్థితులు అనేక విధాల అనుకూలించాలి. అలాగే వాల్మీకి రామాయణం చదివి అనుసూరి ప్రధానంగా పాత్రల్ని చిత్రించాలన్నది నా చిరకాల సంకల్పమే అయినా - అది కార్యోన్ముఖం కావటానికి, ఈ గ్రంథ రూపంలో వెలువడటానికి అనేక విధాల ప్రోత్సాహ సహకారాలందించిన వారు —

సంగీత కళాతపస్వి, రసార్ద్ర మనస్వి, బ్రాహ్మీమయ తేజస్వి, యశస్వి పద్మభూషణ డా. శ్రీపాద పినాకపాణిగారు.

మాన్యమిత్రులు, సహృదయులు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యగారు

ముద్రణ కొరకు త్రోవ చూపిన ప్రియమిత్రులు, నంద్యాల కళాశాలాధ్యక్షులు శ్రీ ఎ. కులశేఖరరెడ్డిగారు.

అవ్యాజ ప్రేమతో మనసార ముద్రణ కార్యభారాన్ని తామై వహించి నన్ను నిశ్చింతగ ఉంచిన ఉదాత్త సంకల్పులు, ఉపకారపరాయణులు, గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాల వృక్షశాస్త్ర శాఖాధ్యక్షులు మిత్రశ్రీ ఎస్. చెన్నారెడ్డిగారు.

గ్రంథరచనకు అవసరమైన పుస్తకాలను సమకూర్చుకోవటంలో తోడ్పడిన రసజ్ఞ మిత్రులు శ్రీ కె. నాగిరెడ్డిగారు.

గ్రంథానికి చక్కని ముఖచిత్రాన్ని రూపొందించి ఇచ్చిన రమణీయ భావనా కుశలుడు, చిత్రకళా నిపుణుడు, అధ్యాపక మిత్రుడు, ప్రియ పూర్వ విద్యార్థి డా. టి. వి. సుబ్రహ్మణ్యం.

వ్రాతప్రతిని సిద్ధం చేయుటలో శ్రమకోర్చి ఎంతో భక్తిశ్రద్ధలతో తోడ్పడిన పూర్వవిద్యార్థి చి॥ ఎ. రవీంద్రనాథ్.

ప్రియమార ప్రూఫులు దిద్దియిచ్చిన విద్వన్మిత్రుడు శ్రీ ఎస్. లక్ష్మీపార్వతీశం.

వారలకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.



# సమర్పణం

శ్రీమన్ ! కృపాజలనిధే ! కృతసర్వలోక !
సర్వజ్ఞ ! శక్త ! నతవత్సల ! సర్వశేషిన్ !
స్వామిన్ ! సుశీలసులభాశ్రిత పారిజాత !
శ్రీ వేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే.

# స్వకీయం



కృతికర్త : డా. అప్పకోడు వేంకట సుబ్బయ్య, ఎం. ఏ., పిహెచ్. డి.
సహధర్మచారిణి — శ్రీమతి సరోజినీదేవి

జననము : 21–3–1935

జన్మస్థలము : చాగలకొండ (ఉదయగిరి తాలూక, నెల్లూరు జిల్లా)

తల్లిదండ్రులు : శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ, శ్రీ వేంకట సుబ్బయ్య

విద్యాభ్యాసము : ప్రాథమిక పాఠశాల — చాగలకొండ, ఉన్నత పాఠశాల — శ్రీ
వి. ఆర్. కళాశాల — నెల్లూరు, కావలి కళాశాల (జవహర్
కావలి, ఆంధ్ర విశ్వవిద్యాలయము - వాల్తేరు.

పరిశోధన : ఉస్మానియా విశ్వవిద్యాలయమున డాక్టరేట్ పట్టము కొరకు.

ఉద్యోగము : కావలి కళాశాలలో, అనంతపురం, గూడూరు ప్రభుత్వ కళాశాలల
ఆంధ్రోపన్యాసకులుగా; హైదరాబాద్, నంద్యాల ప్రభుత్వ
శాలలో ఆంధ్రశాఖాధ్యక్షులుగా; ప్రస్తుతం — కర్నూలు - సి
జూనియర్ ప్రభుత్వ కళాశాలలో — ఆంధ్రశాఖాధ్యక్షులుగా.

రచనలు : 1. వ్యాసమంజరి—సంభాషణ, రేఖ, కోరిక, కన్ను మొదలగు వి
యములపై సరస వ్యాస సంపుటి (ఆంధ్ర. శ్రీ వేంకటేశ్వర వి
విద్యాలయములలో పాఠ్య గ్రంథముగ నిర్ణీతము)

2. షట్పది—భువన విజయము, తెలుగు చాటువులు, అవధానము మొ
లగు విషయములను గూర్చిన సాహిత్య వ్యాస సంపుటి (ఆంధ్ర
శ్రీ వేంకటేశ్వర, ఉస్మానియా, మైసూరు విశ్వవిద్యాలయముల
పాఠ్యగ్రంథముగ నిర్ణీతము)

3. మహాభారతము — మానవ స్వభావ చిత్రణ
(ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి డాక్టరేట్ పట్టమును పొంది
పరిశోధన గ్రంథము)

4. జీవన చిత్రాలు (రామాయణపాత్రలు)

5. సజీవశిల్పాలు (భారతపాత్రలు)

# సూచిక

వాల్మీకి గిరి సంభూతా
రామాంభోనిధి సంగతా
శ్రీమద్రామాయణీ గంగా
పునాతు భువనత్రయమ్

# శబరి

అల వైకుంఠపురంలో అంగరంగ వైభోగంతో విరాజిల్లే ఆ శ్రీమహావిష్ణు [illegible]సిగ నలంకరించిన దివ్యపారిజాతపుష్పజీవితం ఎంత [illegible] అడవిలో మారుమూల ముళ్ళ పట్టుకొని పూచిన [illegible] వాడిపొయ్యే అడవిమల్లె జీవితం గూడ అంతే చరితార్థం. అన్నిపూలు [illegible] జాతాలు కానక్కరలేదు. కాలేవు గూడ. అన్నిపూలు ఆ శ్రీమహావిష్ణువు [illegible] నలంకరించే అవకాశము రాదు. రానక్కరలేదు గూడ. కాని శ్రీమహావిష్ణువు [illegible] నలంకరించిన పారిజాతం అందరి దృష్టి నాకర్షించి నంతగా ఎక్కడో మహాత్ముల పాదాలమీదపడి వాడిపొయ్యే అడవిమల్లె ఆకర్షించలేదు. అయితే మహాత్ముల దృష్టిలో మాత్రం రెండూ సమానమే.

రామాయణంలో శబరి ఒక అడవిమల్లెపుష్పం. ఆమె అడవిలోనే పుట్టింది. అడవిలోనే పెరిగింది. అడవిలోనే రాలిపోయింది. ఆమె అంతరంగం భక్తి భావంతో పరిమళించింది. ఆమె జీవితం మహర్షుల సేవకు అంకితమైంది. పరి చారికాభక్తికి ఆమె పెట్టినపేరు. శబరి తల్లిదండ్రులెవరో తెలీదు. ఆమె ఎందుకని పెళ్ళాడలేదో అసలే తెలీదు. శబరి ఒక గొప్ప సన్యాసిని. ఏ వయస్సులో ఆమె మతంగమహర్షి ఆశ్రమంలో అడుగుపెట్టిందో! ఎందుచేత తన జీవితాన్నంతా ఆ ఆశ్రమసేవకే ధారవోసిందో! బహుశః అదంతా ఒక పూర్వజన్మవాసన; దాని ప్రేరణ.

మతంగాశ్రమంలో ఒక మూలఉంది శబరి కుటీరం. ఆమె ఉషఃకాలానే లేచేది. ఆశ్రమంలో కసవూడ్చేది. నీళ్ళుచల్లేది. రకరకాల ముగ్గులు పెట్టేది. పూజకు పూలు తెచ్చేది- భోజనానికి పండ్లు అమర్చేది. ఆ మహర్షుల కాళ్ళకు [illegible] పిండిపెట్టేది- వాళ్ళిచ్చే తీర్థప్రసాదాలు పుచ్చుకొని, కళ్ళకద్దుకొని తన కుటీరానికి

వెళ్ళేది. ఆమెది ఒక తీరికలేని జీవితం. కోరికలేని జీవితం. తృప్తికి నోచుకొన్న జీవితం. ముక్తికి చేరువయ్యే జీవితం.

శబరి ఆలోచన అంతా ఆశ్రమ పరిచర్యమీదే. ఆమె బ్రదుకంతా ఆశ్రమ పరిచర్యకోరకే. ఆ మతంగాశ్రమాన్ని చిమ్మి చల్లటంలోనే ఆమె కోర్కెలు గుండెలో చల్లబడ్డాయి. అక్కడ ముగ్గులు పెట్టటంలోనే ఆమె తల 'ముగ్గుబుట్ట'లా మారిపోయింది. పూజకు పూలు సేకరించటంలోనే ఆమె కనుచూపు సన్నగిల్లింది. ఆహారానికి పండ్లు ఏరటంలోనే ఆమె నోటిపండ్లన్నీ రాలిపోయాయి. మడిబట్టలు పిండటంలోనే ఆమె శరీరమంతా ముడతలు పడి మెలికలు తిరిగింది.

శబరి ఇప్పుడు గాలికి గలగలలాడే ఒక ఎండుటాకు. ఏ క్షణంలోనైనా రాలిపోయే ఒక పండుటాకు.

అయినా ఆమెకు అలసటలేదు. బాధల్లేవు, భయాల్లేవు, అసంతృప్తి అసలే లేదు

ఆశ్రమంలోని మహర్షులంతా ఒక్కొక్కరే సిద్ధిపొందారు. అదృశ్య మయ్యారు. అయినా శబరి ఇంకా మిగిలిఉంది. ఆశ్రమంలో ఒంటరిగా ఉంది. ఎవరికోసమో! ఎందుకోసమో!

శబరి ఒంటరిగా ఉందేగాని ఆమె మనస్సుకు మాత్రం ఒంటరితనంలేదు. ఆమె మనస్సులో ఎవరో ఉన్నారు. వాళ్ళకోసమే ఆమె మిగిలిఉంది. వాళ్ళకోసమే ఆమె ఎదురుచూస్తూఉంది. అంతేగాదు. ఆశ్రమంలోని యజ్ఞవేదికలు, దర్భకోసలు, పూలత్రీవలు, పండ్లచెట్లు – చుట్టుప్రక్కలఉండే గుట్టలు, కొండలు, సెలయేళ్ళు, పక్షులు, మృగాలు అన్నీ ఆమెకు తోడే. అన్నీ ఆమెకు ఏవోగతస్మృతులను కలిగించేవే. పూర్వ పరిచయాలను గూర్చి మూగబాసలో మాటాడేవే.

ముడుతలు పడ్డ ముఖంతో, పొగమంచు దొంతరల్లాంటి జుట్టుతో, పూడుపడ్డ బావి అడుగున మినుకు మినుకు మనే మిడుగురుల్లాంటి కళ్ళతో, వణకుతున్న కాళ్ళతో, కట్టె ఊతవేసుకొంటూ శబరి మాటిమాటికి తన కుటీరం వాకిట నిలిచి, కుడిచేతిని కళ్ళకానించి, చూపుసారించి, వంగిపోయిన నడుమును ఒకింత నిక్కించి ఎవరికోరకో ఎదురుచూస్తున్నది. ఏదో మూటముల్లె సర్దుకొని ప్రయాణానికి సిద్ధమై

మాటిమాటికి వాకిట నిలిచి బండికొరకు ఎదురుచూచే ఆడపడుచులాఉంది ఆమె మనస్సు. సముద్రాన్ని చేరుకోవటానికి ఆరాటంతో ఎగిరెగిరి దూకే ఏటి ప్రవాహంలా ఉంది ఆమె మనస్సు. ఆ చెట్టు, ఈ గుట్ట, ఆ కొండ, ఈ బండ ఎక్కడ ఏ శబ్దమైనా శబరి రామా! రామా! రామా! అని పలవరిస్తున్నది.

ఈ నిరీక్షణ ఎప్పటినుండో! ఎంతవరకో! మతంగ శిష్యులైన మహర్షులంతా స్వర్గానికి వెళ్ళుతూ 'శబరీ! నిన్ను చూడటానికి శ్రీరామచంద్రుడు వస్తాడని, లక్ష్మణునితో కలిసి నీవుచేసే అతిథి సత్కారాలన్నీ స్వీకరిస్తాడని, ఆ పుణ్యపురుష దర్శనంతో నీవు పునరావృత్తిలేని లోకాలకు చేరుతావ'ని చెప్పారట.

అప్పటి నుండి శబరి ఎదురుచూస్తున్నది. కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తున్నది.

ఎంతకూ ఆ రాముడురాడు.

ఎక్కడున్నాడని ? ఎప్పుడు వస్తాడని ?

ఆయనంతట ఆయనే రావాలి. ఆయనకు బుద్ధిపుట్టినప్పుడు రావాలి. తన్నను గ్రహించాలి. తన జన్మ తరించాలి. అంతవరకు ఈ ప్రాణి నిరీక్షణ ఇలా కొనసాగవలసిందే. అంతవరకు ఈ ప్రాణి తపన ఇలా తలుపులు తెరచుకొని కూర్చోవలసిందే.

అయితే ఆయన ఎప్పుడోగదా వస్తాడని ఊరకుంటే ఎలాగు. ఆయన ఏ రోజైనా రావచ్చు. ఏ క్షణాన్నైనా రావచ్చు. ఏ త్రోవనైనా రావచ్చు.

ఆయన ఎంతోదూరం ప్రయాణం చేసివస్తాడు. అలసి వస్తాడేమొ ? ఆకలిగొని ఉంటాడేమొ ? ఊరకుంటే ఏలాగు ?

శబరి ఆయన ఆతిథ్యానికి అన్నీ సిద్ధం చేసింది. ఇల్లలికింది. ముగ్గు పెట్టింది. కూర్చోటానికి వేదిక సిద్ధం చేసింది. చెట్టు చెట్టుకు ఒక మేలిమి పండు ఏరి తెచ్చింది. పండు పుల్లగా ఉంటే ఎలా ? పచ్చిగా ఉంటే ఎలా ? పెట్టిన ఫలితం దక్కుతుందా ?

అందుచేతనే శబరి ప్రతిచెట్టు పండును రుచి చూచింది. మధురంగా ఉన్నవాటినే, మాగిన వాటినే గంపనింపింది. రకరకాల తేనెలు గూడ తెచ్చింది రాముడు తృప్తిగొని ఉంటాదేమొ ? సెలయేటి నీటిని దొప్పల్లో నింపి ఉంచింది మాలలు కట్టి మెడలో వెయ్యటానికి, పాదపూజలు చెయ్యటానికి రకరకాల పూలు కోసింది. ఇక ఆయన రావటమే ఆలస్యం.

ఆరోజు ఉదయం ఏదో తెలియని ఆనందం శబరి హృదయాన్ని బలంగా అలముకొన్నది. క్రొత్త కాంతి ఒకటి ఆమె కళ్ళల్లో తొణికిసలాడింది. కఱ్ఱ ఊతవేసుకొంటూ ఆమె కుటీరం వాకిట్లో వచ్చి నిలిచింది.

అడవిలోని చెట్లన్నీ గాజుల చేతులతో కొప్పులు సవరించుకొన్నట్లు గూళ్ళలోని పక్షులు రెక్కలు రెప రెప లాడిస్తూ కిలకిలా కూస్తున్నయ్. ఆ కిల కిలా రావంలో శబరికి రామ శబ్దం వినిపిస్తూ ఉంది. చుట్టు ప్రక్కల కొండలన్నీ పైటకొంగులు సవరించుకొన్నట్లు సెలయేళ్ళు గలగలా పారుతున్నయ్. ఆ గల గలా రావంలో గూడ ఆమెకు రామ శబ్దమే వినిపిస్తూ ఉంది. నేలంతా పులకించి నట్లు మృగాలు గంతులువేస్తూ అరుస్తున్నయ్. ఆ అరుపుల్లోగూడ ఆమెకు రామ శబ్దమే వినిపిస్తూ ఉంది. పరమపురుషదర్శనంతో ప్రకృతి సర్వము పరవశత నొందినట్లుంది.

శబరి తలయెత్తి చూచింది.

అల్లంత దూరాన ఒక వింటి కొప్పు వేగుచుక్కలా ఆమె కంటికి కన్పించింది. అది తన ఇంటివైపే నడచి వస్తున్నట్లుంది. కొంతసేపటికి జడలు గట్టిన జుట్టు కన్పించింది. తరువాత చంద్రబింబంలాంటి ముఖం, నీల మేఘం లాంటి కాంతి. అడవి అంతా కాంతిరేఖలతో కళకళ లాడింది. శబరి శరీరం జలద రించింది. కళ్ళు చెమ్మగిల్లాయి. పెదవులు రామా ! రామా ! రామా ! అని పలవరించాయి.

ఇంతలో నీలమేఘ శ్యాముడు రాముడే ఆమెవాకిట నిలిచాడు. నీడలా లక్ష్మణుడు వెంట ఉన్నాడు. రామునికి ఏవేవో అతిథి మర్యాదలు చెయ్యాలని ఇంత దాకా శబరి అనుకొంది. తీరా ఆయన వచ్చాక ఏం చెయ్యాలో ఆమెకు తోచలేదు.

అటూ ఇటూ తిరిగింది. అగుపించే వాటి కోసమే వెదికింది. ఆయన కొరకు తీర్చి దిద్దిన ఆ అందమైన వేదిక, ఆ వేదికమీద కృష్ణాజినం గూడ ఆమెకు కన్పించలేదు. ఎందుకో ఎక్కడలేని తొట్రుపాటు, ఎందుకో ఎన్నడులేని ఆవేశం, ఏదో అపరిమితమైన ఆనందం !

రాముడు ఆమె పారవశ్యాన్ని చూచాడు. ఒక్క చిరునవ్వు నవ్వాడు. సాదరంగా ఆమె పనికేచేతులు పట్టుకొని అవ్వా ! కూర్చొమ్మని కూర్చుండబెట్టాడు. తానూ కూర్చున్నాడు. శబరి కన్నీటిని చేత తుడిచాడు. తమ్ముని వైపు చూచాడు. తన ప్రక్కన కూర్చొమ్మని. శ్రీరాముని హస్తస్పర్శతో యోగిని అయిన ఆ శబరి మేను అనిర్వాచ్యమైన ఒక అనుభూతిని పొందింది. ఆమెలోని అణువణువూ వెయ్యి విద్యుత్తుల కాంతితో వెలిగింది.

శబరి రామలక్ష్మణుల పాదాలు పళ్ళెంలో ఉంచింది. కడిగింది. కళ్ళకు అద్దుకొంది. ఏరి కోసి తెచ్చిన పూలతో ప్రియమార పూజించింది. ఆ రామ పాదాల మీదనే వ్రాలిపోయింది. అప్పుడు శబరి ప్రాణాలు శబరిలో లేవు. ఆమె ఎంతసేపు ఆ పాదాల మీద అలా వ్రాలి ఉందో ! ఆ అన్నదమ్ములు ఎంతసేపు కాలు కదల్పకుండా అలా కూర్చున్నారో ! అంతా మౌనం.

రాముడు ఆమెను లేవదీశాడు. ఆమె ముఖంలోకి ఆర్ద్రార్ద్రంగా చూచాడు. ఒక్క చిరునవ్వు నవ్వాడు. పున్నమినాటి మహాసముద్రం ఆమెముఖంలో పరవళ్ళు త్రొక్కింది. ఆప్యాయంగా 'శబరీ ! నీ తపస్సు నిర్విఘ్నంగా వృద్ధి పొందుతున్నదా ?' అన్నాడు.

ఆమె ప్రక్కనున్న గంపలోని ఒక పండు తీసి రాముని చేత ఉంచింది. మరొకటి లక్ష్మణుని చేతి కందించింది.

రాముడు పండు తిన్నాడు.

'శబరీ ! ఇంద్రియ నిగ్రహం నీకు పరిపూర్ణంగా సిద్ధించిందా ?' అన్నాడు.

ఆమె మరోరకం పండు తీసింది. రామునిచేత ఉంచింది. లక్ష్మణుని చేతికి అందించింది.

రాముడు పండు తిన్నాడు.

'శబరీ ! చాంద్రాయణాది వ్రతాల ఫలాలు పొందావా ? నీ మనస్సు సుఖంగా ఉందా ?' అని అడిగాడు.

ఆమె ఇంకోరకం పండు తీసింది. రాముని చేత ఉంచింది. లక్ష్మణుని కొకటి అందించింది.

'శబరీ ! నీవు చేసిన గురుశుశ్రూష సఫలమైందా ?' అన్నాడు రాముడు పండుతిని చిరునవ్వు నవ్వుతూ చిరుబొజ్జను చేత నిమురుకొంటూ.

ఈసారి శబరి మధురాతి మధురమైన మరోఫలం రాముని నోటి కందించింది. ఒకటి లక్ష్మణుని చేతి కిచ్చింది.

రాముడు అలా ఎన్ని కుశల ప్రశ్నలు వేశాడో !

శబరి అలా ఎన్ని ఫలాలు ఆయన కర్పించిందో !

రాముడు తృప్తిగా త్రేన్చాడు. లక్ష్మణుడు తృప్తిగా తల ఆడించాడు.

అప్పుడన్నది శబరి 'మీ కొరకే మిగిలి ఉన్నానని. మీ కొరకే ఎదురు చూస్తున్నానని. మతంగ శిష్యులైన మహర్షులు మిమ్మల్ని గురించే చెప్పా'రని. 'శాపవిముక్తుడైన కబంధుడు నిన్ను గూర్చి చెప్పాడు. ఈ ఆశ్రమాన్ని గూర్చి చెప్పాడు, నిన్ను చూచాను. నా కడుపు నిండింది. ఇక ఈ ఆశ్రమాన్ని చూద్దామా శబరీ!' అన్నాడు రాముడు నీరు త్రాగుతూ.

కఱ్ఱ ఊతవేసుకొంటూ శబరి ముందు నడిచింది. మహర్షుల యజ్ఞవేదికలు చూపింది. ఆ మహర్షుల తపశ్శక్తిచే ఆశ్రమానికి వచ్చి చేరిన సప్తసముద్రాల జలాల సంగతి చెప్పింది. ఆ మతంగ శిష్యుల స్వేద బిందువులు నేలరాలి పువ్వులై పూచిన వైనం వివరించింది. వాడని ఆ పూలనన్నింటినీ చూపింది. మహర్షుల యజ్ఞయాగాది క్రతు విశేషాలు, తపోవ్రత విధానాలు ఒక్కటొక్కటే వర్ణించి చెప్పింది. ఆశ్రమంలోని చెట్టు చెట్టును చూపింది. గుట్ట గుట్టను చూపింది. చిట్ట చివరకు సెలవిస్తున్నట్లు చేతులు జోడించి నిలిచింది.

శ్రీరాముడు చిరునవ్వు నవ్వుతూ ఆనందంగా చూశాడు. అభయహస్తమిచ్చాడు.

ప్రక్కనున్న యజ్ఞగుండంలో అగ్నిహోత్రం మండుతూ ఉంది. శబరి శరీరం ఒక్కక్షణంలో సమిధలా ఆహుతి అయిపోయింది. కోటి విద్యుత్తుల కాంతి ఒకటి ఆ యజ్ఞగుండం నుండి అంతరిక్షంలోకి లేచి వెళ్ళింది.

రామాయణంలో వాల్మీకి శబరిని ఒక రేఖాచిత్రంగా మాత్రమే చూపాడు. అయినా పాఠకుడు ఆ పాత్ర దగ్గర ఆగి ఆలోచిస్తేచాలు. అనిర్వాచ్యమైన అనుభూతి ఏదో అతని హృదయాన్ని అలముకొంటుంది. ఒక వివశమైన అవశతను కలిగిస్తుంది.

వ్యక్తిముక్తికి గొప్పవంశం ఉండనక్కరలేదు. పాండిత్యం ఉండనక్కరలేదు. పదవులుండనక్కరలేదు. అంగబలం ఉండనక్కరలేదు. అర్థబలం అసలే అక్కరలేదు. మనఃపవిత్రతే ముక్తిహేతువు.

# అహల్య

అప్పుడప్పుడు బ్రహ్మదేవుడు ఎందుకో మరీ అందమైన ఆడవాళ్ళను సృష్టిస్తుంటాడు. ఆ అందాన్నే వాళ్ళ పాలిటి శాపంగా రూపొందిస్తుంటాడు. వాళ్ళ జీవితాలను అన్యాయాలకు, అక్రమాలకు, అత్యాచారాలకు గురిచేస్తుంటాడు. అమితంగా బాధిస్తుంటాడు. తానేమో అవసరమైనపుడు గూడ అగుపడకుండ ముఖం తప్పించి ఎక్కడెక్కడో తిరుగుతుంటాడు. అది ఆయన సృష్టితత్త్వమేమో. లేదా విసుగు చెందినవేళ అవలంబించే ఒక క్రీడా వినోదమేమో.

బ్రహ్మదేవుడు అహల్య విషయంలోగూడ అంతేచేశాడు. అహల్య గౌతమ పత్ని. అందాలరాశి. జీవితంలో ఆమె చేసిన తప్పేమిటో తేల్చిచెప్పటం చాల కష్టం. అయినా ఆమె శాపగ్రస్తురాలైంది. ఎంతకాలమో ఆమె బ్రతుకు బండ బారిపోయింది. ఎప్పటికోగాని ఆమె శాపం తీరిపోలేదు. అప్పటి దాకా ఆమె పతి అనుగ్రహానికి పాత్రురాలు గాలేదు. ఒక పవిత్రస్త్రీమూర్తిగా పేరు పొంద లేదు.

ఆమె కెందుకీ శిక్ష ?

బ్రహ్మదేవుడు అదేపనిగా ఆమె రూపంలో ఏ వక్రతా లేకుండ అహల్యగా, అందాలరాశిగా సృజించటం ఆమె తప్పా ! అమరపతి ఆమె అందానికి ముగ్ధుడై ఆరోజు నుండే ఆమెను కామించటం ఆమె తప్పా ! ఆమె గూడ ఆ యౌవనంలో రూపవయోవైభవోల్లాసుడైన అమరపతిపట్ల వలపు చూపటం ఒక పెద్ద తప్పా! బ్రహ్మదేవుడు ఎంతకాలమో ఆమె నెందుకు గౌతముని దగ్గర ఇల్లడ ఉంచాలి ? ఎంతో వయోభేదం గలిగి వైరాగ్యమార్గంలో ఉన్న ఆ మహర్షితో ఎందుకు వివాహం జరిపించాలి ? ఆ స్త్రీమూర్తి యౌవనానికి, అందానికి అదా సార్థకత ?

అయినా అహల్య పెదవి కదపలేదు. పతిపట్ల విముఖత ప్రదర్శించలేదు. నూతన జీవితర్గంతో తాను సమాధానపడింది. తన బ్రతుకేదో తాను బ్రతుకుతూ

ఉంది. అలాంటప్పుడు కాముకుడు, కామరూపుడు అయిన దేవేంద్రుడు ఆమె మీద కన్నువేయటమా ! ఆమె భర్తలేని సమయంలో అతని రూపాన్నే ధరించి ఆశ్రమంలో ప్రవేశించటమా ! ఆమెను వంచించి బలాత్కరించటమా ! తాను నేర్చిన శృంగార కళావిలాసాలతో ఆ స్త్రీ మూర్తి గుండెలోతుల్లో ఏనాడో గాఢంగా నిద్రించి ఉన్న తొలివలపులను మేల్కొల్పటమా ! వివిధ కామకేళీ విన్యాసాలతో ఆమె యౌవనాన్ని కవ్వించి, నవ్వించి, పైమరపించి అనుభవించటమా ! ఆమె చేతనే 'ఆహా' అనిపించి ఆవలికి తొలగటమా ! అందుకు అహల్యకు దారుణ శాపమా !

కానివాళ్ళు, కళ్ళున్నా చూడలేనివాళ్ళు, కథ రక్తిగడితేచాలని కల్పనలు చేసేవాళ్ళు ఏవేవో చెప్పవచ్చు. ఎన్నెన్నో ప్రచారం చెయ్యవచ్చు. కట్టుకొన్న భర్త గూడ ఆస్థితిలో ఆమెను సరిగ అర్థంచేసుకోకపోవచ్చు. పుట్టించిన ఆ బ్రహ్మదేవు డున్నాడే—ఆయనైనా అటు రానక్కరలేదా . ఆమె నాదుకోనక్కరలేదా ? ఎంతో మంది పెద్దలున్నారే- ఒక్కరైనా దేవేంద్రుని పట్టుకొని ఏమిటి నీకీ పాడుబుద్ధి అని ఆ తిరుగుబోతును తిట్టనక్కరలేదా ! అధికారంలో ఉన్నవాడు హద్దుమీరి ప్రవర్తిస్తే అదేమని అడగటానికి అంతభయమా : అబలజీవితమంటే అంత చిన్న చూపా ! సాటి స్త్రీలు గూడా మాటాడలేదు.

మొత్తానికి అహల్య ఒక దురదృష్టవతి.

అందుకే అంతా మౌనం వహించారు.

అనాడు పాపం ! అహల్య ఆ మాయాగౌతమున్ని శంకించకపోలేదు. అతని వాలకాన్ని, విషయకాల్యాన్ని చూచి ఆశ్చర్యపడకపోలేదు. అయినా అతడు ముమ్మూర్తులా గౌతముడే. కాదని పూర్తిగా త్రోసిపుచ్చటం ఏలాగ ? అయితే మరి ఈ మార్పు ! ఏమో. ఆయన మనస్సు అప్పుడెందుకు అలా చలించిందో. ప్రకృతి ప్రభావమోయేమో. పరిసరాలవల్ల మనస్తత్వంలో వచ్చిన మార్పేమో. అయినా మానవమనస్తత్వం - ముఖ్యంగా శృంగార విషయంలో చిత్రవిచిత్రంగా మారుతూ ఉంటుంది. ఆ ముహూర్తంలో ఆ మహర్షి మనస్సు అందంగాఉన్న తన్ను చూచే

సరికే ఆ విధంగా మారిందేమో. అప్పటికి ఆమె ఆ కపట గౌతముని ప్రయత్నాన్ని కొంత ప్రతిఘటించింది. ॥అందుకే అతడు కోపపడ్డాడు. బెదిరించాడు. కడకు బలవంతంగా ఆమెను కౌగిట్లో బంధించాడు. ॥ఆ సంగతి బ్రహ్మదేవునికిగూడ తెలుసు. అయినా ఆయన అడ్డుపడలేదు. అహల్యది అప్పుడొక నిస్సహాయస్థితి.

ఆమె జీవితంలో అదొక దుర్ముహూర్తం.

దేవేంద్రుడు తరువాత తన శృంగార కళావైభవాన్నంతా అహల్యమీద ప్రయోగించాడు. ఆమె గుండెలోతుల్లో ఏనాడో నిద్రించి ఉన్న తొలివలపు ఊహలను మేల్కొల్పాడు. తన కామకేళీ విలాసాలన్నీ క్రుమ్మరించాడు. ఆమె యౌవనాన్ని రెచ్చగొట్టాడు. ఆ మునిపత్ని మున్నెన్నడు చూడని రసమయలోకాలు చూపించాడు. అప్పుడర్థమైంది అహల్యకు అతడు దేవేంద్రుడని, కాని అప్పుడహల్య అహల్యగాదు. ఒక ఆడ మనిషి. అందమైన ఒక ఆడమనిషి. యౌవనం పొంగిపొరలే ఓ అందమైన ఆడమనిషి. అంతే –

కాగా సుప్తవాంఛలు వ్యక్తి జీవితంలో చిత్రమైన అంశాలు. అవి వ్యక్తిని జీవితంలో వెనుకకు నడిపిస్తాయి ఒక్కొక్కసారి పెద్ద ప్రమాదాల్లో పడవేస్తాయి. సామాన్యంగా సుప్తవాంఛలు సన్నబడతాయేగాని చచ్చిపోవు. అగుపడకుండా ఉంటాయేగాని అసలులేకుండాపోవు. వాడిపోతాయేగాని వాసనను గోల్పోవు. తడి సోకితే చాలు అవి తలయెత్తి చూస్తాయి. అందులోను స్త్రీ జీవితంలో తొలివలపు వాంఛలు మరీ బలీయాలు.

అంతేగాదు, యౌవనంగూడ వ్యక్తి జీవితంలో ఒక చిత్రమైన దశ. దాని పొంగు ఒక పరిధి దాటితే ఆగలేదు. ఎంత వద్దనుకొన్నా వెనుదిరుగలేదు. ఆదశలో అనుభవమే దానికి అత్మీయం. నిగ్రహం దానికి వ్యతిరేకం. అప్పుడది వ్యక్తి విశిష్టతను ఒద్దుచేస్తుంది. స్త్రీ పురుష భావనను, మాత్రమే మనస్సులో నిలుపుతుంది.

---

॥, ॥ ఉత్తరకాండ సర్గ 30 శ్లో. 36, 37.

అహల్య స్థితిగూడ అదే అయింది. అమరపతి శృంగార కళాచాతుర్యానికి ఆమె సుప్తవాంఛలు మోసులెత్తాయి. అతని కామక్రీడా విలాసాలకు ఆమె యౌవనం పొంగులెత్తింది. ఒక స్త్రీ మూర్తిగా ఆమె పురుషుని కౌగిట్లో ఒదిగిపోయింది.

అహల్య స్పందించింది. ద్రవించింది. 'ఆహా' అని ఆనందించింది.

అంతలోనే గౌతమమహర్షి ఆశ్రమద్వారంలో అగుపించాడు. చేత కమండలం, యోగదండం, మెడలో రుద్రాక్షమాల. పండువెన్నెల దిగజారినట్లు జడలుగట్టిన జుట్టు, నిడుపైన గడ్డం. ప్రసన్నతాసుభగమైన ముఖం. ఆకాశగంగలో అప్పుడే స్నానమాడి, పంచాక్షరీ మంత్రజపాన్ని పూర్తిచేసి, శివజటాజూటాన్ని అలంకరించే చంద్రునిలా ఆశ్రమంలో ఆ మహర్షి అడుగుపెట్టాడు. ఆయనను చూడగానే అహల్య స్తంభించిపోయింది. అంతకుముందే ఆమె పొందిన ఆనందం ఒక మెరపు తీగలా మాయమైపోయింది. అంతులేని ఒక అశాంతి, ఆవేదన ఆమె అంతరంగాన్ని ఆవరించాయి. శరీరమంతా ఏదో నిప్పుల్లో పొరలిస్తున్నట్లు బాధ. జరుగగూడనిదేదో జరిగిపోయినట్లు పెద్దవ్యథ. పాలకుండను ఎంగిలిచేసి పారిపోయే పిల్లిలా దేవేంద్రుడు ప్రక్కకు జారుకొన్నాడు. ఎంత ఘోరం జరిగిపోయిందో అప్పుడామెకు అర్థమైంది. మొదలు నరికిన అరటిచెట్టులా ఆమె పతి పాదాలమీద వ్రాలింది. అపవిత్రమయ్యానని ఆక్రోశించింది. తప్పు జరిగిందని తలబాదుకొంది. విపరీత దుఃఖంతో వెక్కివెక్కి యేడ్చింది.

ఎక్కడున్నాడో గాని బ్రహ్మదేవు డక్కడికిరాలేదు. ప్రక్కనే ఉన్నాడుగాని ఆ ద్రోహి దేవేంద్రుడు పెదవి విప్పలేదు.

అహల్య అది కోరితెచ్చుకొన్నస్థితిగాదు. ఏనాడో బ్రహ్మ తన్ను సృజించినప్పుడు ఆమె దేవేంద్రునిపట్ల వలపు చూపింది. అది ఆమె తప్పుగాదు. ఆ వలపు ఏనాడో ఆమె గుండెలోతుల్లో గాఢంగా నిద్రపోయింది. ఆ వలపు తీర్చుకోవాలని ఆమె తరువాత ప్రయత్నించలేదు. తన పాతివ్రత్యాన్ని వదలలేదు. గౌతముని తిరస్కరించలేదు. దేవేంద్రుని అభిసరించలేదు. అది ఆమె సంస్కారం. వచ్చినవాడు దేవేంద్రుడు. ఆమెను వంచించిన వాడు దేవేంద్రుడు. బలాత్కరించినవాడు దేవేంద్రుడు. ఆమె గుండెలోతుల్లోంచి సుప్తవాంఛలు మేల్కొల్పినవాడు దేవేంద్రుడు. ఆమె యౌవనాన్ని కవ్వించి కొల్లగొట్టి ఆమెనొక స్త్రీ మాత్రురాలిగా చేసి

చెరిచి వెళ్ళినవాడు దేవేంద్రుడు. ఒక స్థితిలో ఆమె లొంగిపోయింది. ఒక స్థితిలో ఆమె పొంగిపోయింది. ఒక స్థితిలో ఆమె క్రుంగిపోయింది.

అది పరిస్థితుల ప్రభావం.

ఆమె ఏ స్థితిలో లొంగిపోయిందో, ఏ స్థితిలో పొంగిపోయిందో, ఏ స్థితిలో క్రుంగిపోయిందో ఎవరికి కావాలి? ఆమె మాత్రం దాన్ని ఎలా చెప్పాలి? అందుకే ఆమె అంతగా దుఃఖించింది. కంటికి మంటికి ఏకధారగా ఏడ్చింది. కనికరించి గౌతముడు తన్నర్థం చేసుకోకపోతాడా అని ఆశించింది.

కాని అందరు భర్తల్లాగే ఆ గౌతమ మహర్షిగూడ ఆగ్రహోదగ్రుడయ్యాడు. అది ఆమె దురదృష్టం. అన్నీ తెలిసిన బ్రహ్మదేవుడు అప్పుడైనా రాలేదు. అదీ ఆమె దురదృష్టమే.

గౌతముడు అరచేత శాపజలం తీసుకొన్నాడు. మొదట ఆ మహేంద్రుణి శపించాడు. అవల అహల్యవైపు తిరిగాడు. ఆమెను తీవ్రంగా నిందించాడు. 'నీ అందం, యౌవనం నిన్ను చెరిచాయి. ఇకముందు నీ అందం లోకంలో అద్వితీయంగా ఉండకుండుగాక. అది అందరికి సంక్రమించుగాక. ఆశ్రమ సమీపంలోనే నీవు నశింతువు గాక' - అని ఆమె జీవితం బండవారి పోయేలా శపించాడు. అందం అహల్య పాలిటి శాపంగా పరిణమించింది. పరిస్థితులు ఆమెను పాముల్లా కాటు వేశాయి, పతిత అన్న పేరుతెచ్చాయి.

అహల్య - భర్తకు చేతులెత్తి మ్రొక్కింది. 'స్వామీ! దేవేంద్రుడు నీ రూపం ధరించి నన్ను మోసగించాడు. బెదిరించాడు. బలాత్కరించాడు. అంతేగాని నే నతనిని కాంక్షించలేదు. నా తప్పులేదు, నన్ను కనికరించు ఆ శాపాన్ని ఉపసంహరించు-అని పరిపరివిధాల ప్రార్థించింది (ఉత్తరకాండ సర్గ 30. శ్లో-48) ఆ మునీంద్రుని ముఖంలోకి దీనంగా చూచింది.

గౌతముని ముఖంలో మార్పులేదు. శాపం తప్పదన్నాడు. శ్రీరామచంద్రుడు వచ్చేదాకా నీ శాపం తీరదన్నాడు. ఆ పుణ్యపురుష దర్శనంతోనే నీ పాపం తొలగిపోతుందన్నాడు. ఆయనకు అతిధి పూజచేసి అవల నావెంట చేరమన్నాడు. అంతదాకా ఇంతే అన్నాడు.

అహల్య ఇంకోసారి దీనాతి దీనంగా ఆ మహర్షి ముఖంలోకి చూచింది. దయచూపమని అడిగింది. ఆ మహర్షి కళ్ళు నిప్పు ముద్దల్లా మండాయి. పెదవులు భయంకరంగా కంపించాయి. కాళ్ళు ఆవలకి నడిచి వెళ్ళాయి.

అహల్యగొంతు మూగవోయింది. ఆమె చైతన్యం అంతరించింది. ఆశ్రమ సమీపంలోనే ఒకమూల ఆమె చతికిలబడింది. తపించింది. తపించింది. ఎంతకాలమో తపించింది. ఆమె చుట్టూ పొదలు, తీవలు దట్టంగా అల్లుకొన్నాయి. ఆకుల మాటున, పువ్వులమాటున మరుగుపడి ఉన్న అహల్య మేఘాలమాటున మంచుచే కప్పబడ్డ పూర్ణచంద్రకాంతిలా ఉందట. నీళ్ళమధ్య చూడసాధ్యంగాని సూర్యతేజస్సులా ఉందట.

అహల్య ఒక చెదలుపట్టిన కావ్యం. శిధిలమైన శిల్పం. ఆమెను అంటిన అపవిత్రత తొలగిపోవాలి. బండవారిన ఆమె బ్రతుకు చిగురువేయాలి. అందుకు ఆ రామచంద్రుడే రావాలి. ఆయనంతట ఆయనే రావాలి. ఆ సుముహూర్తం ఎప్పుడో!

ఆనాటి ఉదయం ఆశ్రమప్రాంతంలో ఏదో అపూర్వమైన ఒక అడుగుల సవ్వడి. నేలమీద కాంతిరేఖలు తీవలు ప్రాకినట్లు, పువ్వులు పూచినట్లు సాగుతున్నాయి. సాగిసాగి అవి అహల్యవైపే వచ్చాయి. ఆమె నావరించిన చీకటిని చీల్చివేశాయి. ఆమె రూపాన్ని వెలిగించాయి. జీవితాన్ని చైతన్యవంతం చేశాయి.

అహల్య కళ్ళు తెరిచింది.

ఎదుట నీల మేఘశ్యాముడు. ఆజానుబాహుడు, అరవిందనేత్రుడు శ్రీరాముడు. ప్రక్కనే లక్ష్మణుడు. వెంట విశ్వామిత్రుడు.

ఆ రామ దర్శనంతో ఆమె రాతిబ్రతుకు తొలగిపోయింది. ఆమె గొంతు పలికింది. రామా! రామా! నీలమేఘశ్యామా, అంటూ అహల్యచేతులు చాచి ఏదో పునర్జన్మ పొందినట్లు పైకిలేచింది, రామలక్ష్మణులు ఆ గౌతమపత్ని పాదాలకు నమస్కరించారు. అహల్య ఆనంద బాష్పాలు రాల్చింది. ఆ బాలురిద్దరిని సేవ

నెత్తింది. ఆప్యాయంగా అక్కున చేర్చుకొంది. మనసార ముద్దాడింది. అతిథి మర్యాదలు చేసింది. అర్ఘ్యపాద్యాలిచ్చింది. అర్చనలు చేసింది. జన్మతరించినట్లు తన్మయత నొందింది.

గౌతమ మహర్షి సాదరంగా ఒక్క చిరునవ్వు నవ్వాడు.

విశ్వామిత్ర మహర్షి తృప్తిగా తల ఆడించాడు.

అదొక అద్భుత దృశ్యం.

అందరికి ఒక మధురానుభూతి.

రామాయణంలో అహల్య ఒక మరపురాని పాత్ర.

# ఊర్మిళ

అందరు దేదీప్యమానంగా వెలిగే దీపశిఖనే చూస్తారుగాని, దాని వెలుగునే వేనోళ్ళ ప్రశంసిస్తారుగాని, ఎక్కడో మురికితైలం అడుగున మునిగి, అనుక్షణం తాను దహించుకుపోతూ ఆ దీపానికి ఔన్నత్యాన్నిచ్చే వత్తిని గూర్చిగాని, అది చేసే త్యాగాన్ని గూర్చిగాని ఎవ్వరు అనుకోరు. వత్తి ఎంతగా మునిగితే దీపం అంతగా బలాన్ని పుంజుకొంటుంది. వత్తి ఎంతగా కాలితే దీపం అంతగా వెలుగుతుంది.

లోకంలో కొందరు భర్తలు పొందే పేరుప్రతిష్ఠల వెనుక వాళ్ళ భార్యలు చేసే త్యాగాలు బలంగా ఇమిడి ఉంటాయి. అయినా ఈ లోకం ఆ మహాపతివ్రతల త్యాగాన్ని అప్పుడప్పుడు ఆశ్చర్యకరంగా విస్మరిస్తుంది. ఈ లోకమేగాదు — ఆప్తులు, బంధువులు గూడ ఆ స్త్రీమూర్తుల సంగతి అట్టె పట్టించుకోరు. అథవా ఎప్పుడైనా గుర్తుచేస్తే అవునౌనని అంటారుగాని అంతకుమించి ఆలోచించరు. భర్తల విషయంలో మాత్రం లోకం ఆహా! ఓహో! అని ప్రశంసల వర్షం కురుస్తూ ఉంటుంది.

రామాయణంలో ఊర్మిళ భర్త కొరకు ఎంతో త్యాగం చేసిన భార్య. అయితే అందరు లక్ష్మణుని గురించే ఆలోచిస్తారు. ఆయన గుణగణాలనే ప్రశంసిస్తారు. కాని జీవితంలో మహోన్నత త్యాగం చేసిన ఊర్మిళను గూర్చి ఎవ్వరు అనుకోరు. రామాయణంలో ఆమె ఉన్నా లేనట్లే ఉంది. చివరకు వాల్మీకి మహర్షి గూడ ఆమె సంగతి అనుకోలేదు.

మొదటినుంచి ఊర్మిళది చిత్రమైన స్వభావం. ఎంతో సుకుమార స్వభావం. ఆమె ఎవ్వరితోను అట్టె మాటాడేది గాదు. అమిత మితభాషిణి. అక్క చెల్లెండ్రతో గాని, అంతఃపుర చెలికత్తెలతో గాని అట్టె తిరిగేదిగాదు. ఆమెకు ఏకాంతం అంటే ఎంతో ఇష్టం. తన మనస్సుతోనే తాను ఎక్కువగా ఉండేది. తన మనస్సుతోనే తాను ఎక్కువగా మాట్లాడుకొనేది. తన మనస్సుతోనే తాను ఎక్కువగా ఆడుకొనేది. ఆమెది తనలో తాను లీనమయ్యే తత్వం. బహుశః అది జనకరాజునుండి జన్మతః

ఆమెకు సంక్రమించిందేమొ. ఊర్మిళ వంటి వాళ్ళు ఎన్ని బాధలైనా దిగమ్రింగ గలరు. ఎంతటి త్యాగాన్నైనా చెయ్యగలరు.

ఏ విషయంలో గూడ ఊర్మిళకు వల్లమాలిన మొగమాటం. ఆమె తల్లితో గూడ తన ఇష్టాయిష్టాలు గట్టిగా తెలిపేదిగాదు. దేనికది సరిపెట్టు కోవటమే ఆమె స్వభావం. అక్క సీత ఎక్కడినుండో తమ యింటికి వచ్చింది. వచ్చింది మొదలు ఆమెకు ఎక్కడలేని ప్రాధాన్యం. తండ్రి జనకమహారాజే ఆమె కిచ్చిన స్థానం తన కివ్వలేదు. తాను జనకుని కన్నకూతురైనా అన్ని విషయాల్లో ఆ సీతాదేవిదే అగ్రస్థానం. అంతేగాదు. మిథిల మొత్తం సీత కొరకే ఉన్నట్లు - మిథిలయేగాదు పృథివి యెల్ల ఆమె కొరకే అన్నట్లు జనకమహారాజు ఒక వాతావరణాన్ని సృష్టించాడు. ఊర్మిళ ఓర్మితో ఆ వాతావరణాన్ని సహించింది. సంతోషంగా అందులోనే పెరిగింది.

ఓర్మికి ఊర్మిళ మారుపేరు.

సీత అంటే ఆమెకు అసూయలేదు. పైగా అక్కమీద ఆమెకు విపరీతమైన ప్రీతి. జనకుని మీద అపారమైన గౌరవం. అక్క ప్రక్కన ఎప్పుడున్నా ఊర్మిళ ఒకింత తలవంచి ఒదిగి నడుస్తుండేది. తండ్రి గారికి దూర దూరంగా నిలిచి నమస్కరిస్తుండేది. అలాంటి అక్కకు తాను చెల్లెలు గావటం, అలాంటి తండ్రికి తాను కూతురు గావటం ఒక గొప్ప అదృష్టమని ఆమె భావన.

తండ్రిగారు అక్క పెళ్ళినిగూర్చి ఆలోచిస్తున్నారు. అది అంత సులభం గాదు. శివధనుర్భంగం కావాలి. సీతాదేవి పెళ్ళి జరగాలి. ఆ సుముహూర్తం ఎప్పుడో ! ఆ శక్తి సంపన్నుడు ఎక్కడో !

అక్క పెళ్ళి తరువాతే తన పెళ్ళి. ఎప్పుడో ! ఎవరితోనో ! అందరు కన్యల్లాగే ఊర్మిళగూడ తన వైవాహిక జీవితాన్ని గూర్చి ఏవేవో కలలుగన్నది. కాబోయ్యే భర్త రూపురేఖలు మనస్సులో గీచుకొన్నది. ఆయన గుణగణాలను గొప్పగా ఊహించుకొన్నది. ఆయనతో తన జీవితాన్ని ముడివేసుకొని అనుభవింప దలచిన భోగాలను పదిలంగా గుండెలోతుల్లో దాచుకొన్నది. కన్నెగా ఉన్నది ఊర్మిళ ఊహలు కొన్ని చల్లనివి ; కొన్ని వెచ్చనివి ; కొన్ని మెత్తనివి ; మరి కొన్ని గడుసరివి. అయినా అన్నీ తియ్యనివే.

జనకమహారాజు స్వయంవరం చాటించాడు.

అది సీతా స్వయంవరం. ముందు శివ ధనుస్సు. ఎదురుగా ఎందరెందరో రాకుమారులు. అందరు ప్రయత్నం చేశారు. ఎవ్వరు ఆ శివధనుస్సును ఎక్కుపెట్టలేక పోయారు. విశ్వామిత్ర మహర్షి ప్రక్కనుంచి ఒక్క రాకుమారుడు — నూనూగు మీసాల నూత్న యౌవనుడు పైకిలేచాడు. ముందుకు నడిచాడు. అన్నతోపాటే తమ్ముడుగూడ లేచాడు. అయితే అక్కడే నిలిచాడు - అన్న పూనిక కన్నారాచూడ టానికి. సభలో అందరి చూపులు ఆ ముందుకు వెళ్ళే రాకుమారుని వెంట వెళ్ళాయి. అక్క ప్రక్కన నిలుచున్న ఆ ఊర్మిళ చూపులు మాత్రం లేచి నిలిచిన రాకుమారుని మీదనే నిలిచాయి.

అక్కడ శివధనుర్భంగం.

ఇక్కడ లక్ష్మణుని చిరునవ్వు.

ఎందుకో ఊర్మిళ మేను జలదరించింది. బుగ్గలు సిగ్గు చిలికాయి. రెప్పలు నవ్వు కొన్నాయి. ఏదో తన మనస్సును తానే చూచుకొంటున్నట్లుంది.

అక్క వివాహం ఆ రామునితో, తన వివాహం ఆ లక్ష్మణునితో జరి గాయి. వెంటనే అయోధ్యా ప్రయాణం. అత్తవారింట ఏవేవో క్రొత్త అనుభవాలు.

అంతా ఊర్మిళకు ఒక తియ్యని కలలా ఉంది.

అందగాడు, గుణవంతుడు, పేరు ప్రతిష్ఠలున్నవాడు అయిన భర్త అనుకోకుండా తనకు లభించాడు. తన్ను ప్రేమిస్తున్నాడు. లాలిస్తున్నాడు. సంతోషంలో ఓల లాడిస్తున్నాడు.

అన్నగారి మీద ఆయనకు ఎంతో గౌరవం.

అక్కగారంటే తనకు ఎంతో ప్రీతి.

ఊర్మిళ ఆనందానికి అంతులేదు. తన మనస్సుతోనే తాను మనువాడినట్లుంది.

ఇంతలోనే బావగారి యౌవరాజ్యాభిషేక మహోత్సవం. ఇక నిర్వాహక మంతా తన భర్తదే; తనదే. ముందురోజు సాయంత్రం లక్ష్మణుడు ఏదో పనిమీద

చెప్పుతూ 'రేపు ప్రొద్దున్నే సిద్ధంగా ఉండు. స్వయంగా అన్నగారి అభిషేక మహోత్సవానికి పిలుచుకు పోతా. ఆలస్యం చేస్తే కుదరదు. అలంకారం త్వరగా ముగించుకో' అని ఆ ముద్దరాలి బుగ్గగిల్లి చెప్పి వెళ్ళినట్లుంది. ఊర్మిళ ఎంతగానో మురిసిపోతున్నది. అయోధ్యలో అందరి యెదుట ఆమె అగుపడే మొదటి మహోత్సవం అదే.

ఆ రాత్రి ఆమెకు సరిగా నిద్రపట్టలేదు. ఎందుకో ఎన్నడులేని ఉత్సాహం. ఏవేవో ఆలోచనలు. ఉదయాన్నే ఎంతో ముందుగా లేచింది. శిరస్స్నానం చేసింది. పూజాదికాలు పూర్తిచేసుకొన్నది. వస్త్రాభరణాలు అత్తగారిచ్చినవి, అమ్మగారిచ్చినవి అన్నీ చెలికత్తెల ముందు పరిచింది. ఏరి ఏరి ఎంతో తర్కించి అందమైన వాటిని తొందర తొందరగా అలంకరించుకొన్నది. ఇక లక్ష్మణుడు రావటమే ఆలస్యం. ఆయన అభీష్టాన్నిబట్టి ఏదైనా ఒకటి అరా అలంకారం మార్చుకొంటే మార్చుకోవాలి. అంతే. అందుకే చెలికత్తెలందరిని అవతలికి సాగనంపింది. ఏకాంతంగా అద్దంముందు నిలుచుని తన అందాన్ని తాను తృప్తిదీర ఒక్కసారి చూచుకొంది. అంతలోనే వింతగా ఒక పెద్ద ఆవులింత. తన అకాలపు ఆవులింత చూచి తానే నవ్వుకొంది. అయితే అది అద్దంలో అతి భయంకరంగా అగుపించింది.

అంతలోనే తలుపు తట్టిన చప్పుడు.

ఊర్మిళ తలుపు తెరిచింది. చూచి నిర్ఘాంతపోయింది. నారచీరలు దాల్చి లక్ష్మణుడు నిలిచి ఉన్నాడు. ఒక మహామునిలా మారి ఉన్నాడు. ఏం జరిగిందో ఊర్మిళకు తెలీదు. ఎందుచేత ఆయన అలా మారిపోయాడో అసలే తెలీదు. అప్పుడామె ఊహించే స్థితిలో కూడ లేదు.

లక్ష్మణుడు గంభీరంగా ముందు నడిచాడు. ఊర్మిళ ఆయనవైపు వెర్రిగా చూస్తూ వెనక్కు నడిచింది.

లక్ష్మణుడు ఆగి ఆర్ద్రంగా ఆమెవైపు చూచాడు.

ఆమె శరీరం చన్నీట స్నానమాడినట్లయింది.

ఊర్మిళ భయపడుతూ లక్ష్మణుని వల్కలం వైపు చూచింది. ఆయన అర్ధనిమీలిత నేత్రుడయ్యాడు.

ఇద్దరి మధ్య పెద్ద మౌనం.

లక్ష్మణుడు కళ్ళు తెరిచాడు. ఏదో క్రొత్తవ్యక్తిని చూచినట్లు ఆమెను చూచాడు.

పాపం ! ఆ చూపుకు ఊర్మిళ తలవంచుకుంది.

'ఊర్మిళా ! కైకేయి కోర్కె ప్రకారం అన్నగారి పట్టాభిషేకం ఆగిపోయింది' అన్నాడు లక్ష్మణుడు.

ఆమె ఉలిక్కిపడింది.

'కైకేయి కోర్కె ప్రకారం అన్నగారు పద్నాలుగేళ్ళు అడవులకు వెళ్ళుతున్నా — అన్నాడు లక్ష్మణుడు.

ఆమె భారంగా నిట్టూర్చింది.

'అన్నకు సహాయంగా నేనూ అడవులకు వెళ్ళుతున్నాను' — అన్నాడు యాత్మక స్వరంతో.

ఆమె ప్రక్కనున్న పడకమీద అలా వ్రాలి పడిపోయింది. ఒక భయ నిశ్శబ్దం ఆ మందిరాన్నంతా ఆవరించింది.

అయినా లక్ష్మణుడు ఆందోళన పడలేదు. అందరిని పిలువలేదు. చివ చెలికత్తెను గూడ రమ్మనలేదు.

ఊర్మిళకు స్పృహలేదు. అయినా లక్ష్మణుడు ఆమెను స్పృశింపలేదు. ఆ అప్పుడే స్పృహ రాదని లక్ష్మణునికి తెలుసునేమో. ఎప్పుడో రావటమే మం ఆయన అనుకొన్నాడేమో. ఆ సమయంలో ఆమె స్పృహ తన ప్రయాణానికి బంధనమౌతుందని భావించాడేమో.

సాదరంగా లక్ష్మణుడు ఒక్కసారి ఆమె ముఖంలోకి చూచాడు. మూర్ఛపోయినట్లులేదు. ఏదో గాఢ నిద్రలో మునిగినట్లుంది. ఒక యోగమ ధరించినట్లుంది. తనలో తాను లీనమైన మహాయోగిని లా ఉంది.

చెమ్మగిల్లిన కళ్ళతో లక్ష్మణుడు చెయ్యెత్తి ఆమెను ఆశీర్వదించ భారంగా అడుగులు వేసుకొంటూ ముందుకు నడిచివెళ్ళాడు.

ఊర్మిళ ఎంతకాలం అలా ఉందో! ఎవరెవరువచ్చి ఆమెనుచూచారో! ఏయే చికిత్సలు చేశారో! ఏమీ తెలీదు.

మొత్తానికి ఆ వయస్సులో ఆమె పద్నాలుగేళ్ళు ఏకాంతవాసం అనుభవించింది. భర్త అభీష్టాన్ని గౌరవించి ఆయనను అక్కా బావల సేవలకు అడవులకు పంపింది.

లోకం లక్ష్మణుని కీర్తించింది — అర్ధాంగినీ, అయోధ్యను వదలి అన్న వదినెల సేవలకు అడవులకు వెళ్ళినందుకే. అది ఆయన గొప్పతనమే. కాని ఆయన అలా వెళ్ళడానికి ఎంతో అనుకూలించింది ఊర్మిళ చేసిన త్యాగం.

ఆనాడు ఊర్మిళ ఇదేమిటని ఏ మాత్రం నోరుచేసుకొన్నా లక్ష్మణుడు అలా వెళ్ళగలిగేవాడా? రాముడు మాత్రం ఆయనను అలా వెంట రానిచ్చేవాడా?

మరి లక్ష్మణుడు ఏమనుకొన్నాడో మనకు తెలీదు. రాముడు ఏమనుకొన్నాడో తెలీదు. సీత ఏమనుకొందో తెలీదు. చివరకు వాల్మీకిగూడ ఏమనుకొన్నాడో మనకు తెలీదు. ఎవరనుకొన్నా అనుకోకపోయినా ఊర్మిళ మాత్రం భర్తకోసం మహాత్యాగం చేసింది. ఆ వయస్సులో భర్తను అన్యులసేవకు పద్నాలుగేళ్ళు అనుమతించి అతిభయంకరమైన ఏకాంతం అనుభవించింది.

తనభర్త అన్న వదినెలకు ముందు నడుస్తూ అరణ్యమార్గంలో అడ్డంగా ఉన్న ముళ్ళను, రాళ్ళను అవతలికి తొలగించటం ఆమె ఊహించుకొనేది. ఆనందించేది. అన్న వదినెల నివాసానికై ఆయన నిర్మించిన పర్ణశాల సౌందర్యాన్ని భావించుకొనేది. పులకించేది. అన్నవదినెల భోజనానికై ఆయన సేకరించే ఫల పుష్పాలను, కందమూలాలను. ఆశ్రమానికి రక్షగా రాత్రివేళల ధనుస్సు ధరించి అటూ ఇటూ తిరిగే ఆయన జాగరూకతను స్మరించేది. సంతోషించేది.

భర్తచేసే సీతారాముల సేవలో ఆమె పరోక్ష భాగస్వామిని.

అప్పుడప్పుడు ఆమె తనలో తాను నవ్వుకొనేది. ఎందుకో, ఏమో?

బహుశః అందీ అందని పూలుకోయటానికి ఆ లక్ష్మణస్వామి పడే అవస్థ చూచి ఆమె నవ్వుకొనేదేమో.

అప్పుడప్పుడు ఆమె నిట్టూర్చేది. ఎందుకో, ఏమో, బహుశః సీతాపహరణం లాంటి సన్నివేశాలు స్వప్నరూపంలో ఆమెకు సాక్షాత్కరించేవేమో.

అప్పుడప్పుడు ఆమె కంట తడిపెట్టేది. ఎందుకో, ఏమో,

బహుశః యుద్ధభూమిలో లక్ష్మణస్వామి మూర్ఛవంటి ఘట్టాలు మనోవీధిలో ఆమెకు అగుపించేవేమో.

అయినా ఆమె ఆ పద్నాలుగేళ్ళూ తన మందిరంవదలి ఆవల అడుగుపెట్టలేదు. అయోధ్యలోగాని, ఆవలి ప్రపంచంలోగాని ఏమి జరుగుతున్నదో ఆమెకు తెలీదు. తెలుసుకోవలసిన అవసరంగూడ ఆమెకులేదు. అత్తమామలతోగాని, తల్లిదండ్రులతోగాని, అనుగు చెల్లెండ్రతోగాని, చివరకు చెలికత్తెతోగాని ఆమె మాట్లాడలేదు. మాట్లాడవలసిన అవసరంగూడ ఆమెకులేదు. పుట్టింటినుండి తన వెంటవచ్చిన చెలికత్తెమాత్రం అప్పుడప్పుడు ఆమె మందిరంలో ప్రవేశించేది. పండ్లు, పాలు ఉంచేది. ఊర్మిళ ఎప్పుడులేచేదో! ఏ మాత్రం ఆరగించేదో! ఊర్మిళ ఆహారం ఊపిరి ఉండటానికే. భర్తను మనస్సులో నిలుపుకొనే శక్తిని సమకూర్చుకోటానికే ఆమెది ఒక గొప్ప ఉపవాసవ్రతం.

చెలికత్తెతో గూడ ఊర్మిళ మాటాడేదిగాదు. ఏదో ఒకటి రెండు సంజ్ఞలు అదీ ఎప్పుడో! ఆమెది ఒక గొప్ప మౌనవ్రతం. పద్నాలుగేళ్ళ వరకు తన భర్త రావాలి. తన్ను పలుకరించాలి. ఆయనతో కలిసి అన్నీ భుజించాలి. అంతవరకు ఇంతే.

అట్లని ఊర్మిళ కాలాన్ని లెక్క వేయలేదు. కాలమే తన్ను తాను లెక్క వేసుకొంది. పద్నాలుగేళ్ళు దాటగానే అన్నవెంట లక్ష్మణుని మరల అయోధ్యకు రప్పించింది.

ఆనాడు ఊర్మిళ లక్ష్మణుని కొరకు వెళ్ళలేదు. లక్ష్మణుడే ఊర్మిళకొరకు వచ్చాడు. ఆమె ఇంకా నిద్రలోనే ఉంది. యోగముద్రలోనే ఉంది. ఓ దేవతగదిలో అడుగుపెట్టినట్లు లక్ష్మణుడు ప్రవేశించాడు. హస్తసంజ్ఞతో అక్కడున్న చెలికత్తెను ఆవలికి పంపాడు. ఊర్మిళ ప్రక్కన కూర్చున్నాడు ఒకింత ఒరిగి ప్రియమార ఆమె ముఖంలోకి చూచాడు ముంగురులు చేత సవరించాడు. శిరస్సు నిమిరాడు

'ఊర్మిళా'! అన్నాడు.

లక్ష్మణుని హస్తస్పర్శతో ఏదో అంతరగంగపైకుబికినట్లు ఆమె శరీరం లోని అణువణువున చైతన్యం వెల్లివిరిసింది. ఆమె గుండెలోతుల్లోంచి లక్ష్మణుడు పైకిలేచి ప్రక్కన వచ్చి కూర్చున్నట్లుంది. ప్రియమార తన్ను పిలిచినట్లుంది.

ఊర్మిళ అల్లన కన్నుతెరిచింది.

ఎదుట లక్ష్మణుడు. ఒక్కసారిగా పాలసముద్రం, మేరుపర్వతం ప్రత్యక్షమై నట్లుంది.

లక్ష్మణుడు గాఢంగా ఆమెను హృదయానికి హత్తుకొన్నాడు. ప్రక్కనున్న పళ్ళెంలోని పండుతీసి ఆమెకు తినిపించాడు. తానూ తిన్నాడు. పాలు ఆమెకు త్రాగించాడు. తానూ త్రాగాడు. రేపే అన్నగారి పట్టాభిషేకం అన్నాడు. ఆ క్షణంలో ఊర్మిళేగాదు ఆ నదిలోని గోదావర్యుగూడ అనిర్వాచ్యమైన ఒక రసానుభూతిని పొందాయి.

ఊర్మిళ జీవితంలో ఈ రసానుభూతి ఎంతకాలమో ఆర్ద్రంగా నిలిచింది. ఆమెకు అంగద చంద్రకేతువులు జన్మించారు. ఆమె మాతృమూర్తి అయింది. కారు పథదేశంలో అంగదీయపురంలో అంగదుడు పట్టాభిషిక్తుడయ్యాడు. చంద్రకాంత పురంలో చంద్రకేతువు రాజయ్యాడు. ఊర్మిళ రాజమాత అయింది. ఆ స్త్రీమూర్తి జీవితానికి అదొక ధన్యత.

కాని ఊర్మిళ జీవితం ఏవిధంగా ముగిసిందో తెలీదు. ఆమె లక్ష్మణునికి దారుణమైన దేశ బహిష్కార శిక్ష పడకముందే పరమపదం చేరుకున్నదో లేక ఆ వృద్ధాప్యంలో భర్తనుగూర్చి అమిత బాధాకరమైన మానసికవ్యధ అనుభవించిందో లేక భర్తతోపాటు తానూ సరయూ తీరాన యోగమార్గంలో తనువు త్యజించిందో. వాల్మీకి ఆమె జీవితంలో అన్నివిషయాలూ వదలివేసినట్లే ఈ విషయాన్ని గూడ వదలి వేశాడు.

వాల్మీకి చెప్పినా చెప్పకపోయినా భావుకుడైన ప్రతి పాఠకుని దృష్టి ఊర్మిళ ఆకర్షిస్తుంది. ఆమెచేసిన త్యాగం ప్రతి పాఠకుని మనస్సును ఆర్ద్రం చేస్తుంది.

సీత భర్తతో కలిసి జీవితంలో కష్టాలు అనుభవించింది. మాండవీ శ్రుత కీర్తులు జీవితమంతా భర్తలతో కలిసి జీవించారు. ఊర్మిళమాత్రం యౌవనదశలో అందులోనూ క్రొత్తగా కాపురానికి వచ్చినవేళ, భర్త అభీష్టాన్ని గౌరవించి, సీతా రాముల సేవా భాగ్యాన్ని ఆయనకు కలిగించి, తన్మూలంగా ఆయన వ్యక్తిత్వాన్ని లోకంలో దేదీప్యమానంగా వెలిగించి, తానొక చీకటి గదిలో జీవచ్ఛవంలా పధ్నాలుగేళ్ళు పడిఉంది.

ఊర్మిళ ఒక ప్రేమమూర్తి; త్యాగమయి.

# మంథర

సరళంగా, వేగంగా, సుఖంగా సాగిపోయ్యే బండికి చీల ఊడిపోతున్నదని తెలిసి శీఘ్రంగా పసిగట్టి చీల బిగించి, చక్రం జారిపోకుండా చేసేవాళ్ళున్నట్లే ఎక్కడో ఒక మూలనాగి ఉన్న చీలనే ఊడబెరికి బండిని పడద్రోయటానికి ప్రయత్నించే వాళ్ళుగూడ లోకంలో ఉంటారు. ఈ ఇద్దరి పనులకు ఒక్కొక్కసారి పెద్ద కారణాలుండకపోవచ్చు. వాళ్ళవాళ్ళ స్వభావాలను బట్టే ఆ విధంగా వాళ్ళు ప్రవర్తించవచ్చు. అట్లని వ్యక్తుల ప్రవర్తనలమీద పరిస్థితుల ప్రభావాలుండవని గాదు. ఒక్కొక్కసారి అవి ప్రబలంగా గూడ ఉంటాయి. అయితే వ్యక్తుల సహజ స్వభావాలు మాత్రం తర్కాలకందని జన్మాంతర సంస్కారాలు

రామాయణంలో మంథర ఒక దాసి. కైక అంతఃపురంలో దాసి. చాటున నాగి ఆమె రాముని జీవితరథానికి చీల ఊడదీసింది. ఆ దెబ్బతో రామపట్టాభిషేకమే ఆగిపోయింది. ఆయన జీవిత స్థితిగతులే మారిపోయాయి. రామాయణ మహాకావ్యమే ఒక పెద్దమలుపు తిరిగింది.

మంథర పొట్టిది. పైగా పెద్దగూను. అంద వికారమైన ఆకారం. ఆమె జీవితంలో ఎత్తును చూడలేదు. అందాన్ని, ఆనందాన్ని చూచి హర్షించలేదు. అణిగి ముడుచుకు పోయిన ఆకారం. వడలిపోయిన మనస్తత్వం.

ఆనాడు రామాభిషేకానికి అయోధ్య అందంగా అలంకరించుకొంది. ఎక్కడ చూసినా అరటి స్తంభాలే. మామిడాకుల తోరణాలే. పూలసరాలే. రంగురంగుల దీపాలే. చందన అగరు ధూపాలే. మంత్రాల మ్రోగులే. మంగళవాద్యాలే. పూజా కార్యక్రమ విశేషాలే. ఆనందోత్సాహ కోలాహలాలే.

మంథర ఆ సమయంలో ఎందుకో కైక మేడమెట్లు ఎక్కుతూఉంది. ప్రక్కన నేరొక చెలికత్తె కూడా ఉంది. ఒక్కొక్క మెట్టు ఎక్కుతూఉండే అలంకారాలతో నిండిన ఆ అయోధ్యానగరశోభ అంతకంతకు ఆమెకు అధికంగా అగుపిస్తూఉంది. ఇది అయోధ్యా! అమరావతా! అలకా నగరమా! అని ఆమె ఆశ్చర్యపోతూఉంది. అంతలోనే ప్రక్కనున్న కౌసల్యాదేవి అంతఃపురం అగు

పించింది. ఆ అంతఃపురశోభ అసాదు మరీ పెట్టవచ్చినట్లుంది. పైగా కౌసల్యా దేవి, అంతఃపురం ఆవలికి వచ్చి ఏటి ప్రవాహంలా ఉన్న యాచక సమూహానికి ఏవేవో ఇస్తూ ఉంది.

'ఇది ఎన్నడూలేదే' అని మంథర అనుకొంది. ప్రక్కనున్న చెలికత్తెతో 'ఏమిటే ఇదంతా' ? అని అడిగింది.

మంథర మనస్తత్త్వం ఆ చెలికత్తెకు గూడ తెలుసు. అందుచేతనే పాపం ! చెప్పటానికి తటపటాయించింది. అయినా సంతోషం పట్టలేక 'రేపు రామాభిషేకం' అంది.

అంతే. హఠాత్తుగా కడుపునొప్పి పుట్టినట్లు మంథర ముఖం మారిపోయింది. 'అలాగటే! నాకేమీ తెలీదే!' అంటూ గబగబా మేడమెట్లు ఎక్కింది. గుండెలు బాదుకొంటూ కైక మందిరంలో ప్రవేశించింది. 'కైకా! కొంపమునుగుతున్నది. ఇంకా పడుకొని ఉన్నావా ?' అని కసిరినట్లు అరిచింది.

కైక కేమీ అర్థంగాలేదు.

'ఎందుకే మంథరా అలా అదరిపడతావు. ఏం జరిగిందని ?' అంది కైక ఎంతో నిబ్బరంగా.

'ఏం జరిగిందా ? నీ మీద కుట్ర, నిన్ను సర్వనాశనం చెయ్యటానికి ప్రయత్నం. నీ మగడు నీకు చెప్పేవన్నీ అబద్ధాలే. నీవు నమ్ముతావు. నీవు పసిదానివి, అమాయకురాలివి. అందుకే నీ కొడుకు భరతుని ఊళ్ళో లేకుండా చేసి నీ మగడు ఆ రామునికి పట్టం గట్టుతున్నాడు. రేపు రామపట్టాభిషేకం. అమ్మో ! అబ్బో!' అని గుండెలు బాదుకొంటూ చెప్పింది మంథర.

'రామపట్టాభిషేకమా ! నా రామునికి యౌవరాజ్యాభిషేకమా !' అని కొండంత సంతోషంతో కైక పడకమీదినుంచి లేచి గట్టిగా మంథరను కౌగిలించుకొంది. 'ఎంత సంతోషవార్త చెప్పావే' అని తన మెడలోని రత్నాలహారాన్ని తీసి ఆ మంథర మెడలో వేసింది.

మంథరకు మతిపోయింది. ఒక్కసారి అలా కైక ముఖంలోకి సూటిగా

చూచింది. కన్నీళ్ళు కార్చింది. కన్నెఱ్ఱజేసింది. తన మెళ్ళోవేసిన హారాన్ని తీసి విసిరి పారవేసింది.

కైక ఆశ్చర్యంగా చూస్తూ ఉంది.

మంథర కైకకు అత్యంత దాసి. పైగా దూరపు బంధువు. అందుచేత ఎంతో చనువు తీసుకొని 'ముద్దురాలా!' అని మొదలుపెట్టి 'నీ కొంపమునుగుతున్నది. తెలియక సంతోషిస్తున్నావు. సవతి కొడుకు ఉన్నతి ఏ స్త్రీ కయినా మృత్యువుతో సమానం. రాముడు రాజైతే నీవు, నేను, అందరము ఆ కౌసల్యకు దాస్యం చెయ్యాలి. నీ కొడుకు భరతుడు ఆ రామునికి గొడుగుపట్టాలి అతని దయాధర్మ భిక్షలతో అందరము బ్రతుకు తెరువు సాగించాలి' – అని చెపుతూ ఉండగానే కైక అడ్డుతగిలింది.

'రాముడు సుగుణాభిరాముడు. అతడు రాజైతే అందరికీ సుఖమే. శుభమే. రాముని తరువాత మన భరతుడు రాజౌతాడు. అందుకు దిగులెందుకు?' అంది కైక ఈసడించుకొంటూ.

మంథరకు ఏం చెప్పాలో అర్థంగాలేదు. ఎలా చెప్పాలో తెలియలేదు. తలబాదుకొంటూ 'తెలివితక్కువదానా! నేను చెప్పేది నీ కర్థంగాలేదు. రాముని తరువాత భరతుడు రాజుగాడు. రాముని కొడుకే రాజౌతాడు. భరతుడు, అతని సంతతి శాశ్వతంగా రాజయోగానికి దూరమౌతారు. అంతేనా? రామలక్ష్మణులు ఏకమౌతారు. నీ కొడుకు దిక్కులేని వాడౌతాడు. అతడు అడవులు, కొండలు పట్టుకొని పోవలసిందే. ఒక్క సంగతి ఆలోచించు. ఇంత జరుగుతుంటే నీ మగడు ఒక్క మాటైనా నీతో చెప్పాడా? నీవేమో ముద్దుల భార్యనని మురిసిపోతున్నావు. ఇదంతా ఆ కౌసల్యా దశరథుల కుట్ర. ఇప్పటికైనా తెలుసుకో.

నీ కంటె నాకెవరున్నారు. నీ క్షేమమే నాక్షేమం. నీ సంతోషమే నా సంతోషం, నీ సౌభాగ్యమే నా భాగ్యం, అనేసరికి కైక మనస్సు మారింది. కళ్ళు ఎరుపెక్కాయి.

'అయితే ఇప్పుడు ఏం చేద్దామే మంథరా?' అంది కైక ఆత్రంగా.

మంథర బుద్ధి పాదరసంలా పనిచేసింది. దశరథుడిచ్చిన వరాల సంగతి గుర్తుచేసింది. 'భరతునికి పట్టాభిషేకం, రామునికి పదునాలుగేళ్ళ వనవాసం — ఇవే కైకా నీవు కోరవలసిన వరాలు. త్వరగా బయలుదేరు. కోపగృహంలో ప్రవేశించు. దశరథుడు వస్తాడు. పట్టువదలకు. పని సాధించు' — అని మంథర కైకను త్వరపెట్టింది.

కైక కనురెప్ప లెగురవేసింది. మంథర బుద్ధిని ప్రశంసించింది. అంద వికారమైన ఆమె రూపాన్నిగూడ అతిగా పొగడింది. అంతేగాదు. పనిపూర్తికాగానే ఒక బంగారు కవచం చేయించి దాని గూనుకు తొడుగుతానని గూడ మాట ఇచ్చింది.

మొత్తానికి మంథర అనుకొన్నంత పని చేసింది. కైక వెనుక దాగి రాముని జీవిత రథానికి చీల ఊడబెరికింది. పరిస్థితులను తారుమారు చేసింది.

రామాభిషేకం ఆగిపోయింది. ఆయన జీవితం అడవుల పాలైంది. దశరథుని ప్రాణాలు అనంతవాయువుల్లో లీనమయ్యాయి. ఆయన అంత్యక్రియలు గూడ పూర్తిఅయ్యాయి.

ఇక భరతుని అభిషేకం వైభవంగా జరుగుతుందని, అందుకు ఏ ఆటంకము ఉండదని మంథర ఆశించింది. ఎంతో ఆనందించింది. భరతుని అభిషేకం తన ప్రతిభకు పట్టాభిషేకం. దానితో తన ప్రాధాన్యం పెరిగిపోతుంది. ముమ్ముందు అందరు తన్ను గౌరవించే వారే. తన చుట్టుచేరేవారే. తన్నుచూచి భయపడేవారే. తన అనుగ్రహం కొరకు ప్రాకులాడే వారే. తాను ఇదివరకటిలా ఏదో సామాన్య దాసిలా ఉంటే ఏలాగ ? అందుకే అందంగా అలంకరించుకొని, రక రకాల ఆభరణాలు ధరించి చిత్ర విచిత్రాలైన మొలనూళ్ళ కట్టుకొని, వేషం వేసుకొన్న కోతిలా తన అందచందాలు, ఆభరణాలు అటు ఇటు చూచుకొంటూ, 'తనలో తాను నవ్వుకొంటూ, చెలికత్తెలంతా చుట్టూ చేరి కొలువ భరత శత్రుఘ్నులున్న భవనం తూర్పు వాకిట ప్రవేశించింది.

'అదుగో ! దుర్మార్గురాలు. దొరికింది' అని ద్వారపాలకులు మంథరను పట్టుకొన్నారు. శత్రుఘ్నునికి అప్పగించారు. శత్రుఘ్నుడు మంథరను చురచుర చూచాడు. ఆ చూపు దెబ్బకే ఆ దాసి సగం చచ్చింది. ప్రక్కనున్న చెలికత్తెలు బ్రతుకు జీవుడా అని పరుగెత్తివెళ్ళారు.

శత్రుఘ్నుడు మంథర జుట్టు పట్టుకొన్నాడు. నేలమీద పడవేసి పశువును ఈడ్చినట్లు ఈడ్చాడు. ఆమె ఆభరణాలన్నీ ముక్కలయ్యాయి. నేలమీద అక్కడక్కడ పడ్డాయి. ఆభరణ శకలాలతో, రకరకాల రాళ్ళ కాంతులతో ఆ ప్రదేశమంతా నక్షత్రఖచితమైన ఆకాశం నేలమీదికి దిగినట్లు అగుపించిందట.

మంథర చావుకేక పెట్టింది. కైక ఆకేక విని 'శత్రుఘ్నా! మంథరచస్తుంది. క్షమించి వదలు' అని హడావుడిగా అడ్డువచ్చింది.

కైకమ్మనుగూడ ఆ శత్రుఘ్నుడు ఒక పదిలింపు విదిల్చాడు.

భరతుడు రావటం ఒక్కక్షణం ఆలస్యమైతే శత్రుఘ్నుని చేతిలో మంథర చచ్చి ఉండేదే.

భరతుడు త్వరగా వచ్చి తమ్ముని చెయ్యి పట్టుకొన్నాడు. 'శత్రుఘ్నా! స్త్రీహత్య మహాపాతకం అది జరిగితే అన్నగారు మన ముఖమే చూడరు అందుచేత మంథరను వదలు' అన్నాడు.

శత్రుఘ్నుడు అప్పుడు మంథరను వదిలాడు. ఆ దుష్టానికి ఇంకా ఆయుష్యం ఉంది. అందుకే మిగిలింది. చివరకు రామాభిషేకంగూడ చూచింది. మరి ఆనాడు తాను చేసిన పనికి సంతోషించిందో లేక పశ్చాత్తాపపడిందో !'

మొత్తానికి మంథర రామాయణంలో ఒక మరుపురానిపాత్ర. ఆ మహాకావ్యాన్నే పెద్ద మలుపు త్రిప్పినపాత్ర. రామాయణంలోనే కాదు లోకంలోగూడ ఈనాటికీ ఎందరో మంథరలున్నారు. అందరు వాళ్ళను ఒక కంట గమనించటం ఎంతో అవసరం.

# కైక

సాగరసంగమమే పరమావధ్యంగా — సరళరేఖలా సాగిపోయ్యే ఏటి ప్రవాహానికి ఎక్కడో ఓ కొండ అడ్డుతగులుతుంది. ఆ ప్రవాహాన్ని చిందరవందర చేస్తుంది. పాయలుపాయలుగా చీలుస్తుంది. పెద్దమలుపు త్రిప్పుతుంది. ప్రవాహ వైశాల్యాన్ని పెంచుతుంది. ప్రవాహం చిందరవందరైనా, పాయలుపాయలుగా చీలినా — అది మలుపు తిరిగినందువల్ల, దాని వైశాల్యం పెరిగినందువల్ల లోకానికి మేలే జరుగుతుంది. ఎన్నో ప్రాంతాలు క్షామ పీడ తొలగి సస్యశ్యామలాలౌతాయి. సుఖసంతోషాలలో ఓలలాడుతాయి.

ఆలాగే మహాత్ముల జీవితాల్లోగూడ కొందరడ్డుపడతారు. వారి జీవితాలను చిందర వందర చేస్తారు; పెద్ద మలుపు త్రిప్పుతారు. అందువల్ల మహాత్ములకు కష్టం కలిగినా లోకానికి మాత్రం ఒక్కొక్కసారి గొప్ప మేలే కలుగుతుంది. స్వార్థముఖంగా సాగిపోయ్యే వారి జీవితాలు, శక్తిసామర్థ్యాలు సమాజముఖాలవుతాయి. ఎన్నో సమస్యలను తీరుస్తాయి. సత్ఫలితాల నందిస్తాయి.

అయితే ఏటికడ్డుపడిన కొండనుమాత్రం ఎవ్వరూ నిందించరు — దానికి స్వార్థం లేదుగనుక. మహాత్ములకడ్డుపడిన మనుషులను మాత్రం అందరూ నిందిస్తారు. వారికి స్వార్థం ఉంటుంది గనుక. పోనీ స్వార్థబుద్ధితో వాళ్ళడ్డుపడినా దానివల్ల లోకానికి మేలే జరిగిందని ఎవ్వరూ అనుకోరు. అడ్డుపడిన వ్యక్తులు అడుగడుగున అవమానాలకు గురిఅవుతారు. అపకీర్తి పాలౌతారు.

రామాయణంలో కైక గతికూడ అంతే అయింది. ఆమె రాముని యౌవరాజ్య పట్టాభిషేకానికి కొండలా అడ్డుపడింది. సరళంగా, సుఖంగా సాగిపోయ్యే ఆయన జీవితాన్ని చిందరవందర చేసింది. రామాయణ మహాకావ్యాన్నే ఒకపెద్ద మలుపు త్రిప్పింది. అందువల్ల ఆనాటి సమాజానికి, ఆ కావ్యానికి మేలే జరిగింది. అయినా ఈనాటికీ లోకం ఆమెను నిందిస్తూ ఉంది.

అందుకు కారణం ఆమె స్వార్థ బుద్ధి; తీవ్రబుద్ధి. రాముని అడవుల పాలు చేసి, భర్తప్రాణాలు తీసిన ఆమె పాప బుద్ధి.

అందం, భోగానుభవం, ఆధిక్యం అందరుమానవులూ కోరుకొనేవే అయినా ఎందుకో కొందరు స్త్రీలు వీటిమీద విపరీతమైన మోజు పెంచుకొంటారు. వెగటుగా ప్రవర్తిస్తారు. కాగా అసూయా ద్వేషాలు, చెడుమాటలకు చెవియొగ్గటాలు అందరు మానవుల్లో అగుపించే బలహీనతలే. అయినా ఎందుకో కొందరు స్త్రీలు వీటికి సులభంగా వశమైపోతారు. పర్యవసానాలనుగూడ లెక్కపెట్టకుండ ప్రవర్తిస్తారు. మహామూర్ఖంగా కొన్నింట పట్టుదల వహిస్తారు.

కైక జీవితంలో గూడ అదే జరిగింది.

కైక కేకయరాజపుత్రి. దశరథమహారాజ ప్రియపత్ని. ఆమెకు అందం ఉంది. ఐశ్వర్యం ఉంది. భర్త అనురాగం ఉంది. సవతులందరిలో ఆధిక్యంగూడ ఉంది. అంతేగాదు. రథసారథ్యంలో నైపుణ్యం ఉంది. యుద్ధంలో పతికి తోడ్పడగల ధైర్యంగూడ ఉంది. అన్నింటినీ మించి మంచితనం గూడ కొంతఉంది. అయితే తల్లినుండి సంక్రమించిన ఉద్రిక్తమైన గుణం ఉంది — అది పట్టుదల — అతి మాత్రపు పట్టుదల. పర్యవసానాలను గూడ లెక్కపెట్టని పట్టుదల. ఆ అతిమాత్రపు పట్టుదలే ఆమెకు జీవితంలో అపరిమితమైన అపకారం చేసింది. అపకీర్తి తెచ్చింది.

అది కైకజీవితంలో మరపురానిరోజు. ఆమె శక్తి సామర్థ్యాలు, ధైర్య సాహసాలు సద్వినియోగమైన రోజు. పతి ప్రేమను పూర్తిగా పొందినరోజు. ఆయనమెచ్చి రెండువరాలిచ్చిన రోజు.

ఆనాడు దేవేంద్రునికి సాయంగా దశరథుడు శంబరుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. వెంటవద్దన్నా కైకగూడ వెంటవెళ్ళింది. శంబరుడు రాక్షసుడు. మహావీరుడు. మాయాయుద్ధ నిపుణుడు. ఆనాటి యుద్ధంలో కైకేయి దశరథునికి సారథ్యంచేసింది. అతినిపుణంగా చేసింది. అయినా సాయంకాలానికి దశరథుని శరీరం గాయాలతో నిండిపోయింది. ఆయన సొమ్మసిల్లాడు. రాత్రికావస్తు ఉంది. రాత్రి, రాక్షసమాయకు ఎంతో అనుకూలం. కైకరానున్న ప్రమాదాన్ని పసిగట్టింది. దశరథుని రథాన్ని వెంటనే యుద్ధభూమినుండి తప్పించింది. ఒక రహస్యప్రదేశానికిచేర్చింది. భర్తకు శీతలోపచారాలు చేసింది. అయినా రాక్షసులు దశరథుని ఉనికిపట్టు కనిపెట్టారు. పైకిదండెత్తి వచ్చారు. కైక మరల

మగని రథాన్ని మరో రహస్య స్థలానికి చేర్చింది. ముప్పు తప్పించింది. సేవలు చేసింది. మరునాటికి అతని సేన తిప్పింది.

దశరథుడు కైక సామర్థ్యానికి, సేవలకు ముగ్ధుడయ్యాడు. ఆమెను మనసారా మెచ్చుకొన్నాడు బిగియార కౌగిలించుకొన్నాడు. అడుగకుండానే రెండు వరాలిచ్చాడు. ఆమె పతి కౌగిట్లో పరవశించింది. అరమోడ్పు కన్నులతో ఆయనకు కృతజ్ఞతలు చెప్పింది. తన అదృష్టాన్ని తలచుకొని తానే మురిసి పోయింది.

నిజంగా ఏ మగవజీవితంలోనైనా అదొక మరపురాని రోజు. మంచిరోజు. పూలు పచ్చినరోజు. అయితే ఏవరాలు కావాలో కైక అడుగలేదు. ఏ వరాలిచ్చాడో దశరథుడు చెప్పలేదు.

ఆనందంగా కౌగిలింతలు; కలకలనవ్వులు; ముద్దు మురిపాలు; ముసిముసి నవ్వులు. అంతే.

కాలం గడిచింది.

కౌసల్యా కైకేయీ సుమిత్రలు కొడుకులనుగన్నారు. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు పెరిగి పెద్ద వారయ్యారు. విద్యాబుద్ధులు నేర్చారు. కైక కొడుకు భరతుని కంటె కౌసల్య కొడుకు రాముడు పెద్ద. అయినా సవతి కొడుకును చూచి కైక అసూయపడలేదు. రాజ్యానికి రాముడు వారసుడు. అయినా కైక బాధపడలేదు. పైగా ఆమె రాముని కన్నతల్లిలా ప్రేమించేది. లాలించేది. అతని అభివృద్ధిని, ఆధిక్యాన్ని చూచి ఆనందించేది.

మానవజీవితంలో చెప్పుడు మాటలు మహాచిత్రమైనవి. అవి అందరిమీద పనిచెయ్యవు. అన్ని సమయాల్లోనూ పనిచెయ్యవు. కాని కొందరిమీద పనిచేస్తాయి. కొన్ని సమయాల్లో పనిచేస్తాయి. పాలకుండల్లో కాలకూటాలు నింపుతాయి. మంచు కొండల్లో మంటలు రేపుతాయి. మానవజీవితాలనే మార్చివేస్తాయి. క్రొత్త చరిత్రలు సృష్టిస్తాయి.

అది కైకేయి శయ్యామందిరం. హంసతూలికా తల్పం. పాలసముద్రం లోని నురుగులా అది హాయిగొలుపుతూ పవ్వళించి ఉంది. ఎందుకో ఆమె మనస్సు ఆందోళనగా ఉంది. ఏ రోజయినా ఆమె శయ్యామందిరం వదలి అడుగు బైట పెట్టదు. ఏ పనికైనా దాసీజనాన్ని పంపుతుంది గూడ అటుప్రక్క రాలేదు. అందుకే బైట అయోధ్యలో ఏం జరుగుతున్నది తెలీదు.

ఆమె నిదానంగా గోడనున్న చిత్రపటాన్ని ఆలోచనగా చూస్తూ ఉంది. అది తను శంబరాసురయుద్ధంలో దశరథునికి సారథ్యం చేస్తున్న చిత్రం. ఏ చిత్రకారుడు వేసాడో గాని అన్నీ చూస్తుంటే అంతా అప్పుడు జరుగుతున్నట్లే ఉంది. ఆమె మనస్సులో ఎన్నెన్నో ఆలోచనలు; ఏవేవో అనుభూతులు.

ఇంతలో తలుపు తెరిచిన చప్పుడు.

పరిచారిక వస్తున్నాదేమోనని ఆమె తలాయిన లేచింది.

వచ్చింది దశరథునగారి మంథర. దాని గూనివీపు అదీ ఓ మడుగుబ్బు ఒంటెలా ఉంది. ముఖం ఎందుకో చిటపటలాడుతూ ఉంది — బొగ్గుల కొలిమిలా, సరాసరి వచ్చి కైక శయ్యమీదే కూర్చుంది.

కైక 'నీవా !' అని మళ్ళా పడకమీద వ్రాలింది.

'కైకా నీ కిది తెలీదా ?' అంది మంథర ఏదో కొంపమునుగుతున్నట్లు

'ఏది ?' అంది కైక ఏమి పట్టనట్లు

'అందుకే నీవు మూర్ఖురాలివి. అమాయకురాలివి. భర్తకు మిక్కిలి ప్రియురాలినని, సవతులందరిలో సంపన్నురాలినని మూర్ఖంగా మురిసిపోతున్నావు. అమాయికంగా ఆనందిస్తున్నావు. ప్రమాదం ముంచుకొస్తున్నది. వేసవికాలపు నీటి ప్రవాహంలా నీ భాగ్యం అంతరిస్తున్నది' — అంది మంథర ఆందోళనగా.

కైక అటుప్రక్కనుంచి ఇటు ప్రక్కకు పొరలింది.

'ఏమిటే మంథరా ! ఏం జరిగింది ?' అంది సాభిప్రాయంగా ఆ మంథర వైపు చూస్తూ.

మంథర మాట్లాడలేదు.

'ఏం జరిగిందే — త్వరగా చెప్పు' అంది దాని గూనివీపు ఊపుతూ.

'నీ కొంప మునుగుతూ ఉంది. నీ భర్త రామునికి రాజ్యాభిషేకం చెయ్యబోతున్నాడు' — అంది మంథర ముఖమంతా నోరుచేసుకొని.

కైక శరత్కాలచంద్రరేఖలా శయ్యమీద చివాలున లేచి కూర్చుంది. 'ఎంత శుభవార్త చెప్పావే మంథరా! రామునికి రాజ్యాభిషేకమా! నా రామునికి రాజ్యాభిషేకమా! ఇదుగో రత్నాలహారం — అని తన మెళ్ళోని హారం తీసి తానే మంథర మెడ నలంకరించింది.

మంథరకు మతిపోయింది. ఆ హారాన్ని తీసి అవతలకొట్టి — 'మూర్ఖురాలా! ముంచుకువచ్చే ప్రమాదాన్ని గ్రహించలేకున్నావు. సవతికొడుకు రాజ్యసంపదకు సంతోషిస్తున్నావా! రాముడు రాజైతే నీకేం వస్తుంది? నీ కొడుకు భరతుని కేం వస్తుంది? నీవు, నేను, అందరము ఆ కౌసల్యకు సేవకురాండ్రమౌతాము. నీకొడుకు భరతుడు శాశ్వతంగా రాజయోగానికి దూరమౌతాడు. ఆలోచించుకో' అంది మంథర ముఖమంతా కస్సురుముతూ.

'మంథరా! ఎందుకే అలా అంటావు. రాముడు ధర్మజ్ఞుడు; కృతజ్ఞుడు; పరిశుద్ధుడు; సత్యసంధుడు; జ్యేష్ఠుడు; యౌవరాజ్యార్హుడు. తమ్ములను, భృత్యులను అందరిని తండ్రిలా చూచుకొంటాడు. రఘుకులాభిరాముడైన శ్రీరాముని రాజ్యాభిషేకానికి సంతోషించాలిగాని ఇలా దుఃఖించవచ్చునా పిచ్చిదానా!' అంది కైక మంథర వీపు నిమురుతూ.

'అంతేగాదు. రాముని తరువాత భరతుడు రాజౌతాడు. తొందరెందుకు. రాముడు కౌసల్యకన్న నన్నే ఎక్కువ భక్తిభావంతో చూస్తాడు. బాధెందుకు. రాముడు తనలాగే తమ్ముళ్ళని చూచుకొంటాడు. భయమెందుకు మంథరా! రాముడు రాజైతే భరతుడు రాజైనట్లే' అంది కైక ప్రసన్న మనోజ్ఞ మందహాసంతో.

మంథర ఒక్క వేడినిట్టూర్పు విడిచింది.

'కైకేయీ! నీకు లోకజ్ఞానం లేదు. నాగోడు నీకు బొత్తిగా తెలియదు. సవతి కొడుకు రాజైతే నీకు సవతిసేవ తప్పదు. రాముని తర్వాత రాజ్యం అతని సంత

తికే చెందుతుంది. అంతేగాని భరతునికిరాదు. భరతుని సంతతికీ రాదు. పైగా భరతుడు ఏనాడైనా తనకడ్డు వస్తాడని భావిస్తే రాముడు అతని నంతమొందిస్తాడు. అప్పుడు నీవేం చేస్తావ్. ఇంతకాలం నీవు దశరథుని ప్రియపత్నినని విఱ్ఱవీగావు. కౌసల్యనవమానించావు. ఇప్పుడా కౌసల్య రాజమాత. నిన్నవమానిస్తుంది. నీ మీద కసి తీర్చుకొంటుంది. అందుచేత రాముడు రాజు కాకుండా చెయ్యాలి. అతన్ని వెంటనే రాజ్యం నుండి వెళ్ళగొట్టాలి. లేకుంటేనీ గతి, నీ కొడుకుగతి ఏమౌతుందో ఆలోచించుకో' అని మంథర సెగలుపొగలు గ్రక్కింది.

కైక ముఖకవళికలు మారాయి.

జీవితంలో తాను కౌసల్యకు సేవచేయటమా ! భరతుడు, అతని సంతతి శాశ్వతంగా రాజయోగానికి దూరంకావటమా ! తనతో మాటమాత్రమైనా చెప్ప కుండా, భరతుడు ఊళ్ళోలేని సమయం చూచి దశరథుడు రామాభిషేక ముహూర్తం నిర్ణయించటమా ! ఇదంతా చూస్తుంటే తనను మోసపుచ్చినట్లుంది. మెడకు ఉచ్చు తగిలించినట్లుంది. తాను ప్రమాదం తప్పించుకొని బయటపడాలి. పరిస్థితులను తారుమారుచెయ్యాలి. వ్యవధి లేదు. వెంటనే రామపట్టాభిషేకం ఆపాలి.

ఆ ముహూర్తానికే భరతునికి అభిషేకం జరిపించాలి. అందుకు ఉపాయం ?

'మంథరా! అయితే నీవు చెప్పేదంతా నిజమేనే' అంది కైక భయంగా. అనుకున్నట్లు సూటిగా చూచి తలవూపింది ఆ తంటాలమారి పరిచారిక.

'అయితే వెంటనే రామాభిషేకం ఆపాలి. అతణ్ణి అడవులకు పంపాలి. ఆ ముహూర్తానికే భరతునికి అభిషేకం జరిపించాలి అందుకు ఉపాయం నీవే చెప్పవే మంథరా!' అని ఆదరంగా ముందుకు జరిగి అడిగింది కైక.

మంథర ముఖంలో చిరునవ్వు మహావక్రంగా మెలికలు తిరిగింది. ఆమె పెదవులు పాము పడగల్లా కదలాడాయి.

'కైకా! అందుకు ఉపాయం ఉండనే ఉంది. నీవే మరిచావు. ఆనాడు దశ రథుడిచ్చిన రెండువరాలు ఉన్నాయిగా. వాటిని ఇప్పుడు అడుగు. పద్నాలుగేళ్ళు రాముణ్ణి అరణ్యవాసం పొమ్మను. అతడు ప్రజలకు దూరమౌతాడు. వెంటనే

భరతునికి పట్టాభిషేకం జరిపించమను. ఇలాగు ప్రజలను వశం చేసుకొంటాడు. మనసమస్యలన్నీ పరిష్కారమౌతాయి' అంది ఆప్యాయంగా మంథర.

కైక కనురెప్ప ఎగురవేసింది.

'రెప్పలెగురవేసినట్లుగాదు. వెంటనే నీవు కోపగృహానికి వెళ్ళాలి. దశరథుని మనస్సును పిండి ఆ రెండు వరాలు పొందాలి. ఎలా నిర్వహిస్తావో ఏమో!' అంది మంథర కైక భుజం నిమురుతూ.

అప్పుడు చూడాలి కైక ముఖం. అప్పుడు వినాలి ఆమెమాట. 'మంథరా! నీ వెంత అందంగా ఉన్నావే' అంది ముఖమంతా విప్పచేసుకొని. చెప్పదుమాటలు అంత అందంగా ఉంటాయేమో! 'మంథరా! నీవెంత తెలివిగలదానివే' అంది. చెప్పదుమాటలు అంతచతురంగా ఉంటాయేమో. 'పనికాగానే హారితోరకంగా నీ గూనుకు బంగారుకవచం వేయిస్తానే-అనేకానగలతో నీ శరీరాన్నంతా అందంగా అలంకరిస్తానే' అంది. చెప్పదు మాటలకు ఎన్ని సన్మానాలుంటాయేమో.

'ఆశయసిద్ధి—ఆత్మత్యాగం- అదో ఇదో తేలిపోవాలి' అని ఆక్రాంతం లాగి వదలిన బాణంలా కైక కోపగృహం ప్రవేశించింది. తన ఆభరణాలన్నీ తీసి వేసింది. పూలమాలలు పెరికివేసింది. కబరీభరాన్ని విదిల్చివేసింది. మెరుగు పోయిన అద్దంలా పొగపట్టిన చిత్రంలా, నేలకొరిగిన శిల్పంలా ఒక మూల ఒదిగి పడుకొంది.

మాటిమాటికి దొంగచూపు చూస్తుంది ద్వారం వైపు — దశరథుడు వస్తాడని.

దశరథుడు రానే వచ్చాడు. పట్టాభిషేక సంతోషవార్త స్వయంగా చెప్పదామని వచ్చాడు. ఊహల్లో తేలిపోతూ వచ్చాడు. ఆనందంలో మునిగిపోతూ వచ్చాడు. ఎందుకో అంతఃపురమంతా చీకటి క్రమ్మినట్లుంది. శయ్యాగృహం ప్రవేశించాడు. అలంకారాలతో ఆ మందిరం కామదేవత కౌగిలా ఉంది. దశరథుడు స్పందించాడు. 'కైకా!' అని పిలిచాడు—ఆమెను కౌగిట బంధించాలని; కామసుఖం తనివిదీర అనుభవించాలని. కైకలేదు. పలుకలేదు. కైక కోపగృహంలో ఉందని చెలికత్తె చెప్పింది. ఎలాగోకి కోపగృహానికి వెళ్ళాడు. ఆమె నేలమీద పడుకొని ఉంది. నిరలంకారంగా ఉంది. అయినా ఆయన కంటికి సౌందర్యరాశిలాగే ఉంది. వెంత

విస్తూ అనేకవిధాల ఆశ్వాసించాడు. ఆరోగ్యం సరిలేదా అన్నాడు. అవమానం జరిగిందా అన్నాడు. అభీష్టాలు నెరవేర లేదా అన్నాడు. అవసరమైతే నాప్రాణాలనైనా ఇస్తానన్నాడు. అప్పుడు చూసింది కైక ఆయనవైపు — నీళ్ళు నిండిన కళ్ళతో, వాడిపోయిన ముఖంతో, చెదిరిపోయిన జుట్టుతో.

చిరునవ్వు నవ్వుతూ దశరథుడామెను కౌగిట్లోకి తీసుకొన్నాడు.

ఆప్యాయంగా 'ఏం కావాల'ని అడిగాడు.

'అడిగింది ఇస్తానని ప్రతిజ్ఞ చెయ్యండి. ఆపైన చెప్తా'నంది కైక. 'కైకా! నాకు నీ కంటె ప్రియమైన స్త్రీ లోకంలో లేదు. రామునికంటె ప్రియమైన పురుషుడూ లేడు. నా సర్వస్వం, నా ప్రాణం అయిన రాముని సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. కోరింది ఇస్తాను. ఏం కావాలో చెప్పు' అన్నాడు మన్మథావేశంలో మతిగోల్పోయి ఆ దశరథ మహారాజు.

కైక అద్భుతంగా ఒక నవ్వు నవ్వింది. అందులో ఆనందం ఉంది. వ్యంగ్యం ఉంది. కసి ఉంది. విజయగర్వం ఉంది. 'ఆత్మసాక్షిగా' నీ రాముని సాక్షిగా, పంచభూతాలు సాక్షిగా, సమస్త దేవతలు సాక్షిగా అడిగింది ఇస్తారు గదా' అంది ఆ రాజువైపు ఓరచూపులు చూస్తూ.

దశరథుడు గాఢంగా కైకను హృదయానికి హత్తుకొన్నాడు. అప్పుడంది కైక 'క్రొత్తగా నాకేమీ అక్కరలేదు - అప్పుడు శంబరాసుర సంగ్రామ సమయంలో నన్ను మెచ్చి ఇచ్చిన వరాలు రెండూ ఇప్పుడిస్తే చాల'ని.

'అలాగే' అన్నాడు దశరథుడు.

'అయితే రామాభిషేకానికి సిద్ధం చేసిన సామగ్రితో భరతునికి అభిషేకం జరిపించు. రాముణ్ణి పద్నాలుగేళ్ళు అడవులకు పంపించు' అంది కైక తీవ్ర స్వరంతో.

దశరథుని నిట్టనిలువున గొడ్డలితో నరికినట్లయింది. అతడు మూర్ఛపోయాడు. ఎంతసేపటికో తెప్పరిల్లి లేచాడు.

కైకను మిటమిట చూశాడు. కొరకొర చూశాడు. దీనంగా చూశాడు. దుఃఖంతో చూశాడు. ఇది పాపమని అని, రాముని విడిచి బ్రతుకలేనని, నన్ను ప్రాణాలతో బ్రతుకనీయమని ఇంకేదైనా కోరుకొమ్మని పరిపరివిధాల ప్రార్థించాడు.

కైక ససేమిరా కాదంది.

సరళంగా సాగిపోయ్యే ప్రవాహానికి ఓ పెద్దకొండ అడ్డుపడ్డట్లయింది. ప్రవాహం చిందరవందర కాక తప్పదు. మళ్ళీ తిరుగకా తప్పదు.

దశరథుడు కుప్పగూలిపోయాడు.

ఆ రాత్రి ఎలా గడిచిందో ! ఎంత భయంకరంగా గడిచిందో ! ఎంత నిశ్శబ్దంగా గడిచిందో ! ఎంత నిదానంగా గడిచిందో !

ఎప్పుడు తెల్లవారిందో — ఎలా తెల్లవారిందో దశరథునికి తెలీదు. ఆయన కళ్ళకు వెలుగే కన్పించలేదు. ఎటు చూచినా చీకటే.

రామాభిషేకానికి సమస్తవస్తు సామగ్రి సిద్ధంగా ఉంది. వేద విప్రులు, మంత్రులు, సామంతులు, పౌరులు, జానపదులు ఆసీనులై ఉన్నారు. ముహూర్తం సమీపిస్తూ ఉంది. మహారాజును త్వరగా తీసుకురమ్మని వశిష్ఠుల వారు సుమంత్రుని పంపారు. ఇక్కడ దశరథుని స్థితి ఇది. ఊబిలో ముక్కుదాకా మునిగిపోయిన వృద్ధవృషభరాజంలా ఉన్నారు.

కైక చొరవతీసుకొంది. 'సుమంత్రా ! రాత్రంతా రామాభిషేకాన్ని గూర్చి ఆలోచిస్తూ రాజుగారికి నిద్రలేదు. అందుచేత ఇప్పుడాయన నిద్రావస్థలో ఉన్నాడు. నీతో మాట్లాడలేదు. వెంటనేవెళ్ళి నీవు రాముణ్ణి పిలుచుకొని రా !' అంది అధికారిక స్వరంతో — శిఖరోపమానమైన సాహసంతో.

శ్రీరామచంద్రుడు మంగళస్నానం చేసి, పట్టువస్త్రాలు ధరించి, దేవతా పూజలు జరిపి, పట్టాభిషేకానికి సిద్ధంగా ఉన్నాడు.

పిలుపు కొరకు ఎదురుచూస్తున్నాడు. సుమంత్రుడు వెళ్ళగానే సంతోషంగా అతని వెంటవచ్చాడు. తండ్రిపాదాలకు నమస్కరించాడు. పినతల్లి పాదాలకు ప్రణమిల్లాడు. చేతులు కట్టుకొని ఎదుట నిలిచాడు.

తండ్రి ముఖంలో ఎందుకో సంతోషం లేదు. తల్లి ముఖంలో ఎందుకో తీవ్రత కన్పిస్తూ ఉంది.

దశరథుడు గద్గదస్వరంతో 'రామా !' అన్నాడు. కన్నీళ్ళు విడిచాడు. ఏమీ చెప్పలేక ఆవలికి ముఖం త్రిప్పుకొన్నాడు.

రాముడికి ఏమీ అర్థంకావడంలేదు. చంద్రోదయానికి పొంగిపొరల వలసిన పారావారం ఎందుకో క్రుంగిక్రుశించిపోతూ ఉంది. తండ్రిస్థితిచూస్తే తనకేదో దిగులుగా ఉంది.

'అమ్మా ! నే నేమైనా అపరాధం చేశానా !' అన్నాడు కైక వైపు తిరిగి-'రామా ! నీ తండ్రి మనస్సులో ఓ కోరికఉంది. అది చెప్పలేక బాధపడుతున్నాడు. తప్పక తీరుస్తానని నీవు మాటయిస్తే అది నేనే చెపుతాను' అంది కైక ఓ అడుగు ముందుకు వేసి.

'అమ్మా ! తండ్రి ఆజ్ఞాపిస్తే అగ్నిలోనైనా దూకుతాను. విషాన్నైనా మ్రింగుతాను. మహాసముద్రంలోనైనా మునుగుతాను. అనుమానం లేకుండా చెప్పమ్మా !' అన్నాడు రాముడు గంభీరస్వరంతో. అప్పుడంది కైక — మీ తండ్రి దేవాసుర యుద్ధ సమయంలో నాకు రెండు వరాలిచ్చాడని; ఇప్పుడవి కోరానని; వాటి ప్రకారం నీవు వెంటనే పదునాలుగేళ్ళు అడవులకు వెళ్ళాలని; భరతునికి పట్టాభిషేకం జరగాలని'.

కైక చెప్పినంత సేపు పట్టలేదు రాముడు చిరునవ్వుతో 'సరే' అనటానికి. 'ఈ మాత్రానికే నాన్నగారు ఇంత బాధపడాలా' అనటానికి.

కైక నిప్పులు కురిస్తే రాముడు పూలు చల్లాడు. 'అయితే రామా ! వెంటనే అడవికి బయలుదేరు' అంది కైక ఏ మాత్రం తడవుకోకుండా.

అంతేగాదు 'రామా! నీవు అయోధ్యలో ఉన్నంతవరకూ నీ తండ్రి స్నానం చెయ్యడు, అన్నం తినడు'—అంది అంతకంత తెగించి.

దశరథుడు మూర్ఛపోయాడు.

రాముడు—తల్లి కౌసల్య దగ్గర, తక్కిన బంధుమిత్రుల దగ్గర సెలవు తీసుకొని, అరణ్యవాసానికి అన్నివిధాల సిద్ధమైవస్తానని కైక అంతఃపురం వదలి వెళ్ళాడు.

ఆనోట ఆనోట రాముని అరణ్యవాసవార్త అయోధ్య అంతా వ్యాపించింది. ఎక్కడ చూచినా గుసగుసలే. ఎక్కడ చూచినా వాడినముఖాలే. వేడి కన్నీళ్ళే. పట్టాభిషేకానికి బయలుదేరిన జనసమూహం కైకేయీ మందిరం వైపు మళ్ళింది. రాముడు అరణ్యవాసం వెళ్ళే రాజమార్గం ఇరువైపులా బారులుతీరి నిలిచింది,

కౌసల్యాసుమిత్రలతో, తక్కిన దశరథపత్నులు మూడువందల యాభై మందితో కైకేయికోపగృహం కిటకిటలాడి పోయింది. ఆ గదినేల అంతా కన్నీటి మయమైంది. దశరథుడు ఓ మూల కుప్పవోసిన దుఃఖంలా తలపట్టుకొని కూర్చు న్నాడు. సుమంత్రుడు చేతులు ముడుచుకొని చెంత నిలుచున్నాడు. కైక నిప్పు కణికలా అటూ ఇటూ తిరుగుతూ ఉంది. మాటి మాటికి ద్వారం వైపు చూస్తూ ఉంది—ఇంకా రాముడు రాడేదే అని.

సీతాలక్ష్మణులతో కలిసి రాముడు వచ్చాడు. చేతులు జోడించి తండ్రికి నమస్కరించి, అరణ్యవాసానికి అనుమతి అడిగాడు. దశరథుడు ఒక్కసారి తన దుఃఖాన్నంతా వెళ్ళబోసుకొన్నాడు. దశరథుని భార్యలందరు పరిపరివిధాల దుఃఖిం చారు. అందరు కైకను నిందించే వాళ్ళే. రాముని కొనియాడేవాళ్ళే. కడకు సుమంత్రుడు కూడ చాలా ఘాటుగా కైకను దూషించాడు.

కైక ఒకబండలా ఉండిపోయింది.

దశరథుడు సుమంత్రుని వైపు చూశాడు. రాముని వెంట అరణ్యాలకు సమస్త సంపదలతో చతురంగ బలాలను పంపమన్నాడు.

'అది వీలుపడ'దంది కైక ఒక పిడుగులా.

సంపద, సైన్యం, జనసమూహం లేని రాజ్యం నా భరతుని కెందుకు. నీ వంశం వాడైన సగరుడు తన పెద్దకొడుకును అడవికి పంపాడే. అప్పుడు నీలాగే అన్నీ ఇచ్చి పంపాడా ? అడవికి పంపడమంటే, ఐశ్వర్యహీనం చేయటంగాని సర్వసంప న్నంగా సాగనంపటంగాదు. అంది తీవ్రస్వరంతో.

కైకధీమసానికి, కఠినతనానికి అందరూ ఆశ్చర్యపోయారు. కొందరు ఏవ గించుకొన్నారు. కొందరు భయపడ్డారు గూడ.

ఇక ఆలస్యం ఏ మాత్రమూ మంచిది గాదనుకొంది కైక. తానే వెళ్ళి నార చీరలు తెచ్చి రామునిచేతికిచ్చింది.

సీతారామలక్ష్మణులు నారచీరలు దాల్చారు. అడవులకు వెళ్ళారు.

అయోధ్య కన్నీటివర్షం కురిసింది.

అయినా కైక చలించలేదు.

దశరథుడు మరణించాడు.

అయినా కైక చలించలేదు.

పట్టు నెగ్గిందన్న తృప్తితో, భరతుడు రాజౌతాడన్న ఆనందంతో, తాను రాజమాత కాగలనన్న ఆశతో కైక భర్తృమరణ దుఃఖాన్ని దిగమ్రింగింది. వెయ్యికళ్ళతో కొడుకు రాక కొరకు ఎదురుచూచింది.

భరతుడు రావాలి. కేకయరాజ్యంనుండి రావాలి. రాగానే తానీ అభిషేకవార్త అందించాలి. హఠాత్తుగా తోసుకువచ్చిన ఈ అదృష్టాన్ని తలచుకొని ఆ ప్రియపుత్రుడు ఆశ్చర్యంతో, ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోవాలి. అమ్మను అనేకవిధాల ప్రశంసించాలి. ప్రియమార పూజించాలి. మహావైభవంగా కొడుకు అభిషేకం జరగాలి. తాను కన్నారగాంచి ఆనందించాలి. అందరి కన్నుకుట్టేలా తాను రాజమాత కావాలి. తాను పడిన శ్రమకు, ఎదుర్కొన్న నిందలకు తనజీవితానికి అదే చరమఫలం.

కైక అనుకొన్నదొకటి, అయినదింకొకటి.

భరతుడు వచ్చాడు. పరిస్థితులు అర్థంచేసుకొన్నాడు. తల్లిని నిందించాడు. తీవ్రాతితీవ్రంగా నిందించాడు. రాజ్యాన్ని తిరస్కరించాడు. రాముని తోడ్తెచ్చుటకు అడవులకు బయలుదేరాడు.

కైక నెత్తిన పెద్దపిడుగు పడ్డట్లయింది.

ఆమెది సముద్రమంత నిరాశ. కొండంత బాధ; ఆకాశమంత అవమానం; ఎవ్వరినీ చూడలేని స్థితి; ఏమీ చేయలేని స్థితి. తనవ్రేళ్ళతో తానే కళ్ళుపొడుచుకొన్న స్థితి. తన కాళ్ళు చేతులుతానే కట్టుకొన్న స్థితి. తాను చేసినపాపం అప్పటికప్పుడే అనుభవానికి వచ్చిన స్థితి.

నిస్సహాయత; తలవంపు; మౌనం ఆమెను ముంచివేశాయి. కైక ఇప్పుడొక జీవచ్ఛవం.

అందరివెంట ఆమెగూడ రాముని పిలవటానికి అడవులకు వెళ్ళిందట. తన అభిమానం ఎక్కడదమూటగట్టిపెట్టి వెళ్ళిందో. తన ప్రాణాలు ఎలా బిగబట్టుకొని వెళ్ళిందో, తన ముఖం ఎలాదాచుకొని వెళ్ళిందో. పాపం! భరద్వాజాశ్రమంలో అందరిలా ఆమె ఆ మహర్షియెదుట నిలబడలేక దూరంగా తొలిగి భరతుని వెనుక ఒదిగి నిలిచిందట.

చిత్రకూటంలో శ్రీరామచంద్రుడు కౌసల్యాసుమిత్రలతో పాటు తన పాదాలకూ ప్రణామం చేసినప్పుడు కైక మనస్సు ఎంత క్రుంగిపోయిందో! తమ్మునితో 'భరతా! తల్లి కైకేయిమీద కోపపడవద్దు. ఆమెను ఆదరించు. గౌరవించు. లేకుంటే నామీద ఒట్టు. మీ వదినెమీద ఒట్టు' అని రాముడన్నప్పుడు ఆమె హృదయం ఎన్ని ప్రక్కలై పోయిందో.

అయోధ్యకు పట్టాభిషిక్తుడై, అష్టైశ్వర్యాలతో తులతూగవలసిన భరతుడు నందిగ్రామంలో రామపాదుకలు పూజిస్తూ రాజభృత్యునిలా జీవితం గడుపుతుంటే ఆ తల్లి మనస్సు ఆ పశ్చాత్తాపాగ్నిలో ఎలా కుంచించుకు పోయిందో !

అరణ్యాల్లో అనేక కష్టాలుపడి, లోకోపకారకాలైన అనేక ఘనకార్యాలు చేసి, అందరి మన్ననలు పొంది అరణ్యవాసంనుండి అయోధ్యకు తిరిగివచ్చిన ఆ రామచంద్రుడు తన పాదాలకు నమస్కరించే సరికి ఆమె మనస్సెంత కుదుటబడిందో!

అయినా మానవ జీవితంలో అన్నీ అనుకున్నట్లే జరుగవు. అనుకొన్న దానికి, అయినదానికి ఎంతో తేడా ఉన్నప్పుడు, చేసిన తప్పుకు చిత్రవిచిత్రంగా శిక్ష అనుభవించేటప్పుడు మానసికంగా ఏ మనిషి అయినా నలిగిపోక తప్పదు.

అంతేగాదు. ఒక్కోసారి ఎవ్వరెందుకు పుడతారో, ఏంచేస్తారో, ఒక్కొక్కరిలో ఎప్పుడే బుద్ధి పుట్టుకుందో, ఏ పరిణామాలకు దారితీస్తుందో చెప్పటం చాల కష్టం.

రామ పట్టాభిషేక భంగానికి, రామవనవాస గమనానికి అనుకోకుండా ఆఖరు క్షణంలో కైక కారణభూతురాలైంది. అందువల్ల ఆమెకు అపకీర్తి వచ్చినా, ఆ రామునికి అపకారం జరిగినా, లోకానికి మాత్రం ఉపకారమే జరిగింది. రామావతారం సార్థకమైంది. లోకానికి రాక్షసబాధ తొలగింది. మొత్తానికి రామాయణాన్ని పెద్ద మలుపుత్రిప్పిన స్త్రీ పాత్ర కైక, మరపురాని పాత్ర.

# తార

ఆకు మాటున ఉన్నంత మాత్రాన పుష్పానికి వాసన లేకపోతుందా ! రేకులు లేక పోతాయా ! కాకుంటే అది మాటిమాటికి మనకు కన్పించకపోవచ్చు. చెట్టుకు అల్లు కొన్నంత మాత్రాన తీగకు జీవశక్తి లోపిస్తుందా ! అది పెరగకుండా ఆగి పోతుందా ! కాకుంటే అది చెట్టునుండి విడివడి తన పొడవును ప్రదర్శించక పోవచ్చు. అలాగే మాటాడనంత మాత్రాన బొమ్మకు అందం లేకపోతుందా ! దాని ఆకారం వికారమౌతుందా ! కాకుంటే అది తన్నుగూర్చి తాను చెప్పుకోలేక పోవచ్చు. లోకంలో చాలా మంది స్త్రీలు ఆకుచాటు పువ్వుల్లా, చెట్టుకు అల్లుకొన్న తీవల్లా, అందమైన మూగబొమ్మల్లా వంటయిళ్ళల్లోనో, అంతఃపురాల్లోనో ఒదిగి ఉంటారు. కట్టుకొన్న భర్తను అనుసరించి జీవిస్తుంటారు. ఆ ఒదిగి ఉండటంలోనే వారి కొక తృప్తి. అలా అనుసరించి జీవించటంలోనే వారి కొక ఆనందం. అట్లని వారికి వ్యక్తిత్వం లేదనిగాదు. ప్రజ్ఞాపాటవాలు తక్కువనీగాదు. అవి బాహ్యలోకా నికి అట్టె అగుపించవు. అంతే.

కాని కొంత మంది స్త్రీలు అలా ఉంటూనే అవసరమైనప్పుడు భర్తకంటె ఒక అడుగు ముందుకు వేస్తారు. దూర దృష్టితో పరిస్థితులను అర్థంచేసుకొంటారు. ఎంతో ధైర్యంతో వాటిని ఎదుర్కొంటారు. భర్తకు హితబోధ చేస్తారు. కర్త వ్యాన్ని ఉపదేశిస్తారు. గొప్పగా ప్రకాశిస్తారు. అందరిని ఆశ్చర్యచకితుల్ని చేస్తారు.

రామాయణంలో తార ఈ కోవకు చెందిన స్త్రీ మూర్తి. ఆమె ఆకు చాటు పువ్వులా, చెట్టుకు అల్లుకొన్న తీవలా, అందమైన మూగబొమ్మలా ఎంతకాలమో కిష్కింధా రాజ్యాంతఃపురంలో జీవితం గడిపింది. అయినా అటు భర్తజీవితంలో ఇటు తన జీవితంలో కొన్ని విషమ పరిస్థితు లేర్పడేసరికి, ఆమె ప్రదర్శించిన దూరదృష్టి, చొరవ, ప్రజ్ఞాపాటవాలు, ధైర్యస్థైర్యాలు అనుపమానాలు. సుగ్రీవుని మీదికి రెండోసారి యుద్ధానికి వెళ్ళే వాలికి ఆమె చేసిన హితబోధ, వాలిని వధిం చిన రామునితో ఆమె మాటాడిన తీరు, మహోగ్రుడై సుగ్రీవుణ్ణి చంపటానికి

వచ్చిన లక్ష్మణునితో ఆమె వ్యవహరించిన విధం మహోదాత్తమైన ఆ స్త్రీమూర్తి వ్యక్తిత్వానికి మకుటాయమానాలు.

అది తార అంతఃపురం అందంగా అలంకరింపబడిన శయ్యామందిరం. మధ్యహంస తూలికా తల్పం. ఆ తల్పం మీద వాలి కౌగిట్లో ఒయ్యారంగా ఒదిగిన తార. ముందు రోజు తాను సుగ్రీవుణ్ణి తన్ని తరిమిన వైనం వాలి ఆమెకు వివరిస్తున్నాడు. తార అతని చెక్కిళ్ళు నిమురుతూ, స్వేదబిందువులు తుడుస్తూ, మగని బలపరాక్రమాలకు మురిసిపోతూ, ముసిముసి నవ్వులు నవ్వుతూ ఉంది.

ఆ సమయంలో దిక్కులు పిక్కటిల్లే సింహనాదం. అనుమానం లేదు—అది సుగ్రీవునిదే. దాని దెబ్బకు తల్పంతో గూడ అంతఃపురమంతా అదిరిపోయింది. నిలువుటద్దం నేలకు పడి బ్రద్దలైంది.

తార గుండెలు ఝల్లుమన్నాయి.

'సుగ్రీవుడు మరలా కయ్యానికి కాలుదువ్వటమా! అంగులోను తిన్న దెబ్బల నెత్తురు తడి ఆరకముందే, తిరిగి రావటమా! ఎంత పొగరు! ఎంత సాహసం!' అని వాలి పటపట పళ్ళు కొరికాడు. తటాలున తల్పం దిగాడు దట్టీ బిగించాడు. ఒక్క ఊపున యుద్ధానికి బయలుదేరాడు.

తార మనస్సులో ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది. ఆమె తటాలున లేచింది. వాలిని ఒడిసి కౌగిలించుకొని యుద్ధానికి వెళ్ళవద్దని వారించింది. ఆ సుగ్రీవుని సింహనాదంలోని ఊపును, దాని వెనుక ఉన్న ప్రాపును ఆమె గ్రహించింది. 'వాలీ! నీ కోపాన్ని వాడిన పూలమాలవలె విసర్జించు. నిదానంగా ఆలోచించు. నీ చేత అంతగా దెబ్బతిని పారిపోయిన సుగ్రీవుడు ఇంతగా గర్జిస్తూ వచ్చాడంటే అతనికెంతో అండదొరికి ఉండాలి. అయితే ఏమి? నాకు భయమా? అంటావేమో. సుగ్రీవుడు సహజంగానే సమర్థుడు. పైగా బుద్ధి సంపన్నుడు. అలాంటి వాడు స్వబలాన్ని, పరబలాన్ని తూకం వేసుకోకుండా యుద్ధానికి వస్తాడా? ఇంతకు ముందే అంగదకుమారుడు నాతో చెప్పాడు - యశస్సంపన్నులు, మహావీరులు, దుర్నిరీక్ష్యతేజులు అయిన ఇక్ష్వాకురాకుమారులు రామలక్ష్మణులు సుగ్రీవునికి సాయంగా ఉన్నారట. ఇది ఏదో వినికిడి కాదు. మనవేగులవారి వార్త అట. ఆ రాముడు ఇదివరకే విరాధుణ్ణి వధించాడట. ఖరదూషణాదుల్ని ఖండించాడట, సకల

సద్గుణ శోభితుడట. సాధుజన సంరక్షకుడట. శత్రుజన భయంకరుడట. అలాంటి మహాత్మునితో వైరం అనర్థదాయకం.

ఆ సంగతి అలా ఉంచు. సుగ్రీవుడు మాత్రం నీకు పరాయివాడా ? నీ తమ్ముడు. పైగా సమర్థుడు. అలాంటి బంధువు నీ కింకొకడు దొరుకుతాడా ? నీ తమ్ముణ్ణి నీవే ప్రియమార పిలిపించు. యౌవరాజ్యాభిషేకం జరిపించు. నీ ప్రక్కన ఉంచు. అది మీ ఇద్దరికీ అనేక విధాల మంచిది.

'స్వామీ ! నా కంటె నీకు హితులెవరు ? లోకంలో భార్యను మించిన హితవరి భర్తకెవరైనా ఉంటారా ? నా ప్రార్థన మన్నించు. నీ యుద్ధ ప్రయత్నం విరమించు. సుగ్రీవునితో సఖ్యం సాధించు. జీవితంలో సర్వసుఖాలు అనుభవించు' అని తార ఎంతో చొరవ తీసుకొని, పరిస్థితులను సూక్ష్మంగా పరిశీలించి, ప్రమాదాలను దూరదృష్టితో గ్రహించి, ప్రతివిషయాన్ని తార్కికంగా వివేచించి, మృదుమధురంగా మగనికి హితబోధచేసింది.

తార హితబోధ ఆ వాలిసుగ్రీవులకే గాదు —— లోకంలో కలహశీలురైన అన్నదమ్ములందరికీ అది తారకమంత్రమే.

కాని ఏం లాభం ? వినాశకాలం హితబోధను విననీయదు. విశేషించి విపరీత బుద్ధులు పుట్టిస్తుంది.

తార హితబోధకు వాలి ఆనందించాడు. ఆమెను అభినందించాడు. బాధపడవద్దని బుజ్జగించాడు. అంతేగాని అతడా హితబోధ వినలేదు. పైగా తారను తన వెంట రావద్దన్నాడు. తమ్ముని పొగరు తగ్గిస్తానేగాని ప్రాణాలు తీయనన్నాడు. ఆ రాముడు అంతటి మహానుభావుడు గదా —— అకారణంగా నాకెందుకు అపకారం చేస్తాడన్నాడు. ఒట్టుపెట్టి తారను ఆపాడు. పట్టుబట్టి యుద్ధానికి బయలుదేరాడు.

పాపం ! తారకు దిక్కుతోచలేదు. దుఃఖం పొంగిపొరలుతున్నది. అమంగళ భయం దాన్ని ఆపుతున్నది. అలాగే ఆమె భర్తకు ప్రదక్షిణం చేసింది. అతని విజయాన్ని కాంక్షించి, పౌరాణిక మంత్రాలతో స్వస్త్యయనం జరిపించింది. ఒక్కఊపున వెళ్ళే ఆ వాలి రూపాన్ని చూపానినంతవరకు చూచి నిర్వికారంగా నిలబడి

వాలి దూరమయ్యాడు. తార బరువుగా తల ఊపి అంతరిక్షంలోకి చూచింది. కొంతసేపు గవాక్షం ముందు నిలిచింది. అటు ఇటు తిరిగింది. ఆ తరువాత పడక మీద వ్రాలింది. ఎందుకో ఆమెకు ఎన్నడులేని ఆవేదన; అపరిమితమైన భయం.

పగిలిన అద్దంలా ఉంది ఆమె మనస్సు.

తెగిన తీవలా ఉంది ఆమె శరీరం.

చెదిరిన బొట్టులా ఉంది ఆమె ముఖం.

అంతలోనె వార్తాహరులు వచ్చారు. దుర్వార్త తెచ్చారు. రామబాణానికి గురి అయి వాలి నేల వ్రాలాడన్నారు.

ఆ వార్త వినగానే తార కన్నీళ్ళు కారుస్తూ, గుండెలు బాదుకొంటూ హుటాహుటిని బయలుదేరింది. త్రోవలో వానరులు కొందరెదురయ్యారు. పిడుగుపడ్డట్లు భయపడి పరుగెత్తుతున్నారు. 'ఎందుకీ భయం ? ఎక్కడికీ పరుగు ?' అని అడిగింది తార.

అందరూ ఒకే కేక 'రామబాణం ! రామబాణం ! రామబాణం !'

'రామబాణం వాలిని చంపితే మీ కెందుకీ భయం ?' అంది తార. అందుకు బదులు చెప్పే స్థితిలో వాళ్ళులేరు. వాళ్ళ భయం వాళ్ళది. వాళ్ళ ధోరణి వాళ్ళది. 'అమ్మా ! అంగదుడు బ్రతికి ఉన్నాడు. అతనిని వెంటనే పిలిపించు. కిష్కింధ తలుపులు మూయించు. రాజ్యాభిషేకం జరిపించు. ఆలస్యమైతే ఆ సుగ్రీవుని అనుచరులు విజృంభిస్తారు. కిష్కింధను ఆక్రమిస్తారు. ఏ అపకారమైనా చేస్తారు' అని గ్రుక్క త్రిప్పుకోకుండ చెప్పుతున్నారు. గడగడ వణుకుతున్నారు.

తార వాళ్ళ ముఖాల్లోకి ఒట్టె చూచింది. వాళ్ళ భయాన్ని ఆందోళనను అర్థం చేసుకొన్నది. 'వానరశ్రేష్ఠుడు, మహానుభావుడు అయిన నా పతిదేవుడే నాకు దూరమైతే — ఈ కొడుకెందుకు ? ఈ రాజ్యమెందుకు ? ఈ శరీరమెందుకు ? నేను గూడ నా పతిదేవుని పాదాల దగ్గరకే వెళుతున్నాను' అని మహోదాత్తంగా ముందుకు సాగిపోయింది. వెఱ్ఱిమొగాలు వేసుకొని ఆమెను చూస్తూ ఆ వానరులు నిలబడిపోయారు.

ఎదురుగా పెద్ద నెత్తుటి మడుగు. అందులో రామబాణం దిగబడి కొన ఊపి రితో కాళ్ళు చేతులు గిలగిల కొట్టుకొంటూ వాలి. ప్రక్కనే వెక్కి వెక్కి ఏడుస్తూ అంగదుడు. ఒకవైపు తలవంచుకొని కంటతడిపెడుతూ సుగ్రీవుడు. ఇంకోవైపు సాలవృక్షంలాంటి ధనుస్సు చేతధరించి మౌనంగా శ్రీరాముడు. ప్రక్కనే దిక్కులు చూస్తూ లక్ష్మణుడు. ఇది తార చూచిన దృశ్యం.

వాలిని చూడగానే తార బావురుమంది. తీవ్ర దుఃఖంతో స్పృహతప్పి పడి పోయింది.

అంగదుడు 'అమ్మా !' అని అరిచాడు. సుగ్రీవుడు బొటబొట కన్నీటి బొట్లు రాల్చాడు. రాముడు నిట్టూర్పు విడిచాడు.

తార నెమ్మదిగా తేరుకొన్నది. ముందుకుసాగి వాలిని కౌగిలించుకొన్నది. అతని తలను ఒడిలోకి తీసుకొన్నది వాలి ముఖంలోకి చూస్తూ 'స్వామీ ! నీవు మహావీరుడివి. వానరయూధపతివి. ఈ విధంగా దిక్కులేక దుమ్ములో పడి ఉన్నావా ! ఎంత వైపరీత్యం ! మధువు త్రాగి ఆయాకాలాల్లో మాతో విహరించే వాడివి. ఆ విహారాలన్నీ ఇక ముగిసినట్లే గదా నీవు నేల గూలినా నా గుండె ముక్కలు గాకుండా ఉందే. అది మొండిది. సుగ్రీవుని భార్య నపహరించి అతణ్ణి తరుమగొట్టావు. తత్ఫలితమో ఏమో ఈ రూపంగా పరిణమించింది. ఎంతదూరమో నీకు హితం చెప్పాను. విన్నావా ? ఇప్పుడు నన్ననాథను చేశావు. అంతులేని దుఃఖంలో ముంచావు. నీవు స్వర్గసుఖాలనుభవించటానికి వెళ్ళుతున్నావు. ఇక మన అంగదకుమారుని గతి ఏమి ? సుగ్రీవుని ఆగ్రహానికి వాడు మనగలడా .' అంటూ ఆమె ప్రక్కనే దుఃఖిస్తున్న అంగదుణ్ణి దగ్గరకు తీసుకొన్నది. అతని వీపు నిమురుతూ 'నాయనా ! ఇక మీద నీ తండ్రి నీకు కన్పించడు. ఇప్పుడే తృప్తిగా ఒక్కసారి చూచుకో' అనే సరికి అంగదకుమారుడు ఒక్క పెట్టున పెద్దగా ఏడ్చాడు.

తార మరల వాలి ముఖంలోకి చూస్తూ 'ఇడుగో మన కుమారుడు ప్రక్కనే ఉన్నాడు. కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు. ఒక్కసారి వాడిని చూడండి చేతులు చాచి కౌగిలించుకోండి. అనునయించి ఆఖరుమాట చెప్పండి' అని అశ్రుబిందువులు రాల్చింది. సుగ్రీవునివైపు ఒక్కసారి చూచింది.

అతడు వంచిన తల ఎత్తనేలేదు.

అయినా తార — 'సుగ్రీవా ! రాముడు తన ప్రతిజ్ఞ చెల్లించుకొన్నాడు. నీ అన్నను వధించాడు. ఇంక నీ కోర్కెలు తీర్చుకో. రుమను పొంది రాజ్యభోగాలు అనుభవించు' అని వాలి శవ మీద వ్రాలిపోయింది. అనేక విధాల శోకించింది. ప్రాయోపవేశం చేసి పతితోపాటు తానూ ప్రాణత్యాగం చెయ్యాలని నిర్ణయించుకొంది.

అంతా విషాదవాతావరణం. దిక్కుతోచని స్థితి.

తార మూర్తీభవించిన శోకదేవతలా ఉంది. ఆకాశం నుండి తెగిపడిన నక్షత్రంలా ఉంది. ఆమె దుఃఖానికి అందరి హృదయాలేగాదు. అక్కడున్న చెట్లు, రాళ్ళు కూడ ద్రవించేటట్లున్నాయి.

భర్తృ మరణం తరువాత స్త్రీకి బ్రతుకుమీద ఆశ కలిగించేది కొడుకు భవిష్యత్తును గూర్చిన భావన. మతిమంతుడైన హనుమంతుడు అది గ్రహించాడు. ప్రాయోపవేశానికి పూనుకొన్న తార దగ్గరికి వచ్చాడు. దేహానశ్వరతను గూర్చి తెలియ చెప్పాడు. మృత్యు స్వభావాన్నిగూర్చి వివరించాడు. వాలి అంత్యక్రియలను గూర్చి ప్రస్తావించాడు. అన్నిటిని మించి అంగదునికి జరుగవలసిన యౌవరాజ్యాభిషేకాన్ని సూచించాడు. బ్రతకాలన్న ఆశలను ఆ స్త్రీ మూర్తిలో చిగురింపచేశాడు.

తార ఒక్కసారి వెఱ్ఱిగా పెదవి విరిచింది. హనుమపైపు హాస్యంగా చూచింది. 'హనుమా ! వాలికి జరుగవలసిన సంస్కారాలు, అంగదునికి జరుగవలసిన అభిషేక విశేషాలు నిర్ణయించవలసింది, నిర్వహింపవలసింది — తండ్రి తరువాత తండ్రి, పినతండ్రి సుగ్రీవుడు - నేను గాదు' - అని పదునుగా సమాధానం చెప్పింది. అంతేగాని అంత దుఃఖంలోను, అంత అంత ఆవేశంలోను ఆమె ఔచిత్యాన్ని మరువలేదు. అవివేకంగా మాట్లాడలేదు.

అంతలో వాలి అటు, ఇటు కొంత కదిలాడు. జీవశక్తినంతా చిక్కబట్టి సుగ్రీవుణ్ణి చేరబిలిచి - అంగదుని, తారను, తన మెడలోని కాంచనమాలను అతనికి అప్పగించి, అన్ని విషయాలు చెప్పి కన్నుమూశాడు.

అంగదుడు, తార, వానరులు, సుగ్రీవుడు అంతా ఒక్కసారి బావురు

తార మెల్లగా తల మలిపి అలా రాముని వైపు చూచింది. ఆమె చూపులో నీటిబిందువులున్నాయి. నిప్పురవ్వ లున్నాయి. నెత్తుట చుక్కలున్నాయి.

అంతటి రామచంద్రునికి ఆమె వైపు ఎలాచూడాలో తెలియలేదు. ఆమెను ఎలా అనునయించాలో అంతకంటె తెలీలేదు.

వానరులంతా వాలి కళేబరంమీదినుండి తారను లేవనెత్తారు.

ఆ స్త్రీమూర్తి పొంగిపొరలే దుఃఖాన్ని గొంతులో దిగమ్రింగుకొంటూ, కన్నీళ్ళు తుడుచుకొంటూ, తొట్రుపడుతూ సరాసరి రాముని ఎదుటికి నడిచింది. సూటిగా ఆయన ముఖంలోకి చూచింది.

రాముడు నిర్వికారంగా నిలబడ్డాడు.

తార గద్గదకంఠంతో 'రామా ! నీవు అప్రమేయుడవు. జితేంద్రియుడవు. ధార్మికుడవు. కీర్తిమంతుడవు. సర్వ సమర్థుడవు. నా భర్తను ఏ బాణంతో వధించావో అదే బాణంతో నన్ను వధించు. నా ప్రియునితో నన్ను కలుపు. రమింప చేసే వాడవన్న నీ రామనామం సార్థకం చేసుకో.

ఋష్యమూకం మీద సీతా విరహంతో నీ వెంత బాధపడుతున్నావో నీకు తెలుసు. స్వర్గలోకంలో నా విరహంతో వాలిగూడ అంతే బాధపడుతుంటాడు. నన్ను శీఘ్రంగా వధించు. నా వాలితో నన్ను కలుపు.

అయితే స్త్రీహత్య మహాపాతకమని సంకోచిస్తావేమో. వాలి ఆత్మే తార. అందువల్ల నీకా అనుమానం అక్కరలేదు. నన్ను వధించి స్వర్గానికి పంపు. వాలికి భార్యాదానం చెయ్యి. అన్ని దానాల్లోకి ఆ దానం గొప్పదని ఆర్యులన్నారుగదా. ఆ పుణ్యంతో వాలి వధవల్ల వచ్చిన వీరహత్యాపాతకం బాపుకో' అన్నది.

రాముడు రాతిబొమ్మలా నిలబడ్డాడు.

ఇంత విషాద స్థితిలోగూడ తార అందరు స్త్రీలవలె చతికిలబడలేదు. అట్లని నిందుడనాన్ని గోల్పోయి అటు సుగ్రీవుణ్ణి ఇటు రాముణ్ణి నీచంగా మాట్లాడలేదు.

ఆమె మాటల్లో ఆవేశం ఉందిగాని అవివేకం లేదు. ఆవేదన ఉందిగాని అల్పత్వం లేదు.

అట్లని ఆమె మాటలు దూది ఏకులు గావు. అవి వాడిములుకులు. పదునులో అవి రామబాణాలకు ఏ మాత్రం తీసిపోవు.

తార మాటనేర్పు అమోఘం.

అంతటి రామునికి ఆమె వైపు చూడటంగాని, సూటిగా సమాధానం చెప్పటం గాని సులభసాధ్యంగాలేదు. ఏదో అంతా విధివిలాసమన్నాడు. ఎలాగో ఆమెను ఓదార్చాడు.

వాలికి అంత్యక్రియలు జరిగాయి.

సుగ్రీవునికి రాజ్యాభిషేకం జరిగింది.

అంగదుడు యువరాజయ్యాడు.

వానర సంప్రదాయం ప్రకారం కాబోలు తార సుగ్రీవుని ప్రియురాలైంది.

తార జీవితంలో ఇది క్రొత్త మలుపు. పెద్ద మలుపు.

గత స్మృతులు వ్యక్తిజీవితంలో బలీయాలు. వాటిని చెరిపివేయటం చాల కష్టం. అవి అప్పుడప్పుడు ముందుకు వస్తూనే ఉంటాయి. మనస్సును కలవర పరుస్తూనే ఉంటాయి. అందులోను స్త్రీ జీవితంలో శృంగారపరమైన పూర్వానుభవాలు మరీ కలత రేపుతాయి. ఒకనికి మనస్సిచ్చి, అతని అర్ధాంగిగా అనేక భోగాలనుభవించి, మధురాతి మధుర రసానుభూతులెన్నో చవిచూచి, పరిస్థితుల ప్రభావంవల్ల, సంప్రదాయబద్ధతవల్ల ఇంకొకవ్యక్తి ఇల్లాలుగా మారిన ఇంతి గతస్మృతులను పారద్రోలి, అతుకు కన్పించకుండా, అరమరికలు లేకుండా ఆ క్రొత్తవ్యక్తితో కలిసి జీవించాలంటే అసాధారణ వ్యక్తిత్వం ఉండాలి. అమేయమనోబలం కావాలి. నిరుపమాన నిర్వాహకత్వం నెలకొనాలి.

ఇంతదాకా వాలి ప్రియురాలుగా తార ఎన్నో భోగాలనుభవించింది. అంతసి శృంగార విలాస వీచికల్లో ఉయ్యాల లూగింది. పరిస్థితుల ప్రభావంవల్ల, వానరజాతి సంప్రదాయంవల్ల ఇప్పుడు ఆమె సుగ్రీవుని ప్రేయసి అయింది. జీవితంలో ఇది

సామాన్యమైన మార్పుగాదు. సుగ్రీవుడు తన మరది. అంతేగాదు తన భర్తను దారుణంగా చంపించిన మరది. అలాంటప్పుడు తార తన సహజప్రవృత్తుల నన్నింటిని పూర్తిగా దిగమ్రింగుకొని, అరమరలులేకుండ, అతని నొప్పించకుండ ఈ క్రొత్త పాత్ర నిర్వహించటం అంత తేలికైన పనేమీగాదు. అయినా తార ఆ పాత్రను అద్భుతంగా నిర్వహించింది. సుగ్రీవుడే మెచ్చుకొనే అంత అద్భుతంగా నిర్వహించింది. తారను మించిన రసమయ శృంగారమూర్తి మరిలేదని సుగ్రీవుడు మురిసిపోయేంతగా నిర్వహించింది. విషమ పరిస్థితుల్లో తారే తనకు దిక్కని అతడు తలపోసేంతగా నిర్వహించింది.

వర్షాకాలం గడిచిపోయింది. అది ఎలా గడిచిపోయిందో తారా సుగ్రీవులకు తెలీదు. శరత్కాలం వచ్చింది. అది ఎప్పుడు వచ్చిందో వాళ్ళకు అసలే తెలీదు. వారిది ఒక రసమయజగత్తు. అందులో సూర్యోదయాల్లేవు. సూర్యాస్తమయాల్లేవు. ఋతుభేదాలు అసలే లేవు.

ఒకనాడు హఠాత్తుగా వారి అంతఃపురంలో ధనుష్టంకారం వినిపించింది. పెద్ద పిడుగు పడ్డట్టుంది. మహాపర్వతం బ్రద్దలైనట్టుంది. పునాదులతో గూడ అంతఃపురం పగుళ్ళువారి నట్టుంది.

అది లక్ష్మణుని ధనుష్టంకారం.

సుగ్రీవుని గుండెలదిరాయి. కాళ్ళువణకాయి. పెదవులెండాయి. 'తారా! నీవే దిక్కు'ని ఆమె చాటున అతడు తలదాచుకొన్నాడు.

తార లక్ష్మణుని ఆగ్రహావేశాన్ని అర్థంచేసుకొన్నది. సుగ్రీవుని భయతీవ్రతను భావించుకొన్నది. దిక్కైన అంతఃపురకాంతల దీనతను చూసుకొన్నది. కాని తనది బయటికి వెళ్ళదగిన స్థితిగాదు. అయినా వెళ్ళకతప్పదు.

శయ్యదిగి, జారిపోయ్యే వసను ఒకచేత సవరించుకొంటూ, ఉబికిపడే వక్షోజాన్ని మరోచేత ఒత్తి పట్టుకొంటూ, చెదరిన జుట్టుతో, సంభోగచిహ్నాలతో, స్తనభార వినమ్ర శరీరంతో ఆ సమున్నత గంభీర స్త్రీమూర్తి మెల్లమెల్లగా అడుగులు వేసుకొంటూ సరాసరి నడిచివచ్చింది. లక్ష్మణుని ఎదుట నిలిచింది. కనురెప్పలను ఒకింత పైకెత్తి సూటిగా అతని ముఖంలోకి చూ[illegible]

అంతటి లక్ష్మణుడు పాపం తలవంచుకొన్నాడు.

తార ఒక అడుగు ముందుకువేసింది. లక్ష్మణుడు ఒక అడుగు వెనుకకు వేశాడు.

అప్పుడన్నది తార 'లక్ష్మణా! ఈ కోపం ఎందు'కని. 'ఎవరిమీద' అని. అతని సమాధానంకోసం చూడకుండానే 'ఎవ్వరైనా నీ ఆజ్ఞ అతిక్రమించారా ? — అయినా దావానలం మీద ఎవరు దూకుతారు ;' అంది.

తార నిలబడిన తీరు, ఆమె మాటవైఖరి చూచేసరికి లక్ష్మణుడు సగం చల్లబడ్డాడు. కొంతకు కొంత తగ్గిపోయాడు. గొంతు సవరించుకొని ఎక్కడో మీదికి చూస్తూ 'సుగ్రీవుడు రామ కార్యం మరచాడు. శరత్కాలం వచ్చినా సీతాన్వేషణ సాగించలేదు. కామలోలుడై కాలము గడుపుతున్నాడు' అని గ్రుక్క త్రిప్పుకోకుండా పంతులమ్మ యెదుట పసి బాలుడు పాఠాలు వల్లించినట్లు పలికాడు.

తార అల్లన నవ్వింది. ఆమె నవ్వులో కొంత ఆశ్చర్యం ఉంది. కొంత ఆవేదన ఉంది. కొంత అవగాహన ఉంది. అంతో ఇంతో అపహాస్యం గూడ ఉంది.

ఆప్యాయంగా ఆమె లక్ష్మణునివైపు చూస్తూ—సుగ్రీవుని మిత్రహృదయాన్ని గూర్చి చెప్పింది. అతని కృతజ్ఞతాభావాన్ని గూర్చి చెప్పింది. సీతాన్వేషణకు అతడు వానరసైన్యాన్ని సమీకరిస్తున్నాడని గూడ చెప్పింది. సుగ్రీవుని ప్రస్తుతమన్మథాధీన స్థితిని మనవిచేసింది. 'మన్మథాధీనుడైన ఆ మిత్రుని మీద నీ కోపం చూస్తే నీకు మన్మథ వ్యాపార పరిజ్ఞానమే లేనట్లుందే' అని పరిహాసమాడింది. 'మహర్షులే మన్మథాధీనులై కాలగమనాన్ని మరచిపోయారుగదా. మా బోటి వానరుల సంగతి చెప్పాలా' అని సమర్థించింది. 'అయినా మేము రామకార్యం మరువలేము. ఆ సంగతి సుగ్రీవుణ్ణి అడుగు. లోనికిరా. స్త్రీలున్నారని సంకోచించకు. మేమంతా మీ మిత్రుని పత్నులమేగదా' అని సూటిగా లక్ష్మణుని కళ్ళల్లోకి చూచింది. తాను ముందు నడిచింది. లక్ష్మణుని వెంట నడిపించింది.

ప్రియకాంతా పరివృతుడు, కామకేళీపరవశుడు అయిన సుగ్రీవుణ్ణి చూడగానే పళ్ళు పటపట కొరికి 'నీ అన్నను పట్టిన గతే నీకూ పట్టుతుంది — రామకార్యం మరచావు' అని మరల లక్ష్మణుడు మండిపడేసరికి అంతఃపురం అంతఃపురమంతా

కంపించిపోయింది. అక్కడి స్త్రీలంతా గడగడలాడారు. ఇక సుగ్రీవుని సంగతి చెప్పనే అక్కరలేదు.

ఎటు చూచినా భయం; నిశ్శబ్దం; నిశ్చేష్టత.

అప్పుడు తార గంభీరంగా ముందుకు అడుగు వేసింది. ఆ భయాన్నీ, నిశ్శబ్దాన్నీ, నిశ్చేష్టతను నిలువునా చీల్చింది. 'లక్ష్మణా! ఇది నీకు తగదని గద్దించి పలికింది.

'సుగ్రీవుడు కృతఘ్నుడు గాదు. క్రూరుడుగాదు. కుటిలుడు గాదు, అసత్యవాది అంతకంటెగాదు. అతడు మీ మిత్రుడు. విశేషించి మిత్ర కార్యాచరణాసక్తుడు. మహాతపస్సంపన్నుడైన విశ్వామిత్రుడే మేనకతో గూడి కాలగతిని మరువలేదా? పది సంవత్సరాలను ఒక్కపూటగా గడపలేదా? సుగ్రీవుడు వానరుడు. పైగా చాల కాలం స్త్రీ సుఖానికి దూరమైనవాడు. కొండలు, గుట్టలు పట్టి తిరిగినవాడు. ఒంటరి జీవితం గడిపినవాడు. ఎన్నో కష్టాలు అనుభవించినవాడు. ఇప్పుడతడు తృప్తిదీర స్త్రీ సుఖాలు అనుభవిస్తున్నాడు. ఇది పెద్దతప్పా. పరిస్థితులను అర్థం చేసుకోకుండ, యుక్తాయుక్త విచక్షణలేకుండ, సమయసందర్భాలు గమనించకుండ ఎదుటివారి మీద ఎగిరెగిరి పడటం ఏ మాత్రం మంచిదిగాదు. అందులోను నీ వంటి ధర్మజ్ఞుడు, సత్త్వసంపన్నుడు, మహాపురుషుడు ఈ విధంగా ప్రవర్తించటం ఏ మాత్రం ఉచితంకాదు. నీ కోపం ఆపుకో. పరిస్థితులను అర్థంచేసుకో. రావణుడు మహా బల సంపన్నుడు. అందుకుదోడు అతనిది అపారరాక్షససైన్యం. ఈ సంగతి వాలి చెప్పగా విన్నాను. వానర సైన్యాన్ని సమకూర్చుకోకుంటే ఆ రావణుని జయించటం ఎలా సాధ్యమౌతుంది? అందుకే సుగ్రీవుడు వానరసైన్యాన్ని సమీకరిస్తున్నాడు. అన్ని దిక్కుల్లో ఉన్న వానరులను పక్షం రోజుల్లో రమ్మన్నాడు. రాకుంటే శిక్ష ఏమిటో తెలుసా? శిరశ్ఛేదం. అది సుగ్రీవాజ్ఞ. దానికి తిరుగులేదు. అపవాదం అంతకంటె లేదు. ఇదంతా మీ కొరకు గాదా? ఆలోచించు. నీ కన్నెఱ్ఱ చూచి మా అంతఃపుర కాంతలంతా అదరిపడుతున్నారు. ఇది ఏ మాత్రం ఉచితం గాదు. నీ కోపాన్ని ఉపసంహరించుకో. ప్రసన్నుడవై మిత్రుడుగా మసలుకో. ముందున్న మహాకార్యాన్ని ఆలోచించుకో' అని ఆవేశంగా అనేసరికి లక్ష్మణునికి ఊపిరాడ లేదు. ఏమి సమాధానం చెప్పాలో తెలియలేదు.

అగ్నిపర్వతంలా వచ్చిన ఆ వ్యక్తి మంచుగడ్డలా మారిపోయాడు.
న్నంగా సుగ్రీవుని వైపు చూచాడు.

అప్పుడు బ్రదుకు జీవుడా అని సుగ్రీవుడు ఊర్పు వదిలాడు. ము
వచ్చాడు. మెడలోని పూలమాలను త్రెంచి పారవేశాడు. పరిస్థితులను వి
క్షమించుమని లక్ష్మణుని ప్రార్థించాడు.

లక్ష్మణుడు సుగ్రీవుని ఆప్యాయంగా పలుకరించాడు. అనునయించాడు.

కిష్కింధ కథ సుఖాంతమైంది.

అందుకు కారణం తార వ్యక్తిత్వం.

ఆమే లేకుంటే — ఆ చొరవ చూపకుంటే -- అంతటి నేర్పు ప్రద
కుంటే కథ ఏమయ్యేదో! అందుకే వాల్మీకి మహర్షి ఆమె పాత్రనంతగా
దిద్దాడు.

మగువల దూరదృష్టికి, మాటనేర్పుకు, ధైర్యానికి, దక్షతకు తార మార
తారను తమ్మునికి అప్పగిస్తూ వాలి చెప్పిన వాక్యాలు ఆమె వ్యక్తిత్వానికి
టద్దాలు.

సుషేణ దుహితాచేయ । మర్థ సూక్ష్మ వినిశ్చయే
ఔత్పాతికేచ వివిధే । సర్వతః పరినిష్ఠితా
యదేషా సాధ్వితి బ్రూయా । త్కార్యం తన్ముక్తసంశయమ్
నహితారా మతం కించి । దన్యథా పరివర్తతే
(4-22-13, 14)

రామాయణంలో ఒక మరపురాని స్త్రీ పాత్ర తార.

# శూర్పణఖ

లోకంలో వలచిన వనిత కొరకు పేగుకెక్కిన పురుషులున్నట్లే, మనసు పడిన మగవాని కొరకు చరిత్ర సృష్టించిన స్త్రీలున్నారు. మహోన్నత త్యాగాలతో, మరపురాని సాహసాలతో కొందరు పేరుపొందితే, మితి మీరిన స్వార్థాలతో, దారుణ దుర్మార్గాలతో మరికొందరు చరిత్ర కెక్కారు. రామాయణంలో శూర్పణఖ రెండవ కోవకు చెందిన స్త్రీ పాత్ర. ఆమె ఏ ముహూర్తంలో రాముని చూచి మోహించిందోగాని, ఆమె మోహం ఆ సీతారాముల దాంపత్యాన్ని చిందర వందర చేసింది. రావణుని జీవితాన్ని సర్వనాశనం చేసింది. రామాయణ మహాకావ్యాన్నే పెద్ద మలుపు త్రిప్పింది.

శూర్పణఖ రావణుని చెల్లెలు. ఆమెదొక వికృతరూపం. అయినా రాక్షస స్త్రీ గనుక కోరిన రూపం ధరించగలదు. రావణుడామెను విద్యుజ్జిహ్వుని కిచ్చి వివాహం చేశాడు. విద్యుజ్జిహ్వునిది పాతాళలోకం. యక్ష నగరం. రావణుడు తన దిగ్విజయ యాత్రలో ఆ యక్ష నగరం మీద దండెత్తాడు. ఎదిరించిన కాలకేయుల నందరా ఖండించాడు. మితిమీరిన యుద్ధావేశంలో మరిది విద్యుజ్జిహ్వుణ్ణి గూడ వధించాడు. శూర్పణఖను విధవను చేశాడు.

లంకకు రాగానే శూర్పణఖ రావణుని పాదాల మీద వ్రాలింది. పరిపరి విధాల దుఃఖించింది. రావణుడు పశ్చాత్తప్తుడయ్యాడు. చెల్లెలిని లేవనెత్తాడు. కన్నీళ్ళు తుడిచాడు. 'అమ్మా! నీకు అన్యాయం జరిగింది. ఆవేశంలో అల్లుడన్న సంగతి మరచి నీ పతిని హతం చేశాను. మరణించిన నీ మగనిని మరల నీ కివ్వలేను. అయితే నీ బ్రతుకు తెరువుకు లోటులేకుండా ఏర్పాటు చేస్తాను. తమ్ముడు ఖరుణ్ణి దండకారణ్యంలో ప్రభువుగా నియమిస్తున్నాను. పధ్నాలుగు వేల రాక్షసుల్ని అతనికి బలంగా పంపతున్నాను. దూషణుడు అతనికి దండనాథుడుగా వ్యవహరిస్తాడు. ఖరదూషణు లిదరు నీ ఆజ్ఞానువరులై నడచుకొంటారు. రాజసోదరివై

నీవు భోగభాగ్యాలు అనుభవించు' అని ఆమె నోదార్చి ఖరుని వెంట దండకారణ్యం పంపారు.

జీవితంలో శూర్పణఖ చిన్న వయస్సులోనే భర్తను గోల్పోయింది. అందు చేత ఆమె కామవాంఛలు అట్టేతీరలేదు. ఆ వయస్సులో భర్తృ సుఖంలేకుంటే ఆడమనిషికి పెద్ద అసంతృప్తి. అందమైన పురుషుని చూచినప్పుడంతా ఆమె మనస్సు చలిస్తుంది. అనుకూల దంపతులను చూచినప్పుడంతా ఆమె మనస్సు అసూయ పడు తుంది. పతి సౌఖ్యాన్ని అనుభవించే పరస్త్రీని ఆమె మనస్సు ఏ మాత్రం సహించ లేదు. ఎంతో సంస్కారం ఉంటేగాని ఆ వయస్సులో అలాంటి స్త్రీ అసంతృప్తిని, అసూయను ఆవలికి పారద్రోలలేదు. శూర్పణఖది భర్తృసుఖానికి దూరమైన జీవితం; సంస్కార శూన్యమైన వ్యక్తిత్వం. కామసంబంధమైన అసంతృప్తి, అసూయ ఆమె స్వభావంలో బలంగా గూడుకట్టుకొన్నాయి.

అది హేమంతఋతువు. ఆనాడు ఉదయం గోదావరిలో స్నానం చేసి, పూజలన్నీ పూర్తిచేసుకొని సీతారామలక్ష్మణులు పర్ణశాల వాకిట విశ్రాంతిగా కూర్చు న్నారు. చల్లగాలి మెల్లగా వీస్తూఉంది. ప్రకృతిశోభ కనులపండువుగా ఉంది. ఒకే వేదిక మీద సీతారాములు వేరొక వేదిక మీద ఒకింత దూరంలో లక్ష్మణుడు ముగ్గురు మనోహర ప్రకృతిని గూర్చి ముచ్చటించు కొంటున్నారు. సీత రామునికి మరీ చేరువగా ఉంది. మగని వైపు ఒకింత ఒరిగి ఓరగా ఆయన కళ్ళల్లోకి చూస్తూ ఉంది. అంతలోనే శూర్పణఖ ఎక్కడినుండో అక్కడికి వచ్చింది. ఆదంపతులను చూచింది. 'ఆహా! ఎంత అందగాడు! ఆయన ప్రక్కన ఆ భంగిమలో నేనే ఉంటే —— –' అని ఏవేవో కలలు గన్నది. వెంటనే తన వికృత రూపాన్ని వద లింది. ఏదో తొడుగు దిగ వేసుకొన్నట్లు అందమైన రూపం ధరించింది. అయితే ఆ అందం వెనుక ఏదో వికారం తొంగిచూస్తూనే ఉంది.

శూర్పణఖ ఒయ్యారాలు ఒలకపోస్తూ శ్రీరాముని యెదుట నిలిచింది. 'తాపస వేషం ధరించి, ధనుర్బాణాలు చేపట్టి దండకారణ్యం వచ్చిన మీరెవరు?' అంది ఆ రాముని ముఖంలోకి చూస్తూ.

రాముడు తన సంగతి చెప్పాడు. తన భార్యసంగతి చెప్పాడు. తమ్ముడి సంగతి చెప్పాడు. తామెందుకు వచ్చారో తెలియచెప్పాడు. ఆ తరువాత 'అంగనా మణీ! నీవెవరు ?' అన్నాడు.

శూర్పణఖ తన సంగతి చెప్పింది. తన అన్నలైన రావణ కుంభకర్ణుల సంగతి చెప్పింది. తమ్ముడు విభీషణుని సంగతి చెప్పింది. క్రూర పరాక్రములైన ఖర దూషణాదుల సంగతి చెప్పింది. శ్రీరాముని ముఖంలోకి సాభిప్రాయంగా చూచి 'నిన్ను ప్రేమించా'నంది. 'సీత నీకు తగిన భార్యకా'దంది. తన్ను చేపట్టి జనస్థానంలో స్వేచ్ఛగా విహరించమంది.

రాముడు ఆశ్చర్యపోయాడు.

అల్లన నవ్వి 'శూర్పణఖా! నేను సీతాపతిని. నిన్నుగూడ చేపట్టితే ఈ సీత నీకు సవతి అవుతుంది. నీ వంటి ఉత్తమ స్త్రీలకు సవతిపోరు సహించటం కష్టం. అడుగో తమ్ముడు లక్ష్మణుడు. ఆయన ఒంటరివాడు. అన్నివిధాల నీ అందానికి తగినవాడు' - అన్నాడు అపహాస్యంగా.

శూర్పణఖ వెంటనే లక్ష్మణుని దగ్గరకు వెళ్ళింది. తన వంపుసొంపులన్నీ ప్రదర్శించింది. భార్యగా స్వీకరించమని ప్రార్థించింది.

లక్ష్మణుడు పకపక నవ్వాడు. 'వెట్టిదానా! నేను రామదాసుణ్ణి. నన్ను పెళ్ళాడితే నీవూ దాసివౌతావు. నీలాంటి అందగత్తెకు దాసీత్వమా ? అయ్యో ! అది ఎంతమాత్రం ఉచితంగాదు. నీవు ఆ రాముణ్ణే చేపట్టు. ఆయన రెండవభార్యగా ఉండు. నీముందు ఆ సీతమ్మ అందమెంత. ఆయన నిదానంగా నిన్నే నెత్తికెక్కించుకొంటాడు. సీతమ్మను సాగనంపుతాడు' - అనగానే శూర్పణఖ మురిసిపోతూ మళ్ళీ రాముని దగ్గరికి వెళ్ళింది. సీతమ్మను దురదుర చూచింది. ఆమె అడ్డే లేకుంటే ఆ రాముడు తన్నే వరిస్తాడని తలచింది మహోగ్రంగా నోరు తెరిచింది. మింగాలని మీదికివచ్చింది.

రాముడు ససంభ్రమంగా లేచాడు. శూర్పణఖను అదలించాడు. 'లక్ష్మణా! ఈ రాక్షసి హద్దుమీరింది. సీతను మనం రక్షించుకోవాలి. శూర్పణఖను అంగవిహీనం చెయ్యి' అన్నాడు.

వెంటనే లక్ష్మణుడు ఖడ్గంతో ఆ రాక్షసి ముక్కు చెవులు కోశాడు.

నేల అంతా నెత్తుటి మయం.

పాపం! సీతమ్మ ఆ దృశ్యాన్ని చూడలేక రెండు చేతుల్తో కళ్ళు మూసుకుంది.

హాహాకారాలతో ఆ శూర్పణఖ ఆకాశాని కెగిరింది. ఒక్క ఊపున ఖరుని ముందు వ్రాలింది. కడుపు బాదుకొంటూ జరిగినదంతా చెప్పింది.

ఖరుడు మహోగ్రుడయ్యాడు. ఆ రామలక్ష్మణులు తన ముక్కు చెవులే కోసినట్లు బాధపడ్డాడు. పద్నాలుగు మంది మహావీరులైన రాక్షసులను పిలిచాడు. ఆ సీతారామలక్ష్మణులను చంపిరమ్మన్నాడు.

శూర్పణఖ వాళ్ళ వెంట వెళ్ళింది. ఒక చెట్టు చాటున దాగింది. ఆ శ్రీరామచంద్రుణ్ణి చూపింది. రాక్షస వీరులు పద్నాలుగుమంది ఆ రాముని మీద విజృంభించారు. ఆయన బాణాలకు హతులయ్యారు. శూర్పణఖ అంతా చూచింది. పెద్దగా అరిచి పరుగెత్తుకొని వచ్చి ఖరునితో ఆ రాక్షసుల చావు సంగతి చెప్పింది. రాముని బలపరాక్రమాలు వర్ణించింది. నోరు కొట్టుకొంటూ, జుట్టు పీక్కుంటూ ఇది రాక్షస జాతికే అవమానమని అరణ్ణి రెచ్చగొట్టింది.

ఖరుడు మహోగ్రుడయ్యాడు. పటపట పళ్ళు గొరికాడు. సమస్త సైన్యంతో శ్రీరాముని మీదికి దండెత్తి వెళ్ళాడు

శూర్పణఖ తృప్తిగా ఒక్క ఊర్పు విడిచింది. యుద్ధం చూడాలని వెంట వెళ్ళింది.

అయితే ఆమె ఆశించినదొకటి. అయినది ఇంకొకటి.

ఖరదూషణాదులు ససైన్యంగా రాముని చేత ఖండితులయ్యారు. శూర్పణఖ గుండెలదిరాయి. పెద్దగా ఒక్క కేకపెట్టి లంకకెగిరింది.

అది లంకలో పుష్పక విమానాగ్రభాగం. అప్పుడే రావణుడు మారీచాశ్రమం నుండి తిరిగి వచ్చాడు. మంత్రులతో కొలువు దీరాడు. అంతకుముందు

అకంపనుడు చెప్పిన శూర్పణఖావమానాన్ని గూర్చి, ఖరదూషణ సంహారాన్ని గూర్చి, రామలక్ష్మణుల బాహుపరాక్రమాన్ని గూర్చి, సీతా సౌందర్యాన్ని గూర్చి, మారీచుని సలహాను గూర్చి మనస్సులో ఆలోచిస్తున్నాడు.

అంతలోనే శూర్పణఖ వచ్చింది. కడుపు బాదుకొంటూ—కన్నీటి ధారలతో—నెత్తుటి చారికలతో ముక్కు చెవులు లేకుండా మిక్కిలి వికృతంగా వచ్చింది. రావణుని పాదాల మీద వ్రాలింది. 'అన్నా! నీవు మన్మథభోగాల్లో మునిగి మీదికివచ్చే ప్రమాదాన్ని గుర్తించలేకున్నావు. చారులవల్ల విషయాలు తెలుసుకోకుండా స్త్రీలోలుడవై విహరిస్తున్నావు. జనస్థానంలో రాముడు రాక్షసులనంతా నిర్మూలిస్తున్నాడు. మహర్షులకు అభయమిస్తున్నాడు. మన ఖరదూషణులను ససైన్యంగా ఖండించాడు. అతని పరాక్రమం అద్వితీయం. అతని తమ్ముడున్నాడు. అన్ని విధాల అన్నకు తగ్గ తమ్ముడు. అన్ని విషయాల్లో అన్నకు సాయంగా ఉంటాడు. సీత రామపత్ని.

ఆమె అతిలోక సౌందర్యవతి. దేవ గంధర్వయక్ష కిన్నరులలో అంత అందగత్తెలేదు. అలాంటి భార్యను పొందిన పురుషుని జీవితమే చరితార్థం. నీకామె భార్య అయితే అన్ని విధాల బాగుంటుంది. నేనే అపహరించి తెచ్చి ఆమెను నీ కివ్వటానికి ప్రయత్నించాను. అందుకే లక్ష్మణుడు నాకీగతి పట్టించాడు.' అని బావురుమని ఏడ్చింది. తెగిన ముక్కుచెవులు చూపింది చెల్లెలి ఈ అవమానాన్ని, రాముని ఆ పరాక్రమాన్ని, ఖరదూషణ సంహారాన్ని సహించి ఊరకుంటావా అని ఆవేశంతో అడిగింది. అంతేగాక 'సీతను భార్యగా పొందలేని నీ భోగభాగ్యాలెందు' కని ఎత్తి పొడిచింది. రావణ హృదయాన్ని సీతాపహరణానికి సిద్ధంచేసింది.

రామాయణంలో మంథర రామపట్టాభిషేకాన్ని చెడగొట్టి, ఆయన జీవితాన్ని అడవులవైపు మళ్ళిస్తే, శూర్పణఖ అరణ్యవాసంలో ఆయన అర్ధాంగిని అపహరింపజేసి, రామబాణాన్ని రావణుని మీదికి రప్పించింది. మంథరాశూర్పణఖవల్ల రామునికి అపకారమే జరిగినా లోకానికి మాత్రం ఉపకారమే జరిగింది. రామాయణ కావ్యం పెద్ద మలుపులు తిరిగింది.

# మండోదరి

ఎంతో సారవంతమైన పాదులోపుట్టి, అందంగా, ఏపుగా ఎదిగే తీవ రానల్లుకోటానికి మహోన్నతము, శాఖోపశాఖా విలసితము అయిన పెద్ద వృక్షం కొరకు వెదకటము, అలాంటి వృక్షానికి అల్లుకొని ఎంతో ఎత్తు పెదగాలని, ఎన్నో పూలు పూయాలని, కాయలు కాయాలని కలలు కనటము, ఆ కోరిక నెరవేరగానే నిలువెల్ల పులకించి తన అదృష్టానికి తానే ఆశ్చర్యపడటము, అపరిమితానందాన్ని అనుభవించటము లోకసహజం. కాని ఆ చెట్టుకొక వేరుపురుగు పుట్టి, చీడతగిలి, బలహీనమై, గాలి దెబ్బకు కొమ్మలువిరిగి, కూకటివ్రేళ్ళతో గూడ పెల్లగిలి పడి పోతే, ఆ తీవ కుప్పగూలి ప్రక్కనబడి ఎంత దుఃఖాన్ని అనుభవిస్తుందో ఎవరు చెప్పగలరు!

లోకంలో ఏస్త్రీ స్థితి అయినా ఇంతే. ఆమె ఎక్కడో జన్మిస్తుంది. ఎవరినో చేపట్టాలని కలలుగంటుంది. ఏదేవో అనుభవించాలని ఆశిస్తుంది. అన్నీ అను కొన్నట్లే జరిగి, కోరుకొన్నవన్నీ పొందానన్న ఆనందాన్ని అనుభవించే సమ యంలో - ఆ భర్త ఏ వ్యసనానికో బానిస అయి, ఎంతచెప్పినా వినకుండా పతన మైతే ఆ పతివ్రత ఏమి చేయగలదు? నిప్పులాంటి నిజాన్ని కాదనగలదా? నిలు వెల్ల దహించే దుఃఖాన్ని దిగమ్రింగగలదా?

రామాయణంలో మండోదరి స్థితిగూడ అదే అయింది. ఆమె మహా సౌందర్యవతి. అంతకుమించిన గుణవతి మహోదాత్తవ్యక్తిత్వశోభావతి. ఆమె తండ్రి దానవరాజు మయుడు ఆమె తల్లి అప్సరస హేమ. మండోదరి తన అభిజాత్యానికి, అందానికి, గుణానికి. అభిరుచికి. ఐశ్వర్యానికి తగిన భర్తను చేపట్టాలని కలలుగన్నది. మయుడు గూడ ఆమెకు తగిన వరుని అన్వేషించాలని బయలుదేరాడు. మండోదరిని వెంటబెట్టుకొనే బయలుదేరాడు. ఎక్కడెక్కడ తిరి గాడో! ఎవరెవరిని చూచాడో!

ఒకనాడు మండోదరీమయులు దట్టమైన అడవిమార్గాన వెళ్ళుతూ ఒక మలుపు తిరిగే సరికి ఎక్కడిదో అడుగుల సవ్వడి వినిపించింది. మండోదరికి ఎడమ కన్నాట

రింది. శుభసూచన. చెట్టుమీద గువ్వలజంట కూసింది. శుభశకునం. మయుడు ముందుకు చూచాడు. పెద్ద మద్దిచెట్టంత మనిషి కారుమేఘంలా ఎదుట కన్పించాడు. అతని నొసట విభూతిరేఖలు; చెవులకు రత్నకుండలాలు; శిరస్సున రత్నకిరీటం; బాహు బలస్ఫూర్తి; బ్రహ్మతేజస్సు; చేతధనుస్సు - ఇది అతని రూపం.

మయుడు ఆశ్చర్యపడ్డాడు, మండోదరి సిగ్గుపడ్డది. ఆమె వాలుగంట ఆ మహావీరుని రూపు చూచింది. అతని యౌవనశోభను తిలకించింది. ఔన్నత్యమహిమను ఊహించింది. ఒకింత తండ్రిప్రక్కకొదిగి నిలిచింది.

వచ్చిన వ్యక్తి మయుణ్ణి చూచి 'మహాత్మా! నీ వెవ్వ' రన్నాడు. 'ఒంటరిగా ఈ అడవిలో కన్యకతో తిరుగుతున్నావే' అన్నాడు.

మయుడు మొదట తన సంగతి చెప్పాడు. తరువాత కూతురి వరాన్వేషణ విషయం తెలిపాడు.

వెంటనే ఆ వ్యక్తి మందోదరివైపు చూచి అందంగా ఒక నవ్వు నవ్వాడు. ఆ నవ్వులో, ఆ చూపులో శృంగార కళావిలాసాలు తీవలు సాగినట్లున్నాయి. పువ్వులు పూచినట్లున్నాయి.

మండోదరి మనస్సు మనస్సులోలేదు. ఆమె పరవశ అయింది. కాలి బొటన వ్రేలితో నేలరాస్తూ నునుసిగ్గు దొంతరలు పేర్చినట్లు నిలబడింది.

మయుడు అతనివైపు సూటిగా చూచి 'నివ్వెవ్వ' రన్నాడు.

'కుబేరుణ్ణి కైలాసం పారద్రోలి, లంకలో రాక్షస సామ్రాజ్యాన్ని స్థాపించి, అటు విజయోత్సవం, ఇటు చెల్లెలి వివాహమహోత్సవం జరిపించి, విలాసంగా వేటాడ వచ్చిన రాక్షసరాజ్య చక్రవర్తిని, పులస్త్యబ్రహ్మ పౌత్రుణ్ణి, విశ్రవస బ్రహ్మపుత్రుణ్ణి, దశకంధర నామధేయుణ్ణి' అని ధీర గంభీర స్వరంతో సమాధానం చెప్పేసరికి మయుని నోటమాట రాలేదు.

మండోదరి మెచ్చుకోలు నవ్వునవ్వింది. మనసిచ్చి అతని వైపు చూచింది.

అతడూ ప్రేమగా ఆమెవైపు చూచాడు.

మయుడు ఇద్దరి చూపులు అర్థంచేసుకొన్నాడు. మండోదరి నిచ్చి దశకంధరునికి వివాహంచేశాడు. అంతేగాదు. తపస్సుచేసి తాను సంపాదించిన శక్త్యాయుధాన్ని గూడ అల్లునికి అప్పగించాడు.

మందోదరి లంకేశ్వరుని అర్థాంగి అయింది. లంకా మహా సామ్రాజ్య పట్టమహిషి అయింది. జీవితంలో అనేక భోగాలనుభవించింది. మగని విజయోత్సవాలు చూచింది. మహానందాన్ని పొందింది. పతిదేవుని బల పరాక్రమాలు ప్రశంసించింది. ఇంద్రజిత్తువంటి మహావీరుని కన్నతల్లి అయింది. ఆ స్త్రీ మూర్తికి అంతకంటె ఏం కావాలి ?

ఆ దశలో దశకంఠుడు కాముకుడయ్యాడు. అతని స్వభావంలో వేరు పురుగు పుట్టింది. అతని జీవితానికి చీడ పట్టింది.

రావణుడు వేదవతిని వేధించాడు. శాపగ్రస్తుడయ్యాడు. దేవగంధర్వ ఋషి కన్యలను అపహరించాడు. శాపగ్రస్తుడయ్యాడు. రంభను మానభంగం చేశాడు. శాపగ్రస్తు డయ్యాడు. పుంజికస్థలను పట్టి బాధించాడు. శాపగ్రస్తుడయ్యాడు. ఎందరెందరో పతివ్రతలను బలాత్కరించాడు. శాపగ్రస్తు డయ్యాడు.

పాపం! మండోదరి ఎప్పటికప్పుడు భర్త స్థితికి బాధపడుతూనే ఉంది. ఎన్నోసార్లు ఆయనకు హితబోధ చేసింది.

అయినా రావణుడు మారలేదు. అతని కాముకత తీరలేదు. పైగా అది పరాకాష్ఠనందింది.

సీతాపహరణం జరిగింది.

రాక్షస మహాసామ్రాజ్యానికి గ్రహణం పట్టింది.

మందోదరి మనస్సులో అంతులేని భయం. ఎంతో ఆందోళన. సీతాపహరణం వల్ల మగనికి ఏ అపకారం జరుగుతుందో ? ఆమె మహాపతివ్రత. రాముడు అసాధారణ మానవుడు. పెరికత్తెలు ఎప్పటికప్పుడు సంగతులు చెపుతూనేఉన్నారు. శూర్పణఖకు ముక్కు-చెవులు తెగాయి. ఖరదూషణాదులు హతులయ్యారు. సీతాపహరణం జరిగింది. అశోకవనంలో ఆమె శోకిస్తూ ఉంది. ప్రతిదినం రావణుడు

ఆమెను బాధిస్తూనే ఉన్నాడు. హనుమంతుడు సముద్రం దాటాడు. సీతను చూచాడు. లంకను కాల్చాడు. అంతా ఏదో పెద్ద పీడకలలా ఉంది. మండోదరి మనస్సు మరీ బాధపడుతూ ఉంది. ఆమె ఎన్నోసార్లు భర్తకు హితబోధచేసింది. పతివ్రతల శోకశాపాలు ప్రాణాంతకాలని పదే పదే హెచ్చరించింది. ప్రతిసారి రావణుడు పకపక నవ్వుతాడేగాని ఆమె మాట పట్టించుకోడు. తన వరాల సంగతి వివరిస్తాడేగాని ఆమె విన్నపం వినిపించుకోడు. తన బలపరాక్రమాలను ప్రశంసించుకొంటాడేగాని ఆమె భయాన్ని అర్థంచేసుకోడు. మాటకు ముందు ముల్లోకాలను జయించానంటాడు. తనకు మరణం లేదంటాడు. మృత్యువే తన్నుచూస్తే గడగడలాడుతుందంటాడు. దిక్పాలకులు తన వశవర్తులంటాడు. తన్నుచూస్తే సూర్యుడు వెలగనంటాడు. వాయువు వీవదంటాడు. తన పుత్రుడు ఇంద్రజిత్తంటాడు. తన తమ్ముళ్ళు అజేయపరాక్రము లంటాడు. రాక్షసవీరులందరు యుద్ధనిపుణులంటాడు. లంక దుర్భేద్యమంటాడు. ఏవేవో చెప్తాడు. ఏలాగో ఆమెను బుజ్జగిస్తాడు. మురిపిస్తాడు. వీణ వాయిస్తాడు. ఆమె వీణాగానం వింటాడు. రసమయ లోకాల్లోకి ఆమెను నడిపిస్తాడు. మైమరపిస్తాడు. అంతేగాని ఆమె హితబోధ వినడు. సీతను వదలడు. రాముని మాహాత్మ్యాన్ని అంగీకరించడు. అతనితో వైరం మానడు.

ఏ ముహూర్తాన సీతాపహరణం జరిగిందోగాని లంకలో అన్నీ అపశకునాలే. అందుకు తోడు రావణుని వాలకం గూడ క్రమంగా మారుతూ ఉంది. అతడు ఎవరి మాటా వినటంలేదు. శ్రీరామునితో సంధి అంటే చాలు తోక త్రొక్కిన త్రాచులా మీద పడుతున్నాడు. సంధి సంగతి చెప్పిన కుంభకర్ణుని కాదన్నాడు. విభీషణుని వెళ్ళగొట్టాడు. రావణుని మనస్సులో మంటలు రగులుతున్నాయి. మండోదరి మందిరానికి కూడ అతడు రావటం లేదు. ఎప్పుడూ మంత్రాలోచనలే. ఎప్పుడూ యుద్ధ వ్యూహరచనలే. ఎప్పుడూ సైన్య సమీకరణలే. ఎప్పుడూ ఏదో ఆలోచనలే. ఎప్పుడైనా ఒకసారి మండోదరి మందిరానికి వచ్చినా సీత విషయం ప్రస్తావించటానికే ఆమెకు అవకాశం ఇవ్వడు.

మండోదరి లోలోపల కుమిలిపోతూ ఉంది.

వానరులు సేతువు నిర్మించారు. సముద్రం దాటారు. లంకను ప్రవేశించారు. అనుకొన్న యుద్ధం రానే వచ్చింది. పేరు మోసిన రాక్షస వీరులంతా యుద్ధభూమికి బలి అయ్యారు. అయినా రావణుడు మారలేదు. సీత విషయం ప్రస్తావించటానికే.

మండోదరికి అవకాశం లభించలేదు. ప్రియపుత్రుడు గెలిచాడని ఒకనాడు రావణుడు వచ్చాడు. స్వయంగా తానే ఆ శుభవార్త తెచ్చాడు. ఆనాడు ఆయన ఆనందానికి అందులేదు. ఆ ఆనందంలో తన్నూ ముంచి తేల్చాడు. మండోదరి రాముని మహత్తును గూర్చి మరొక్కసారి చెప్పదామనుకొంది. సీత పాతివ్రత్యాన్ని గూర్చి మరొకసారి ప్రస్తావిద్దామనుకొంది. ఇకనైనా ఈ మారణహోమం ఆపమని అడుగు దామనుకొంది. కాని ఆ పతిదేవుని ఆనందపారవశ్యాన్ని జూచి ఆమె ఏమీ అనలేక పోయింది. ఆ ఆనందంలో తన హితబోధ అపశ్రుతిలా ఉంటుందని ఆమె జంకింది. తనకు తెలియకుండానే తానూ ఆ ఆనందంలో మునిగితేలింది. పైగా అది మహా సంగ్రామ సమయం. భర్త ఎంతోసేపు తన దగ్గరలేదు. మరల నిన్ను కలుస్తానని మహావేగంగా వెళ్ళాడు. ఈసారి ఇంద్రజిత్తు, నేను శత్రు నిశ్శేష శుభవార్తతో నీ మందిరానికి వస్తామన్నాడు.

మరునాడే ఇంద్రజిత్తు మరణించాడు.

మరల రావణుడు ఆమె మందిరానికి వచ్చాడు. కళ్ళ నీళ్ళు తుడిచాడు. అయితే తాను రెండు కన్నీటి బొట్లు రాల్చాడు. అవి నీటిబొట్లులాలేవు. నెత్తుటి బొట్లులా ఉన్నాయి. రగిలే నిప్పుల్లా ఉన్నాయి. సెగలు, పొగలు గ్రక్కు తున్నాయి. అప్పుడు మండోదరి ఏం మాట్లాడుతుంది ? తానే ఆయన కన్నీళ్ళు తుడిచింది.

రావణుడు ఒక వేడి నిట్టూర్పు విడిచాడు. మహాతీవ్రంగా మేఘాల వైపు చూచాడు. తల వంకిస్తూ తటాలున కదలి వెళ్ళాడు.

అంతఃపురమంతా అగ్నిపర్వతం బ్రద్దలైనట్లుంది. మండోదరి అతని వైపే చూస్తూ అలా నిలబడిపోయింది. ఆకాశంలో కారుమేఘాలు క్రమ్ముతున్నాయి. ఆమె కళ్ళల్లో నీళ్ళు కురుస్తున్నాయి.

చెలికత్తె పరుగెత్తు కొంటూవచ్చి 'అమ్మా !' అంది. పరధ్యానంగా మండో దరి 'ఆఁ' అంది.

'అమ్మా ! ప్రభువుగారే స్వయంగా యుద్ధానికి వెళ్ళారట' అంది చెలికత్తె ఆరాటోళనగా.

మండోదరి మాట్లాడలేదు. భారంగా ఒక్క ఊపిరి మాత్రం విడిచింది. తన కన్నీళ్ళు తానే తుడుచుకుంది.

విధి బలీయం. కానున్నది కాక మానదు. ఇంతవాకా వచ్చిన యుద్ధం ఇక ఆగదు.

మండోదరి గుండె రాయిచేసుకొంది.

అది రామరావణ యుద్ధం. ముల్లోకాలను ఆశ్చర్యంలో ముంచి తేల్చిన యుద్ధం. అటు మానవజాతి భవితవ్యాన్ని, ఇటు రాక్షసజాతి భవితవ్యాన్ని తేల్చి వేసే యుద్ధం. మహాభయంకర యుద్ధం.

యుద్ధ వార్తలు ఎప్పటికప్పుడు అందుతూనే ఉన్నాయి. మండోదరి మనస్సు గాలిలో పెట్టిన దీపంలా ఉంది.

ఆ రాత్రి అన్నీ దుస్స్వప్నాలే. ఎలా తెల్లవారిందో ఆమెకే తెలీదు. అంతఃపుర కవాటం నుండి రెండు కిరణాలు మండోదరి ముఖం మీద పడ్డాయి. అవి చురచుర మంటున్నాయి. సూర్యుడే సూదులతో ఆమె కళ్ళు పొడిచినట్లుంది.

మండోదరి లేచింది.

లంకా నగరమంతా అల్లకల్లోలంగా ఉంది. అంతటి అల్లకల్లోలం లంకలో మునె్నన్నడు లేదు. ఏవో కేకలు; హాహాకారాలు.

మండోదరి కవాటం తెరిచి చూచింది. రాక్షస స్త్రీలంతా ఇళ్ళల్లో తలలు విరియబోసుకొని గుండెలు బాదుకొంటూ ఏడుస్తున్నారు. మేడలమీద, చెట్లమీద, కోటగోడలమీద వానరులు ఉత్సాహంతో గంతులు వేస్తున్నారు. విజయధ్వానాలు చేస్తున్నారు.

అంతలోనే జాపురుమంటూ చెలికత్తె వచ్చింది. 'అమ్మా ! ప్రభువు ...' అంది పెద్దగా ఏడుస్తూ.

మండోదరి మాట్లాడలేదు. ఒక్క క్షణం కళ్ళు మూసుకొంది. ఆమె కళ్ళ నుండి నదులు పొంగిపొరలాయి.

ఆ మౌనధీరగంభీర శోకమూర్తి ఏకాయెకి యుద్ధభూమికి తరలి వెళ్ళింది. రావణుడు పెనుతుఫానుకు పెల్లగిలిపడిన మహావృక్షంలా పడిఉన్నాడు. విభీషణుడు ఒకవైపు నిలబడి దుఃఖిస్తున్నాడు. వానరులు విజయోత్సాహంతో గంతులు వేస్తున్నారు. రావణుని రాణులంతా రోదిస్తున్నారు.

మండోదరి మూర్తీభవించిన శోకదేవతలా ముందుకు నడిచింది. అంత శోకంలోనూ ఆమె ఎంతో ఉదాత్తంగా ఉంది. అందరు ఆమెను చూచి అవలికి తప్పుకొన్నారు. రక్తసిక్తమైన రావణుని ఎదమీద ఆమె వ్రాలింది. విలపించింది. విలపించింది. ఎంతగానో విలపించింది. అయినా ఆమె తన భర్తను బలిగొన్న ఆ రామచంద్రుణ్ణి ఏమీ అనలేదు. అన్నను వదలి ఆ రామచంద్రుణ్ణి ఆశ్రయించిన విభీషణుని గూడ ఏమీ నిందించలేదు.

మండోదరి రావణుని తలను తన చేతుల్లోకి తీసుకొంది. ఆయన ముఖమంతా గాయాలే. తలమీద కిరీటం లేదు. అది తునాతునకలై ఎక్కడోపడి ఉంది. నొసట విభూతి రేఖల్లేవు. అవి చెమట నీట తడిసి ఎప్పుడో కొట్టుకుపోయాయి. చెవులకు కుండలాల్లేవు. అవి ముక్కలు ముక్కలై మట్టిలో కూరుకుపోయాయి.

రావణుని ముఖం ఒక పాడుపడిన రాజసౌధంలా ఉంది. అది చూచేసరికి మండోదరి మనస్సులో ఎన్నో ఆలోచనలు. ఏవేవో అనుభూతులు. ఒకవైపు ఆశ్చర్యం. మరోవైపు దుఃఖం, ఇంకొకవైపు నైరాశ్యం.

'ప్రభూ ! ముల్లోకాలను గడగడలాడించిన మీకా ఈ మరణం' అంది. 'అందులోను ఒక మానవుని చేతనా' అంది. 'దేవేంద్రుడే మీ దెబ్బకు భయపడతాడే ! మహర్షులంతా మీ మాట వింటే దిక్కులకు పరుగిడుతారే ! యమధర్మరాజే మీరెదురుపడితే గడగడలాడుతాడే ! అలాంటి మీకా ఒక మానవమాత్రుని చేత మరణం' అంది. కాదు – కాదు. రాముడు మానవమాత్రుడు గాదు. ఖరదూషణాదుల వధతోనే రాముడు మానవమాత్రుడు గాడని తేలిపోయింది. అంతటి సముద్రాన్ని వానరులు దాటగానే రాముడు మానవమాత్రుడుగాదని తేలిపోయింది. ఆయన పరమాత్ముడు. మానవరూపం ధరించిన మహావిష్ణువు. అందుచేతనే మిమ్మల్ని వధించగలిగాడు. కాకుంటే ఆ పని ఎవరికి సాధ్యం

అయినా ఎవరినో గూర్చి ఎందుకనుకోవాలి. ఇదివరలో మీరు ఇంద్రియాలను జయించారు. అందుచేత ముల్లోకాలను జయించగలిగారు. ఇప్పుడా ఇంద్రియాలకు వశమయ్యారు. శత్రువుచేత హతమయ్యారు.

రామునితో వైరం వద్దని, అది అనేక విధాల అనర్థదాయకమని, సీతనిచ్చి సంధి చేసుకొమ్మని ఎన్నిసార్లో నేను మీకు చెప్పాను. మీ తమ్ముళ్ళు చెప్పారు. నా తండ్రిగూడ చెప్పాడు. అయినా మీరు వినలేదు. సీత మహాసాధ్వి. ఆమెను మీరు చెరబట్టారు ఆమె అంటే మీ కెందుకంత మోహం? ఆమె కంటె అందగత్తెలు మీ కెంతమంది లేరు? అభిజాత్యంలోగాని, అందంలోగాని ఆమె నాకంటె ఎక్కువా? చెప్పండి. మీరు కామమోహితులయ్యారు. అందుకే మీ కంటికి ఆమె అంత అందంగా అగుపించింది. మీకు చివరిరోజులు దాపురించాయి. అందుకే ఆమె మీ కంటబడింది. పతివ్రతాశోకం వ్యర్థంగాదు. సీత మహాపతివ్రత. ఆమెను స్పృశించిన రోజే మీరు మాడిపోవలసింది. అలా జరుగలేదు. అది ఆశ్చర్యకరం. ఎందరెందరో పతివ్రతలను మీరు బాధించారు. వాళ్ళందరూ మిమ్మల్ని శపించారు. ఆ శాపాలఫలమే మీ మరణం. మీరు ముల్లోకాలను జయించిన మహావీరులే — నీచాతి నీచమైన నారీచౌర్యానికి ఎలా పాల్పడ్డారు. మాయోపాయంచేత ఆ మహా పతివ్రత సీతను ఎందుకు అపహరించారు. పిరికితనం అందులో ప్రతిఫలిస్తున్నది. ఆ పిరికితనమే మీ నైతిక బలహీనతకు నిదర్శనం. పతనానికి నాంది. రాక్షస కుల నాశానికి విషబీజం. విభీషణుడు దీర్ఘదర్శి. సత్యవాది. మహాభాగుడు. ఆనాడె అతడు మీకు హితం చెప్పాడు. రానున్న ప్రమాదాన్ని పసిగట్టి రాముని ఆశ్రయించాడు.

సుకృతఫలం సుఖం. దుష్కృతఫలం దుఃఖం. అవి ఎవరికైనా అనుభవించక తప్పదు.

జీవితాన్ని మీరు గొప్పగా అనుభవించారు. అనేక ఘనకార్యాలు సాధించారు. వీర మరణం పొందారు. మీ మార్గం మీరు చూచుకొన్నారు. నన్నే అనాథగా చేసి వెళ్ళారు. ఈ స్థితి వస్తుందని కలలో గూడ నేను ఊహించలేదు. నా తండ్రి దానవ రాజు మయుడు — నా భర్త రాక్షసేశ్వరుడు రావణుడు — నా పుత్రుడు మహావీరుడు ఇంద్రజిత్తు — జీవితంలో నాకు ఏ లోటూ ఉండదు — ఎవరి వలన భయముండదు — అని విఱ్ఱవీగేదాన్ని. అలాంటి నాకు ఆశ్చర్యకరంగా ఈ గతిపట్టింది.

విధి బలీయం. అయినా మీరు మరణించారంటే నమ్మలేకుండా ఉన్నాను. నా స్థితి ఎలా ఉందో చూడండి. మన లంకకు ఏ గతి పట్టిందో చూడండి. అంతఃపుర కాంతలంతా ఎలా ఏడుస్తున్నారో చూడండి. అని మండోదరి భర్త కళేబరం మీద బడి పరిపరి విధాల శోకించింది.

అయినా మండోదరి పరులను పల్లెత్తుమాట అనలేదు. గతాన్ని, తన భర్త ప్రవర్తనాన్ని ఒక విధంగా నెమరువేసుకొంది. సమ్యగ్దృష్టి చెడకుండా పరిస్థితులను సమీక్షించుకొంది. పతి మరణానికి స్త్రీ సహజంగా శోకించింది. ఆస్థితిలో సామాన్య స్త్రీలైతే శత్రువీరులను ఎంత నిందించేవారో ! విశేషించి విభీషణుని ఎంత దూషించేవారో ! భర్త లోపాల్ని కప్పి పుచ్చి గుణగణాల్ని మాత్రమే ఎంతగా శ్లాఘించేవారో !

అయితే ఆ పరిస్థితుల్లో మండోదరి పరదూషణకు పూనుకొన్నా సహించటం సులభమేమోగాని ఆమె చేసిన ఆత్మవిమర్శను మాత్రం సహించటం చాల కష్టం.

రాముడు రావణుని అంత్యక్రియలకు అనుమతించాడు. విభీషణుడు మండోదరిని ఓదార్చాడు. అన్నగారి అంత్యక్రియలు జరిపాడు.

మండోదరి గతాన్నంతా ఒక కలగా భావించింది. తనలో తాను లీనమైపోయింది.

రామాయణంలో మండోదరి ఒక మహోదాత్త స్త్రీమూర్తి. ఆమె మనోబలం, హృదయ వైశాల్యం, సమ్యగ్దృష్టి అనుపమానం.

# సీతాదేవి

మానవజీవితంలో దాంపత్యం ఎంత ప్రధానమైందో, ఎంత పవిత్రమైందో అతి ప్రాచీన కాలంలోనే భారతీయ సమాజం దర్శించింది. భార్యాభర్తృ సంబంధాన్ని ఒక పవిత్రబంధంగా గుర్తించింది. వివాహాన్ని ఒక ప్రధాన జీవిత యజ్ఞంగా తీర్చిదిద్దింది. పాతివ్రత్యాన్ని, ఏకపత్నీవ్రతాన్ని దాంపత్య పరమ ధర్మాలుగా రూపొందించింది.

దాంపత్యం నిజానికి స్త్రీ పురుష జీవితంలో ఒక చిత్రమైన సంఘటన. ఒక సుకుమారమైన సంబంధం. ఒక మనోహరమైన అనుభవం. అందులో హెచ్చు తగ్గులుండవు. ముందు వెనుకలుండవు. ఉన్నవన్నీ ఆత్మీయతలే. అనురాగాలే. అప్పుడప్పుడు అందులో ఎన్నో త్యాగాలు. కష్ట సుఖాల్లో సమభాగాలు.

అందుకే భారతీయులు దాంపత్యాన్ని ఏదో ఇద్దరు స్త్రీ పురుషుల దైహిక సంబంధంగా మాత్రమే లెక్కించలేదు. వైయక్తిక జీవనంగా మాత్రమే పరిగణించలేదు. దాంపత్యం వారి దృష్టిలో దైహికస్థాయి నధిగమించిన మానసిక సంగమం. ఆత్మ సంగమం. మధుర సంగమం. అందుచేతనే దానికి ఎన్నో ఉన్నత లక్ష్యాలు నిర్దేశించారు. ఒక విశిష్ట సామాజిక స్థితిని గూడ కల్పించారు. అనేక బాధ్యతలను అప్పగించారు. అయితే సమాజపరమైన బాధ్యతాభారాన్నంతా నిర్వహించవలసిన వ్యక్తి భర్త. అతనికి అవసరమైన సహకారాన్నంతా అందింపవలసిన స్త్రీమూర్తి భార్య. సమాజంలో భర్త ఎంత ఎత్తు ఎదిగితే అతని బాధ్యతా భారం అంత పెరుగుతుంది. భార్య సహకారం అంతకంత అతనికి అవసరమౌతుంది. ఒక్కొక్క సారి ఉన్నత త్యాగాన్ని గూడ ఆమె చేయవలసివస్తుంది.

అయితే భర్తృ సాహచర్యంలోనే భార్యకొక ఆనందం. అవసరమైన సహకారాన్ని అందించటంలోనే ఆమె శక్తికొక తృప్తి. ఉన్నత త్యాగం చెయ్యటంలోనే ఆమె జీవితానికొక చరితార్థత. అందుచేతనే భారతీయ స్త్రీకి పాతివ్రత్యం బాధాకరమైన బంధంకాదు. భారం కాదు. దుఃఖం కాదు. తక్కువ తనం అంతకంటె

కాదు. అనేక పరమ పవిత్ర జీవన విధానం. మధురాతి మధుర ప్రేమ ప్రవాహం.

రామాయణంలో సీత పరమ పతివ్రతగా పేరు పొందింది. పతిప్రేమనే పరమార్థంగా భావించింది. ఆయన సాహచర్యం కొరకు అనేక కష్టాలు అనుభవించింది. సహధర్మచారిణిగా పెక్కు విధాల భర్తతో సహకరించింది. ఆయన ప్రభు ధర్మపాలనకొరకు అగ్ని ప్రవేశం చేసింది. అడవులకు మరొకసారి వెళ్ళింది. కడకు భూగర్భం చొచ్చి శాశ్వతంగా అదృశ్యమైపోయింది.

సీతాదేవి పుట్టుకే ఒక అద్భుతం. ఆమె అయోనిజ. యజ్ఞం చెయ్యాలని జనక మహారాజు భూమిని దున్నటం, నాగేటికొమ్ముకు పెట్టె ఒకటి తగులుకోవటం, అందులో ఒక అందాల పాప అగుపించటం, ఆమె జనకుని యింట సీతగా, ఆయన కన్నకూతురి కన్న మిన్నగా పెరగటం, అంతా ఒక అద్భుతం.

పుట్టుకతోనే సీత సామాన్యురాలు కాదని, ఏదో మహాత్మురాలని, కారణ జన్మురాలని భారతదేశమంతా పేరు వ్యాపించింది. అందుకు దోడు ఆమె సమున్నత విగ్రహం, దివ్య సౌందర్యం, దేదీప్యమాన తేజం అందరి దృష్టిని ఆకర్షించాయి. ఎవరి నోట విన్నా ఆ మాటే. ఆనాటి జనకుని సమస్య సీతకు తగిన వరాన్వేషణ.

సీతా వివాహం సామాన్యమైన విషయంగాదు. ఆమె వివాహం ఆనాడు యావద్భారతాన్ని ఆకర్షించిన రసవత్తర సన్నివేశం. జనకమహారాజు సీతా స్వయంవరం చాటించాడు. శివధనుర్భంగం చేసిన శక్తి సంపన్నునికే సీతనిచ్చి వివాహం చేస్తానన్నాడు.

అది సీతా స్వయంవర సభ. మిథిలానగర వైభవ ప్రభ. ఎటుచూచినా రంగురంగుల తోరణాలు. రాకుమారుల రథకేతనాలు. జవనాశ్వసమూహాలు. అందమైన అలంకారాలు.

ఎదుట ఎత్తైన వేదిక. వేదిక మీద మేరుపర్వతంలా ధనుస్సు. మహా శివ ధనుస్సు.

ప్రక్కనే జనక మహారాజు. ఆయన ప్రక్కనే సౌందర్యరాశి సీత. ఆమె

చేత అందాల పూలమాల. ఒకవైపు పురోహితులు. మరోవైపు మునిశ్రేష్ఠులు. ఇంకో వైపు మంత్రులు. వేరోవైపు సామంతులు.

వేదిక ముందు రాకుమారులు బారులుదీరి కూర్చున్నారు. సమున్నత వక్షస్థలాలతో, మిసమిసలాడే మీసాలతో, విశాల ఫాలభాగాలతో. ధగద్ధగాయమాన కిరీటాలతో, మొనలెత్తిన వీర స్వరూపాల్లా ఉన్నారు. అందరూ చూస్తున్నారు. వారి చూపు ఒకసారి శివ ధనుస్సు మీద. మరోసారి సీతమ్మ చేతి పూదండ మీద. కొందరు కదిలి కూర్చున్నారు. కొందరు లేచి కూర్చున్నారు. మరికొందరు ముందుకు నడిచి కూర్చున్నారు. ఇంక కొందరు వేదిక మీదికి వెళ్ళవచ్చు చూస్తు న్నారు. అందులో కొందరు ధనుస్సును చూచి వచ్చారు. మరికొందరు తాకి వచ్చారు. ఇంక కొందరు కదలించి వచ్చారు అంతేగాని ఎవ్వరూ దాన్ని ఎక్కు పెట్టలేదు. ముక్కలు చెయ్యలేదు.

జనకమహారాజు సమస్య ఎలా తీరాలో ! జానకి వివాహం ఎలా జరగాలో! సభ నిండా ఒక నిస్సహాయత, నిశ్శబ్దత.

అప్పుడు లేచాడు వెలుగు కిరణంలా విశ్వామిత్ర మహర్షి ప్రక్కనుండి ఒక యువకుడు. అజానుబాహుడు; అరవింద నేత్రుడు; నీలమేఘశ్యాముడు; నూనూగు మీసాల నూత్నయౌవనుడు. సవినయంగా గురువుకు నమస్కరించాడు. విశ్వామిత్ర మహర్షి అల్లన తల ఆడించాడు. శిష్యుడు చిరునవ్వుతో అడుగు ముందుకు వేశాడు. అందరి చూపులూ ఆ యువకుని మీదే. జనకుని చూపుల్లో ఆశలు కొనలు సాగాయి. సీతమ్మ చూపుల్లో నునుసిగ్గు సింగారాలు మొగ్గ తొడిగాయి. యువకుడు ఎకాయెకి వేదిక యెక్కాడు. విల్లెక్కు పెట్టాడు. అది ఫెళ్ళుమని విరిగింది. ఎటుచూచినా ఆశ్చర్యం, ఆనందం; హర్షధ్వానాలు.

ఆ హర్షధ్వానాల మధ్యనే సీత చేతి పూలదండ ఆ రాముని మెడ నలంకరించింది.

జనకమహారాజు తృప్తిగా ఒక్క ఊర్పు విడిచాడు.

అది మిథిలానగరం రాజభవనం, సీతారాముల కల్యాణ మంటపం. తెల్లని వస్త్రాలతో వెన్నెల పరచినట్లు పెళ్లి పందిరి. రంగురంగుల మణిదీపాలు. రత్నాలంకారాలు, ముత్యాల ముగ్గులు, అరటి స్తంభాలు, మామిడాకుల తోరణాలు, వివిధ

లరా విన్యాసాలు, మనోహర పుష్ప పరిమళాలు, పాల సముద్రం లేచి వచ్చి నట్లుంది. తారా మండలం దిగివచ్చినట్లుంది. మానస సరోవరం ముందుకు సాగి నట్లుంది. నందనోద్యానం నడచివచ్చినట్లుంది.

పెళ్ళి పీటల మీద సీతారాములు, ప్రక్కనే వారి తల్లిదండ్రులు, ఇటు శతా నందుడు, అటు వసిష్ఠుడు. ఆ తరువాత తక్కిన పురోహితులు; బంధుమిత్రులు, మంత్రి సామంతులు; పౌర జానపదులు; అశేష ప్రజానీకం. అన్ని లోకాలు ఏకమై వచ్చినట్లుంది.

సీతమ్మ బుగ్గన సిగ్గు చూడండని గుసగుసలాడుకొనేవారు కొందరు. రామయ్య ముఖాన రాజసం చూడండని మెచ్చుకొనేవారు మరికొందరు. అంతా ఆ జనకరాజు అదృష్టం అని అనుకొనేవారు ఇంక కొందరు.

మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి. హోమధూమాలు మీదికి సాగు తున్నాయి. వేదమంత్రాలు ప్రతిధ్వనిస్తున్నాయి.

మహాప్రవర ముగిసింది. మాంగల్యధారణ జరిగింది. తరువాతి కార్యక్రమం తలంబ్రాలు. అది అందరికి ఎంతో ఆకర్షకమైన అంశం. సీతమ్మ దోసిట ముత్యాలు తీసుకుంది. అవి ఆమె అరచేతి చిగురాకు రంగో ; అంతరంగంలోని అనురాగాల పొంగో ; ఆ ముత్యాలు పద్మరాగాల్లా అగుపిస్తున్నాయి.

ముసిముసి నవ్వులు నవ్వుతూనే గడుసరి సీతమ్మ గబగబా ముత్యాలు పోసింది. రామయ్య తలమీద అవి మల్లెపువ్వుల్లా మెరుస్తున్నాయి. అందుకు కారణం ఆ సీతమ్మ తెలినవ్వు దొంతరలో రామయ్య నల్లని కురులలో, జారిపడుతుంటే ఆ తెల్లటి ముత్యాలు ఇంద్రనీలాల్లా అగుపిస్తున్నాయి. అందుకు కారణం ఆ సీతమ్మ కాటుక కళ్ళో. లేక ఈ రామయ్య నల్లనికళ్ళో.

తలంబ్రాల సంబరంలో అందరు తల మునకలయ్యారు. తరించినట్లు భావించారు.

ఆ తరువాత అంపకాలు. అవే అందరి కళ్ళకు అశ్రుజలపాతాలు, పొంగి పొరలే కరుణరస ప్రవాహాలు. జనకుడు కన్నీళ్ళు తుడుచుకుంటూ, గద్గద స్వరంతో 'ఈ సుకుమారి సీతమ్మ నా పుత్రి ఇకనుంచి శ్రీరామా ! నీకు ధర్మపత్ని. ఈమె

పాణిని పరిగ్రహించు. అన్ని జీవిత సుఖాలు అనుభవించు' అని సీతాదేవి చేతిని శ్రీరామునికి అందివ్వగానే అందరి కళ్ళూ ఒక్కుమ్మడిగా చెమ్మగిల్లాయి. కరుణ రసం కాలువలు గట్టి ప్రవహించింది.

మిథిల మొత్తం ఆ కరుణరసంలో కొంతసేపు మునిగితేలింది. సీతారాముల వివాహం శోభాయమానంగా ముగిసింది. రావణ సంహారానికి, జగత్కల్యాణానికి నాంది జరిగింది.

సీతమ్మ మిథిల వదలింది. అత్తవారింట అడుగు పెట్టింది. ఆమె జీవితం క్రొత్త మలుపు తిరిగింది.

అయితే సీతాదేవి జీవితంలో అన్నీ చిత్రమైన మలుపులే. నాటకీయ పరిణామాలే. విషమ పరీక్షలే. అత్తవారింట్లో దశరథ మహారాజు పెద్ద కోడలుగా, శ్రీరామచంద్రుని అర్థాంగిగా ఆమె ఏయే భోగాలు అనుభవించాలనుకుందో! ఎంతగా ఆనందించాలనుకుందో! దశరథుడు రాముని యౌవరాజ్యాభిషేకాన్ని గూడ నిర్ణయించాడు. భర్త యువరాజు కాబోతున్నాడు. తాను కోసల రాజ్య పట్టమహిషి కాబోతున్నది. జీవితంలో సీతకు ఇంతకంటె ఏం కావాలి.

వసిష్ఠమహర్షి ఆదేశానుసారం ఆమె ముందురోజు ఉపవాసవ్రతం పాటించింది. ఆరోజు ఉషఃకాలాన్నే లేచింది. శిరస్నానం చేసింది. పూజాదికాలు పూర్తి చేసింది. పట్టు వస్త్రాలు ధరించి పట్టాభిషేకానికి సిద్ధంగా ఉంది. ఇక రాముడు రావటమే ఆలస్యం.

రాముడు ఎంతకూ రాడు. పుష్యమీ నక్షత్రం పరుగెత్తి వస్తూఉంది. అయినా రాముడు రాడు. ఎందు చేతనో! ఏమో!

సీత అంతఃపురంలో అటూ ఇటూ తిరిగింది. ఆమె మనస్సు ఆందోళనగా ఉంది. ముహూర్తం దాటిపోతూ ఉంది. రాముడు రాలేదు. ఎందుకో! ఏమో!

ఇలా ఆలోచిస్తూ ఉండగానే రాముడు వచ్చాడు. అయితే రాహుగ్రస్త చంద్రునిలా ఉన్నాడు. ఆయన ముఖంలో కళాకాంతుల్లేవు. విపరీతమైన వేదన కొట్టవచ్చినట్లు కన్పిస్తూ ఉంది. ఎందుకో! ఏమో!

సీత ఆశ్చర్యపోయింది. నిలువెల్ల కంపించిపోయింది. అడిగింది. అడిగింది.

భర్తను ఎన్నో ప్రశ్నలడిగింది. రాముడు ఒక మహాసౌధమధ్య స్తంభంలా నిలబడ్డాడు. మాటాడలేదు. ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో ఆయనకు తోచలేదు.

అయితే ఎంత సేపు ఆ మౌనం ?

ఆయన గొంతులో ఒకసారి గుటక మ్రింగుకొన్నాడు. కొండంత దుఃఖం కడుపులో ఇముడ్చుకొన్నాడు.

'సీతా ! కైక తండ్రిని రెండు వరాలు కోరింది – భరతునికి పట్టం గట్టమని, పద్నాలుగేళ్లు నన్ను అడవులకు పంపమని. నీతో చెప్పి వెళ్లుదామని వచ్చా. అమ్మ కౌసల్యను జాగ్రత్తగా చూడుకో. ఇక భరతు డందరికీ ప్రభువు. అతని ముందు నా విషయం ప్రస్తావించకు. నా గుణగణాలు ప్రశంసించకు. ప్రభుత్వం పరస్తుతిని సహించదు. నే వెళ్ళి వస్తా' అనేసరికి ఆమె కంటి వెంట కుండపోతగా నీళ్లు కారాయి.

ఒక్కసారిగా ఆమె దుఃఖాన్నంతా దిగమ్రింగుకొంది. ఎక్కడలేని ధైర్యాన్ని తెచ్చుకొంది. చేతులు సాచి –

'స్వామీ ! నేనూ మీ వెంటవస్తా. భర్త కష్టసుఖాల్లో భార్యకు భాగం ఉంది. ఇహపరలోకాల్లో మీరే నాకు గతి. అరణ్యంలో మీ కంటె ముందు నడుస్తూ మీ పాదాలకు దర్భలు గ్రుచ్చుకోకుండా మార్గం మెత్తగా ఉండేటట్లు చేస్తా. ఆడమనిషి అరణ్యం వస్తున్నదే అని సంశయించకండి. మీరు మహాపరాక్రమ శీలురు. నావంటి వాళ్ళు పదిమంది వెంట వచ్చినా మీరు రక్షణ కల్పించగలరు. అయోధ్యాభోగాల కంటె అడవుల్లో మీ వెంట ఉండటమే నా కెంతో ఇష్టం' – అనేసరికి రాముడు అరణ్యవాసం ఎంత భయంకరమో, ఎంత బాధాకరమో వివరించి చెప్పాడు. ఆమెను వారించటానికి అనేక విధాల ప్రయత్నించాడు.

అయినా సీత వినలేదు. పైగా పుట్టింట ఉండగానే జ్యోతిష్కులు, సాముద్రిక శాస్త్రజ్ఞులు అరణ్యవాసం తనకు తప్పదని చెప్పారని, అందుచేత మానసికంగా అందుకు సిద్ధంగానే ఉన్నాననీ, – వనవాసమైనా, స్వర్గవాసమైనా భర్తతో కలిసి అనుభవించటమే తన అభిమతమని, అన్ని ధర్మాలు తెలిసిన మీకు పాతివ్రత్యం ధర్మం తెలియదా అని, పాతివ్రత్య ధర్మం నుండి స్త్రీని మరలించే ప్రయత్నం చెయ్యటం మీ వంటివారు చెయ్యదగునా అని రామునికి ఊపిరాడకుండా అడిగింది.

ఆయనను మానసికంగా గెలిచింది. అరణ్యవాసానికి అనుమతి సాధించింది. పతిని అనుసరించింది.

సీత తార్కిక ప్రజ్ఞకు, పాతివ్రత్యభావనకు ఈ ఘట్టం ఒక పతాక. కాగా సీత ఇంకోసారి కూడ భర్త ఎదుట తన తార్కిక ప్రజ్ఞ ప్రదర్శించింది ఆయన అంగీకరించకపోయినా తన వాదాన్ని గొప్పగా ప్రస్తరించింది.

అది శరభంగ మహాముని ఆశ్రమం. మునులంతా రాముని చెంత చేరి రాక్షసుల వల్ల కలిగే బాధలు వెళ్ళబోసుకున్నారు. తమకు రక్షణ కల్పించమని వేడుకొన్నారు. రాముడు వాళ్ళందరికి అభయ హస్తమిచ్చాడు. రాక్షసులనంతా సంహరిస్తానని మాట ఇచ్చాడు. సుతీక్ష్ణమహాముని ఆశ్రమానికి బయలుదేరాడు. త్రోవలో సీతమ్మ రామునితో సుదీర్ఘ వాదానికి దిగింది.

'స్వామీ! మానవునికి కామజవ్యసనాలు మూడు. అనృతభాషణం, పరదారాభిగమనం, వైరం వినారౌద్రం. ఇందులో మిగత రెండూ మొదటి దానికంటె బలీయాలు. మీరు అనృతభాషణులెన్నటికీ కారు. పైగా పరస్త్రీ పరాఙ్ముఖులు. అయితే ఇప్పుడు మీది అకారణ వైరంతో కూడిన రౌద్రం. అదొక పెద్ద వ్యసనం. మహర్షులు అడుగగానే దండకారణ్యంలో ఉండే రాక్షసులనంతా సంహరిస్తానని మాట ఇచ్చారు. అది మంచిదిగాదు. మీ చేతి ధనుస్సు ఆ ప్రతిజ్ఞకు ఎక్కువగా దోహదం చేసినట్లుంది. సమిధలు సమీపంలో ఉంటే అగ్నిహోత్రం ఎలా విజృంభిస్తుందో ఆయుధం చేతుల్లో ఉంటే క్షత్రియ తేజం అలా పెల్లుబుకుతుంది. ఆయుధ సంపర్కం అగ్ని సంపర్కం ఒకటే అంటారు పెద్దలు. రాక్షసులు మీ పట్ల ఏ అపరాధం చెయ్యలేదు, అకారణంగా వారినంతా మీరు సంహరించడం ఒక పెద్ద హింస అవుతుంది. ఎందుకో నా మనస్సు అందుకు అంగీకరించటంలేదు. క్షత్రియుని చేతి ధనుస్సు సాధువులకు రక్షణ కల్పించవలసిందే ఏ రాక్షసుడైనా మీరు చూస్తుండగా ఒక్క మహర్షిని బాధిస్తేవాణ్ణి హతమార్చండి. అంతేగాని పనిగట్టుకొని రాక్షసులనంతా చంపుతాననటం ధర్మంగాదు. అయినా వనవాసంలో మీకీ ఆయుధాలెందుకు చెప్పండి. మనం నారచీరలు కట్టుకొన్నాము, తాపస దీక్ష వహించాము తపస్సు చేసుకొందాము, పద్నాలుగేళ్ళు పూర్తికాగానే అయోధ్యకు వెళ్లుదాము. అప్పుడు మీరు ధనుస్సు చేపట్టి క్షత్ర ధర్మాన్ని స్వీకరించవచ్చు. అంతేగాని ఇప్పుడెందుకండీ! ఈ ధనుర్బాణాలు. ఇవి చేత ఉంటే హింస మీదికి మనస్సుపోతుంది. అందుచేత ఇవి వద

లండి. ప్రశాంతంగా ఎక్కడో కూర్చుని తపస్సు చేసుకొందాము. అన్ని విధాల మనకిప్పుడు తగింది తాపస ధర్మం. నన్ను అపార్థం చేసుకోకండి. నా మీద ఆగ్రహించకండి. మీ మీది స్నేహ గౌరవాలతో ఈ మాటలు చెప్పానేగాని అహంకారంతో కాదు. అయినా మీకు నేను ధర్మాన్ని గూర్చి చెప్పేటంతదాన్నా. ఏదో స్త్రీ చాపల్యంతో చెప్పాను. సర్వము మీకు తెలుసు. అందులోను ధర్మాన్ని గూర్చి మీకు చెప్పగలవారెవరు ?' అని సీత అంది.

రాముడు చిరునవ్వు నవ్వాడు. 'సీతా నీవు చెప్పిందంతా నిజం. అది నీ సంస్కారానికి నిదర్శనం. శరణాగత రక్షణ నా జీవిత లక్ష్యం' అన్నాడు.

అరణ్యవాసంలో సీతాదేవి అనుభవాలు అనేకాలు. ఆమె చిత్రకూట శోభ చూచింది. మందాకినీ సౌందర్యం చూచింది. మున్యాశ్రమాల పవిత్రత దర్శించింది. అనసూయాదేవి ఆదరాభిమానాలు పొందింది. ఆమె యిచ్చిన దివ్యాంగరాగమాలికా వస్త్రాభరణాలు స్వీకరించింది. విరాధుని రాక్షసత్వాన్ని చూచింది. శరభంగ సుతీక్ష్ణ సుదర్శన మహామునుల ఆశ్రమాలు సందర్శించింది.

పంచాప్సర సరోవరాన్ని గూర్చి వినింది. అగస్త్యమహాముని ప్రశంసలు పొందింది. గోదావరీ నీట స్నానమాడింది. పంచవటీ పర్ణశాల ప్రవేశించింది. శూర్పణఖ కాముకతను, కామరూపాన్ని తిలకించింది. రాముని ఖరదూషణ సంహారాన్ని కన్నారగాంచింది.

సీతాదేవి జీవితంలో ఆదొక దుర్దినం. ఆరోజు ఉదయం శిరస్నానం చేసి పూజకు పూలు కోయాలని ఆశ్రమం ప్రక్కనున్న పూలమొక్కల దగ్గరకు పోగానే ఒక అపూర్వ మృగం - కాంచన మృగం - కన్పించింది. అది అల్లంత దూరంలో మేస్తూ ఉంది. దాని అందం అతిలోకం. అద్భుతం. సీత ససంభ్రమంగా భర్తను పిలిచింది, ఆ మృగాన్ని చూపింది. అది తనకు కావాలని అడిగింది. రాముడు అదెంత పని అన్నాడు. లక్ష్మణుడు అది మాయామృగమన్నాడు. మారీచుడే ఆ మృగరూపం ధరించాడన్నాడు. అయినా సీత వినలేదు. రాముడు ఆగలేదు. 'మృగమైతే మీ వదినెకు తెచ్చియిస్తా. మారీచుడైతే మట్టుపెట్టివస్తా. నీ వామెకు రక్షగా ఉండు' అని రాముడు బయలుదేరాడు. ఆ మృగాన్ని వెంబడించాడు. పట్టుకోవాలని ప్రయత్నించాడు. ఎట్టకేలకు అది రాక్షస మాయ అని తెలుసుకొన్నాడు. విల్లెక్కుపెట్టి దాన్ని కొట్టాడు. వాడు నిజంగా మారీచుడే. హా ! సీతా ! హా ! లక్ష్మణా ,

అంటూ వాడు స్వరం మార్చి రామునిలా అరిచి చచ్చాడు. సీత ఆ అరుపు విన్నది. ఆయనకు సాయంగా లక్ష్మణుని పొమ్మన్నది. లక్ష్మణుడు అది రాక్షస మాయ అన్నాడు. అన్నకు ఏ ప్రమాదమూ లేదన్నాడు. రాదన్నాడు.

సీత ఆవేశపడింది. ఆవేదనపడింది. ఆగ్రహపడింది. లక్ష్మణుని అనరాని మాటలంది. నీవు మోసగాడివంది. క్రూరబుద్ధివంది. రాముడికి శత్రువివంది. చివరకు నన్ను కామిస్తున్నావని గూడ అంది. అందుచేతనే నీవు అన్నకు సాయంగా వెళ్ళటం లేదంది. ఆయన మరణించినా నేను నీకు దక్కనంది.

సీత లక్ష్మణుని సౌశీల్యం తెలియని వ్యక్తి గాదు. లక్ష్మణుడు కామిస్తున్నాడను కొనేంత దుర్మార్గురాలుగాదు. అయినా ఆమె అనరాని మాటలంది. అంతంత మాట లంది. అందుకు కారణం ఆమె ఆవేశం, ఆవేదన, ఆగ్రహం. భర్తకేమైందో అన్న భయం. ఆ మాటలంటేగాని లక్ష్మణుడు తన్ను వదలి వెళ్ళడన్న ఆలోచన. అంతే.

సీతది అప్పుడొక దిక్కుతోచని స్థితి. దీనాతిదీనస్థితి. పర్ణశాలలో ఉన్న భర్తను పిలిచింది తాను. జింక వెంట పొమ్మని పంపింది తాను. ఆయన కేదైనా ప్రమాదం జరిగితే ? పైగా ఆయన కేకపెట్టాడు. అది చావుకేక. సహాయం కొరకు పెట్టే చివరికేక. అయినా లక్ష్మణుడు వినిపించుకోడు. అదేమంటే ఆయనకు ప్రమాదం లేదంటాడు. రాదంటాడు. తన ఆందోళనను అర్థం చేసుకోడు. తన భయాన్ని పట్టించుకోడు. పెద్ద బండలా నిలబడతాడు. అండగా ఉంటానంటాడు. అంతా రాక్షస మాయఅంటాడు. అతనిని కదిలించటం ఎలాగ ? అన్నకు సాయంగా పంపటం ఎలాగ ? అందుకే సీత ఆ మాటలంది. అంతంత మాటలంది. కడుపుబ్బ ఏడ్చు కొంది. కన్నీళ్ళు రాల్చింది. ఆడవారి అమాయకత్వమంతా వెళ్ళబోసింది.

లక్ష్మణుడు కటకటలాడాడు. కన్నీళ్ళు రాల్చాడు. ఆమెను వదలి అన్నకు సాయంగా వెళ్ళాడు.

అంతటి అంతఃపుర భోగాలే వదలుకొని అడవులకు వచ్చిన సీతకు ఆ కాంచన మృగం మీద ఎందుకంత కాంక్ష కలిగిందో !

ఎవ్వరినీ పల్లెత్తుమాట అనని ఆ సాధుశీల ఆనాడు లక్ష్మణుని అన్ని మాట లెందుకు అందో !

అంతా విధి వైపరీత్యం.

లక్ష్మణుడు వెళ్ళాడు. సీత ఆశ్రమంలో ఒంటరిగా ఉంది. ఇదే సమయమను కొని సన్యాసి వేషంలో రావణుడు వచ్చాడు. సన్నని కావివస్త్రం, జడలుగట్టిన జుట్టు, చేత ఛత్రం, కాళ్ళ పాదుకలు, భుజాన దండం, మరోచేత కమండలం, నొసట విభూతి రేఖలు, పై పెచ్చు వేద పఠనం.

సీత అతనిని బ్రాహ్మణ సన్యాసిగా భ్రమించింది. భక్తితో ఆహ్వానించింది. ఆసనం వేసింది. అర్ఘ్యపాద్యాలిచ్చింది. అన్నం వడ్డించింది. అడిగిన ప్రశ్నలన్నిం టికీ సమాధానం చెప్పింది.

అయితే ఆ సన్న్యాసి ధోరణి ఆశ్చర్యకరంగా ఉంది. ఆమె అందాన్ని చూస్తున్నాడు. ఆ అందాన్ని కామ దృష్టితో వర్ణిస్తున్నాడు.

సీత చాల దూరం సహించింది. చివరకాతడు బయటపడ్డాడు. తాను రావణుడి నన్నాడు. లంకాధిపతినన్నాడు. తన్ను చేపట్టి సర్వసుఖాలు అనుభవించమన్నాడు.

సీత భయపడింది. బాధపడింది. కోప పడింది. రావణుని దూషించింది. రాముని గుణగణాలు వివరించింది; బలపరాక్రమాలు ప్రశంసించింది. తమ ప్రేమైక దాంపత్యాన్ని తెలియచెప్పింది.

అయినా రావణుడు వినలేదు. తన ప్రయత్నాన్ని విరమించలేదు. ఆత్మ ప్రశంస ఆపలేదు. రామ నింద మానలేదు.

సీత మేనంతా నిప్పులు చెరిగినట్లుంది.

'రావణా ! రామపత్నిని నీవు కోరుతున్నావు. పతివ్రతనైన నన్నపహరిం చాలని ప్రయత్నిస్తున్నావు. ఇది మెడను రాయి గట్టుకొని సముద్రంలో దూకటం. మంచి నిప్పును గుడ్డలో దాచటం. మందర పర్వతాన్ని చేతులతో ఎత్తటం. కాల కూటాన్ని గటగటా త్రాగటం. ఒక సూగ పట్టువీసుతూ వజ్రాన్ని మ్రింగటం, ఆలో చించు. ఆ రాముడెక్కడ ! నీ వెక్కడ ! సింహానికి నక్కకు, సముద్రానికి చిరు చెలమకు, మదేభానికి మార్జాలానికి, గరుత్మంతునికి వాయసానికి, ఎంత భేదముందో ఆ రామునికి నీకు అంతభేదం ఉంది. అన్యాయంగా చెడిపోకు. ఆయన బాణాలకు బలికాకు' — అనగానే రావణుడు రెచ్చిపోయాడు. చేతులు అప్పళించాడు. నిజ

రూపం ధరించాడు. ఎడమచేత ఆమె జుట్టు పట్టుకొన్నాడు. కుడిచేత ఆమె తొడలు పట్టుకొన్నాడు. ఎత్తి రథంలో కూర్చుండ బెట్టుకొన్నాడు. ఒక్క ఊపున ఆకాశాని కెగిరాడు.

సీత భయంతో బాధతో పెద్దగా పెనగులాడింది. బిగ్గరగా అరిచింది. తన్ను రక్షించమని రాముని పిలిచింది. తన అపహరణ వార్త ఆ రామునితో చెప్పమని వృక్షాల నడిగింది. ప్రస్రవణ పర్వతాన్ని ప్రార్థించింది. గోదావరీ నదిని కోరింది. మృగాలను, పక్షులను పరిపరి విధాల అర్థించింది.

అన్నీ మౌనం వహించాయి. అంతా మౌనం వహించారు. ఆ రావణుడంటే అంత భయం. చివరకు జటాయువు సీతను చూచాడు. రావణుని అడ్డగించాడు. ఆమెను రక్షించటానికి అనేక విధాల ప్రయత్నించాడు. భయంకర పోరాటం గూడ సాగించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. రావణుడు జటాయువు రెక్కలు నరికాడు. కాళ్ళు త్రుంచాడు. ఆకాశ మార్గాన ఎగిరిపోయాడు.

సీత దుఃఖాన్ని చూచి గాలికి ఊగే కొమ్మలతో చెట్లన్నీ ఆమెకు ధైర్యం చెప్పాయట. పర్వతాలన్నీ సెలయేటి నీటి ప్రవాహాలుగా కన్నీళ్ళు కార్చాయట. తామర కొలనులన్నీ కాంతి విహీనాలై కంట తడిపెట్టాయట. మృగాలు మేతమాని అశ్రు బిందువులు రాలుస్తూ అశ్రులెత్తి నిలిచాయట. కాని ఏం లాభం. అవి కంట తడి పెట్టగలవేమోగాని గొంతు విప్పలేవు. రావణుని ఎదిరించలేవు. సీతను రక్షించ లేవు.

సీత పరిపరి విధాల శోకించింది. పెద్ద దూరం రావణుని నిందించింది. పర దారావహరణం నీ ప్రాణాంతకమని హెచ్చరించింది. కాని ప్రయోజనం ?

అంత దుఃఖంలో - రావణుని రథంలో ఉండే - ఆమె ఎలాగో తన ఆభర ణాలు కొన్ని మూటగట్టింది. రావణుడు ఏ ధోరణిలో ఉన్నాడో - ఆమె ఆమూటను ఒక కొండ మీద కోతుల మధ్య జార విడిచింది. ఆ కోతులైనా రామునికి తనజాడ చెపుతాయని సీత ఆశ.

రావణుడు సీతను లంకకు చేర్చాడు. కొంతకాలం అంతఃపురంలోనే ఉంచాడు. పెక్కుమంది రాక్షస స్త్రీలను ఆమె సేవకు నియోగించాడు. ఆ తరువాత ఆమెను అశోకవనంలో ఉంచాడు.

అయోధ్యలో ఉండవలసిన సీత భర్తవెంట అరణ్యాలకు వచ్చింది. భర్త వెంట అరణ్యాల్లో ఉండవలసిన సీత రావణుని అశోకవనంలో బందీ అయింది. మనుషుల మధ్య, మహర్షుల మధ్య మసలవలసిన మహాభయంకర రాక్షసుల మధ్య పచ్చిపడింది. విధి విధానాలు విచిత్రాలు !

సీత జీవితంలో మానసిక నరకయాతన ఆరంభమైంది. ఆమె చుట్టూ రాక్షస స్త్రీలే. రావణుని బలపరాక్రమాలు వర్ణించేవారు కొందరు. భయపెట్టి రావణుని వరించమనేవారు మరి కొందరు. ప్రలోభాలు కల్పించి రావణునివైపు మనస్సు మళ్ళించమనేవాళ్ళు ఇంక కొందరు. మధ్య మధ్య రావణుడు - అతని కామ ప్రలాపాలు, భర్తకు దూరంగా ఈ వాతావరణంలో ఒక పతివ్రత ఎలా బ్రతకాలి. పైగా ఆమె ఎక్కడ ఉన్నది భర్తకు తెలియదు. భర్త ఎప్పుడు వచ్చేది ఆమెకు తెలియదు.

అయినా సీత అలాగే బ్రతికింది. రాముడు రాగలడన్న ఆశతోనే బ్రతికింది. ఆ రావణుని చంపి తన్ను స్వీకరింపగలడన్న ధైర్యంతోనే బ్రతికింది. సీత ఆత్మ విశ్వాసం అమోఘం. భర్త బలపరాక్రమాల మీద, ధర్మ విజయం మీద, అధర్మ నాశన మీద ఆమెకున్న నమ్మకం అపారం, అయితే అక్కడున్న ప్రతిక్షణం ఆమె పాలిటికి ఒక యుగం. సీత అలాగే కాలాన్ని గడిపింది. ఆ నరకయాతన అలాగే అనుభవించింది.

ఆనాడు రావణుడు లెస్సగా అలంకరించుకొన్నాడు. సీత సంగతి అటో ఇటో తేల్చుకోవాలని తరలివచ్చాడు. ఆమె కృశించి ఉంది. విసిగివేసారి ఉంది. దిక్కుతోచక దీనస్థితిలో ఉంది. ఆ స్థితిలో సీత అసత్యాపవాదంచే చెడిన కీర్తిలా ఉందట. అవ్యృత్తిలేక మరపు కలిగిన వేదవిద్యలా ఉందట. మంచుచే కాంతి తరిగిన పద్మంలా ఉందట. అపవిత్రులు స్పృశించిన యజ్ఞవేదికలా ఉందట. అంజలి ఘటించి పతిదేవుని ప్రార్థనలో ఉందట.

రావణుడు తన కోరికను వ్యక్తం చేశాడు. తన బలపరాక్రమాలను, అధికార ఐశ్వర్యాలను వివరించాడు. తన్ను చేపట్టి అన్ని సుఖాలు అనుభవించమని అర్థించాడు.

సీత ఒక గడ్డిపరకను అడ్డంగా ఉంచి రావణునితో మాట్లాడింది. అంపటి రావణుని ఆమె గడ్డిపరకగా ఎంచిందో లేక అది పతివ్రత పరపురుషునితో సంభాషించే సంప్రదాయమో ।

'రావణా ! నీ కోర్కె విరమించు. నీ మనస్సు నీ భార్యల మీదికి మరలించు. నేను రామపత్నిని. పతివ్రతను. నీకు దక్కను. నీ భార్యలను ఇతరులు బలాత్కరిస్తే నీవు సహిస్తావా ? ఆలోచించు, ధర్మాన్ని అవలంబించు. పందారాగమనం ఆయురైశ్వర్యనాశకం. నన్ను రామునికి అప్పగించి ఆ మహామహుని శరణువేడు. నీవు బంధు మిత్రులతో సుఖంగా జీవిస్తావు. లేకుంటే నీవు సర్వనాశనమౌతావు. కళకళలాడే నీ లంక కాటి బూడిదలా మారిపోతుంది. రామబాణం ఎంత తీవ్రమో నీకు తెలియదు. ఇంద్రుని వజ్రాయుధమైనా వ్యర్థమౌతుందేమోకాని రామబాణం నిన్ను, నీ లంకను నిలువున దహిస్తుంది. పరిస్థితులు విషమించకుండా నన్ను నా భర్తకు అప్పగించి క్షమాపణ చెప్పుకో' అనగానే రావణుడు పటపట పళ్ళు గొరికాడు. ఎంత చెప్పినా నీ మనస్సు మారటం లేదన్నాడు. ఇక రెండు మాసాలు మాత్రమే నీకు గడువిస్తున్నానన్నాడు. ఆవల నీవు నాతో పవ్వళించాలన్నాడు. లేకుంటే నా ప్రాతఃకాల భోజనానికి బలి అవుతావన్నాడు.

ఆ మాటలకు సీత చెవులు మూసుకొంది. రావణుని చురచుర చూచింది. 'దుర్మార్గుడా ! నీవు నా చూపుకు బూడిద కావలసిందే. అయితే రామాజ్ఞలేదు. అందుకే బ్రతికిపోయావు. అంత బలవంతుడివే అయితే రాముడు లేనపుడు నన్నెందుకు దొంగిలించావు. పిరికిపందా !' అనేసరికి రావణుడు మండిపడ్డాడు. మహాసర్పంలా బుసలుకొట్టాడు. ప్రక్కనున్న రాక్షస స్త్రీలతో శీఘ్రమే సీత మనస్సు మార్చండన్నాడు. సామదాన భేద దండోపాయాలు ప్రయోగించండన్నాడు. ధాన్యమాలి ప్రార్థనతో ఒక్క ఉదుటున అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

అంతదాక సీతకు రావణుని గోల. ఆ తర్వాత రాక్షస స్త్రీల గోల. ఆమెకు దిక్కుతోచలేదు. దుఃఖం పొంగిపొరలుతున్నది. నిప్పుల్లో కూర్చున్నట్లున్నది. రాముడింకా రాలేదు. ఎక్కడున్నాడో ! ఎప్పుడు వస్తాడో ! ఆయన జాడ తెలియలేదు. నిరాశా నిస్పృహలు సీతను ఆవరిస్తున్నాయి. ఎంతకాలం ఈ బాధ ? ఎంతవరకు ఈ ఓర్పు ? పతివ్రతకు ఈ బ్రతుకెందుకు ?

అందుకే సీత శింశుపా వృక్షాన్ని చేరింది. జడను మెడకు చుట్టుకొని చెట్టు కొమ్మను చేత వంచి ఉరిపోసుకొని ఊపిరి విడువటానికి నిశ్చయించింది. ఇంతలో ఆమె ఎడమ కన్నదిరింది. చేప ఊపిన కమలంలా కదిలింది. ఎడమ భుజంకూడ కంపించింది. ఎందుచేతనో మీది వస్త్రం గూడ జారిపడింది. అన్నీ శుభశకునాలే. అయినా సీత ఆత్మహత్యా ప్రయత్నం మానలేదు. అంతలోనే చెట్టు మీద నుంచి రామనామం వినిపించింది. రామకథ మనోహరంగా చెవి సోకింది. వెన్నెల కురిసినట్లుంది. ఎంతో ఆశ్చర్యకరంగా ఉంది. లంకలో రామ నామమా !

సీత తలయెత్తి చూచింది. కోతి. ఒక చిన్న కోతి. ఎంతో కాంతివంతంగా ఉన్న కోతి. సీత ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె కొయ్యబారిపోయింది. కొంత సేపటికి తేరుకొంది. ఇంతలో కోతి క్రిందికిదూకింది. చేతులు జోడించి తాను హనుమనని రామదూతనని సీత యెదుట నిలబడింది. శ్రీరాముని వృత్తాంతం చెప్పింది.

అయినా సీతకు అనుమానమే. కామరూపుడైన రావణుడే కోతిగా మారి వచ్చాడేమో ? తన మనస్సును మార్చటానికి ఈ మారు ఈ రూపం ధరించాడేమో? కాకుంటే ఒక కోతి రామదూత కావటమేమిటి ? అంతటి సముద్రాన్ని లంఘించటమేమిటి ? లంకకు రావటమేమిటి ? తన్ను చూడటమేమిటి? ఎలా నమ్మటం ?

హనుమంతుడు గూడ ఆమె అనుమానాన్ని పసిగట్టాడు. రాముని రూపురేఖలను, ఆయన గుణవిశేషాలను కంటికి కట్టినట్లు వర్ణించాడు. రామసుగ్రీవ సఖ్యాన్ని చెప్పాడు. ఆమె ఆభరణాల మూటను రాముని కిచ్చిన వైనం విన్నవించాడు. రాముని విరహాన్ని, సీతాన్వేషణ ప్రయత్నాన్ని వివరించాడు. రాము డిచ్చిన ముద్రికను చేతి కందించాడు

సీత ఆనందానికి అంతులేదు. ఎక్కడో చీకటి కోనలో చిక్కుకొని జీవితంలో ఇక వెలుగే చూడలేనని నిరాశానిస్పృహలతో, భయాందోళనలతో, బ్రదుకు మీద ఆశవదులుకొన్న సీతకు రాముని చేయూత దొరికినట్లయింది. ఆస్థితిలో ఆ స్త్రీ మూర్తికి అంత కంటె ఏం కావాలి ?

సీత ముద్రికను కళ్ళకద్దుకొన్నది. రామలక్ష్మణులను గూర్చి ఎన్నెన్నో కుశల ప్రశ్నలు వేసింది. అనుక్షణం ఆ రామచంద్రుడు తన్నే స్మరిస్తున్నాడని విని ఎంతో మురిసిపోయింది. అనేక విధాల ఆ హనుమంతుని కొనియాడింది.

'అమ్మా! నీవు నా వీపు అధిరోహించు. అగ్నిహోత్రుడు హవిస్సును గొనిపోయి దేవేంద్రున కందించినట్లు ఇప్పుడే నిన్ను ఆకాశమార్గాన గొనిపోయి ఆ రామునికి అప్పగిస్తాను. ఆకాశమార్గాన రాక్షసు లెవ్వరు నన్నడ్డుకోలేరు. అదుగో ఇదుగో అనే లోగానే నీవు ఆ రామచంద్రుని చెంత ఉంటావు' అని హనుమ అనే సరికి సీత శరీరం గగుర్పొడిచింది. చిరునవ్వు నవ్వుతూ ఆమె 'హనుమా! నీ వింత చిన్న కోతివే అంత దూరం నన్నెలా తీసుకుపోతావు' అంది.

హనుమంతుడు మేను పెంచాడు. మేరు పర్వతంలా అగుపించాడు. అగ్ని హోత్రునిలా ప్రకాశించాడు.

సీత ఆశ్చర్యపోయింది. హనుమ బలపరాక్రమాలను, తేజోధైర్యాలను ప్రశంసించింది. అయినా అతని వెంట వెళ్ళటానికి ఆమె అంగీకరించలేదు. ఇంకొకరైతే ఎంతో సంతోషంగా వెళ్ళేవారేమో.

ఆమె 'హనుమా! నేను నీవెంట రావటం సరిగాదు. వాయువేగంతో నీవు ఎగిరిపోతుంటే 'ఆ వేగానికి ఓర్వలేక నేను క్రిందపడిపోవచ్చు. మరణించవచ్చు. నన్నుగొనిపోతుంటే రాక్షసులు ఊరకుంటారా ? నిన్ను వెంబడిస్తారు. ఇద్దరి ప్రాణాలకు ప్రమాదం కలిగిస్తారు. వీపున నేనుంటే రాక్షసులతో నీవు పోరాడటం గూడ కష్టమే. నన్నుదించి నీవు పోరాడితే వారు నన్ను బాధించవచ్చు. లేదా నా ప్రాణాలు తీయవచ్చు. లేదా పట్టి ఏ రహస్య ప్రదేశంలోనైనా బంధించవచ్చు. వీటిలో ఏది జరిగినా నీవు పడిన ఈ శ్రమ అంతా వ్యర్థమౌతుంది. పైగా నేను బ్రదుకకుంటే నా భర్త బ్రదుకడు.

అంతేగాదు. పరపురుషస్పర్శ నాకిష్టంలేదు. అందుచేత నీ వీపు ఎలా అధిరోహించేది ? అయితే అమ్మా నిన్ను రావణుడు స్పృశించలేదా అంటావేమో. అప్పుడు నాదొక అశక్తస్థితి; నిస్సహాయస్థితి.

నీవు రావటము, నన్ను చూడటము, నా భర్తృ వృత్తాంతం చెప్పటము, ఆయన ముద్రికను అందివ్వటము — ఎంతో ఆనందంగా ఉంది. నా రాముడే రావాలి. రావణుని చంపాలి; నన్ను స్వీకరించాలి'. అనేసరికి ఆంజనేయుడు చేతులు జోడించి నమస్కరించాడు. 'అమ్మా! నీ పాతివ్రత్యం, వివేకం అతిలోకం; అసదృశం. నిన్ను దర్శించినట్లు నా కేదైనా ఆనవాలు ఇవ్వు. అది రామునికిచ్చి నీ వృత్తాంతం వివరిస్తా' అని శిరస్సు వంచి సవినయంగా అర్థించాడు.

సీతాదేవి చిత్రకూటం మీద తాను, రాముడు ఏకాంతంగా విహరించేటప్పుడు జరిగిన వాయస వృత్తాంతం ఒక గుర్తుగా చెప్పింది. నన్ను ఒకింత గాయపరచిన ఆ వాయసం మీదనే బ్రహ్మాస్త్రం ప్రయోగించిన రాముడు ఇంతచేసిన ఈ రావణుని ఎందుకు ఉపేక్షిస్తున్నాడో అడుగమన్నది. ఒకనాడు మణిశిలను చేతరాచి రాముడు తన నుదుట తిలకం దిద్దిన వృత్తాంతాన్ని మరో గుర్తుగా చెప్పింది. మాసం లోపల రాముడు రాకుంటే తన మరణం తప్పదన్నది. వివాహసమయంలో తల్లి యిచ్చిన అపురూప చూడామణిని కొంగు ముడివిప్పి ఆనవాలుగా హనుమ చేతికిచ్చింది.

హనుమ ఆ చూడామణిని కళ్ళకద్దుకొన్నాడు. ఆమెకు సాష్టాంగ నమస్కారం చేశాడు. బయలుద్దేరాడు.

సీత కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

కొంత సేపటికి అశోకవనంలో పెద్ద అలజడి. కొమ్మలు విరిగిన శబ్దం. చెట్లుపడిన చప్పుడు. కావలివాండ్ర హాహాకారాలు. సీత ఆందోళనగా తలయెత్తి అటూ ఇటూ చూచింది. అంతా హనుమ పని. అతడు మందరపర్వతంలా విజృంభించాడు. మొత్తం వనాన్ని చెల్లాచెదరు చేస్తున్నాడు.

రాక్షస స్త్రీలు సీతను చుట్టుముట్టారు. అతడెవరో చెప్పమని బలవంతం పెట్టారు. సీత తనకేమీ తెలియదంది. అతడు గూడ ఒక రాక్షసుడేమో అంది. ఆ రాక్షస మాయలు మీకే తెలుసునంది.

కొంతసేపటికి అశోకవనంలో పెద్ద యుద్ధం. కింకరాది రాక్షసులు వానరుని చేతిలో హతమయ్యారని రాక్షస స్త్రీలు చెప్పుకొన్నారు. జంబుమాలి చచ్చాడని చెప్పుకొన్నారు. అక్షకుమారుడు అంతమొందాడని అనుకొన్నారు. సీత అంతరంగంలో ఎంతో సంతోషించింది. ఆ తరువాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం చేత ఆ వానరుని పట్టుకొన్నాడని, రావణుని కొలువు కూటానికిగొనిపోయాడని, వాడి పని ఇక ముగిసినట్లే అని, రాక్షస స్త్రీలు అనుకొన్నారు. సీత ఎంతో ఆందోళనపడింది. రావణుడు ఏం చేస్తాడో ? ఏమో ? హనుమ రాముని చేరకుంటే తన గతి ?

అంతలోనే లంక అంతా పెద్ద కోలాహలం. కోతి తోకకు నిప్పంటించారని, వీధులన్నీ త్రిప్పుతున్నారని, స్త్రీలు, వృద్ధులు, పిల్లలు అంతా చూచి ఆనందిస్తున్నారని కావలికాచే రాక్షస కాంతలే సీతకు చెప్పారు. ఆమె ఎంతో ఆవేదనపడింది.

అంతరంగంలో అగ్నిహోత్రుని ధ్యానించింది. ఆ హనుమంతుని చల్లగా చూడ
మని ప్రార్థించింది.

అంతలోనే లంక అంతా మిన్నుముట్టే మంటలు; రోదన ధ్వనులు. హాహాకా
రాలు. అది లంకా దహనం. అయినా సీత మనస్సు ఆందోళనగానే ఉంది. హనుమ
ఎలా ఉన్నాడో ! ఎక్కడున్నాడో ?

అంతలోనే హనుమ ఆమె ముందు వ్రాలాడు. 'అమ్మా ! నీవు సుఖంగా
ఉన్నావు గదా'. అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. తల్లి ఇక వెళ్తా. త్వరలోనే
అందరము వస్తాము. రాక్షసులను అంతం చేస్తాం. నీవు నిశ్చింతగా ఉండు' —
అని ఆకాశాని కెగిరాడు.

సీత కూడ గండం గడిచి బయటపడ్డట్లు ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది. అది
మొదలు అనుక్షణం ఆమె రాముని కొరకు ఎదురు చూస్తూనే ఉంది. ఆ రాముడు
ఎప్పుడు వస్తాడో ! రావణుని ఎప్పుడు వధిస్తాడో ! నన్నెప్పుడు స్వీకరిస్తాడో !
అదే సీత ఆలోచన.

ఒకనాడు అందంగా అలంకరించుకొని రావణుడు తారసిల్లాడు. 'సీతా ! మన
అడ్డు తొలగిపోయింది. రాముడు యుద్ధరంగంలో మరణించాడు. రాముడే గాదు -
లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు, అంతా
రాక్షసులచేత హతమయ్యారు. నీ మనస్సు మార్చుకో' అన్నాడు. 'విద్యుజ్జిహ్వా !
ఏదీ రాముని శిరస్సు, ధనుస్సు సీతకు చూపు' అన్నాడు.

సీత రాముని శిరస్సును ధనుస్సును చూచింది. కొండమీది నుండి క్రిందికి
దొర్లినట్లు మూర్ఛపోయింది. దుఃఖసాగరంలో మునిగింది. ఇక తనకు దిక్కెవరు ?
ఈ జన్మకు విముక్తిఎప్పుడు? ఇన్ని కష్టాలకు కారణం కైక. సీత అంత దుఃఖంలో
కైకను కొంతసేపు నిందించింది. అత్త కౌసల్య దుస్థితిని కొంతసేపు తలపోసింది.
తన దురదృష్టానికి కొంతసేపు గోడాడింది.

సీత దుఃఖాన్ని చూస్తూ రావణుడు అట్టె నిలబడిపోయాడు. అంతలోనే
ఒక రాక్షసుడు పరుగెత్తుకొంటూ వచ్చాడు. 'స్వామీ ! తక్షణం మీరు మంత్రాలోచ
నకు రావాలట. ప్రహస్తుడు మంత్రులతో కలిసి మీ కొరకు ఎదురుచూస్తున్నాడు.'
అనగానే రావణుడు హుటాహుటి అక్కడ నుండి వెళ్ళాడు.

ఏ ప్రమాదం ముంచుకొచ్చిందో !

రావణుడు వెళ్ళగానే రాముని శిరస్సు, ధనుస్సు రెండూ మాయమయ్యాయి.

అప్పుడు చెప్పింది సరమ 'సీతా ! అంతా మాయ' అని. 'అది రాముని శిరస్సు, ధనుస్సు కాద'ని. 'రాముడు ససైన్యంగా దండెత్తివచ్చాడు. దిక్కుతోచక రావణుడు పరుగెత్తాడు. అవిగో రణభేరీ మహాధ్వనులు. విను రాక్షస సైన్యాన్ని సమీకరిస్తున్నారు. యుద్ధానికి సన్నద్ధం చేస్తున్నారు. రాముడు జయిస్తాడు. ప్రియ మార నిన్ను స్వీకరిస్తాడు. ఏ మాత్రం చింతించవద్దు' అని సరమ చెప్పేసరికి సీతకు పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది. సంతోషం, కృతజ్ఞత తొణికిసలాడే నేత్రాలతో సీత సరమను చూచింది.

సరమ 'అమ్మా ! నీవు క్షేమంగా ఉన్నావని రామునితో చెప్పివస్తా. ఆకాశ మార్గాన ఎవ్వరికీ అగుపడకుండా వెళ్ళివస్తా' అనగానే సీత 'సరమా ! మొదట రావణుడేమి చేస్తున్నాడో చూడు. ఎందుకో నాకు భయంగా ఉంది. రాముడు దండెత్తి వచ్చాడని ఇతడు నాకు ప్రాణాపాయం కలిగిస్తాడేమో ! లేక ఎవ్వరికీ అగుపడకుండ ఇంకెక్కడైనా దాచి ఉంచుతాడేమో !' అంది.

సరమ వెంటనే వెళ్ళింది. విషయం తెలుసుకొని వచ్చింది. 'అమ్మా ! తల్లి కైకసి, అవిద్ధుడనే వృద్ధమంత్రి రావణునికి హితం చెప్పుతున్నారు. రామునికి నిన్ను అప్పగించమని అంటున్నారు. లేకుంటే రాక్షస నాశనం తప్పదంటున్నారు. రావణుడు మాత్రం ససేమిరా కాదంటున్నాడు. కంఠంలో ప్రాణం ఉండగా అది జరుగదంటున్నాడు. 'తల్లి ! రాక్షస నాశనం, రామ విజయం తప్పదు' — అని అంటూ ఉండగానే వాళ్ళకు వానరసేనా సింహనాదాలు వినిపించాయి.

రామదండు ముందుకు నడిచింది. సీత మేను పులకించింది. మహాయుద్ధం మొదలైంది.

ఒకరోజు పుష్పక విమానం అశోకవనానికి హఠాత్తుగా వచ్చింది. రాక్షస స్త్రీలంతా సీతను అందులో ఎక్కించారు. వారూ ఎక్కారు. అందులో త్రిజట కూడ ఉంది. విమానంలో వెళ్ళుతూ ఆ రాక్షస స్త్రీలంతా రకరకాల అలంకారాలతో, ఆనందోత్సాహాలతో అలరారుతున్న లంకాపురిని సీతకు చూపారు. ఆమెకు ఆశ్చర్యంగా ఉంది. ఆవేదనగా ఉంది. యుద్ధభూమిలో నరుకబడిన అడవిలా పడిఉన్న

వానర సైన్యాన్నంతా చూపారు. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. నేలమీద ఓ మూ పడి ఉన్న రామలక్ష్మణులను గూడ చూపారు. ఇంద్రజిత్తు ఆ అన్నదమ్ములను హతమార్చాడన్నారు. అందుకే లంకలో ఆ విజయోత్సవాలన్నారు.

సీత కుప్పగూలిపోయింది. ఆమె ఆశలన్నీ ఒక్కసారిగా అదృశ్య మయ్యాయి. అంతులేని దుఃఖంతో ఆమె జ్యోతిష్కులు, సాముద్రిక శాస్త్రజ్ఞులు తనకు చిన్నప్పుడు చెప్పిన శుభలక్షణాలు స్మరించింది. భర్త మరణించాడని పరిపరి విధాల శోకించింది. తన బ్రదుకింక వ్యర్థమని భావించింది.

వెంటవచ్చిన రాక్షస స్త్రీలలో త్రిజట ఉండటం సీత అదృష్టం. త్రిజట సావధానంగా రామలక్ష్మణులను చూచింది. 'అమ్మా! నీ భర్త బ్రదికి ఉన్నాడు. రామలక్ష్మణులు మూర్ఛనొందారేగాని మరణించలేదు. వారి ముఖాలు వాడిపోయాయే గాని కాంతి విహీనాలు కాలేదు. వెంట ఉన్న వానర వీరులు విచారిస్తున్నారేగాని ఉత్సాహాన్ని వీడలేదు. నిదానంగా చూడు. రాముడు అజేయుడు. ఆయన మరణిం చటం అసంభవం. నీవు ధైర్యంగా ఉండు' అని సీత నోదార్చింది. ఆ విమానాన్ని అశోకవనానికి మళ్ళించింది.

అయినా సీత దుఃఖిస్తూనే ఉంది. తానే మౌతుందో తనకే తెలీదు. అది ఆమె పరిస్థితి.

అప్పుడు ఇంకో చిత్రమైన సంఘటన. ఆగ్రహోదగ్రుడైన రావణుడు చంద్రహాసం చేతబట్టి చంపుతానంటూ ఒకనాడు ఆమె మీదికి వచ్చాడు. వద్దని మంత్రులు ఎంత వారిస్తున్నా వినలేదు. ఆమెకు అంతా అయోమయంగా ఉంది. ఏం జరిగిందో తెలీదు. ఎందుకు రావణుడు అలా వస్తున్నాడో తెలీదు. మొత్తానికి ఆనాడు ప్రాణాల మీద ఆమె ఆశ వదలుకొంది. అంతలోనే సుపార్శ్వుడు రావణు నికి అడ్డుపడ్డాడు. ఏదో చెప్పాడు. అతని మనస్సు మార్చాడు. వెనుకకు మర లించాడు. ఒక విధంగా ఆనాడు సీతను బ్రదికించాడు. అప్పుడన్నారు కొందరు — ఇంద్రజిత్తు యుద్ధరంగంలో మరణించాడని, అందుచేతనే రావణుడు ఆగ్రహో దగ్రుడై ఆ పనికి పూనుకొన్నాడని. సీత సంతోషించింది. వెయ్యి కళ్ళతో ప్రతి దినం రాముని విజయవార్త కొరకు ఎదురుచూసింది.

అది సీత జీవితంలో ఒక గొప్ప శుభదినం. ఆమె నిరీక్షణ ఫలించిన దినం. ఆమె కష్టాలు గట్టెక్కిన దినం. రావణుడు గతించిన దినం. ఆమె పంజర జీవితం

పటాపంచలైన దినం. ప్రసన్నమ్మ వంటిదేదో ప్రాప్తించే దినం. భర్త సాన్నిధ్యం సిద్ధించే దినం.

అనుకొన్నట్లే హనుమ వచ్చాడు. అంజలి ఘటించి నిలిచాడు. అమ్మా! రామలక్ష్మణులకు కుశలం అన్నాడు. రావణుడు మరణించాడన్నాడు. రాముడు జయించాడన్నాడు.

సీత ఆనందానికి అంతులేదు. ఎంతసేపో ఆమె నోట మాట రాలేదు. అంతసేపూ ఆమె కళ్ళవెంట ఆనందబాష్పాలు రాలుతూనే ఉన్నాయి.

'అమ్మా! పలుకవేమి!' అన్నాడు హనుమ. ఆమె అలా చూస్తూనే ఉంది. ఆనందాశ్రువులు రాలుస్తూనే ఉంది. పెదవి విప్పిపలుకు లేకుండా ఉంది.

కొంతసేపటికి గొంతు సవరించుకొని 'హనుమా! ఎంత సంతోషవార్త చెప్పావు. నిన్ను పొగడటానికి లోకంలో భాషలేదు. నీకు బహూకరించటానికి వస్తువే లేదు'. అంది - కళ్ళనీళ్ళు మడుచుకొంటూ; ప్రియాతి ప్రియంగా హనుమ కళ్ళల్లోకి చూస్తూ.

'ధన్యోస్మి' అన్నాడు హనుమ, అటూ ఇటూ చూచి 'అమ్మా! నీవు అనుజ్ఞ ఇస్తేచాలు. నిన్ను బాధించిన ఈ రాక్షస స్త్రీల అంతుచూస్తా' అన్నాడు. హనుమ మాటలకే వాళ్ళంతా హడలిపోయారు. ఆయన మాటవిని గడగడ వణికారు.

హనుమ మాటకు సీత చిరునవ్వు నవ్వింది. 'హనుమా! వాళ్ళు రావణుని దాసీ జనం. యజమాని చెప్పినట్లు చెయ్యటం వాళ్ళ ధర్మం. అందుచేత దాసీ జనం దండనార్హంకాదు. అయినా అంతా నా దురదృష్టం. అందుకు ఒకరిని నిందించి ఏం లాభం' అనేసరికి హనుమ ఆమె ధర్మదృష్టికి చేతులెత్తి నమస్కరించాడు. ఆ రాక్షస స్త్రీలంతా ఆమె దయా స్వభావానికి ఆశ్చర్యపోయారు. అంజలి ఘటించారు. బ్రతుకు జీవుడా అని ఒక్కసారి ఊపిరి పీల్చుకొన్నారు.

'అమ్మా! ఆ రామచంద్రునికి ఏం చెప్పమంటారు' అన్నాడు. హనుమ. 'వారి దర్శనం కోసం వెయ్యి కళ్ళతో నిరీక్షిస్తున్నానని చెప్పు' అంది సీత.

హనుమ వెళ్ళాడు.

అద్భుతా మధురమైన మగని ఆహ్వానం కొరకు ఆ మహాసాధ్వి అనుక్షణం ఎదురుచూస్తూ ఉంది.

అంతలో విభీషణుడు వచ్చాడు. 'అభ్యంగన స్నానం చేసి, అలంకరించు కొని ఆ రామచంద్రుడు మిమ్మల్ని తన సమక్షానికి రమ్మన్నాడు' అని రాక్షస స్త్రీల చేత చెప్పించాడు.

సీత యథాతథంగానే వస్తానంది.

'రామచంద్రుడు అందరికి ప్రభువు. ఆయనమాట అవిలంఘ్యం' అని చెప్పించాడు విభీషణుడు.

సీత అలాగే అంది. అభ్యంగన స్నానం చేసింది. అంగరాగాలు అలము కొంది. ఆభరణాలు ధరించింది. భర్త సమ్ముఖానికి బయలుదేరింది. ఎంతో ఎడ బాటు తరువాత, ఎన్నో కష్టాల తరువాత ఆమె భర్తను కలుసుకోవటం ఇదే మొదటిసారి. ఎండిన ఏటికి నిండుగా వరద వచ్చినట్లుంది ఆమె మనస్సు. ఒక్కొక్క అల ఏయే కలలు కంటున్నదో! ఎంతెంతగా ముందుకు దూకు తున్నదో !

సీత వస్తుంటే వానరులు, రాక్షసులు అంతా ప్రక్కకు తప్పుకొన్నారు. చేతలు జోడించి నిలబడ్డారు. మెడలు సాచి తనివిదీర ఆమెను చూడసాగారు.

సీత సిగ్గుతో తలవంచుకొంది. భర్త యెదుట నిలుచుంది. ఆయన వైపు ఏలా చూడాలో! ఏం మాట్లాడాలో పెళ్ళినాడుగూడ ఆమె మనస్సు ఇంత తిరుగుడు పడలేదు

భర్త ఎంత ప్రేమగా చూస్తాడో ! ఎంత ప్రియంగా పలుకరిస్తాడో !

'సీతా ! శత్రు సంహారం చేశాను. నా పౌరుషం నిరూపించాను. నా ప్రతిజ్ఞ నెరవేర్చాను. నా మిత్రుల కృషి ఫలించింది.

ఇదంతా నీ కొరకు గాదు నా వంశ ప్రతిష్ఠకొరకు. నా కొరకు. నా కీర్తి కొరకు.

నీవు రావణుని ఆధీనంలో ఇంతకాలం ఉన్నావు. నీది దివ్యసౌందర్యం. అతనిది పరమకాముక స్వభావం. అందుచేత నీ చరిత్ర సందేహాస్పదం.

పైగా రావణుని దృష్టిచేత, స్పర్శచేత నీవు మలినమయ్యావు. నిన్ను స్వీక రించటానికి నా మనస్సు అంగీకరించటంలేదు.

ఇక నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు. భరత లక్ష్మణ సుగ్రీవ విభీష ణుల ఎవరైనా నీకు తిండి, బట్ట ఇస్తారు. పోషిస్తారు' — అన్నాడు రాముడు కర్కశతోరంగా.

సీత ఇది ఏ మాత్రం ఊహించలేదు. మన స్తత్త్వాలు మహావిచిత్రాలు. ఆమె హృదయం కుమిలిపోయింది. ఒకవైపు దుఃఖం, మరోవైపు కోపం, ఇంకోవైపు అవమానం ఆమె అంతరంగాన్ని సంక్షోభపెట్టాయి. ఏం చెయ్యాలో ఆమెకు తోచ లేదు. ఏం మాట్లాడాలో ఆమెకు తెలియదు.

పన్నీటి జల్లుకోరుకొంటే పిడుగుల వాన కురిసినట్లయింది. పూల పాన్పుకు ఆశపడితే ప్రళయాగ్నిగుండం ప్రాప్తించినట్లయింది.

ఏ స్త్రీ జీవితంలోనైనా ఇదొక మహావైపరీత్యం। సీత కళ్ళు తుడుచుకుంది. పొంగివచ్చే దుఃఖాన్ని ఎలాగో దిగమ్రింగుకొంది.

'స్వామీ! మీరేనా ఈ మాటలనేది. నా పట్ల ఏ దోషంలేదు. కావాలంటే ప్రమాణం చేస్తాను నేను మీ ధర్మపత్నిని మనం ఎంతో కాలం కలిసి జీవించాం. ఇంతేనా మీరు నన్నర్థం చేసుకొన్నది. అపహరణ సమయంలో రావణుడు నన్ను స్పృశించాడంటారే - అందుకు నేనేం చేసేది. అప్పుడు నేను అసహాయను. అశ క్తను. అది నా తప్పుగాదు. దేవుని తప్పు. నా శీలాన్నే మీరు శంకిస్తే ఆ సంగతి సూచనప్రాయంగానైన హనుమచేత చెప్పింపగూడదా. అప్పుడే ప్రాణాలు వదిలే దాన్ని, ఈ యుద్ధం ఎందుకు ? ఈ మిత్రులంతా మీ కొరకు శ్రమపడటం ఎందుకు ?

ఉచితానుచితాలు విచారింపక ఒక అల్పునిలా మాట్లాడటం మీకు న్యాయం గాదు. కులకాంతను కులటగా శంకించటం మీకు ధర్మంగాదు. భూసుతగా నేను జన్మించాను. జనకుని ఇంట పెరిగాను. అగ్నిసాక్షిగా మిమ్మల్ని వివాహమాడాను. అలాంటి నన్నే మీరవమానించారు. తక్కువ తనం మాయింట, ఒంటలేదు' ... అని ఒక్కసారి ఆమె గొల్లుమంది.

లక్ష్మణుని వైపు తిరిగి 'లక్ష్మణా! ఇప్పుడు నేనొక సందేహాశీలను; పతిత్య క్తను, ఈ మహాజన సమక్షంలో అగ్నిప్రవేశమే నాకు శరణ్యం, అందుకు అన్నీ సిద్ధం చెయ్యవా ?' అంది.

లక్ష్మణుడు అన్నవైపు చూచాడు. అన్న అందుకు ఆమోదించినట్లు తల ఊపాడు.

అగ్నిగుండం ఏర్పాటయింది. సీత పతిదేవునికి ప్రదక్షిణం చేసింది. పాద నమస్కారం చేసింది. అగ్నిహోత్రం ఎదుట నిలిచింది. అంజలి ఘటించింది.

'అగ్నిహోత్రా ! రాముని తప్ప అన్యపురుషుని స్మరించకుండా ఉన్నట్లయితే నన్ను రక్షించు. మనసా వాచా కర్మణా ఆ రామునే స్మరిస్తూ ఉన్నట్లయితే నన్ను రక్షించు, పంచభూతాలు పతివ్రతగా భావించినట్లయితే నన్ను రక్షించు' — అని పలికింది. అగ్నిహోత్రునికి ప్రదక్షిణం చేసింది. అగ్ని ప్రవేశం చేసింది. అందరు ఆక్రందనలు చేశారు.

సీత పాతివ్రత్యానికది అగ్ని పరీక్ష. రాముని ధార్మికత్వాని కది అగ్ని పరీక్ష.

అగ్ని పరీక్షలో సీత నెగ్గింది. బ్రహ్మాది దేవతలు ఆమె పాతివ్రత్యాన్ని ప్రశంసించారు. అగ్నిహోత్రుడు చెక్కుచెదరకుండా సీతను తెచ్చి రామునికి అప్పగించాడు. ఆమెను పరిగ్రహింపవలసిందని ప్రార్థించాడు.

రాముడు చిరునవ్వునవ్వాడు. 'సీత పాతివ్రత్యం నాకు విదిత పూర్వం. ఆమెకు ముల్లోకాల్లో ఏ పాపం అంటలేదు. అయితే పరీక్షించకుండా పరిగ్రహిస్తే ప్రజలు పరిపరి విధాల భావిస్తారు. అందుకే ఆమెకీ అగ్నిపరీక్ష. సీత జనకాత్మజ. రామపత్ని. ఆమెకు ఇంకొకరు నీతులు చెప్పాలా ! ఆమె పట్ల హద్దులమీరి ప్రవర్తించటం ఆ రావణుని తరంగాదు. ఆ సంగతి నాకు తెలుసు. అయినా ప్రజల కొరకే ఆమెకీ అగ్ని పరీక్ష. సీత పరిశుద్ధ చరిత్ర. ఆమెను పరిగ్రహిస్తున్నాను' — అని సాదరంగా చూచి ఆప్యాయంగా ఆమెను ప్రక్కకు తీసుకొనేసరికి దేవదానవ వానర మహర్షులంతా ఒక్కసారి హర్షధ్వానాలు చేశారు.

సీత పూచిన సంపెంగలా పులకించింది. రాముని ప్రక్క నిలిచింది. ఆమె జీవితంలో అదొక మహోజ్జ్వల ఘట్టం.

ఈ ఘట్టంతో ఆమె జీవితం మరో మలుపు తిరిగింది. భర్త వెంట ఆమె అయోధ్యకు వెళ్ళింది. కోసల రాజ్య పట్టమహిషి అయింది. భర్తతోపాటు తానూ పెక్కుమందికి బహుమానాలిచ్చింది. ప్రియమార హనుమకు మరపురాని ముత్యాల

హారమిచ్చింది. అన్ని సంవత్సరాల తరువాత జీవితంలో యౌవనభోగాల వించింది. అంతఃపుర సుఖాలు చవిచూచింది.

అది అయోధ్యా రాజాంతఃపుర ఉద్యానవనం. అందు సీతారాములు వి న్నారు. ఎంతకాలం తరువాతనో వారికి ఈ విశ్రాంతి; విహారం. అలసిపోం పర చిన దర్భాసనం మీద కూర్చున్నారు. రాముని కౌగిట్లో సీత ఒదిగి ఆయ వ్రాలి ఉంది. ఆయిన అప్యాయంగా ఆమె ముంగురులు సవరిస్తున్నాడు. స్వేద బిందువులు తుడుస్తున్నాడు. చిరునవ్వు నవ్వుతూ 'సీతా నీవు సంతా కాబోతున్నావు. ఏం కావాలో కోరుకో' అని అనురాగ స్వరంతో ఆమె చూస్తూ అన్నాడు.

ఆమె సిగ్గుపడి ముఖానికి అడ్డంగా చేతులు కప్పుకొంది. రాముడు ఆ తొలగించాడు. 'ఏం కావాలో అడుగు' అన్నాడు మెల్లగా.

'స్వామీ ! గంగాతీర పవిత్ర మున్యాశ్రమాల్లో ఉండాలని ఉంది. ఒక్కరోజైనా అక్కడ గడపాలని ఉంది' అంది సీత అపోవినమైన త్వంలో.

'అలాగే రేపే నిన్ను పంపిస్తా' అన్నాడు రాముడు అనుకోకుండా నిశ్చయాత్మక స్వరంతో. ఆ తరువాత తన స్వర తీవ్రతకు తానే విచారి అంతలోనే సీత చిరునవ్వు నవ్వింది. ఆమెను చూచి ఆయనా నవ్వాడు.

వేగుల వారిని కలిసే వేళ అయింది. వెంటనే రాముడు వెళ్ళాడు.

ఉన్నట్టుండి మరునాటి ఉదయం సుమంత్రుని రథం సీత అంతః ముందు ఆగింది. అందుండి లక్ష్మణుడు దిగాడు. 'అమ్మా ! రాజాజ్ఞ గంగాతీర మున్యాశ్రమాలకు నిన్ను గొనిపోవచ్చును. నీ వక్కడ కాలం తావు. ఆలస్యం కాకుండా బయలుదేరు' అన్నాడు సీతతో.

సీతకు ఆరోజు ఉదయం నుండి ఏవో అపశకునాలు. అయినా భ కోరిన కోర్కె వెంటనే తీరుస్తున్నాడు. పైగా ఇంతత్వరగా తీరుస్తాడని తా ఊహించలేదు. తన మీద ఆయనకు ఎంత ప్రేమో !

సీత తనలో తాను మురిసిపోయింది. 'ఇదుగో లక్ష్మణా ! వస్తున్నా పత్నులకు అనేక వస్త్రాలు, ఆభరణాలు తెస్తున్నా' అని హడావుడిగా ఆమె తీసుకొని రథం ఎక్కింది.

లక్ష్మణుడు మాట్లాడలేదు. సుమంత్రుడు గూడ ఏమీ మాట్లాడలేదు. రథం కదిలింది. అన్నీ అపశకునాలే. 'లక్ష్మణా ! ఏమిటయ్యా ఈ అపశకునాలు. అంతా కుశలమే గదా' అంది సీత.

లక్ష్మణుడు మాట్లాడలేదు. సుమంత్రుడు రథం తోలుతూనే ఉన్నాడు. రథం గోమతీ నదీ తీరం చేరింది. ఆ రాత్రికి అక్కడ ఒక ఆశ్రమంలో విశ్రాంతి.

మరునాటి ఉదయం మరలా ప్రయాణం. అల్లంత దూరాన గంగానది కన్పించగానే లక్ష్మణుడు గొల్లుమని ఏడ్చాడు. 'ఎందుకు లక్ష్మణా ! ఏడుస్తున్నావు' అంది సీత ఆందోళనగా. 'అవునులే - నువ్వెప్పుడు రాముని వదలి ఒక్కరోజైనా ఉండలేదు. అందుకే ఏడుస్తున్నావు. నేను ఆయనను వదలి ఉండటానికి అలవాటు పడ్డాను. గంగను దాటించు. మున్యాశ్రమ దర్శనం చేయించు. తెచ్చిన సొమ్ములు, వస్త్రాలు, మునిపత్నులకిచ్చి వెంటనే వెనుదిరిగి వెళ్ళాలి. నా రాముని చూడకుండా నేనూ ఉండలేను' అంది సీత అమాయికంగా.

గంగ రానే వచ్చింది. నావమీద వానూ లక్ష్మణుడు ఆవలికి దాటారు. అప్పుడన్నాడు లక్ష్మణుడు ఆపుకోలేని దుఃఖంతో 'అమ్మా ! అపవాద కారణంగా అన్న నిన్ను అడవుల్లో వదలి రమ్మన్నా'డని.

సీత గడగడ వణికింది. ఎంతసేపో ఆమె నోట మాటరాలేదు. కొంతసేపటికి గద్గద స్వరంతో 'ఏమిటి లక్ష్మణా ! ఆ అపవాదు ? ఎందుకు లక్ష్మణా ! నాకీ శిక్ష?' అంది.

లక్ష్మణుడు చేతులెత్తి నమస్కరించాడు. సూచనగా అపవాదు చెప్పాడు.

సీత మూర్ఛపోయింది.

ఎంత సేపటికో ఆమె తెప్పరిల్లుకొంది. అంతులేని దుఃఖంతో తన ఆవేదన నంతా వెళ్ళబోసుకుంది.

'లక్ష్మణా ! నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించావు. నేనొక దురదృష్టవతిని. ఈ అరణ్యవాసాన్ని ఎలా అనుభవించేది. ఈ ఒంటరితనాన్ని ఎలా భరించేది. ఎవరైనా నీ భర్త ఎందుకు వదిలేశాడని అడిగితే ఏమని బదులు చెప్పేది. అపవాదానికి వెరచి అగ్ని శుద్ధ అయిన నన్ను మీ అన్న మరల అడవులపాలు చేశాడు.

భర్త ధర్మ నిర్వహణలో భార్యకూడ భాగం పంచుకోవాలి. ఆయన అపకీర్తి నాకూ అపకీర్తే. అది తొలగిపోవాలి. రాముడు ప్రజాభిప్రాయాన్ని మన్నించి ధర్మ ప్రభువుగా నన్ను పరిత్యజించాడు. ఆయన ధర్మపత్నిగా ఈ అరణ్యవాసాన్ని నేను భరిస్తాను. భర్తయే నాకు దైవం; బంధువు; గురువు. ప్రాణాలర్పించి అయినా భర్తకు ఇష్టమైన పని చెయ్యటం పతివ్రతా ధర్మం. ఇదే మీ అన్నగారికి నా నివేదన. పౌరజానపదులను సోదరుల్లా ఆదరించమని వారికి చెప్పు. అత్తలందరికి అంజలి ఘటించానని చెప్పు' అనగానే లక్ష్మణుడు ఆమెకు సాష్టాంగ నమస్కారం చేశాడు. శోకిస్తూ ఆమెకు ప్రదక్షిణం చేసి నావ యెక్కాడు. గంగ ఆవలి ఒడ్డుచేరి రథం ఎక్కి మాటిమాటికి ఆమెవైపు తిరిగి చూస్తూ, కన్నీళ్ళుకారుస్తూ ముందుకు సాగి వెళ్ళాడు.

సీత ఒంటరి అయింది. ఎంతోసేపు ఆమె ఏడ్చింది. అంతా అరణ్యం. ఎటు పోవాలో, ఏం చెయ్యాలో! ఆమె కొక దిక్కు తోచనిస్థితి. దీనాతిదీన స్థితి.

ఆ స్థితిలో ఆశ్చర్యకరంగా వాల్మీకి మహర్షి వచ్చారు. 'అమ్మా! వచ్చావా' అన్నారు. ఆ పిలుపులో ఎంత వాత్సల్యం! 'అమ్మా! అంతా తెలుసు' అన్నారు. ఆ మాటలో ఎంత సానుభూతి! 'అమ్మా! ఆశ్రమానికి వెళ్దాం' అన్నారు. ఆ ఆహ్వానంలో ఎంత ఆర్ద్రత! సీతాదేవికి దురదృష్టం తొలగిపోయినట్లుంది. దేవుడు ప్రత్యక్షమైనట్లుంది.

ఆమె కన్నీళ్ళు తుడుచుకొని మెల్లగా లేచి ఆ మహర్షికి నమస్కరించింది కృతజ్ఞతాబిందుతుందిల నేత్రాలతో మేలిముసుగు సవరించుకొని, తలవంచుకొని ఆ మహర్షి వెంట నడిచి వెళ్ళింది.

ముందు వాల్మీకి మహర్షి. ఆయన వెంట సీతామహాసాధ్వి. వెనుక శిష్య గణం. ఆశ్రమంలో అడుగుపెట్టగానే అపూర్వస్వాగత సత్కారాలు. ఎందరెందరో మునిపత్నులు. అందరు రమ్మని ఆహ్వానించేవారే. వారి ముఖాల్లో పవిత్రత. మాటల్లో ప్రశాంతత, హృదయాల్లో ఆర్ద్రత. అయోధ్యనే మరిపించేటట్లున్నాయి.

వాల్మీకాశ్రమ ప్రవేశం సీత జీవితంలో ఒక క్రొత్త మలుపు. ఆమె అక్కడే కుశలవులను ప్రసవించింది. తల్లి అయింది అక్కడే కుశలవులు పెరి

గారు. వాల్మీకి శిష్యులయ్యారు. ఆ మహర్షి వాళ్ళకు రామకథ చెప్పాడు. రామ కథా గానంలో ఆ బాలురిద్దరు ఆరితేరారు.

ఆనాడు గోమతీ తీరంలో శ్రీరామచంద్రుని అశ్వమేధ యాగం. యాగ సమయంలో కుశలవుల రామకథా గానం. అందరి హృదయాలకు అపూర్వ దివ్య సుధాపానం.

రాముడు కుశలవుల రూపుచూచాడు. గుణం చూచాడు. అన్నీ తన పోలికలే. సీత కొడుకులని గుర్తించాడు. పులకించాడు. దూతలను వాల్మీకి దగ్గరకు పంపాడు. 'సీత పవిత్రురాలే అయితే - ఏ పాపము ఎరుగనిదే అయితే సర్వజన సమక్షంలో పాతివ్రత్యాన్ని గూర్చిన ఆమె ప్రమాణం కావాలి. అందుకామె అభిప్రాయం ఏమిటో, వాల్మీకి మహర్షి ఉద్దేశం ఏమిటో విచారించిరండ'ని వారి నాదేశించాడు.

వాల్మీకి మహర్షి 'రేపు ఉదయమే సీత, రామ సమక్షానికి వస్తుందని, ప్రమాణం చేస్తుం'దని వర్తమానం పంపాడు.

ఆ మహర్షి ఆ మానవతితో ఏం మాట్లాడాడో తెలీదు. ఆమె మనస్సు ఏం నిర్ణయించుకొందో అంతకంటె తెలీదు. ఆమె తలవంచుకొని ఒక మూగ బొమ్మలా ఆ మహర్షి వెంట నడిచింది.

అది రామ సభ. మహాసభ. ఒకవైపు వసిష్ఠవామదేవ భార్గవ చ్యవన భరద్వాజాది మహామునులు. వారి శిష్యులు, ప్రశిష్యులు. మరోవైపు పౌరజానపద ప్రజా సమూహం. ఇంకోవైపు సుగ్రీవాంగద వాయుపుత్రాది ప్రముఖ వానరులు. వేరోవైపు విభీషణుడు, అతని బంధుమిత్రులు.

సాక్షాత్తు బ్రహ్మదేవునిలా ఆ సభలోకి వాల్మీకి మహర్షి ప్రవేశించాడు. ఆయన వెంట వేదంలా సీతాదేవి అడుగువేసింది. అందరి దృష్టి ఆ సీతాదేవి మీదే. అందరి మనస్సు ఆమె ప్రమాణ కార్యక్రమం మీదే.

ఆ మహాసాధ్వి ఏం చెపుతుందో! ఏం చేస్తుందో! వాల్మీకి మహర్షి ఆ సభా మధ్యంలో ఆగాడు. ఆయన ప్రక్కనే సీత చేతులు జోడించి నిలుచుంది. ఇద్దరు చతుస్సముద్రాల మధ్య ఉన్నట్లుంది. ఎదుట శ్రీరామచంద్రుడు. ఆయన ప్రక్కనే భరత లక్ష్మణ శత్రుఘ్నులు. అల్లంత దూరాన అంతఃపుర స్త్రీలు.

సీత ఎవ్వరినీ చూడలేదు. చివరకు శ్రీరాముని గూడ చూడలేదు. ఆ అభి మానవతి వంచిన తల ఎత్తలేదు.

సీత చూపంతా నేల మీద, ఆమె మనస్సంతా ఆ రాముని మీద.

సభ అంతా నిశ్శబ్దం.

వాల్మీకి మహర్షి ఒక్కసారి సభనంతా కలయ జూచాడు. ప్రసన్నతా సుభగ మైన ముఖంలో ఉదాత్త గంభీరమైన స్వరంతో 'శ్రీరామచంద్రా, సీత పరమ పవిత్రురాలు. మహాపతివ్రత. నా ఆశ్రమంలోనే ఆమె కవల పిల్లలను ప్రస వించింది. ఆ కుశలవులు నీ కుమారులు. ఈ మహాసాధ్విని స్వీకరించు. మా అందరికి ఆనందాన్ని కలిగించు' అనగానే సభ అంతా ఒక్కసారి ఊర్పు విడిచింది.

శ్రీరామచంద్రుడు 'మహర్షీ, మీరు చెప్పింది సత్యం. సీత మహాపతివ్రత. ఆ సంగతి లంకలో అగ్ని పరీక్ష కూడ నిరూపించింది. అపవాదం కారణంగానే ఆమెను నేను పరిత్యజించాను. ఆమె పవిత్రురాలని ఇప్పుడు నాకు ప్రమాణం కావాలి. ఆ తరువాత గాని ఆమెను ప్రేమించలేను. పరిగ్రహించలేను' - అనేసరికి సీత మనస్సు చితికిపోయింది.

ఆమె వంచిన శిరస్సుతోనే, జోడించిన చేతులతోనే ఓ అడుగు ముందుకు వేసింది. సభ అంతా శ్వాసమాని ఆమెవైపే చూచింది.

సీత గద్గద కంఠంతో, కన్నీరు కారుస్తూ ఎలుగెత్తి 'అమ్మా! భూదేవీ! రాముని కంటె అన్యుని మనస్సున నేను స్మరించకుండా ఉన్నట్లయితే నీ హృద యంలో నాకు స్థానమివ్వు'. 'అమ్మా, భూదేవీ! మనోవాక్కాయ కర్మల నేను రాముణ్ణే పూజిస్తున్నట్లయితే నీ హృదయంలో నాకు స్థానమివ్వు'. 'అమ్మా! భూదేవీ! నేను చెప్పింది సత్యమే అయితే నీ హృదయంలో నాకు స్థాన మివ్వు'---

అనగానే అందరికి ఒక భయంకర శబ్దం వినిపించింది. భూమి బ్రద్దలైంది. అందుండి ఒక దివ్య సింహాసనం పైకివచ్చింది. భూమాత ప్రియమూర నాహూవులు సాచి సీతాసుతను కౌగిలించింది. కన్నీరు తుడిచింది. ముంగురులు సిమిరింది. ఆసనం మీద కూర్చుండ బెట్టుకొని అంతర్థానమైంది.

సభ అంతా ఆశ్చర్యంలో మునిగిపోయింది. అందరి హృదయాలు ఆవేదనలో కూరుకుపోయాయి. రాముడు సీతా ! సీతా ! అంటూ చిన్నపిల్లాడిలా శోకించాడు.

సీత జీవితం సమాప్తమైంది.

మొత్తానికి సీత జీవితంలో ఎన్నో మలుపులు. ఎన్నో కష్టాలు ఎన్నో పరీక్షలు. ఎన్నో శిక్షలు. తన తప్పేమీ లేకుండానే ఆమె అన్నీ అనుభవించింది. సహధర్మచారిణిగా శ్రీరామునికి అన్నివిధాలా సహకారాన్ని అందించింది. ఆయన ధర్మపాలనకై అగ్నిపరీక్ష కూడ ఎదుర్కొంది. ఆయన ధర్మపాలనకై మరొక మారు అరణ్యవాసాన్ని కూడ అనుభవించింది. అభిమానవతిగా చివరకు జీవితమే త్యాగం చేసింది.

సీత కష్టాలు ఆమె నొక మహాపతివ్రతగా నిరూపించాయి. ఆమె అగ్ని పరీక్షలు స్త్రీ జాతికి గర్వకారణాలుగా రూపొందాయి. సీత జీవితం ఆదర్శమయం. ఆమె చరిత్ర లోకోపకారకం.

సీత లేకుంటే రావణ వధే లేదు
రావణ వధే లేకుంటే రామ కథే లేదు.
రామాయణం ఒక విధంగా సీతా చరిత్రమే !

# త్రిజటుడు

త్రిజటుణ్ణి చూడగానే లోకంలోని పేదరికమంతా ఒక్క చోటికి చేరి ఆకారం దాల్చిందా అనిపిస్తుంది. చినిగిపోయిన అంగవస్త్రం, అంతకంటె చినిగిపోయిన తుండు గుడ్డ, బక్కచిక్కిన శరీరం, ముడుతలు పడ్డ ముఖం, మాసిపోయిన గడ్డం జడలు గట్టిన జుట్టు, మట్టి పట్టిన యజ్ఞోపవీతం, కప్పు సరిగాలేని కుటీరం, కుక్కి మంచం, కట్టుకొన్న చీర - మెళ్ళో పసుపుకొమ్ము తప్ప మరో చీరగాని, ఆభరణం గాని లేని ఇల్లాలు, ఇంటి నిండా గంపెడు పిల్లలు — ఇది త్రిజటుని స్థితి.

అయినా ఆ బ్రాహ్మణునికి అసూయలేదు. ద్వేషంలేదు. అల్పత్వం అంతకంటెలేదు. అయితే అలసట మాత్రం ఉంది. అధికంగా ఉంది. పేదరికంతో పోరి పోరి ఆ బ్రాహ్మణుడు అలసిపోయాడు. ఎంతో అలసిపోయాడు.

త్రిజటుడు ఉదయాన్నే లేచేవాడు. స్నానాదికాలు పూర్తిచేసుకొనేవాడు. నొసట విభూతిరేఖలు తీర్చుకొని, తృప్తిగా గాయత్రిని జపించుకొనేవాడు. గుక్కెడు మంచి నీళ్ళు త్రావి గునపం దోటిచేత పట్టుకొని — పార, తట్ట నెత్తిన పెట్టుకొని అడవికి వెళ్ళేవాడు; మధ్యాహ్నానికి కందమూలాలతో, కాయకసురులతో ఫలపత్రాలతో గంపనెత్తిన పెట్టుకొని ఇంటికి వచ్చేవాడు. నట్టింట గంప దింపి, నిట్టూర్పు విడుస్తూ నేల మీద పైగుడ్డపరుచుకొని కొంతసేపు పడుకొనేవాడు. ఆయన ఇల్లాలు అప్పుడు మడిగట్టుకొనేది. ఆయన తెచ్చిన వాటిలో కొన్ని ఉడకబెట్టేది. త్రిజటుడు మెల్లగా లేచి, మళ్ళీ స్నానంచేసి, సంధ్యవార్చి, దేవతార్చన జరిపి, భార్య కూర్చిన వంటకాలు భగవంతునికి నివేదన పెట్టేవాడు. తరువాత తాను, పిల్లలు భోంచేసేవాడు. ఆ యిల్లాలు భర్తకు, పిల్లలకు అడిగి అడిగి వడ్డించి - అడుగున మిగిలిందేదో తిని, వంటగదిని, ఉన్న ఒకటి రెండు పాత్రలు శుభ్రం చేసుకొని— మరునాటి భోజనానికి మోదుగాకుల విస్తళ్ళు కుట్టుకుంటూనో లేక దీపారాధనకు వత్తులు చేసుకుంటూనో వాకిట్లో పంచటరుగు మీద కూర్చునేది. ఇరుగింటి సోమిదేవమ్మ, పొరుగింటి సావిత్రమ్మ, ఎదురింటి మహాలక్ష్మమ్మ వచ్చి కూర్చునేవారు. వాళ్ళతో ఏవేవో కబుర్లు — వ్రతాల విషయాలు; నోముల విషయాలు; ఉపవాస

విషయాలు. సాయంకాలం కాగానే అందరు దేవాలయాలకు వెళ్ళేవారు. అచ్చట దైవదర్శనాలు, పురాణశ్రవణాలు పుణ్యకథా కాలక్షేపాలు.

త్రిజటుడు నొసటి విభూతి రేఖలతో, కుంకుమ బొట్టుతో పీట అరుగు మీద కూర్చుని యజ్ఞోపవీతానికి దారం వడుకుతుంటే సాక్షాత్తు బ్రహ్మదేవుడే వచ్చి సూత్రయజ్ఞం చేస్తున్నట్లుండేది. ఒక టెంకాయ చిప్పలో ప్రత్తి ప్రప్పటూ, మరో టెంకాయ చిప్పలో మధ్యమధ్య విభూతిచేతి కద్దుకొంటూ మాటిమాటికి సరిచేస్తూ చెయ్యిసాగినంత దూరం సన్నగా దారం తీస్తుంటే — ఏదో తెలుపు కిరణం ఆయన హృదయం నుండి వెలికి వస్తున్నట్లుండేది. ఆ సూత్రయజ్ఞం చూడటానికి చుట్టు ప్రక్కల వారంతా వచ్చేవారు. కొందరు ధర్మసందేహాలు అడిగేవారు. కొందరు వేదవిషయాలు ప్రస్తావించేవారు. కొందరు గ్రహగతులు తెలుసు కొనేవారు. అదో చిన్న బ్రహ్మలోకంలా ఉండేది.

త్రిజటునిది ఒక స్వతంత్ర జీవనం. ఒక స్వచ్ఛ జీవనం. చెయ్యి చాపటం ఆయన చేతగాని పని. శ్రమపడి జీవించటం ఆయన సహజ స్వభావం.

త్రిజటుడన్నా ఆయన భార్య అన్నా అందరికీ ఎంతో ప్రేమ: గౌరవం. పేదరికం ఆయన బ్రహ్మ వర్చస్సుకు అడ్డురాలేదు; ఆయన గౌరవాన్ని అది కించ పరచలేదు. అయితే దాన్ని భరించటమే బాధాకరంగా ఉంది. వయస్సు ముదిరే కొందీ దాన్ని సహించటం చాల కష్టంగా ఉంది.

... త్రిజటుడు కావాలని పేదరికాన్ని వరించలేదు. వచ్చిన పేదరికాన్ని సహించారు. త్రిజటుడు ఆశను త్యజించలేదు. దానిని అదుపులో ఉంచారు. త్రిజటుడు సర్వసంగ పరిత్యాగి కాదు. సంసారి. ఎంతకాలమని ఈ పేదరికాన్ని భరించటం?

ఆయన భార్య ఎన్నోసార్లు బ్రతిమాలింది. 'స్వామీ! ఇంత మంది పిల్లలతో ఈ దారిద్ర్యాన్ని ఎంత కాలమని భరిద్దాము. మీరూ వృద్ధులౌతున్నారు. శక్తి తగ్గిపోతున్నది. ఒక్కసారి ఆ దశరథ మహారాజును కలసిరండి. ఏదైనా అడగండి. మన దారిద్ర్యం తీరిపోతుంది. ఎందరెందరో ఆ మహారాజును ఆశ్రయిస్తున్నారు. ఎన్నో ప్రయోజనాలు పొందుతున్నారు. మీరూ వెళ్ళండి. మన పిల్లల కొరకైనా అడగండి' అని అనేక విధాల ప్రార్థించింది.

.... త్రిజటుడు ప్రతిసారీ తల ఊపేవాడు. ఆమె వైపు జాలిగా చూసేవాడు.

అక్కడి నుండి లేచి వెళ్ళేవాడు. అంతేగాని ఆయన ఎన్నడూ రాజద్వారంలో అడుగుపెట్టలేదు. ఆ మహారాజును అర్థించలేదు.

ఆ రోజు త్రిజటుడు ఆలస్యంగా అడవికి బయలు దేరాడు. ముందు రోజు ఉపవాసం. అందుచేత మరీ నీరసంగా ఉన్నాడు. అయినా వెళ్ళక తప్పదు. వెళ్ళకుంటే పూట గడవదు. పాపం! త్రిజటుని కాళ్ళు తడబడుతున్నాయి. కళ్ళు మూతలు పడుతున్నాయి. అలాగే బట్టా పారా నెత్తిన పెట్టుకొని, గునపం దోటీ చేత బట్టుకొని బయలు దేరాడు. అడవిలో అక్కడక్కడా త్రవ్విచూచాడు. ఎక్కడా కందమూలాలు దొరకలేదు. కొంత సేపు చెట్టు నీడన కూర్చున్నాడు. సేద తీర్చుకొన్నాడు. మరల త్రవ్వటం మొదలు పెట్టాడు. ప్రొద్దెక్కుతూ ఉంది. పిల్లలు ఆకలితో ఎంత అలమటిస్తున్నారో! త్రవ్వి త్రవ్వి త్రిజటుడు అలసిపోయాడు. వాడిపోయిన తోటకూర కాడలా గునపం మీద తల వాల్చి అలా నిలబడ్డాడు. ఎండ మండిపోతూ ఉంది. శరీరమంతా చెమటలు కారిపోతున్నాయి. దారిద్ర్యభారాన్ని మోయలేక మోయలేక చతికిలబడ్డ ఆ సంసారానికి ఏమీ దిక్కుతోచలేదు. భారంగా ఒక్క నిట్టూర్పు వదిలాడు. వాల్చిన తలపైకెత్తాడు. చంటివాణ్ణి చంకన వేసుకొని భార్య పరుగెత్తి వస్తూ ఉంది. ఎందుకో! ఏం జరిగిందో!

ఆందోళనగా త్రిజటుడు ఆమె వైపు చూచాడు.

ఆమె అల్లంత దూరాన్నుండే గొంతెత్తి 'ఆ గునపం బట్టా అవల పారేయండి. రాముడు అరణ్యాలకు వెళ్ళుతున్నాడు. అమితంగా దానాలు చేస్తున్నాడు. అడిగిన వాళ్ళకు అడిగినట్లు ఇస్తున్నాడు. మీరూ వెళ్ళండి. ఏదైనా అడగండి. నా మాటకాదనకండి. మీ కష్టాన్ని చూడలేకుండా ఉన్నాను. ఈ దారిద్ర్యాన్ని భరించలేకుండా ఉన్నాను.' అని గట్టిగా ఆయన చేతులు పట్టుకొని ఏడ్చింది.

త్రిజటుడు తన్ను తాను చూచుకొన్నాడు. తన భార్యా ముఖంలోకి చూచాడు. ఆమె చంకనున్న పసిబాలుని వైపు చూచాడు. భారంగా ఒక్క నిట్టూర్పు విడిచాడు. రెండు కన్నీటి బొట్లు రాల్చాడు. గునపం అవల విసిరి వేశాడు. నడుముకు బిగించిన పంచుగుడ్డ విప్పి, విదిల్చి భుజాన వేసుకొన్నాడు. ఒక్క ఊపున అక్కడి నుండి బయలు దేరాడు.

అది సాకేతపురం. రామమందిరం. ముందు ఎందరెందరో బ్రాహ్మణులు

పరిచారకులు, ప్రజలు. కొందరు దానాలు గ్రహించినవారు. మరికొందరు గ్రహించటానికి వరుసగా నిలుచున్నవారు. ఒక వెలుగు కిరణంలా త్రిజటుడు లోపికి చొచ్చుకు వెళ్ళాడు. ఆయన బ్రహ్మవర్చస్సును, ఆవేశాన్ని, పూనికను చూచి ద్వారపాలకు లంతా ప్రక్కకు తప్పుకున్నారు. సరాసరి త్రిజటుడు శ్రీరాముని సమక్షానికి వెళ్ళాడు. సభ్యతను పాటించటానికి తన తుండుగుడ్డను పైన కప్పుకోవాలని ప్రయత్నించాడు. పాపం ! ఆ తుండుగుడ్డ నిండా చినుగులే. ఒక వైపు చినుగు మీదికి వస్తున్నది. ఒక ప్రక్క చినుగు వెనుకకు వేసుకొంటే మరోప్రక్క చినుగు ముందుకు వస్తున్నది.

రాముడు త్రిజటుని అవస్థ చూచాడు. చిరునవ్వు నవ్వాడు. చివరకు త్రిజటుడు ఎలాగో తుండుగుడ్డ కప్పుకొన్నాడు.

రాముడు ఆపాదమస్తకం ఆ బ్రాహ్మణుని చూచాడు.

అతడు నీళ్ళన్నీ ఎండి పగుళ్ళువారిన వేసవి పంటకాల్వలా ఉన్నాడు. ఆకులన్నీ రాలి చిమగుల గూడులా చూపట్టే చెట్టులా ఉన్నాడు.

రాముడు ఆర్ద్రంగా ఆ త్రిజటుని వైపు చూచాడు.

త్రిజటుడు తలవంచుకొన్నాడు.

ఇద్దరి మధ్య పెద్దమౌనం. అయితే ఆ మౌనం ఎంతసేపు ?

త్రిజటుడు తలయెత్తి ఏదో తప్పు చేస్తున్నవానిలా రాముని వైపు చూచాడు.

రాముడు ఏదో చెప్పమన్నట్లు ఆ విప్రుని చూచి తల ఆడించాడు.

త్రిజటుడు 'రాకుమారా ! నేను పేద బ్రాహ్మణుడను. బహుకుటుంబిని. ఉంఛవృత్తితో జీవిస్తున్నాను. దారిద్ర్యాన్ని భరించలేకున్నాను' అని మరల తల వంచుకున్నాడు.

రాముడు పరిహాసంగా 'అయితే నీకు వెయ్యి గోవుల నైన ఇవ్వా' నన్నాడు.

త్రిజటుడు తలయెత్తి నిరాశగా చూచాడు.

రాముడు చిరునవ్వు నవ్వి 'త్రిజటా ! అదిగో ఆ కర్ర తీసుకో. శక్తికొలది

డాన్ని విసురు, అది ఎంత దూరాన పడుతుందో అంతాదాకా ఉన్న గోవులన్నీ నీకు దానం చేస్తా' అనే సరికి అక్కడున్న వారంతా ఆ త్రిజటుని చూచి 'అయ్యో ! పాపం !' అన్నారు. ఈ బ్రాహ్మణుడు ఎండు కట్టెలా ఉన్నాడే ఈ కర్రను ఎలా విసర గలడనుకొన్నారు. ఒకవేళ విసిరినా ఒక్క గోవునైనా దాటి అది పడు తుందా అనుకొన్నారు. అయినా రాముడు ఎవ్వరికీ ఈలాంటి పరీక్షలు పెట్టలేదే — ఈ పేదబ్రాహ్మణునికి ఎందుకీ పరీక్ష అనుకొన్నారు. అయితే రాముని ఆంతర్య మేమిటో అని అంతా ఆశ్చర్యంగా చూచారు.

త్రిజటుని కళ్ళల్లో ఆశారేఖ తళుక్కున మెరిసింది. తక్షణం అతడు తుండు గుడ్డ నడుముకు బిగించాడు. కర్రను గిరగిర త్రిప్పి తన శక్తి నంతా చిక్కబట్టి ఒక్కఊపున విసిరివేశాడు.

అది సరయూనదికి ఆవలి ఒడ్డున అనేకవేల గోవుల నతిక్రమించి నెమరు వేస్తూ నిలబడి ఉన్న ఒక ఆబోతు ముందు పడింది.

ఆ బ్రాహ్మణునిలో అణగి ఉన్న దారిద్ర్యబాధ అంత తీవ్రం.

రాముడు ఆశ్చర్యపోయాడు. ఆనంద పరవశు డయ్యాడు. ఆ బ్రాహ్మణుని గాఢంగా కౌగిలించుకొన్నాడు. 'త్రిజటా ! నీ దారిద్ర్యబాధ ఎంత తీవ్రమో ఇప్పు డర్థమైంది. ఏదో నవ్వులాట కన్నాను వెయ్యిగోవుల నైనా ఇవ్వనని. అందుకు ఆగ్రహించకు. నీ తేజస్సు అద్భుతం. అగుపిస్తూనే ఉంది. అయినా దాని కొలది స్పష్టంగా చూద్దామని ఆ కర్ర విసర మన్నాను. ఆ కర్ర పడిన దాకా ఉన్నగోవులన్నీ నీవే. అవి ఎన్ని వేలైనా సరే. ఇంకా నీకేం కావాలో అడుగు' అన్నాడు రాముడు ఎంతో ప్రేమగా.

త్రిజటుడు తృప్తిగా తల ఊపాడు. అంతలో అతని భార్య గూడ అక్కడికి చేరుకొంది. భర్త సంపాదించిన గోసంపదను చూచి ఆమె కొండంత ఆనం దించింది.

త్రిజటుని దారిద్ర్యం తీరిపోయింది. దంపతులిద్దరు ఆ రామచంద్రుని మన

సార ఆశీర్వదించారు. మౌనంగా తమ ఆశ్రమానికి తరలి వెళ్ళారు. రామచంద్ర
సంతోషంగా కొంతదూరం వారిని సాగనంపాడు. ఆవులన్నింటిని ఆశ్రమం చే
డని భటులను ఆదేశించాడు.

అందరి కళ్ళల్లో ఆశ్చర్యం !

ఎంతోకాలం అతికష్టం మీద భరించిన తీవ్రాతితీవ్రదారిద్ర్యం,
అవకాశం అపురూపంగా వచ్చి తీరే పరిస్థితి ఏర్పడితే—వ్యక్తి ఉత్సాహం
ఎత్తు, పరుగెత్తే దూరం లోకంలో ఆశ్చర్యకరాలుగానే ఉంటాయి.

అంతేగాదు. మానవుని దేహబలం కంటె మనోబలం ఎంతో గొప్పది.

# వాల్మీకి మహర్షి

సూర్యకిరణం సోకేసరికి సరోవరంలోని తామర మొగ్గ ఒక్కటొక్కటిగ రేకులు విప్పుకొని ఎలా పరిపూర్ణంగా వికసించి పరిమళాలు వెదజల్లు తుందో, ప్రక్కకొదిగి మరంద బిందువుల వర్షిస్తుందో—అలాగే ప్రతి మానవహృదయంలో దాగి ఉన్న వెలుగు ఏదో ప్రేరణ ఏర్పడగానే అపూర్వ భావరూపంలోనో, రసో జ్జ్వల వాగ్రూపంలోనో, మహోత్కృష్టచేష్టా రూపంలోనో వ్యక్తమౌతుంది. ప్రపంచానికి గొప్పమేలు చేస్తుంది.

వాల్మీకి మహర్షి విషయంలో గూడ ఇదే జరిగింది.

అది తమసానదీ తీరం. అంతా దట్టమైన అరణ్యం. మధ్య ప్రశాంత మనోహర ఋష్యాశ్రమం. మహర్షి వాల్మీకి ఆశ్రమ కులపతి. ఆశ్రమంలో అన్నివేళలా వేదఘోషలు; శాస్త్రచర్చలు, ధర్మచికిత్సలు.

కొద్ది రోజులుగా వాల్మీకి హృదయం ఎందుకో కలతగా ఉంది. ఏదో కావా లని అది కోరుతూ ఉంది. ఏదో చెయ్యాలని అది ఉవ్విళ్ళూరుతూ ఉంది. ఏం కావాలో, ఏం చెయ్యాలో దానికి తోచటంలేదు. ఆ మహర్షి హృదయానికి అదొక అపూర్వస్థితి. ఆ స్థితి ఆయనకే ఆశ్చర్యంగా ఉంది అయినా ఆయన ఆనాటి సామాజిక స్థితిగతులను గూర్చి, అధర్మ విజృంభణాన్నిగూర్చి, స్వార్థస్వభా వాన్ని గూర్చి, ధర్మతత్త్వాన్ని గూర్చి, జీవిత పరమార్థాన్ని గూర్చి, అన్నింటిని మించి మానవుని అసంపూర్ణతను గూర్చి ఆశ్రమంలోని శిష్యులతో, తోటి మహర్షు లతో చర్చిస్తూనే ఉన్నాడు.

ఆనాడు తమసానదికి స్నానార్థమై వాల్మీకి బయలు దేరుతూ ఉండగానే అను కోకుండా నారద మహర్షి ఆయన ఆశ్రమానికి వచ్చాడు. వాల్మీకి మహానంద భరి తుడై ఆ దేవర్షికి స్వాగతం పలికాడు. కూర్చుండ బెట్టాడు. కుశల ప్రశ్నలు వేశాడు. బ్రహ్మమానసపుత్రుడు, త్రిలోకసంచారి, తపస్స్వాధ్యాయ నిరతుడు, వాగ్విద వరిష్ఠుడు అయిన నారద మహర్షిని చూడగానే లోకంలో సర్వసద్గుణ సంప న్నుడైన పూర్ణపురుషుడు ఒక్కడైనా ఉన్నాడా అని ఆయనకు అడగాలనిపించింది,

'మహాత్మా! ఈ లోకంలో గుణవంతుడూ, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, సత్యసంధుడు దృఢవ్రతుడు, సదాచార సంపన్నుడు, దయామయుడు, విద్వాంసుడు, ప్రియదర్శనుడు, అక్రోధనుడు, అసూయారహితుడు, అదిత్వియశౌర్యుడు అయిన మహాపురుషుడు ఎవరైనా ఉన్నాడా' అని అడిగాడు.

అందుకు నారద మహర్షి నవ్వారు. తమిరాక అర్ధనిమీలిత నేత్రుడై—వాల్మీకి ప్రశ్న, తన సమాధానం ఎంత సార్థకాలు కాబోతున్నవో దర్శించారు. ఆ మహర్షి వైపు మనోజ్ఞంగా చూచాడు 'వాల్మీకి! ఇన్ని గుణాలు ఒక్క వ్యక్తిలో ఉండటమా! ఎంత కష్టం! వాటిలో కొన్ని ఉన్నచాలు. వ్యక్తి ముక్తుడౌతాడు. అయినా నీ వడిగిన గుణాలన్నీ ఉన్న వ్యక్తి లోకంలో ఒక్కడున్నాడు. ఆయన కథ నీదాకా రాలేదా? అయితే చెప్తా విను' అని రామకథ అంతా చెప్పారు. మహారసవంతంగా చెప్పారు.

వాల్మీకి హృదయంలో రామకథ ముద్రపడింది. ఆ మహర్షి ఉప్పొంగిపోయారు. శిష్యులు, వారు ఆదేవర్షిని గొప్పగా సన్మానించారు. సాగనంపారు.

ఆ తరువాత వాల్మీకి మహర్షి కమండలం చేతపట్టుకొని తమసానదికి బయలుదేరాడు. శిష్యుడు భరద్వాజుడు కలశం పట్టుకొని గురువుగారిని అనుసరించాడు.

ఆ రోజు తమస ఎందుకో ఉరవడిగా ప్రవహిస్తూ ఉంది. గురుశిష్యులిద్దరూ ఒడ్డు వెంట కొంత దూరం నడిచారు. వాల్మీకి మహర్షి ఒకరేవు దగ్గర ఆగి 'భరద్వాజా! ఇది సజ్జన హృదయంలా స్వచ్ఛంగా ఉంది. మహా ప్రసన్నంగా ఉంది, ఇక్కడే స్నానం చేద్దాం' అన్నారు. అంతలోనే అతిమనోహరంగా క్రౌంచస్వరం వినిపించింది. ప్రకృతి రమణీయంగా ఉంది. దట్టూదట్టమైన అడవి. ప్రక్కనే పెద్ద ఏరు. ప్రభాత సూర్యోదయం. ప్రశాంత వాతావరణం. అందమైన ఆ ప్రకృతిని తిలకిస్తూ ఆ మహర్షి, శిష్యుడూ అడవిలోకి నాలుగు అడుగులు వేశారు. కొమ్మమీద ఒయ్యారంగా ఒక క్రౌంచ మిథునం కూర్చుని ఉంది. మగపక్షి ఆడుపక్షి ముక్కును ముక్కుతో నొక్కుతూ ఉంది. రెక్కను ప్రక్కకు దాపి ప్రియురాలిని హత్తుకొంటూ ఉంది. ఆ జంట చూడముచ్చటగా ఉంది. ఆ పక్షుల ప్రణయస్వరం వినముచ్చటగా ఉంది.

వాల్మీకి వాటివైపు చూస్తూ ఉండగానే హఠాత్తుగా ఎక్కడిదో బాణం వచ్చి ఆ

మగ పక్షులను గిలించి. అది గిలగిల తన్నుకొంటూ క్రింద పడింది. నెత్తుటి మురదలో రెక్కలు పెపెప కొట్టుకొంటూ మృతియాలిన పడుతూ ఉంది. ఆడు పక్షి అరుస్తూ - ఆ మగపక్షి చుట్టూ తిరుగుతూ - దాని రెక్కలు ముక్కుతో అటూ ఇటూ కదలిస్తూ దీనాతి దీనంగా దిక్కులు చూస్తూ ఉంది.

వాల్మీకి హృదయం ద్రవించిపోయింది. ఆ మహర్షికి బాణం ఎక్కుపెట్టిన బోయవాడు ప్రక్కనే కన్పట్టాడు. ఆ తపస్వి సావేశం పొంగి పొరలింది. ఒక వైపు కరుణ. మరో వైపు కోపం. అప్రయత్నంగా

మానిషాద ! ప్రతిష్ఠాం త్వ
మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథు నా దేక
మవధీః కామ మోహితమ్

(ఓరీ నిషాదా ! ఎంత పని చేశావురా ! కామమోహితమైన క్రౌంచ మిథునంలో ఒక దాన్ని చంపావు. నీ వెంతో కాలం బ్రతకవు.) అన్నాడు. ఆయన మాటలు ఆయనకే అద్భుతంగా ఉన్నాయి. ఒక్క క్షణం స్తంభించి పోయాడు. 'ఓహో ! ఇది శ్లోకం ! అపూర్వం ! పాద బద్ధంగా ఉందే ! అక్షర సమం గూడ ! అంతే గాదు. తంత్రీలయ సమన్వితం ! శోకరుచినైన నా హృదయం నుంచి ఈ శ్లోకం పుట్టింది. ఇది శ్లోకమే. అనుమానం లేదు' అని తనకు తానే ఆశ్చర్యపడసాగాడు. తనలో తానే మాట్లాడు కోవటం మొదలు పెట్టాడు. ప్రక్కనున్న భరద్వాజుడు 'స్వామీ ! అది శ్లోకమే' అని పెద్దగా అనేదాకా ఆ మహర్షికి పరిసరాల స్పృహనే లేదు.

వాల్మీకి శిష్యుని భుజం తట్టాడు. తృప్తిగా తల ఆడించాడు. అదే విషయం అనేక పర్యాయాలు చెప్తూ శిష్యునితో కలిసి తమసానదిలో స్నానం చేశాడు. అనుష్ఠానాలు ముగించుకొని ఆశ్రమానికి బయలు దేరాడు. ముందు తాను, వెనుక జలపూర్ణకలశంతో శిష్యుడు భరద్వాజుడు, త్రోవ పొడవునా ఆ శ్లోక విషయమే. ఆశ్రమానికి వచ్చిన తరువాత గూడ ఆ మహర్షి మనస్సు శ్లోకం మీదే ఉంది. ఆయన పరధ్యానం అందరిలో ఆసక్తిని రేకెత్తించింది. ఆశ్రమవాసులంతా అందుకు కారణం ఏమని భరద్వాజుణ్ణి అడిగారు. భరద్వాజుడు అందరికి ఆ క్రౌంచమిథునం

సంగతి చెప్పాడు. వాల్మీకి మహర్షి వాక్కునుండి వ్యక్తమైన శ్లోకం చదివి విని పించాడు. అందరు అపూర్వమైన ఆ శ్లోకాన్ని విని ఆశ్చర్యపోయారు. ఆనంద పడ్డారు.

అంతవరకు వాళ్ళంతా విన్నది వేదమంత్రాలే. ఇప్పుడీ శ్లోకంలో సంస్కృత భాష ఏవో క్రొత్త సొగసులు సంతరించుకొన్నట్లుంది. వేదఛందస్సు విలక్షణమైన మలుపు తిరిగినట్లుంది. నవ్యకవితకు లోకంలో నాందీగీతం ఆలపించి నట్లుంది. ఆశ్రమమంతా కాంతిరేఖలతో కళకళలాడుతున్నట్లుంది. మధురగీతాలతో మురిసి పోతున్నట్లుంది.

అయినా వాల్మీకి మహర్షికి ఏదీ పట్టలేదు. ఎవ్వరూ అగుపించటంలేదు. ఆయన కొంతసేపు ఒక వేదిక మీద కూర్చున్నాడు. గాఢంగా ఏదో ఆలో చించు కొన్నాడు. ఆయన కొంతసేపు అటు ఇటు తిరిగాడు. ఎందుకో తల ఆడించాడు. ఆయన కొంతసేపు చెట్టు క్రింద కూర్చున్నాడు. అంతరిక్షంలోకి అట్టె చూచాడు. ఎటు చూచినా ఆయనకు క్రౌంచమే అగుపిస్తూ ఉంది. ఏది ఆలోచించినా ఆయనకు శ్లోకమే వినిపిస్తూ ఉంది.

వాల్మీకి మనస్సు వాల్మీకిలో లేదు.

ఆ స్థితిలో ఆ మహర్షికి అంతరిక్షంలో బ్రహ్మదేవుడు అగుపించాడు. ఆయన భువికి దిగి తనవైపే నడిచి వచ్చాడు. వాల్మీకి ఆ వేదకవికి పాదాభివందనం చేశాడు. అర్ఘ్యపాద్యాలిచ్చాడు. ఆసనం సమర్పించాడు. పూజాదికాలు పూర్తిచేసి చేతులు జోడించి సమక్షాన కూర్చున్నాడు. అయినా ఆయన మనస్సు ఆయనలో లేదు.

ఆ సంగతి చతుర్ముఖుడు గ్రహించాడు. చిరునవ్వు నవ్వుతూ 'ఆదికవీ! అది శ్లోకమే' అన్నాడు.

వాల్మీకి మహర్షికి అమృతం కురిసినట్లుంది. పరిమళం వీచినట్లుంది. కాంతి గిలిగింతలు పెట్టినట్లుంది.

సవినయంగా ఆయన చతుర్ముఖుని కళ్ళల్లోకి చూచాడు. ఆశగా ఏదో అడుగ బోయాడు. అయినా అడుగలేక పోయాడు.

బ్రహ్మదేవుడు తనంతట తానే ప్రియమార 'మహాకవీ!' అని సంబోధించి, నా సంకల్పం వల్లనే నీ నోట ఆశ్లోకం పలికింది. రామకథను నీకు నారదుడు

చెప్పాడుగా-- ఆ కథనంతా శ్లోక బద్ధంచెయ్యి. నీ రచన సమోజ్జ్వలంగా ఉంటుంది. పర్వతాలు, నదులు లోకంలో ఉన్నంతకాలం నీ రామచరిత్ర ప్రచారంలో ఉంటుంది నా అనుగ్రహం వల్ల ఆయావ్యక్తుల బాహ్యరూపాలు, మనస్తత్త్వాలు, ఆంగికసాత్త్వికాది అనుభావవిశేషాలు, వివిధ వాక్యక్రమాలు సర్వమూ నీకు అవగతమౌతాయి నీ రచన ప్రత్యక్షర సత్య మౌతుంది. పాపహర మౌతుంది. రామకథారచన ప్రారంభించు' అని అంతర్ధాన మయ్యాడు.

వాల్మీకి ఆశ్చర్యచకితుడయ్యాడు. రామకథారచనకు నిశ్చయించుకొన్నాడు. ప్రాగగ్రంగా దర్భలు పరచుకొన్నాడు. వాటి మీద ప్రాఙ్ముఖంగా కూర్చున్నాడు. నారదప్రోక్తమైన రామకథను సమాధిబద్ధం చేశాడు. అందులోని ప్రతిపాత్ర రూపాన్ని, ఆలోచనాక్రమాన్ని, సంభాషణ సరళిని, ప్రవర్తన విధానాన్ని ప్రతి దినమూ యోగదృష్టితో దర్శించటం ప్రారంభించాడు.

ఆ మహర్షి అయోధ్యను దర్శించాడు. దశరథుని పుత్రకామేష్టిని దర్శించాడు రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల పుట్టుకను దర్శించాడు. సీతారామ కల్యాణం దర్శించాడు. శ్రీరామవనవాసం దర్శించాడు. సీతాపహరణాన్ని దర్శించాడు. శ్రీరామ సుగ్రీవ సఖ్యం, లంకా దహనం, రావణసంహారం, రామపట్టాభిషేకం సర్వం తన కళ్ళ ముందే జరిగినట్లు చూచాడు. ఆయా వ్యక్తుల ఆంగిక సాత్త్వికాది అనుభావాలను అంతరాత్మైన రసభావాలను, ఆలోచనాక్రమాలను అన్నింటిని ఆయన కనుగొన్నాడు.

ఏనాటి కానాడు రామాయణ రచన ఆ మహర్షి మనస్సులో మధురాతి మధురంగా సాగుతూనే ఉంది. అనుష్టుప్ శ్లోకాలు ఆయన అంతరంగంలో తరంగాల్లా రూపొందుతున్నాయి. రామరాజ్యం మూడు పువ్వులు ఆరుకాయలుగా అలరారుతూ ఉంది. ధర్మం నాలుగు పాదాల నడుస్తూ ఉంది. ప్రజలు సుఖశాంతులతో జీవిస్తూ ఉన్నారు. రామాయణం నిరవత్తరంగా రూపుదిద్దుకొంటూ ఉంది.

ఆనాడు ఆశ్రమంలో వాల్మీకి మహర్షి తృప్తిగా నిట్టూర్చి దర్భాసనం మీది నుండి లేస్తున్నాడు, అంతలోనే మునిబాలకులు పరుగెత్తుకొంటూ వచ్చారు. ఆయన పాదాలకు నమస్కరించారు. కొందరి ముఖాల్లో ఆశ్చర్యం. కొందరి ముఖాల్లో ఆవేదన. కొందరి ముఖాల్లో ఆందోళన. అందరు ఒక్కసారిగ 'భగవాన్! భాగీరథీ తీరంలో ఎవరో ఒకామె ఏడుస్తూ ఉంది. ఒంటరిగా ఉంది అన్నారు.

మహర్షి ప్రశాంత గంభీరంగా ఆ ముని బాలకుల వైపు చూచాడు.

ఒక మునిబాలకుడు 'స్వామీ ! ఆమె సామాన్య స్త్రీగాదు ఎవరో దేవకాంత అన్నాడు చేతులు జోడించి.

మరొకడు 'మహర్షీ ! ఆమె ఎందుకో పాపం। వెక్కి-వెక్కి ఏడుస్తూ ఉంది' అన్నాడు తానూ ఏడుస్తూ.

ఇంకొకడు 'గురుదేవా ! ఆమె మన ఆశ్రమానికి చేరువలో ఉంది. అతిథ్యం ఇవ్వండి. ఆదరించండి' అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

వాల్మీకి మహర్షి అర్ధనిమీలిత నేత్రుడయ్యాడు. అంతా యోగ దృష్టితో చూచాడు. ఆమె సీత పతిపరిత్యక్త. ఇంతవరకు తాను రామకథారచయిత. ఇక ముందు ఆ మహాకథలో తానొక పాత్ర, ఎంతో బాధ్యతా భారాన్ని వహించవలసిన పాత్ర. వాల్మీకి ఒక్క నిట్టూర్పు విడిచి, గంభీరంగా తల పంకించి, కమండలం యోగదండం చేతబట్టి వెంటనే బయలు దేరాడు। ముందు మునిబాలకులు వెనుక తాను. అంతా గంగా తీరం చేరారు.

సీత ఆకాశంనుండి తెగిపడిన నక్షత్రంలా ఉంది. దుఃఖసాగరంలో మునిగి పోతున్న తెప్పలా ఉంది. ఆమె ఏ పరిస్థితిలో ఉందో ఆమెకే తెలీదు. శోకించి శోకించి సొమ్మ సిల్లి పడిఉంది. కమండలోదకం ముఖాన చల్లి 'అమ్మా ! సీతా మహాసాధ్వీ !' అన్నాడు వాల్మీకి మహర్షి ఆర్ద్రంగా. ఆమెకు అమృతం కురిసి నట్లుంది. ఆశాకిరణం అగుపించి నట్లుంది. సీత తలయెత్తి చూచింది. కొండంత దుఃఖాన్ని గొంతులో దిగమ్రింగు కొని బొట బొట రెండు కన్నీటి బొట్లు రాల్చింది

వాల్మీకి మహర్షి చెయ్యెత్తి 'శుభమస్తు'। అన్నాడు.

ఆమె చేతులు జోడించి నమస్కరించింది. 'అమ్మా ! అంతా నాకు తెలుసు నీవు మహాపతివ్రతవు. బాధపడకు. మన ఆశ్రమానికి పోదాం పద' అన్నాడు కన్న కూతురిని ఇంటికి పిలిచినట్లు.

సీత తన స్థితికి తానే ఆశ్చర్యపడింది. అయోధ్యా రాజ్యాంతఃపురం ఎక్కడ ? అరణ్యంలో మున్యాశ్రమం ఎక్కడ ? ఆమె కన్నీళ్ళు తుడుచుకుంది. మెల్లగా లేచి కూర్చుంది.

'అమ్మా ! నడువగలవా ?' అన్నాడు వాల్మీకి మహర్షి ప్రసన్నంగా ఆమె గర్భం వైపు చూస్తూ.

ఆమె నెమ్మదిగా ఆ మహర్షికి పాదాభివందనం చేసింది. ఆయన వెంట బయలుదేరింది.

ఆశ్రమం చేరుకోగానే తాపసస్త్రీలంతా ఎంతో ఆప్యాయంగా ఆమెకు స్వాగతం పలికారు. వాల్మీకి మహర్షి వారితో మన ఆశ్రమానికి సాక్షాత్తు మహాలక్ష్మి వచ్చిందన్నారు. జనక మహారాజు కూతురు, దశరథ మహారాజు కోడలు, శ్రీరామచంద్రుని పత్ని - సీతామహాదేవి మన ఆశ్రమానికి రావటం ఎంత భాగ్యం అన్నారు. ప్రియపుత్రికను తొలికాన్పుకు తన యింటికి పిలుచుకు వచ్చే తండ్రి పొందే ఆనందం నాది అన్నారు.

ఆ మాటకు తాపసకాంతలంతా ఒకరి ముఖాలొకరు చూచుకొన్నారు. అందరు ఆనందంగా సీతవైపు చూచారు. ఆమె చేతులు పట్టి మెల్లగా ఆశ్రమంలోకి నడిపించారు. అమ్మా ! అనే వాళ్ళుకొందరు. తల్లీ ! అనేవాళ్ళు కొందరు. అక్కా ! అనేవాళ్ళు కొందరు. చెల్లీ ! అనేవాళ్ళు కొందరు. ఎంత ఆర్ద్రత ! ఎంత ప్రేమ ! ఎంత ఆదరణ ! ఎంత గౌరవం ! అంతా ఆమెనుపలుకరించే వాళ్ళే. అంతా ఆమెకు పరిచర్య చేసేవాళ్ళే ఆమెకు పూలమీద నడుస్తున్నట్లుంది. వెన్నెల్లో విశ్రాంతి తీసుకొంటున్నట్లుంది. మానవత్వంలోని మాధుర్యమంతా మీదికి పొంగి పొరలి నట్లుంది.

అయోధ్యా రాజ్యాంతఃపురంలో ఉండవలసిన సీత అనుకోకుండా అడవిలో వాల్మీకాశ్రమవాసిని అయింది.

రామాయణం మరో పెద్దమలుపు తిరిగింది.

అది వాల్మీకి మహర్షికే ఆశ్చర్యంగా ఉంది.

విడిపడిన సీతారాములు ఎలా కలియాలో ! ఎప్పుడు కలియాలో !

ఏమీ తోచటం లేదు.

ప్రతి ఉదయం పూజాదికాలు పూర్తిచేసుకొని సీతాదేవి వాల్మీకిసన్నిధికి వచ్చేది. ఆ మహర్షి వేదిక మీద దర్భాసనస్థుడై వేదమూర్తిలా వెలుగుతూ రామకథ వినిపించే వారు. రామకథ ఆమె భర్తకథ. ఆమెకథ మరి ఆ మహర్షి వినిపించేది ఆమెకో ! ఆమె గర్భవాసంలో పెరుగుతున్న ఆమె కుమారులకో ! మహర్షుల సంకల్పాలు మహా నిగూఢాలు; మహార్థ సాధకాలు.

ఆనాటి కథ సీతాపరిత్యాగం. అది విని ఆమె భారంగా లేచి వెళ్ళింది. మరునాడు ఉదయం ఆమె మహర్షి దగ్గరకు రాలేదు.

అనుకోకుండా ఆనాడు శత్రుఘ్నుడు వాల్మీక్యాశ్రమానికి వచ్చాడు. ఆయన లవణాసుర సంహారానికై వెళ్ళుతున్నాడు. ఆ రోజంతా వాల్మీకి మహర్షికి ఆయనతోనే సరిపోయింది.

అర్ధరాత్రి మునిబాలకులు పరుగెత్తుకొంటూ వాల్మీకి మహర్షి దగ్గరకు వచ్చారు. 'భగవాన్ ! రామపత్ని ఇద్దరు మగపిల్లల్ని కన్నది. భూతదోష నివారకంగా మీరు ఆ కవల పిల్లలను రక్షకట్టాలి' అన్నారు.

ఆ రాత్రి ఆశ్రమంలో నిద్రలేదు. వాల్మీకి ఆనందానికి అవధిలేదు. ఆయన హడావిడిగా లేచాడు. కుశలను, లవలను (దర్భలు) చేతికి తీసుకొన్నాడు. భూత సంహారకాలైన మంత్రాలు జపించాడు. ఆ దర్భలను వాకిట్లో వేచి ఉన్న వృద్ధాంగనల చేతికిచ్చాడు. 'ముందు పుట్టిన వాణ్ణి కుశలతో తుడువండి. కుశుడని పేరు పెట్టండి' వెనుక పుట్టిన వానిని లవలతో తుడువండి. లవుడని పేరు పెట్టండి' కుశలవ నామధేయులై ఆ కవలలు కీర్తి కెక్కుతారు' అన్నాడు.

అప్పుడు శత్రుఘ్నుడు గూడ ఆ శుభవార్తవిని సంతోషాతిశయంతో సీతాదేవి ప్రసవించి ఉన్న పర్ణశాలకేగి ప్రక్క కొదిగి నిలిచి 'అమ్మా ! కుశలమా ? అన్నాడు

ఆమె తల మలిపి ఒక్కసారి మరిది వైపు చూచింది.

శత్రుఘ్నుడు చేతులు జోడించి నమస్కరించాడు. ఎందుకు వచ్చావని ఆమె అడుగలేదు. ఎప్పుడు వచ్చావని గూడ అడుగలేదు. ఎందుకు వచ్చిందీ ఆయన చెప్పలేదు. ఎప్పుడు వచ్చిందీ ఆయన చెప్పలేదు. వేకువనే వాల్మీకి మహర్షికి నమస్కరించి శత్రుఘ్నుడు తన పనిమీద తాను వెళ్ళాడు.

కుశలవులు దినదిన ప్రవర్ధమానులౌతున్నారు. వాల్మీకి దగ్గర విద్యాబుద్ధులు నేర్చుకొంటున్నారు. వారి స్వరం మహా మనోహరం. వారి తేజస్సు అద్భుతం. వారి బలం అమోఘం. వారిని చూడాలని. వారి వాక్కు వినాలని ఆశ్రమంలో అందరూ ఉవ్విళ్ళూరే వారే. వారి బలం ఊహించుకొని అందరూ ఆశ్చర్యపడే వారే.

సీతాదేవి కొడుకుల్ని చూసుకొని కొండంత సంతోషంతో ఉంది. కొడుకుల రూపంలో ఆమెకు రాముడు కనిపిస్తూ ఉన్నాడు. కొడుకుల మాటల్లో ఆమెకు రాముడు వినిపిస్తూ ఉన్నాడు. తల్లిగా ఆమెకు ఎంతో తృప్తి ఉంది ఇల్లాలుగా ఆమె ఎంతో కుమిలిపోతూ ఉంది.

వాల్మీకి మహర్షికి ఆమె స్థితి పూర్తిగా తెలుసు. అయినా ఆమె సమస్యకు పరిష్కారం ?

అన్నీ తెలిసి అంటే రాముడె ఆమెను వదలివేశాడు. అలాంటప్పుడు ఆయనకు ఎవరు చెప్పగలరు ? ఏమని చెప్పగలరు ?

వాల్మీకి మహర్షి ఆలోచిస్తూనే ఉన్నాడు. ఒక్కొక్కసారి ఈలాంటి సమస్యలు పిల్లల వల్లనే బాగా పరిష్కారమౌతాయి. సీతారాముల సమస్యను కుశలవులే పరిష్కరించాలి. ఎప్పుడో ! ఎలాగో !

అంతదాకా రామాయణ మహాకావ్యం వాల్మీకి మహర్షి హృదయంలోనే ఉంది. మహారత్నంగా రూపు దిద్దుకొంది. కవిత హృదయంలోనే ఉంటే కవికి తృప్తి ఉంటుందా ? కవితకు చరితార్థత చేకూరుతుందా ?

కవిత కవిహృదయం నుంచి బహిర్గతం కావాలి. అందలి ప్రతిభావం, ప్రతి పదం మానవహృదయాన్ని పరవశం చేయాలి బహుళ ప్రచారం పొందాలి సమర్థులు, సత్పురుషులు అయిన వారే ఆ కవితా ప్రచారకార్యక్రమం చేపట్టాలి. మహాజన సభాసమక్షంలో ఆ కవిత వినిపించే మహదవకాశం గూడ రావాలి. ఇవన్నీ జరిగినా ఆ కవిత గొప్ప సామాజిక ప్రయోజనం సాధించాలి. హితోపదేశం చెయ్యాలి. జగద్ధితం కావాలి.

రామాయణం ఒక మహాపురుషచరిత్ర. మానవునికి ధర్మస్ఫూర్తి నిచ్చే చరిత్ర. ధ్యాననిరతిని ప్రబోధించే చరిత్ర. మానవుని దివ్యునిగా తీర్చిదిద్దే చరిత్ర. లోకాన్ని పరవశం చేసే చరిత్ర. మధురాతి మధురమైన మానవ చరిత్ర. మానవ జాతికి మహోపదేశమిచ్చే చరిత్ర. మానవ లోకంలో శాశ్వతంగా నిలిచే చరిత్ర. ఈ విషయం బ్రహ్మదేవుడు ముందే వాల్మీకితో చెప్పాడు. ఇక ఆయన చెప్పింది జరగాలి అంతే.

కాగా రామకథ వల్లనే సీతారాముల సమస్య పరిష్కారం కావాలి. రామకథ వాల్మీకి కీర్తిలోకంలో కలకాలం నిలవాలి. రామకథ వల్లనే మానవజాతి తరించాలి.

అన్నీ ఆలోచించే కాబోలు ఆ వాల్మీకి మహర్షి అంతవరకు తన హృదయం లో రూపు దిద్దుకొన్న రామాయణ కావ్యాన్ని బహిర్గతం చెయ్యాలనుకొన్నాడు. రామకథను లోకంలో ప్రచారం చెయ్యవలసిన సమయం గూడ ఆసన్నమైందను కొన్నాడు. అందుకు కుశలవులనే ఎన్నుకొన్నాడు ఆ బాలురిద్దరికి రామకథనురసవత్తరంగా నేర్పాను. వాళ్ళు పరవశించి గానం చేస్తుంటే వాల్మీకి మహర్షే పులకించి పోయేవాడు. ఆశ్రమవాసులంతా ఆకలిదప్పులు మరచి వినేవారు. పశువులన్నీ మేత మాని మోరెత్తి నిలిచేవి. పూలు,తీవలు—బొమ్మలు, చెట్లు లయలు ఆడిస్తూ అద్భుతఆలకించేవి. ఇక సీతమ్మ సంగతి చెప్పనే అక్కరలేదు.

ఋష్యాశ్రమం ఒక రసప్రపంచమై రాజించేది.

వాల్మీకి హృదయం ఎంతో తృప్తిగా ఉంది.

అంతలోనే శ్రీరాముని అశ్వమేధానికి రమ్మని ఆయనకు ఆహ్వానం వచ్చింది అర్ధనిమీలితనేత్రుడై ఆయన సాలోచనగా ఉండిపోయాడు. కుశలవులను, మునిశిష్యులను పిలిచి మనం అశ్వమేధానికి వెళ్ళాలన్నాడు.

అది గోమతీతీరం. నైమిశారణ్యం. శ్రీరాముని అశ్వమేధం. మంత్రులతో సామంతులతో, పౌరజానపద ప్రముఖులతో, ఆహూతులైన మహర్షులతో, వివిధ దేశాధీశ్వరులతో, సుగ్రీవాది వానరులతో, విభీషణాది రాక్షసులతో ఆ ప్రదేశ మంతా కళకళలాడుతూ ఉంది. అరణ్యమంతా మహానగరంగా మారినట్లు అనిపిస్తూ ఉంది. ఎటు చూచినా సత్రాలే; పర్ణశాలలే, హోమకుండాలే. ఎక్కడ విన్నా వేదమంత్రాలే; శాస్త్రచర్చలే; పురాణప్రవచనాలే.

అందుకు తోడు అనేక వస్తువులతో అలరారే అంగళ్ళు; వివిధ వినోదాలు.

సువిశాల యాగశాలలో సువర్ణసీతను ప్రక్కనిడుకొని శ్రీరామచంద్రమూర్తి అశ్వమేధం చేస్తున్నాడు. వచ్చేవారికి, ఇచ్చేదానాలకు అవధిలేదు. అదొక ఇంద్రలోకంలా ఉంది, అదొక బ్రహ్మలోకంలా ఉంది. యాగం సాంగోపాంగంగా సాగుతూ ఉంది.

అది మహర్షివాటిక. అందులో అందమైన ఒక పర్ణశాల. శిష్యసమేతంగా వాల్మీకి మహర్షి అందులో విడిది చేశాడు. ఆశీస్సులు తీసుకొని ఒనాడు కుశలవు

లను చేరపిలిచాడు. ప్రియాతి ప్రియంగా 'మీరిద్దరు ఇక రామాయణ కావ్యగానం ప్రారంభించండి శ్రీరాముని యాగశాలలో, మహర్షివాటికలో, మహారాజనివాస ప్రదేశంలో మధురాతిమధురంగా గానం చెయ్యండి కందమూలాలూ, ఫల పత్రాలు మాత్రమే స్వీకరించండి శ్రీరామనృపాలుడు మీగానం వినాలని మిమ్మల్ని పిలుస్తాడు నియమనిష్ఠతో రోజుకు రెండు సర్గల చొప్పున గానం చెయ్యండి. ధైర్యంగా గానం చెయ్యండి. ధనాపేక్ష వదలండి ఆయన ధనరాసులిచ్చినా తిరస్కరించండి. ఎవరు మీరని అడిగితే వాల్మీకిమునిశిష్యులమని చెప్పండి' అన్నాడు

ఆ రామాయణ కావ్యగానంతో వాల్మీకి మహర్షి ఏ మహాప్రయోజనాన్ని సంకల్పించాడో !

మరునాటి ఉదయమే కుశలవులు రామకథా గానం ప్రారంభించారు.

కథ పరమపవిత్రం. రచన రమణీయం. గానం మనోహరం. పాదం విన్న వాళ్ళు -- పదం విన్నవాళ్ళు వ్యక్తులు పరవశించిపోతున్నారు. ఎక్కడ చూచినా రామాయణ కావ్యగాన ప్రస్తావనలే. కుశలవుల ప్రశంసాపరంపరలే యాగ ప్రస్తావనలు అడుగున పడ్డాయి. అశ్వమేధాన్ని ఆ రామాయణం కప్పివేసింది.

రాముడు కుశలవులను పిలిపించాడు వారి రూపు చూచి ఆశ్చర్యపోయాడు వారి గానం విని పులకించి పోయాడు. ముమ్మూర్తులా వారు తనలాగే ఉన్నారు. గానంలో వారి ముందు గంధర్వులైనా తలక్రిందే.

రామాయణం విన్న తరువాత రాముని కళ్ళు చెమ్మగిల్లాయి. కుశలవులు సీతాదేవి కొడుకులని తెలిసిపోయింది. ఆమె పాతివ్రత్యాన్ని పరీక్షించి భార్యా పుత్రులను పరిగ్రహించాలనుకొన్నాడు. వెంటనే వాల్మీకి దగ్గరకు దూతలను పంపాడు.

వాల్మీకి మహర్షి సంకల్పం సఫలమైంది. సీతారామపునస్సమాగమానికి రంగం సిద్ధమైంది.

వచ్చిన దూతలతో వాల్మీకి 'సతికి పతియే గదా దైవం' అన్నాడు. రాముడు కోరినట్లు సీతాదేవి రేపు ఉదయమే ఆయన సమక్షానికి వచ్చి తన పాతివ్రత్యాన్ని గూర్చి ప్రమాణం చేస్తుందన్నాడు.

అశ్వమేధయాగకాలంలో అది బ్రహ్మాండమైన సభ. మంత్రి సామంత పురోహిత పౌరజానపదులతో, వానరరాక్షస మహర్షి ప్రముఖులతో సభ క్రిక్కిరిసిపోయింది. ఉన్నతాసనం మీద శ్రీరాముడు కొలువు దీరాడు. మహర్షి వాల్మీకి మహోదాత్తంగా ముందుకు అడుగులు వేసుకొంటూ సభలోకి వచ్చాడు. అశ్రుబిందువులు రాలుస్తూ అంజలి ఘటించి, అవనతవదనయై ఆ సీతాదేవి ఆ మహర్షిని అనుసరించి సభలో అడుగుపెట్టింది. ఆ దృశ్యాన్ని చూస్తుంటే బ్రహ్మవెంట వేదం నడిచి వచ్చినట్లుంది. అందరు హర్షధ్వానాలు చేశారు. సరాసరి వాల్మీకి మహర్షి శ్రీరాముని సమక్షాన నిలిచాడు. చేయెత్తి ఆశీర్వదించాడు. గంభీర స్వరంతో 'శ్రీరామా! సీతమహాపతివ్రత. సుచరిత. ఇంతకాలం నా ఆశ్రమంలోనే ఉంది. కుశలవులు మీ సమానులు. శత్రువులకు అజేయులు. ప్రచేత పుత్రుడను, తపస్విని అయిన నా మాటను నమ్ము. ఈ పవిత్రచరిత్రను పరిగ్రహించు' అన్నాడు.

అందుకు రాముడు 'మహర్షీ! మీరు చెప్పింది నిజమే. సీత మహాపతివ్రత. పవిత్రచరిత్ర. ఆ సంగతి నాకూ తెలుసు. ఆమె లంకలోనే ఆ సంగతి నిరూపించింది. అయినా లోకాపవాదం బలీయం. భయంకరం. లోకాపవాదభీతి చేతనే నేనామెను పరిత్యజించాను. సర్వజన సమక్షంలో సీత ఇప్పుడు తన పవిత్రతను నిరూపించుకొంటేగాని నా మనస్సు ఆమె పట్ల ప్రేమ చూపలేను' అన్నాడు.

కథ చిత్రమైన మలుపు తిరిగింది. అందరు చూస్తూండగానే సీత తన పాతివ్రత్యాన్ని గూర్చి ప్రమాణం చెయ్యటము, భూమి బద్దలు కావటము, భూదేవి పైకి రావటము, సీత ఆమె అంకంలో కూర్చుని అదృశ్యం కావటము క్షణంలో జరిగిపోయాయి.

శ్రీరాముని శోకానికి అవధిలేదు.

ఆ సమయంలో అక్కడికి వచ్చియున్న బ్రహ్మాదిదేవతలు రాముని అనేక విధాల ఓదార్చారు. ప్రత్యేకించి బ్రహ్మదేవుడు రాముని విష్ణుత్వాన్ని తెలియచెప్పారు. ప్రాకృతుని వలె వగవకుండ భవిష్యత్కృతను తెలుసు కొమ్మన్నాడు.

అంతలోనే సూర్యాస్తమయమైంది. మరునాటి ఉదయం మరల కుశలవులు వచ్చారు. మిగతకథ వినిపించారు.

అశ్వమేధం సమాప్తమైంది.

శ్రీరాముడు కుశలవులను కొడుకులుగా స్వీకరించాడు

రామాయణంలో వాల్మీకి మహర్షి పాత్ర ముగిసింది. ఆయన చిత్రమైన ఒక చిరు నవ్వునవ్వాడు. శిష్యులతో కలిసి ఆశ్రమానికి చేరుకొన్నాడు. తనలో తాను లీనమై పోయాడు. ఆదికవిగా, మహాకవిగా లోకంలో నిలిచిపోయాడు.

# వసిష్ఠమహర్షి

స్వార్థాన్ని శరీరధారణకు మాత్రమే పరిమితంచేసి ప్రజాహితాన్ని, ప్రభుహితాన్ని, అన్నింటిని మించి ధర్మపరిరక్షణాన్ని జీవితపరమార్థాలుగా స్వీకరించి, వేదవిహిత మార్గంలో పయనించిన మేధావి వ్యవస్థ ప్రాచీన భారతీయ పురోహిత వ్యవస్థ. పురోహితులది ఒక పవిత్ర జీవిత విధానం. వారిది పరమ సాత్త్విక స్వభావం. వేద విద్యయే వారి మూలధనం. ధర్మచింతన, కర్మాచరణ, సమచిత్తత, నిర్లిప్తత వారి విశిష్ట గుణాలు. అందుచేతనే వారికి సమాజంలో గురుస్థానం లభించింది. అందుచేతనే వారి ఉపదేశాలను, ఆదేశాలను అనాటి ప్రభువులు ప్రజలు శిరసావహించారు. సాగిలపడి వారికి నమస్కరించారు.

క్షాత్రం రజస్తమోగుణాల సమ్మేళనం. ప్రభువుల కది ప్రధాన గుణం. దేశరక్షణకు, శత్రుశిక్షణకు రాజ్యవిస్తరణకు అది అవసరం. అయినా అది సత్త్వబద్ధం కాకుంటే ప్రజాపాలనకు అట్టే పనికిరాదు. ప్రజాపాలన సమదృష్టితో, నిండుగా నిదానంగా సాగవలసిన వ్యవహారం. అందుచేతనే ప్రాచీనకాలంలో రజస్తమోగుణ ప్రధానమైన ప్రభువ్యవస్థకు, సత్త్వగుణ ప్రధానమైన పురోహితవ్యవస్థ హితవరిగా నిలిచింది ప్రజాశ్రేయస్సుకు పరిపరి విధాల తోడ్పడింది.

ఆదర్శప్రాయమైన ఆ పురోహితవ్యవస్థకు మకుటాయమానంగా నిలిచిన మహావ్యక్తి వసిష్ఠమహర్షి. ఆ మహర్షిని చూస్తే అందరికీ గౌరవభావమే. సమున్నత కృశశరీరంతో, ప్రశాంతవదనంతో, విభూతిరేఖలు మెరిసే విశాలఫాల భాగంతో, అరుణబింబం లాంటి కుంకుమ బొట్టుతో, కైలాసశృంగం లాంటి జటాజూటంతో, మందాకినీ జలపాతం వంటి గడ్డంతో వెలుగులు విరజిమ్మే లోతైన

నేత్రాలతో, చేత జపమాల, మెడలో రుద్రాక్షమాల ధరించి, చిరునవ్వు చిందే పెదవులతో ఆ బ్రాహ్మీమయమూర్తి ప్రత్యక్షమైతే ఎవరైనా ఆయనకు చేతులెత్తి నమస్కరించ వలసిందే.

ఆయన ధర్మదృష్టి మహామునిశీలం. ఆయన ఆశ్రమం పరమపవిత్రం. అదొక అపరబ్రహ్మలోకం. ఆశ్రమంలో ఎటుచూచినా మునిజనసమూహాలు; హోమధూమాలు; వేదమంత్రాలు; అతిథి సత్కారాలు.

ఆశ్రమంలో హోమధేనువు శబల ఒకగొప్ప ఆకర్షణ. ఆ కామధేనువే వసిష్ఠవిశ్వామిత్రుల వైరకారణం. ఆ మహర్షుల వైరం అనేక వైపరీత్యాలకు దారి తీసింది. అయినా చివరకు విశ్వామిత్రుని తపశ్శక్తిని వసిష్ఠమహర్షి మెచ్చుకొన్నాడు. ఆయన సాధించిన బ్రహ్మర్షిత్వాన్ని అంగీకరించాడు. కులదేవతా సమక్షంలో బ్రహ్మర్షీ! అని సంబోధించాడు. అంతటితో వైషమ్యానికి అంతం చేశాడు. అవగాహనను, ఆప్యాయతను పెంపొందించాడు.

వసిష్ఠ మహర్షి మొదటినుండి ఇక్ష్వాకువంశ పురోహితుడు. ఆ వంశంలో ఆయనకు తెలియని విశేషాలులేవు. దుఃఖం కలిగినప్పుడు సందేహాలు తల యెత్తినప్పుడు, వైదికక్రియలు సంకల్పించినప్పుడు ఇక్ష్వాకు వంశరాజులందరు ఆయనతో సంప్రదించారు. ఆయన హితవాక్యాలను శిరసావహించారు.

దశరథమహారాజు పుత్రులు లేనందువల్ల తాను పొందే ఆవేదనను, అశ్వమేధ యాగం చేసి పుత్రులను పొందాలన్న తన ఆకాంక్షను బ్రాహ్మణ సభాసమక్షాన ప్రకటించినప్పుడు అందరి పక్షాన 'ఓ మహారాజా! నీ సంకల్పం స్తుతిపాత్రం. సర్వసంభారాలు సిద్ధంచేయించు. యజ్ఞాశ్వాన్ని విడిపించు, సకలసద్గుణసంపన్నులైన సుతులు నీకు జన్మిస్తారు' అని ఆశీర్వదించింది వసిష్ఠమహర్షి. తాను ఇక్ష్వాకుకుల పురోహితుడై యుండి దశరథుని అభీష్టాన్ని మన్నించి ఆయన వెంట వెళ్ళి ఋష్యశృంగుని ఋత్విక్కుగా నిలిపియాగం జరిపించింది వసిష్ఠమహర్షి. రామలక్ష్మణులకు జాతకర్మలు జరిపింది, నామకరణం చేసింది, విద్యాబుద్ధులు నేర్పింది, విశేషించి శ్రీరామచంద్రుని శస్త్రాస్త్రకోవిదునిగా, సకల విద్యాపారంగతునిగా తీర్చిదిద్దింది వసిష్ఠ మహర్షియే. విశ్వామిత్రుని వెంట శ్రీరాముడు వెళ్ళటానికి గూడ ఆనాడు దోహదం చేసింది ఈ మహాగురువే.

'నా రాముడు పసివాడు. రాక్షసుల మీదికి పంపను. నేనే సైన్యంతో వచ్చి ఆ రాక్షసుల వధిస్తాను' —అంటాడు దశరథుడు.

'నాకు కావలసింది శ్రీరాముడు, నీవు కాదు. ఇన్నమాట ప్రకారం పంపిస్తావా ? అసత్యఫలాన్ని అనుభవిస్తావా ?' అంటాడు విశ్వామిత్రుడు.

ఆనాటి సభలో అదొక విషమ స్థితి. ఎవ్వరికి దిక్కుతోచని స్థితి. ఎవరు ముందుకు రాగలరు ! ఏమని చెప్పగలరు !

అప్పుడందరికి వసిష్ఠు డొక్కడే దిక్కు. అందరు ఆయనవైపే ఆశతో చూచారు. శిష్యుని శక్తి సామర్థ్యాలు ఆ కులగురువుకు తెలుసు. దశరథుని పుత్ర మమకారం గూడ ఆ మహర్షికి తెలుసు. విశ్వామిత్రుని మహత్తు గూడ ఆ మహాత్మునికి తెలుసు. అసత్య దోషం, ఆ గాధేయుని కోపం అన్నీ ఆ ధార్మికునికి తెలుసు. కాని విశ్వామిత్రుడు ఒకనాటి తన ప్రత్యర్థి. ఆయన ఇప్పుడు స్వయంగా వచ్చి తన శిష్యుణ్ణి సాయంగా పంపమంటున్నాడు—అందులోనూ సదుద్దేశంతో, అది ఎంతెంతో గౌరవం ! ఎంతెంతో పురస్కారం !

విశ్వామిత్రుని ఆగ్రహాన్ని శాంతింపజేయను సభలో అంతా నిలబడి ఉన్నారు. ఎవ్వరూ ఇప్పుడు గూడ ఏమీ అనటం లేదు.

రాముడు ప్రసన్నముఖుడై ప్రక్కనే ఉన్నాడు.

దశరథుడు దుఃఖంతో క్రుంగి పోతున్నాడు.

విశ్వామిత్రుడు కోపంతో పొగలు గ్రక్కుతున్నాడు.

అప్పుడు వసిష్ఠమహర్షి మెల్లగా ముందుకు నడిచాడు. ఆర్ద్రంగా శిష్యుని వైపు చూచాడు. తల అల్లన ఆడించాడు. స్నేహపూర్వంగా విశ్వామిత్రునివైపు చూచాడు. చిరునవ్వు నవ్వాడు. ఆదరంగా దశరథుని వైపు చూచాడు. చేయెత్తి ఆశీర్వదించాడు. ప్రశాంత గంభీర స్వరంతో —'దశరథా ! నీవు సాక్షాత్తు రూపు దాల్చిన ధర్మంలా ఇక్ష్వాకువంశంలో జన్మించావు. ధైర్యశాలివి. సువ్రతుడివి. అలాంటి నీవే ధర్మం తప్పితే ఎలాగ ? అసత్యదోషమే అంటిననాడు నీవుచేసిన యజ్ఞయాగాలు, అన్నదానాలు, వాపీకూప తటాకాది నిర్మాణాలు అన్నీ నిష్ఫలాలేగదా. చెప్పిన ప్రకారం శ్రీ రామచంద్రుని విశ్వామిత్రుని వెంట పంపు. అగ్నిమధ్యస్థ మయిన అమృతాన్ని ఎవ్వరూ అంటలేనట్లే విశ్వామిత్ర రక్షణలో ఉన్న రాముణ్ణి

రాక్షసులు చెనకలేరు. విశ్వామిత్రుడు ధర్మాత్ముడు. మహావీరుడు తపోధనుడు. శస్త్రాస్త్ర విజ్ఞానంలో అద్వితీయుడు. అనేకానేక శస్త్రాస్త్రాలు ఆయన అధీనంలో ఉన్నాయి. అవసరమైతే అపూర్వాలైన శస్త్రాస్త్రాలను గూడ ఆయన సృజించగలడు ఆ మహానుభావుని వెంట మన రాముణ్ణి పంపటానికి ఏమాత్రం అనుమానించవద్దు. అనుకొంటే ఆయన స్వయంగా రాక్షసులను సంహరించగలడు. నీ కొడుకులకు మేలు చేయాలన్న సంకల్పంతోనే ఆయన ఇన్నడుగుతున్నాడు' అని తన ప్రభువుకు హితబోధ చేశాడు. తన ప్రత్యర్థి విశ్వామిత్రుని గుణగణాలు కొనియాడాడు. పరిస్థితిని చక్కదిద్దాడు.

శ్రీరాముడు గురువుగారి పాదాలకు నమస్కరించాడు. విశ్వామిత్రుని వెంట బయలు దేరాడు. ముందు విశ్వామిత్రుడు; వెంట రాముడు; వెనుక లక్ష్మణుడు.

అదొక రసవత్తర దృశ్యం.

అంతవరకు వసిష్ఠుడు అస్త్రవిద్యలో ఆ రాముణ్ణి తీర్చిదిద్దాడు. ఇప్పుడు ఆ ప్రియశిష్యుణ్ణి తన ప్రత్యర్థి అయిన విశ్వామిత్రుని వెంట పంపుతున్నాడు. శిష్యుని సామర్థ్యం మీద, ప్రత్యర్థి సహృదయత మీద ఆ మహర్షి కెంత విశ్వాసమో !

ఎందుకో వసిష్ఠమహర్షి ఒకనాడు ఆశ్రమంలో దర్భాసనం మీద కూర్చుని, అంతకు ముందెన్నడో రాముని అస్త్రవిద్యాసాధనలో ముక్కలై మూలపడి ఉన్న ఒక మహాధనుస్సు వైపు అదే చూస్తున్నాడు. అంతలోనే సుతుడు సుయజ్ఞుడు వచ్చాడు.

'పితృదేవా ! నా ప్రియమిత్రుడు రాముడు ఇంకా తిరిగిరా లేదే' అన్నాడు.

వసిష్ఠమహర్షి సాభిప్రాయంగా సుయజ్ఞుని ముఖంలోకి చూసి, చిరునవ్వు నవ్వి, అల్లన తల ఆడించాడు.

అంతలోనే రాజభటుడు వచ్చాడు. దశరథమహారాజు మిమ్మల్ని సభకు రమ్మంటున్నారని ఆహ్వానించాడు.

సభలో సీతారామకల్యాణ శుభవార్త. ఇక మగపెళ్ళివారి పౌరోహిత్యమంతా వసిష్ఠుల వారిదే. తన ప్రియశిష్యుడు శ్రీరాముడు తాటకను సంహరించటం, ఆ విశ్వామిత్రుని మెప్పుపొందటం, అనేక శస్త్రాస్త్రాలు ఆయన చేతిమీదగా అందు

చాడు. మరునాడు అభిషేకమహోత్సవం. ఉషఃకాలాన్నే వసిష్ఠమహర్షి, శిష్యులు, ఆహూతులైన బ్రాహ్మణశ్రేష్ఠులు సరయూనదిలో స్నానం చేశారు. విభూతిరేఖలు తీర్చుకొని, ఇసుక తిన్నెల మీద కూర్చుని సంధ్యావందనాది పూర్వాహ్ణికాలు పూర్తిచేశారు.

ఆరోజు సరయూనది వేదమంత్రాలతో ఊగిపోయింది.

నొసటి విభూతిరేఖలతో, మెడలోని రుద్రాక్షమాలలతో, జడలు గట్టిన జుట్టుతో, నిడుపైన గడ్డాలతో, చేతయోగదండాలు, కమండలాలు ధరించి వేద మంత్రాలు వల్లెవేస్తూ వసిష్ఠమహర్షి, శిష్యులు, తక్కిన బ్రాహ్మణోత్తములు మూర్తీభవించిన వేదపరంపరలా అయోధ్యానగర వీథుల్లో నడచివెళ్ళుతుంటే త్రోవ కిరుపైపులా బారులు దీరి ప్రజలు నమస్కరించారు.

ఆ బ్రాహ్మణోత్తములంతా రాజభవనం చేరుకొన్నారు. అభిషేక మంటపం లో హోమవేదికకు అన్నిపైపుల ఆసీనులయ్యారు. దర్భనిర్మితమైన అగ్రాసనం మీద వసిష్ఠమహర్షి ఆయన ప్రక్కనే వామదేవమహర్షి, ఎదుట శుక్లమాల్యాంబ రాలు, దధి ఘృతక్షీరాది పంచామృతాలు; వివిధ హోమద్రవ్యాలు; పుష్పఫలాలు; తీర్థజలాలు. అన్నీ అభిషేకానికి సిద్ధంగా ఉన్నాయి.

మంగళవాద్యాలు మ్రోగు తున్నాయి. గజాశ్వవృషభాలు, ఛత్రచామరాది రాజలాంఛనాలు ప్రక్కనే అలంకృతాలై ఉన్నాయి. మంత్రి సామంత పౌరజాన పద ప్రముఖులంతా ఆసీనులై ఉన్నారు.

వసిష్ఠమహర్షి అభిషేకద్రవ్యాలను, ఆసీనులైయున్న వ్యక్తులను ఒక్క సారి చూశాడు. అర్ధనిమీలితనేత్రు డయ్యాడు.

ముహూర్తం సమీపిస్తూ ఉంది.

మహారాజు ఇంకా రాలేదు.

వసిష్ఠమహర్షి అవలికి లేచి వచ్చాడు, సుమంత్రుని చూశాడు. 'సుమంత్రా! అభిషేకానికి అన్నీ సిద్ధంగా ఉన్నాయి. ఆహ్వానితులంతా ఆసీనులై ఉన్నారు. ముహూర్తం సమీపిస్తూ ఉంది. వెళ్ళివెంటనే మహారాజును రమ్మను' అన్నాడు.

సుమంత్రుడు ఏకాయెకి వెళ్ళాడేగాని మహారాజు మాత్రం రాలేదు.

అంతలోనే కైకేయి వరాల సంగతి, రాముని వనవాసం సంగతి అంతఃపురం అంతా వ్యాపించింది. ఎక్కడ చూచినా గుసగుసలే. అయోధ్యనిండా విషాద మేఘాలే; అకాల కాళ తిమిరాలే.

వసిష్ఠమహర్షి వడివడిగా కైకేయి అంతఃపురానికి వెళ్ళాడు. దశరథ మహారాజు ఒక మూల చలికిపట్టి ఉన్నాడు. రామలక్ష్మణులు నారచీరలు కట్టుకొన్నారు. పాపం ! సీతాదేవి మాత్రం కైకేయిచ్చిన నారచీర అటూ ఇటూ చుట్టుకొంటూ ఉంది. ఎలా కట్టుకోవాలో ఆమెకు చేతగాలేదు. రాముడామెకు సాయపడుతున్నాడు. ఆమె కట్టుకొన్న పట్టుచీర మీదనే ఆ నారచీరను అలంకరిస్తున్నాడు. ఆ దృశ్యం చూచేసరికి అందరితోపాటు ఆ వసిష్ఠమహర్షి కళ్ళుగూడ చెమ్మగిల్లాయి. కోపంతో ఎరుపెక్కాయి. ప్రియశిష్యుని పట్టాభిషేక భంగం ! అంతకు తోడు ఆ సీతారాముల వనగమనం !

అయోధ్యా రాజ వంశంలో ఎంత అనర్థం !

వసిష్ఠమహర్షి ఒక్కడుగు ముందుకు వేశాడు. కైకవైపు విరసనగా చూచాడు. అనేశాడు 'ప్రాణహరాలా ! ఎంత పని చేశావు ! సీత కూడ అరణ్యాలకు వెళ్ళాలా ? ఎందుకు వెళ్ళాలి ?

నీవడిగిన వరాల్లో ఆమె అడవులకు వెళ్ళాలని లేదుగా ? ఆమెనెందుకు పంపుతున్నావు ?

సీతారాములు అరణ్యాలకు వెళ్ళితే మేమూ వారివెంట వెళ్ళుతాము. మేమే గాదు సకల సేనా నాయకులు, దాసదాసీజనము, అయోధ్యాపురవాసులు అంతా వెళ్ళుతారు. అంతేనాము భరత శత్రుఘ్నులు గూడ అందరి కంటె ముందు నార చీరలు కట్టుకొని అన్నవదినలకు అరణ్యాల్లో శుశ్రూష చేస్తారు. అయోధ్య పాడు పడుతుంది. పాడుపడిన అయోధ్యను నీవొక్కతివే ఏలుకో !

రాముడు లేని రాజ్యం రాజ్యం గాదు. అది అరణ్యం. రాముడున్న అరణ్యం అరణ్యం గాదు. అది మహారాజ్యం.

నీ భరతుడు ఈ భూమిని పాలిస్తాడని అనుకొంటున్నావా ! అతడు సదాచార సంపన్నుడు. నీకోర్కెను ఏమాత్రం మన్నించడు. నిన్ను క్షమించడు. చూస్తూ

ఉందు—కొన్ని క్షణాల్లో అయోధ్యలో ఉండే మనుష్యులేగాక, పశుపక్ష్యాదులు కదకు వృక్షాలు గూడా రాముణ్ణి ఎలా అనుసరిస్తాయో, బుద్ధి గలిగి నీకోరికలు సీతకు మంచి సొమ్ములు చీరలు ఇవ్వు'—అన్నాడు.

ఎవరెంత ఆవేశపడినా ఆవేదనపడినా రాముని అరణ్యవాసం ఆగలేదు. దశరథుని మరణం తప్పలేదు.

దశరథుడు మరణించగానే సిద్ధార్థవిజయ జయంతాది మంత్రులు, వసిష్ఠ వామదేవగౌతమ మార్కండేయాది మహర్షులు సమావేశమయ్యారు. అరాజకరాజ్యంలో ఏర్పడే పరిస్థితుశ్రమితో సమీక్షించారు. వీటిని నివారించటానికి ఇక్ష్వాకు రాకుమారునొక్కరుని రాజ్యంలో ప్రభువుగా ప్రతిష్ఠించమని అందరు వసిష్ఠుని ప్రార్థించారు.

వసిష్ఠమహర్షి సాలోచనగా — 'దశరథుడే భరతునికి రాజ్యమిచ్చాడు. మనం మనం విచారించవలసిన పనిలేదు' అని మంత్రులవైపు చూచి 'మీరు వెంటనే కేకయరాజ్యం వెళ్ళి అతిముఖ్యమైన పని మీద నేను తక్షణం భరతుని రమ్మన్నానని చెప్పండి. రాముని వనవాసాన్ని గూర్చిగాని, దశరథుని మరణాన్ని గూర్చిగాని ఏమాత్రం ప్రస్తావించకండి' అన్నాడు.

భరతుడు తమ్మునితోగూడ అయోధ్యకు తరలి వచ్చాడు. తల్లికోరికలను అన్నగారి అరణ్యవాసాన్ని, పితృదేవుని మరణాన్ని తెలుసుకొన్నాడు. పెద్దగా దుఃఖించాడు. తల్లిని తీవ్రంగా నిందించాడు.

దశరథుని అంత్యక్రియలు పూర్తి అయ్యాయి. భరతుడు శోకభారంతో క్రుంగి పోతున్నాడు. అవమానభారంతో నలిగిపోతున్నాడు. ఆస్థితిలో అతనితో పట్టాభిషేక విషయం ప్రస్తావించాలి.

వసిష్ఠమహర్షి మంత్ర సామంత పౌరజానపద ప్రముఖులనందా పిలిపించి పెద్ద సభ చేశాడు. కొలువు దీరిన భరతునివైపు ఆర్ద్రంగా చూచి —

'నాయనా ! దశరథమహారాజు ధర్మబద్ధుడై ధనధాన్యసమృద్ధమైన ఈరాజ్యాన్ని నీకిచ్చి మరణించాడు. సత్యవ్రతుడైన శ్రీరామచంద్రుడు తండ్రి ఆజ్ఞ తలదాల్చి అరణ్యాలకు వెళ్ళాడు. తండ్రి, అన్న నీకిచ్చిన ఈరాజ్యాన్ని చక్కగా పాలించు. సుఖాలు అనుభవించు. నీ పట్టాభిషేకం శీఘ్రమే జరగాలి' అన్నాడు.

వసిష్ఠుని మాటలకు భరతుడు సిగ్గుపడ్డాడు. దుఃఖపడ్డాడు. తలవంచుకొని 'గురుదేవా! వేదవేదాంగ పారంగతులైన మీరు ఈ ధర్మవ్యతిక్రమాన్ని నాకు తెలుపవచ్చునా! రాజ్యం రామునిది. నేను రాముని వాడను. కైకేయి అధర్మపరురాలు ఆమె వరాలను నేను సఫలం కానివ్వను. అన్నగారిని ఆహ్వానించాలని అరణ్యాలకు బయలుదేరుతున్నాను. ఆయన రానంటే నేనూ అక్కడే ఉంటాను' అనేసరికి సభలో అందరి కళ్ళు చెమ్మగిల్లాయి.

భరతుడు వెంటనే సుమంతుని వైపు చూచాడు. రథాన్ని సిద్ధం చెయ్యమన్నాడు.

అంతా అరణ్యాలకు బయలుదేరారు.

అక్కడ అదొక సమస్య.

భరతుడు రాముని అయోధ్యకు రమ్మంటాడు. రాజ్యం ఏలమంటాడు. రాముడు అయోధ్యకు రానంటాడు. భరతుణ్ణే రాజ్యం ఏలమంటాడు.

జాబాలి నాస్తికమతం చెప్పి రాముణ్ణి అయోధ్యకు రమ్మనేసరికి ఆయనకు కోపం వచ్చింది. అప్పుడు వసిష్ఠమహర్షి జోక్యం పుచ్చుకొని జాబాలి నాస్తికుడు కాడు, నిన్ను అయోధ్యకు రప్పించాలన్న ఆశయంతోనే అలా మాట్లాడాడని చెప్పాడు. లోకోత్పత్తి ప్రకారాన్ని, ఇక్ష్వాకు వంశక్రమాన్ని వివరించి వంశాచారం ప్రకారం జ్యేష్ఠుడివైన నీవే అయోధ్యను పాలించ రమ్మన్నాడు.

రాముడు తన పితృవాక్య పరిపాలన వ్రతాన్ని పునరుద్ఘాటించాడు. భరతుడు రామపాదుకలతో తిరిగి వచ్చాడు. ఆ రామపాదుకలే అయోధ్యను పద్నాలుగేళ్ళు పాలించాయి.

రాముడు అరణ్యంలో అనేక కష్టాలనుభవించి, అంతటి రావణాసురుని సంహరించి, అఖండకీర్తి నార్జించి, పద్నాలుగేళ్ళ తరువాత సతీసమేతంగా పుష్పక విమానంలో వచ్చి, సర్వజన సమక్షంలో తనకు పాదాభివందనం చేసేసరికి ఆ వసిష్ఠమహర్షి శిష్యుణ్ణి కౌగిలించుకొని ఎంత ఆనందించాడో. ఆయన ధార్మికతను, ధైర్యస్థైర్యాలను, బలపరాక్రమాలను తలచి ఎంత పులకించాడో! ఆయన పట్టాభిషేక మహోత్సవాన్ని ఎంత ఘనంగా జరిపించాడో!

రాముడు పట్టాభిషిక్తుడయ్యాడు. రాజ్యంలో ధర్మాన్ని నాలుగుపాదాల నడిపించాడు. త్రిజగద్విఖ్యాతుడయ్యాడు. అంతకంటె ఆ గురువుగారికి ఇంకేం కావాలి ?

అయితే ధర్మం మీద ఆ మహర్షుల దృష్టిలో అన్నిటికన్నా పై. అందరు ఒక్కటే. సర్వపరిగ్రహణాన్ని మాని జీవితసర్వస్వాన్ని దానించారు. పురోహితబాధ్యతలను స్వీకరించారు. ధర్మవిషయంలో వారి దృష్టి ఒకసూర్యకిరణం. అది అన్ని చోట్ల, అందరిపట్ల సమానంగా ప్రసరించవలసిందే.

రాముని జీవితంలో అదొక సందర్భం. ఆనాడు మునిరూపంలో వచ్చిన యమధర్మరాజుతో ఆయన సంభాషణలు సాగిస్తున్నాడు. ఎవ్వరైనా తమ ఏకాంతానికి అంతరాయం కలిగిస్తే అతనికి మరణదండన తప్పదని ప్రతిజ్ఞచేసి వాకిట్లో లక్ష్మణుని కాపలా ఉంచాడు. అంతలో దుర్వాసమహర్షి వచ్చాడు. వెంటనే రాముణ్ణి చూడాలన్నాడు. వీలులేదని లక్ష్మణుడు వారించాడు. అయితే అందరినీ శపిస్తానన్నాడు దుర్వాసుడు. గత్యంతరం లేక లక్ష్మణుడు లోనికి వెళ్ళాడు. దుర్వాసుడు వచ్చిన సంగతి శ్రీరామునితో చెప్పాడు.

ఆజ్ఞ ఉల్లంఘించాడని అనుంగుతమ్ముడు లక్ష్మణుని దారుణంగా శిక్షించటమా ? తన జీవితంలో సర్వసుఖాలు వదులుకొని తనకు సేవచేశాడని తమ్ముని క్షమించి వదలటమా ? చేసిన ప్రతిజ్ఞ చెల్లించటమా ? భ్రాతృప్రేమను ఆదరించటమా ?

రామునికి అదొక విషమసమస్య.

ఆ సమస్యతో రాముడు సతమతమౌతున్నాడు. ఎటూ తేల్చుకోలేక ఎంతో బాధ అనుభవిస్తున్నాడు.

అప్పటికీ లక్ష్మణుడు తన్ను శిక్షించమన్నాడు. అయినా రాముడు ఒక నిర్ణయానికి రాలేకున్నాడు. మరునాడు మహాసభ చేశాడు. సమస్యను ఆ సభ ముందుంచాడు.

అయిన ఆ రామునికి ఎవ్వరేమి చెప్పగలరు ? తమ్మునికి దారుణశిక్ష విధించమనగలరా ? లేక చేసిన ప్రతిజ్ఞ త్రోసి పుచ్చమనగలరా ?

అందుకే అంతా మౌనం వహించారు.

అప్పుడు వసిష్ఠమహర్షి లేచాడు. 'రామచంద్రా! కాలం బలీయం. వినాశం విధివిహితం. ఎడబాటు అనివార్యం. అయితే ప్రతిజ్ఞాభంగం అవాంఛనీయం. భ్రాతృప్రేమతో నీవే ప్రతిజ్ఞాభంగం చేస్తే ప్రపంచంలో ధర్మం దెబ్బతింటుంది. అల్లకల్లోలం ఏర్పడుతుంది. ధర్మనిర్వహణలో తన-మన భావాలకు తావులేదు. చెప్పినమాట నిలుపుకోటానికే గదా నీ తండ్రి నిన్ను అడవులకు పంపాడు. చివరకు ప్రాణాలు గూడ విడిచాడు. ప్రభువే ఆడినమాట తప్పితే ఇక ప్రజల సంగతి చెప్పాలా? సోదరవాత్సల్యాన్ని వర్జించు. లక్ష్మణునికి శిక్షవిధించు' అని ఉచ్చైస్స్వరంలో ఉద్ఘాటించాడు. రామునికి కర్తవ్యాన్ని ఉపదేశించాడు.

ఆ తరువాత శ్రీరాముని సరయూ ప్రవేశాన్ని గూడ వసిష్ఠమహర్షే శాస్త్రోక్తంగా జరిపించాడు.

క్లిష్ట సమయంలో అటు దశరథునికి, ఇటు శ్రీరామునికి వసిష్ఠమహర్షి ధర్మోపదేశం చేశాడు. ప్రభుహితాన్ని, ప్రజాహితాన్ని కోరాడు. అన్నింటిని మించి ధర్మాన్ని పరిరక్షించాడు. ప్రాచీన భారతీయ పురోహితవ్యవస్థకు పతాకగా నిల్చాడు. ఆదర్శమూర్తిగా హైందవ గురుపీఠాన్ని అధిష్ఠించాడు.

# విశ్వామిత్రుడు

పరాకుగా ఉన్న సైనికుడు పై అధికారి కేకవిని—నిలువెల్ల కళ్ళుగా, మనసెల్ల చెవులుగా సావధానుడైనట్లే మామూలు మనిషి మొదలు మహారాజు దాకా విశ్వామిత్రుని పేరు వింటేచాలు మత్తువదలి తత్తరపాటుతో మేలుకొంటారు. దూర్వాసుని ప్రక్కనే ఆయనకూ పీటవేస్తారు. కోపానికి, శాపానికి ప్రతిరూపంగా ఆ మహర్షిని భావిస్తారు.

విశ్వామిత్రునిది మహాతీవ్రమైన మనస్తత్త్వం. అలాంటి మనస్తత్త్వం ఉండే వాళ్ళుచీటికి మాటికి కోప పడతారు. హరిహరాదులనైనా అధిగమిస్తారు. ఉన్న

శక్తులన్నింటిని పుంజీభవింపజేసి మంచిదైనా, చెడ్డదైనా— మేలుకలిగినా, కీడుమూడినా అనుకొన్న పని అయ్యేదాకా రెప్పవాల్చరు రెండుకాళ్ళూ ఒకచోట పెట్టరు.

అయితే విశ్వామిత్రునిది కేవలం అగ్నికణంలా ప్రజ్వరిల్లే హృదయం మాత్రమే గాదు. అది అప్పుడప్పుడు మంచు గడ్డలా మారిపోగలదు. ఆయనది పాషాణంలా కఠినమైనా హృదయం మాత్రమే గాదు. ఆ మహర్షి స్వాభిమాన ధురంధరుడు మాత్రమే గాదు. సౌందర్యపిపాసి గూడ.

విశ్వామిత్రునిది సహజంగా చిక్కనైన రజోగుణం. దానిపట్టూ దట్టంగా తమోగుణం ఉంది. ఒక విధంగా చెప్పాలంటే పరవళ్ళు త్రొక్కే రజోగుణ ప్రవాహం తమోగుణ తటద్వయాన్ని ఒరుసుకొంటూ సాత్త్విక సాగరంలో సంగమించిన స్వభావానికి ఉత్తమ ఉదాహరణ విశ్వామిత్రుడు. అలాంటి విశ్వామిత్రుడు జీవితంలో తాను సాధించిన శస్త్రాస్త్ర సామగ్రినంతా శ్రీరాముని కిచ్చాడు. అంతేగాక అయోధ్యకు మిథిలకు వియ్యాన్ని కూర్చాడు. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు, ధర్మ సంస్థాపనకు విశేషంగా దోహదం చేశాడు.

విశ్వామిత్రుడు గాధిపుత్రుడు. క్షత్రియుడు. భూమండలాన్ని బహు కాలం పాలించి ఒకరోజు అక్షౌహిణీపూర్ణసైన్యంతో ఆయన ప్రపంచాన్నంతా చూచి రావాలని బయలు దేరాడు. రాష్ట్రాలు, నగరాలు, పర్వతాలు, నదులు, మున్యాశ్రమాలు అన్నీచూచి చివరకు అపరబ్రహ్మలోకంగా ప్రసిద్ధి కెక్కిన వసిష్ఠాశ్రమానికి వచ్చాడు. వచ్చి ఆ మహర్షికి నమస్కరించాడు.

వసిష్ఠమహర్షి విశ్వామిత్రునికి సాదరంగా స్వాగతం పలికాడు. ఉభయులు కలిసి కూర్చుని ఎంతసేపో కుశల ప్రశ్నలు వేసుకొన్నారు. ఆ తరువాత వసిష్ఠ మహర్షి ఆప్యాయంగా 'మహారాజా ! నీకూ నీచతురంగ బలాలకు ఆతిథ్యం ఇవ్వాలని అనుకొన్నాను. నాకోరిక మన్నించు. నా ఆతిథ్యం స్వీకరించు. నీవు అతిథి శ్రేష్ఠుడివి. పూజార్హుడివి' అన్నాడు.

విశ్వామిత్రుడు వికసితవదనుడై 'మహర్షీ ! నీ దర్శనంతో, నీ స్వాగతంతో, నీ మధురమధుర సంభాషణంతో సంతృప్తిచెందాను. వేరే ఆతిథ్యమెందుకు ? వెళ్ళివస్తా. నన్ను అనుగ్రహించు' అన్నాడు చేతులు జోడిస్తూ.

'విశ్వామిత్ర మహారాజా ! నాకోరిక తీర్చాలి. నా ఆతిథ్యం స్వీకరించి వెళ్ళాలి' అన్నాడు వసిష్ఠమహర్షి ఆయన చేతులు పట్టుకొంటూ.

'అలాగే' అన్నాడు విశ్వామిత్రుడు తలవంచి.

వెంటనే వసిష్ఠమహర్షి హోమధేనువును పిలిచాడు. పాల సముద్ర పొంగులా, రాశిపోసిన వెన్నెల్లా ఆ కామధేనువు వచ్చి నిలిచింది.

'శబలా! పరివారంతో విశ్వామిత్ర మహారాజుకు సత్కారం చెయ్యాలి వారివారి అభీష్టానుసారంగా భక్ష్యభోజ్యచోష్యలేహ్య పానీయాది ఆహార పదార్థాలన్నీ సమృద్ధిగా సిద్ధంచెయ్యి' అన్నాడు వసిష్ఠమహర్షి.

శబల తల ఆడించి లోపలికి నడిచింది. క్షణకాలంలో అపూర్వాలైన అనేకానేక ఆహారరాశులు సిద్ధమయ్యాయి.

అందరూ తీరి కూర్చున్నారు. తిన్న వారికి తిన్నంత. అంతా తృప్తిగా త్రేన్చారు.

విశ్వామిత్రుడు ఆశ్చర్యపోయాడు.

'ఇంత తక్కువ వ్యవధిలో—ఇంతమందికి—ఇన్నిరకాల ఆహారపదార్థాలా ఇదంతా శబల ప్రభావమే!' అని ఆశ్చర్యపడుతూ అటుచూచాడు.

శబల నెమరువేస్తూ ఒక చెట్టుక్రింద నిలబడివుంది. 'ఇంత పెద్ద ఎత్తున అతిథి సత్కారాలు చెయ్యగల శబల మహారాజుల దగ్గర ఉండాలి గాని మహర్షుల దగ్గర ఎందుకు?' అనుకొన్నాడు విశ్వామిత్రుడు. వసిష్ఠుని వైపు తిరిగి 'మహర్షీ! నీకు లక్షగోవులిస్తాను. ఈ శబలను నా కివ్వు' అన్నాడు.

వసిష్ఠమహర్షి ఆయన కోరికకు ఆశ్చర్యపోయాడు. తల అడ్డంగా ఆడించాడు.

విశ్వామిత్రునికి రోషం పైకి పొంగింది. 'ఋషివర్యా! ఇది రత్నం. రత్నాలు రాజుల సొత్తు. ఇది గుర్తుంచుకో' అన్నాడు.

వసిష్ఠుడు చిరునవ్వు నవ్వాడు. 'విశ్వామిత్రా! నీవు లక్షగోవులుగాదు నూరుకోట్లగోవులిచ్చినా, రజతకనకాలు నాముందు రాసులు పోసినా ఈ శబలను నే నివ్వను. హవ్యకవ్యాలు, అగ్నిహోత్రాలు, బలిహోమాలు, స్వాహాకారవషట్కారాలు అన్నీ ఈ శబలయందే ఆయత్తమై ఉన్నాయి. సర్వస్వం ఇది. మనస్వికి కీర్తి ఎలాంటిదో ఇది నాకు అలాంటిది. ఎలా ఇచ్చేది చెప్పు?' అన్నాడు నిశ్చయాత్మక స్వరంతో.

విశ్వామిత్రుని పట్టుదల పెరిగింది. 'వసిష్ఠా! నీకు బంగారుతో అలంకరించిన పద్నాలుగువేల ఏనుగులు ఇస్తాను, ఎనిమిదివేల రథాలనిస్తాను. పదకొండు వేల గుర్రాల నిస్తాను కోటి గోవుల నిస్తాను. అంతేగాక అపార ధనరాసులను గూడ ఇస్తాను' అన్నాడు రాజసాన్ని ప్రదర్శిస్తూ.

వసిష్ఠుడు పెదవి విరిచాడు. 'విశ్వామిత్రా! అవన్నీ నాకెందుకు ?' అన్నాడు.

విశ్వామిత్రుడు ఉగ్రుడయ్యాడు. ఒక్క చిటికవేసి భటులను పిలిచి ఆ శబళను బంధించండని ఆదేశించాడు.

శబళ ఆ భటుల నందరిని అవలీలగా విదిల్చింది. ఆవేదనతో ఆ వసిష్ఠుని ముందుకు వెళ్ళి నిలిచింది. 'మహర్షీ! నీవు నన్ను వదిలివేశావా ? నేను ఏ అపకారం చేశాను ? ఈ రాజభటులు నన్ను లాక్కుపోతున్నారు. వారి దుర్మార్గాన్ని అరికట్టు. నన్ను రక్షించు' అని కన్నకూతురిలా ఘోషించింది.

వసిష్ఠమహర్షి భారంగా ఒక్క నిట్టూర్పు వదిలాడు. 'శబళా! విశ్వామిత్రుడు మహారాజు. బలసంపన్నుడు. ఆయనను జయించగల భౌతికబలం నాకు లేదు. తపోబలంతో నాశం చేస్తా మనుకొంటే ఆయన ప్రజాపాలకుడు. ప్రజాపాలకుణ్ణి చంపటం మహాపాతకం, ఏం చేసేది ?' అన్నాడు శబళవైపు జాలిగా చూస్తూ.

'అయితే మహర్షీ! అనుజ్ఞ ఇవ్వండి—అతని బలాన్ని నేను నాశం చేస్తాను' అన్నది శబళ.

అలాగే అన్నాడు ఆ వసిష్ఠమహర్షి.

ఒక్కసారి శబళ అంబా అని అరిచింది. శరీరాన్ని గట్టిగా విదిల్చింది. వేలకొలది సైనికులు ఉద్భవించారు. విశ్వామిత్రుని బలాన్ని ఒక్కక్షణంలో నాశనం చేశారు.

అది చూచి విశ్వామిత్రుని కొడుకులు దివ్యాయుధాలతో వసిష్ఠుని మీద విజృంభించారు.

వసిష్ఠమహర్షి ఒక్క హుంకారం చేశాడు. వాళ్ళంతా ఒక్కక్షణంలో మండి పోయారు.

విశ్వామిత్రుడు నిర్వీర్యుడయ్యాడు. అలలులేని సముద్రంలా, కోరలు పోయిన పాములా, రాహుగ్రస్తుడైన రవిబింబంలా, రెక్కలు విరిగిన పక్షిలా

క్షత్రశోకంతో, శత్రుకోపంతో సలసలకాగాయి.

అన్యులదయినా, ఆశించగూడనిదైనా, ఆకర్షించిన ప్రతిది తన అరచేత ప్రాలాలను కోవటం రజోగుణ స్వభావం. అది చేతికందనప్పుడు అభిమానం దెబ్బతిని ఆ రజోగుణం తమోగుణంతో చెయ్యికలుపుతుంది. శత్రుత్వాన్ని వహిస్తుంది. చెడుత్రోవలు త్రొక్కుతుంది

విశ్వామిత్రుడు కోరగూడనిదానిని కోరాడు. బలవంతంగా దాన్ని పొందటానికి ప్రయత్నించాడు. అపజయాన్ని చవిచూచాడు.

క్షత్రబలం బ్రహ్మబలాన్ని జయించలేక పోయింది.

బాహుబలం తపోబలం ముందు తలవంచింది.

విశ్వామిత్రుని జీవితంలో ఇదొక పెద్దమలుపు.

అయినా విశ్వామిత్రునికి క్షత్రబలం మీద విశ్వాసం పోలేదు. కాకుంటే వసిష్ఠుని జయించటానికి తనక్షత్రబలం చాలేదనుకొన్నాడు. తపస్సుచేసి అధికంగా అస్త్రబలం ఆర్జించాలనుకొన్నాడు. ఒక్కఊపున హిమాలయాలకు వెళ్ళాడు. మహోగ్రమైన తపస్సు చేశాడు. మహేశ్వరుణ్ణి మెప్పించాడు. అనేకానేక శస్త్రాస్త్రాలు సాధించాడు. పర్వణినాటి పారావారంలా విజృంభించి వసిష్ఠాశ్రమం మీద వివిధాస్త్రాలు ప్రయోగించాడు. ఆశ్రమం అంతటా మంటలు రేగాయి. మృగాలు పక్షులు, మునులు చెల్లాచెదరై పరుగుత్తుతూ ఉంటే వసిష్ఠమహర్షి చెయ్యెత్తి 'ఆగండ'ని అరిచాడు. అయినా ప్రయోజనం లేకపోయింది.

అప్పుడు ఆగ్రహోదగ్రుడైన ఆ వసిష్ఠమహర్షి బ్రహ్మదండం చేతబట్టి 'దుర్మార్గుడా ! ఎంతకాలంగానో వృద్ధిపొందించిన ఈ ఆశ్రమాన్ని నాశనం చేశావు. నీ అంతు చూస్తాను' అని విశ్వామిత్రునికి ఎదురు తిరిగాడు

విశ్వామిత్రుడు వికటాట్టహాసం చేశాడు. ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. బ్రహ్మదండం దాన్ని ఆర్పివేసింది. విశ్వామిత్రుడు ఉగ్రుడై వారుణాస్త్రం ప్రయోగించాడు. బ్రహ్మదండం దాన్ని మ్రింగివేసింది. విశ్వామిత్రుడు ఇంకా విజృంభించి రౌద్రపాశుపత బ్రహ్మపాశ కాలపాశ శుష్కాశనీ ఆర్ద్రాశనీ ధర్మచక్ర విష్ణుచక్ర వాయువ్య కంకాళాది మహాస్త్రాలన్నింటిని వరుసగా ప్రయోగించాడు. అన్నింటిని బ్రహ్మదండం అవలీలగా అంతంచేసింది.

విశ్వామిత్రుడు పెద్దగా ఊర్పు విడిచాడు. ఎట్టకేలకు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. దాన్ని గూడ బ్రహ్మదండం త్రుటిలో మ్రింగివేసింది.

విశ్వామిత్రునికి దిక్కుతోచలేదు.

వసిష్ఠమహర్షి అగ్నిగోళంలా వెలుగుతున్నాడు.

విశ్వామిత్రుడు తలవంచుకొన్నాడు. అవమానభారంతో ఆవలికి తొలగి వెళ్ళాడు. చెమ్మగిల్లిన కళ్ళతో శూన్యంలోకి చూస్తూ 'ఛీ ! క్షత్రియ బలమెందుకు ? బ్రహ్మబలమే బలం. వసిష్ఠుని ఒక్క బ్రహ్మదండంతో నా అస్త్రాలన్నీ వ్యర్థమయ్యాయి ' అని మాటిమాటికి నిట్టూర్పులు విడుస్తూ భార్య ప్రక్కన చతికిలబడ్డాడు.

భర్త ఆవేదనను ఆమె అర్థం చేసుకొంది. అనేక విధాల ఆయనను ఓదార్చింది. ఆ స్థితిలో ఏ మగవానికైన మంచి ఆదరువు అతని భార్యే.

విశ్వామిత్రునికి క్షత్రియబలం మీద పూర్తిగా విశ్వాసం పోయింది. బ్రహ్మబలంమీద అధికంగా గౌరవం పెరిగింది. విశ్వామిత్రుడు తపస్సు చెయ్యాలని అనుకొన్నాడు. బ్రహ్మర్షిత్వాన్ని సాధించాలని నిశ్చయించుకొన్నాడు. ప్రియపత్ని సాహచర్యం ప్రోత్సాహకరంగా ఉంటుందని ఊహించుకొన్నాడు. శరావతీ నదీ తీరానికి సత్వరమే తరలివెళ్ళాడు. ఆశ్రమం నిర్మించుకొన్నాడు. తపస్సు ప్రారంభించాడు.

భార్య పరిచర్య చేస్తూఉంది.

ఆయన తపస్సు సాగిపోతూ ఉంది.

అయితే భార్య సాహచర్యం విశ్వామిత్రునిలో రజోగుణాన్ని రగుల్కొల్పినట్లుంది. ఆయన భార్యతో సాంసారిక సౌఖ్యాలనుభవించాడు. హవిష్యంద, మధుష్యంద, దృఢనేత్ర, మహారథులనే నలుగురు కొడుకులను గన్నాడు.

విశ్వామిత్రుని మహోగ్రతపం మాత్రం బ్రహ్మదేవుని మెప్పుపొందింది. చతుర్ముఖుడు ప్రత్యక్షమై 'విశ్వామిత్రా ! నీవు రాజర్షి వయ్యావు' అని అంతర్ధానమయ్యాడు.

విశ్వామిత్రుడు సిగ్గుతో తలవంచుకొన్నాడు. తన తపస్సుకు రాజర్షిత్వమేనా తగిన ఫలం ?

కాదు. కానేకాదు.

తక్షణం ఆయన సాంసారిక సౌఖ్యాలకు స్వస్తి చెప్పాడు. తపస్సును ఉద్ధృతం చేశాడు.

అప్పుడు విశ్వామిత్రుని తపస్సుకు ఒక విఘ్నం.

చండాలు డొకడు పరుగెత్తుకొంటూ వచ్చాడు. ఆయన పాదాల మీద వ్రాలాడు. అనుగ్రహిస్తానంటే తప్ప పాదాల వదలనన్నాడు. తీరా కళ్ళు తెరిచి చూస్తే అతడు త్రిశంకుడు. త్రిశంకుని రూపాన్ని, స్థితిని చూచి విశ్వామిత్రుడు ఆశ్చర్యపోయాడు; ఆర్ద్రంగా 'త్రిశంకూ! ఏమిటి ఈ స్థితి' అన్నాడు.

'స్వామీ! నేను సశరీరస్వర్గం కోరుకొని యజ్ఞం చెయ్యాలనుకొన్నాను. అందుకు వసిష్ఠమహర్షిని ఆశ్రయించాను. ఆయన నాకోరికను తిరస్కరించాడు. నన్ను దూషించాడు. తరువాత నేను ఆయన కొడుకులను ఆశ్రయించాను. తండ్రికి, మాకు అభిప్రాయభేదాలు కల్పించాలనుకొన్నావా అని వాళ్ళు నన్ను శపించారు. ఆ శాపఫలమే ఈ రూపం. ఈ స్థితిలో నీవే నాకు దిక్కు. నీపురుషకారంతో దైవాన్ని మరలించు. దయచూపి నాకోర్కె నెగ్గించు. వసిష్ఠునివల్ల అతని కొడుకులవల్ల ఏర్పడిన ఈ స్థితినితొలగించు, నీవూ కాదంటే నాగతి ఏమి? అని కంట తడి పెట్టాడు. గట్టిగా కాళ్ళు పట్టుకొన్నాడు.

విశ్వామిత్రుని హృదయం ద్రవించింది. వసిష్ఠుని మీది ప్రతిభటత్వం పైకి పొంగింది. వెంటనే ఆకాశం వైపు చూసి, త్రిశంకుని వీపుతట్టి 'ఇక్ష్వాకు మహారాజా! నీకు స్వాగతం! నిన్ను కృతార్థుణ్ణి చేస్తాను. నీ యజ్ఞం నిర్వహించటానికి పుణ్యకర్ములైన మహర్షుల నందరినీ పిలిపిస్తాను. వసిష్ఠుని కారణంగా నీకీ రూపం కలిగింది. భయపడకు. ఈ రూపంతోనే నిన్ను స్వర్గనికి పంపే బాధ్యత నాది. సందేహించకు. స్వర్గం నీకు కరతలామలకం చేస్తాను' అన్నాడు. కొడుకుల వైపుచూచి 'యజ్ఞసంభారాలన్నీ సమకూర్చండి' అన్నాడు. శిష్యుల వైపు చూచి 'వెంటనే మీరంతా వెళ్ళి మహర్షుల నందరిని ఆహ్వానించండి' అన్నాడు 'ఆహ్వానసమయంలో ఎవరైనా, ఏమైనా అంటే అది నాతో చెప్పండి' అన్నాడు.

తక్షణమే శిష్యులు బయలుదేరి వెళ్ళారు. ఎందరెందరో మహర్షులను ఆహ్వానించి తోడ్కొచ్చారు. విశ్వామిత్రునికి నమస్కరించి 'మహాత్మా! మహోదయుడు మాత్రం మీ ఆహ్వానాన్ని మన్నించలేదు. అతడు, వసిష్ఠుని కొడుకులు అవహేళనగా 'యజ్ఞం చేయించేవాడు క్షత్రియుడా! చేసేవాడు చండాలుడా! ఆ

యజ్ఞాన్ని దేవతలు హర్షిస్తారా ? హవిర్భాగాలు స్వీకరిస్తారా ? మిగిలిన హవిస్సు ను మహర్షులు భుజిస్తారా ?' అని మాలకూడు దారపి విన్నవించారు.

విశ్వామిత్రుడు ఉగ్రుడయ్యాడు మహోదయుణ్ణి, వసిష్ఠ పుత్రుల్ని మాడి బూడిద అయ్యేలా శపించాడు. మరునటి జన్మలో వసిష్ఠుని కొడుకులు ముష్టి కులం లో పుట్టి, కుక్క మాంసం తిని కుళ్ళి విరూపులుగా, మహాపాపులు, వికృతులు అయి వివిధ దేశాలు తిరుగుతా రన్నాడు. మహోదయుడు మాత్రం కిరాతకులంలో జన్మించి అనేక కష్టాల పాలౌతాడన్నాడు. వచ్చిన మహర్షుల వైపు చూచి 'త్రిశం కుడు ఇక్ష్వాకు వంశీయుడు, ధర్మాత్ముడు, నన్ను శరణు కోరొచ్చాడు. సశరీరంగా స్వర్గానికి వెళ్ళాలని కోరాడు. అతనిచేత మనం యజ్ఞం చెయ్యించాలి' అన్నాడు.

మహర్షులంతా విశ్వామిత్రుడికి భయపడి అతడు చెప్పినట్లు యజ్ఞం జరిపిం చారు. అయితే హవిర్భాగానికి దేవతలు రాలేదు. విశ్వామిత్రుడు అనేక పర్యా యాలు ఆహ్వానించినా ఆ దేవతలు రాలేదు. కడకు గాధేయుడు క్రోధావేశంతో యజ్ఞస్రువం చేతబట్టి 'త్రిశంకూ ! నేను ఆర్జించిన తపశ్శక్తినంతా నీకు ధారపోస్తు న్నాను. సశరీరంగా స్వర్గానికి వెళ్ళు' అన్నాడు.

అందరూ ఆశ్చర్యచకితులై చూస్తుండగానే త్రిశంకుడు అమాంతం పైకెగిరి వెళ్ళాడు. అయితే దేవేంద్రుడు అతనిని స్వర్గంలో అడుగుపెట్ట నివ్వలేదు.

'త్రిశంకూ ! నీవు గురుశాపహతుడివి. స్వర్గానర్హుడివి' అని క్రిందకి త్రోశాడు.

త్రిశంకుడు తలక్రిందుగా పడుతూ 'విశ్వామిత్రా ! రక్షించు ! రక్షించు ! అని కేకలు పెట్టాడు. ఆ కేకలు వినేసరికి విశ్వామిత్రునికోపం మిన్నుముట్టింది. పట్టుదల విపరీతంగా పెరిగింది

'త్రిశంకూ ! అక్కడే ఉండు' అని చెయ్యెత్తి పెద్దగా అన్నాడు.

త్రిశంకుడు పడకుండా అక్కడే ఆగిపోయాడు.

అప్పుడు విశ్వామిత్రుడు చేతిదర్భలు, జలంతీసుకొని, అర్ధనిమీలిత నేత్రుడై ఏదో మంత్రించి ఆకాశంలోకి చల్లాడు. ఒక్కక్షణంలో త్రిశంకుని చుట్టూ నక్షత్ర మండలం ఏర్పడింది. ఇంకోసారి విశ్వామిత్రుడు ఏదో సంకల్పించి అలాగే చల్లాడు త్రిశంకుని చుట్టూ నక్షత్ర మండలం ఏర్పడింది. మూడోసారి మళ్ళీ

కోపంగా 'ఈ క్రొత్త స్వర్గంలో ఇంకొక ఇంద్రుణ్ణి సృష్టిస్తాను లేదా లోకంలో ఇంద్రుడే లేకుండా చేస్తాను'—అని జపజలం చేతిలో తీసుకొనే సరికి దేవతలు, మహర్షులు భయభ్రాంతులై ఆయనకు పాదాక్రాంతులయ్యారు. త్రిశంకుడు గురు శాపహతుడనీ, అందుచేత స్వర్గానర్హుడనీ అనేకవిధాల నచ్చచెప్పారు.

'అయితే నా ప్రతిజ్ఞ ఏంకావాలి? త్రిశంకుడు సశరీరంగా స్వర్గాన్ని అను భవించ వలసిందే. నేను సృష్టించిన ఈ నక్షత్రాలు శాశ్వతంగా ఉండవలసిందే' అన్నాడు విశ్వామిత్రుడు ఆవేశంగా.

అందుకు దేవతలు అంగీకరించారు. 'మహర్షీ! నీ సృష్టి అనాది జ్యోతి శ్చక్రానికి ఆవల శాశ్వతంగా ఉంటుంది. త్రిశంకుడు అమరుడై ఆ నక్షత్రాలమధ్య తలక్రిందుగా వ్రేలాడుతూ ఉంటాడు' అని అందరు అన్నారు.

త్రిశంకునికి తనదైన ఒక స్వర్గం లభించింది. దేవతలు, మహర్షులు తృప్తిగా తిరిగివెళ్ళారు. అయితే విశ్వామిత్రుని పనిమాత్రం మళ్ళా మొదటికి వచ్చింది. ఒక ప్రయోజనాన్ని ఆశించి చేసిన తపస్సంతా మరొకదానికి వ్యయమై పోయింది.

విశ్వామిత్రుడు తన నష్టం తాను తెలుసుకొన్నాడు. రజస్తమోగుణాలను పూర్తిగా జయించాలను కొన్నాడు. దక్షిణ దిక్కు తనకు యోగించలేదని పడమటి దిక్కుకు ప్రయాణమయ్యాడు. పుష్కరతీర్థంలో మహాదీక్ష వహించి మరల తపస్సు ప్రారంభించాడు.

అక్కడగూడ ఆయన తపస్సుకు అనుకోని ఆటంకం.

బాలు డొకడు పరుగెత్తుకొంటూ వచ్చి విశ్వామిత్రుని ఒడిలో వ్రాలాడు. అతడు ఎంతో అలసిఉన్నాడు. కళ్ళల్లో భయోగాలు, నిరాశానిస్పృహలు అగు పిస్తున్నాయి. కసాయివాని వ్రేటునుండి తప్పించుకొని వచ్చిన బలిపశువులా ఉన్నాడు.

తపోనిమగ్నుడైన విశ్వామిత్రుడు కళ్ళుతెరిచి చూశాడు. ఆ బాలుడు శున శ్శేపుడు తనమేనల్లుడు ఋచీకుని రెండవ కొడుకు.

విశ్వామిత్రుడు కళ్ళు విప్పిచూడగానే శునశ్శేపుడు రెండుచేతులు జోడించి దీనాతిదీనంగా చూస్తూ 'నీవే నాకు దిక్కు' అన్నాడు. మరల ఆ మహర్షి ఒడిలో వ్రాలిపోయాడు.

అల్లంత దూరాన అంబరీషమహారాజు [illegible]

విశ్వామిత్రుని హృదయం ఆర్ద్రమైంది. [illegible] ముందుకు వచ్చాడు. కళ్ళలోని నీళ్ళు తుడిచాడు. ఎత్తికూర్చుండ బెట్టాడు.

అంతలో అంబరీషుడు గూడ ఆ మహర్షి దగ్గరికి [illegible] విశ్వామిత్రుడు ఆ మహారాజును కుశల మడిగాడు. [illegible] విశ్వామిత్రుని పుత్రులుగూడ ఆ వింత చూడటానికి వచ్చారు.

విశ్వామిత్రుడు విషయం ఏమిటని అంబరీషుణ్ణి అడిగాడు. అంబరీషుడు తన యజ్ఞం సంగతి చెప్పాడు. అమరపతి తన యజ్ఞపశువును అపహరించాడని, అందుకు ప్రాయశ్చిత్తంగా నరపశువును బలి ఇవ్వాలని, [illegible] పుచ్చుకొని ఋచీకుడు తన రెండవ కొడుకును ఇచ్చాడని చెప్పాడు

విశ్వామిత్రుడు తల ఆడించాడు. శునశ్శేఫుని వైపు [illegible] చూశాడు శునశ్శేఫుడు కన్నీళ్ళు తుడుచుకొంటూ 'మహర్షి! మా నాన్న పెద్దకొడుకును ఇవ్వ నన్నాడు. మా అమ్మ కడగొట్టు కొడుకును ఇవ్వనంది. ఇక [illegible] నేనేకదా' అని దీనంగా ఆయన ముఖంలోకి చూచాడు.

విశ్వామిత్రుని మనసు మరీ ఆర్ద్రమైంది. [illegible] ఆయన ఏదో ఆలోచించాడు. అక్కడే కూర్చున్న తన కొడుకుల వైపు చూశాడు. 'మీలో ఒకరు శునశ్శేఫునికి బదులుగా వెళ్ళండి' అన్నాడు.

విశ్వామిత్రుని ఆర్ద్రత ముందు అసముద్రుడైనా తలవంచవలసిందే! ఆయన త్యాగశీలం ముందు మహోన్నతుడైన హిమవంతుడైనా మోకరిల్ల వలసిందే.

విశ్వామిత్రుని కొడుకులు తండ్రివైపు తిరస్కారంగా చూశారు. [illegible] అక్కడి నుండి లేచి వెళ్ళారు.

విశ్వామిత్రుడు కొడుకుల ప్రవర్తనకు ఆగ్రహించాడు. [illegible] శపించాడు. 'మీరూ వసిష్ఠుని కొడుకుల్లాగే ముష్టికులంతో [illegible] కుక్కమాంసం తింటూ బ్రతకండని శపించాడు.

తరువాత మంత్రపూతమైన విభూదిని శునశ్శేఫుని శరీరం[illegible] పూశాడు. 'యజ్ఞ సమయంలో నీకు ఎఱ్ఱగంధంపూసి, ఎఱ్ఱపూలమాల వేసి, దర్భత్రాళ్ళతో వైష్ణ

ఆపుకోలేక పోయాడు. శాపజలం చేతికి తీసుకొన్నాడు. 'రంభా ! నా తపస్సు చెరప టానికి వచ్చావా. నల్లని రాయిగా వెయ్యేళ్ళు పడి ఉండు' అని శపించాడు.

రంభ రాయిగా మారిపోయింది. దేవేంద్రుడు బ్రతుకుజీవుడా అని పరిగెత్తి పోయాడు. అయితే ఆ కోపకారణంగా విశ్వామిత్రుని తపస్సు తరిగిపోయింది. జితేంద్రియుడు కానందున ఆ మహర్షి మనశ్శాంతి లోపించింది.

విశ్వామిత్రుడు తన కోపాన్ని తానే గర్హించుకొన్నాడు. బ్రహ్మణ్యం సిద్ధించేదాకా—ఎంత కాలమైనాసరే, ఆహారం లేకుండా, కడకు ఊర్పయినా వదల కుండా కఠోర తపస్సు చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. ఆయన తపోజీవితంలో అది చివరి సిద్ధయం.

ఆ తపస్సు చేసేచి విశ్వామిత్రుడు తూర్పుదిక్కు వెళ్ళాడు. కొయ్యలా నిలబడి వెయ్యేళ్ళు తపస్సు చేశాడు. ఆ తపస్సు తర్వాత అన్నం తినటానికి కూర్చుంటే దేవేంద్రుడు బ్రాహ్మణరూపంతో వచ్చి 'ఆకలి మండుతూ ఉంది—అన్నం పెట్టు' అని వెయ్యబోయాడు. విశ్వామిత్రుని వ్రతభంగం చెయ్యాలని ఆయన ఉద్దేశం. అయినా విశ్వామిత్రుడు ఆగ్రహపడలేదు. అన్నమంతా ఆ బ్రాహ్మణునికే పెట్టాడు. మరల తపస్సు ప్రారంభించాడు. ఊర్పయినా వదలకుండా వెయ్యి సంవత్సరాలు మహోగ్ర తపస్సు చేశాడు.

విశ్వామిత్రుని శిరస్సునుండి వేడి పుట్టింది. పొగలు పైకి లేచాయి. అన్ని వైపులా వ్యాపించాయి. సముద్రాలు, పర్వతాలు, భూమి, గాలి అన్నీ కలత నొందాయి. సూర్యుడు వెలవెల పోయాడు. దేవతలంతా తేజోహీనులై దిక్కుతో చక బ్రహ్మదేవుని సమ్ముఖానికి పరుగెత్తారు. 'పితామహా ! ప్రమాదాన్ని నివారించు జగత్తంతా దగ్ధంకాకముందే ఆ మహర్షి కోరికను అనుగ్రహించు' అని ప్రార్థించారు.

బ్రహ్మదేవుడు బయలుదేరాడు. ఆయన వెంట దేవేంద్రుడు, దేవతలు అంతా వచ్చారు. అపూర్వ చూడ ముచ్చటైన దృశ్యం.

బ్రహ్మదేవుడు మహోగ్రతపస్సులో మునిగి ఉన్న విశ్వామిత్రుని ముందు నిలిచి ఉచ్చైస్స్వరంలో 'బ్రహ్మర్షీ ! అని సంబోధించాడు.

ఆ సంబోధన అమృతం కురిపిస్తున్నది.

విశ్వామిత్రుడు కళ్ళు తెరిచాడు. చేసు[illegible]త్తి [illegible] నమస్కరించాడు.

బ్రహ్మదేవుడు 'విశ్వామిత్రా! నీవు బ్రాహ్మణ[illegible]న్నాడు. 'ఇక ప్రశాంతుడవు కా' అన్నాడు. 'నీవు దీర్ఘాయు[illegible]న్నాడు. 'ఇక నీ తపస్సు విరమించు' అన్నాడు.

అయినా విశ్వామిత్రుడు లేవలేదు.

'పితామహా! నాకు బ్రహ్మణ్యం, దీర్ఘాయు[illegible] కలి[illegible]' అన్నాడు.

అవునన్నట్లు బ్రహ్మదేవుడు తల ఆడించాడు. [illegible]కారవేదాలు నన్ను వరించాలన్నాడు. క్షత్రియులలో శ్రే[illegible] వశిష్ఠుడు అయిన వసిష్ఠుడు వచ్చి నన్ను బ్రహ్మర్షీ! [illegible]న్నాడు. అంతదాకా ఈ తపస్సు విరమించనన్నాడు.

ఎంత పట్టుదల! ఏ వ్యక్తి[illegible] ముక్క పోయిందో ఆ వ్యక్తే ఇప్పుడు వచ్చి తన[illegible]నాన్ని గుర్తించి 'బ్రహ్మర్షీ!' అని పిలిస్తేగాని [illegible]త్తు బ్రహ్మదేవుడే నీవు బ్రహ్మర్షి వన్నా చాలదు.

ఒక్క పెట్టున దేవతలంతా వసిష్ఠుని దగ్గరకు [illegible] వారి ప్రార్థనను మన్నించి విశ్వామిత్రుని [illegible]తో స్నేహపూర్వకంగా 'బ్రహ్మర్షీ!' అని సంబోధించా[illegible].

అప్పుడు విశ్వామిత్రుడు పైకి లేచాడు. [illegible] కౌగిలించుకొన్నాడు.

రెండు కైలాసశిఖరాలు కౌగిలించుకొన్నట్లుం[illegible].

రెండు మహాసముద్రాలు ఏకమైనట్లుం[illegible]. [illegible] అపూర్వమైన ఒక ఆనందానుభూతి.

విశ్వామిత్రుడు వసిష్ఠుణ్ణి ఉన్న[illegible]. హృదయపూర్వకంగా అర్ఘ్యపాద్యాలిచ్చాడు. అనేక వి[illegible].

స్పర్ధ అదృశ్యమైంది.

స్నేహం వెల్లి విరిసింది.

ఎవరి నివాసాలకు వారు వెళ్ళిపోయారు.

ఆ తరువాత విశ్వామిత్రుడు తీర్థయాత్రకు బయలుదేరాడు. పర్వతాలు, నదులు, పుణ్యక్షేత్రాలు చూస్తూ భూమండల మంతా పర్యటించాడు.

లోకంలో క్రమంగా అధర్మం పెరుగుతూ ఉంది. సాధుజనులు రాక్షసుల చేతుల్లో నానాబాధలకు గురి అవుతున్నారు. రాక్షసనాయకుడు రావణుడు మహో తీవ్రంగా విజృంభించి ముల్లోకాలను గడగడ లాడిస్తున్నాడు. అతని అనుచరుల అకృత్యాలకు హద్దులేదు.

అయోధ్యలో శ్రీరామచంద్రుడు అవతరించాడు. వసిష్ఠమహర్షి దగ్గర విద్యాబుద్ధులు నేర్చుకొంటున్నాడు. ఆనాడు లోకానికి ఆయన ఒక్కడే ఆశాకిరణం

విశ్వామిత్రమహర్షి లోకకల్యాణార్థం దండకారణ్యంలో ఒక యాగం ఆరంభించాడు రావణప్రతినిధులైన మారీచసుబాహులు మాటిమాటికీ ఆ యాగాన్ని భంగం చేస్తున్నారు. ముని జనులను బాధిస్తున్నారు.

ఆ రోజు గూడ మారీచసుబాహులు హోమగుండంలో రక్తమాంసాలు క్రుమ్మరించారు. ఋత్విక్కుల మీద రాళ్ళ వర్షం కురిపించారు.

ఏం చెయ్యాలి ?

విశ్వామిత్రుడు దర్భాసనం మీద అర్ధనిమీలితనేత్రుడై కూర్చున్నాడు. ఆలోచించాడు. తన దగ్గర అనేక దివ్యశస్త్రాస్త్రాలున్నాయి. వాటితో అవలీలగా ఆ రాక్షసులను అంతమొందించవచ్చు. అయితే ఇప్పుడు మరల తాను శస్త్రాస్త్రాలు చేపట్టటమా ? అనుచితం. ఆ రాక్షసులను చంపటానికి శస్త్రాస్త్రాలే అక్కరలేదు. తపశ్శక్తితో వాళ్ళను బుగ్గిచెయ్యవచ్చు. అయినా అది పవిత్రమైన తపశ్శక్తిని అల్పులమీద ప్రయోగించటమా ? అనవసరం పైగా తాను వాళ్ళను పరిమార్చాలంటే తపస్సుచేసి సంపాదించిన సత్త్వస్థితి నుండి రజస్తమస్సులకు దిగాలి. బ్రహ్మర్షిత్వాన్ని వదలి రాజధర్మం స్వీకరించాలి. ఈ దశలో అది అభిలషణీయం కాదు.

అయితే ఏం చెయ్యాలి ? దుష్టశిక్షణ మాత్రం జరిగితీరాలి

అంతలోనే ఆ మహర్షి దివ్యదృష్టికి అయోధ్యామహానగరం, దశరథుని కొలువుకూటం కనిపించాయి. శ్రీరాముని విలువిద్యా పరిణతి చూస్తే, ఆయన వివాహా

ప్రస్తావన వినిపించాయి. జీవితంలో తాను ఆర్జించిన శస్త్రాస్త్రసంపద అంతా సద్వినియోగం రావాలి. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపన జరిగి తీరాలి. తన శస్త్రాస్త్రాలు అందుకో దగినవాడు, ఆ మహాకార్యం జరిపించగలిగినవాడు ఆ శ్రీరాముడే. అందుకే ఆయన జన్మించాడు. ఆ వశిష్ఠమహర్షి దగ్గర విలువిద్య అభ్యసించాడు. ఆయన కార్యక్రమాలు, బలపరాక్రమాలు అయోధ్యకు మాత్రమే పరిమితం కారాదు. అలా జరిగితే అవి ఆశించిన ప్రయోజనాలు ప్రపంచానికి చేకూర్చలేవు. ఆయనచేతి మీదుగా రాక్షస సంహారం జరగాలి. అందుకు సీతా వివాహం చాలా అవసరం.

విశ్వామిత్రుడు వెంటనే అయోధ్యకు బయలు దేరాడు.

అది దశరథుని ఆస్థానం. మంత్రులతో, సామంతులతో, పురోహితులతో, పౌరజానపద ప్రముఖులతో సభ అంతా క్రిక్కిరిసి ఉంది. రాముని విద్యాపరిస మాప్తిని గూర్చి, ఆయన ప్రతిభా విశేషాలనుగూర్చి, బలపరాక్రమాలనుగూర్చి వసిష్ఠమహర్షి అప్పుడే వివరించి చెబుతున్నాడు. హర్షధ్వానాల మధ్య ఆనంద తన్మయత్వంతో ఆ దశరథమహారాజు రామచంద్రుని వివాహాన్ని గూర్చి ప్రస్తా విస్తున్నాడు. అప్పుడు విశ్వామిత్రుడు సభలో ప్రవేశించాడు. అందరి ముఖాల్లో నూ ఆశ్చర్యం, భయం.

దశరథుడు స్వాగతం పలికాడు. అర్ఘ్యపాద్యాలిచ్చి అర్చనలు చేశాడు. ఏది అడిగినా ఇవ్వటానికి సిద్ధంగా చేతులు కట్టుకొని మహర్షిముందు నిలబడ్డాడు.

వసిష్ఠుడు చిరునవ్వు నవ్వాడు.

విశ్వామిత్రుడు మహానంద భరితుడయ్యాడు. 'మహారాజా! నేనొక యజ్ఞంచేస్తున్నాను మారీచసుబాహులన్న రాక్షసులు ఆ యజ్ఞాన్ని భగ్నం చేస్తు న్నారు. రామచంద్రుణ్ణి నాతో పంపు. ఆ రాక్షసులను చంపి తిరిగి వస్తాడు. బాలుడని భయపడకు. అతడు మహావీరుడు. సత్యపరాక్రముడు. ఆ సంగతి వసిష్ఠునికి గూడ తెలుసు' అన్నాడు—సగౌరవంగా, సాభిప్రాయంగా ఆ మహర్షి వైపు చూస్తూ.

దశరథుని గుండెలో బండ పడ్డట్లయింది.

'మహర్షీ! మీ వెంట నేనే వస్తా నన్నాడు. చతురంగ బలాలతో ఆ రాక్ష సుల నేనే సంహరిస్తానన్నాడు. నా రాముడు బాలుడన్నాడు, ఆ రాక్షసులేమో చాల

చంద్రుల్లా ఉన్నాయి. అన్నీ ముక్తకంఠంగా 'రామా ! నీకు స్వాధీన మయ్యాము' అని ఘోషించాయి.

రాముడు 'సమయం వచ్చినప్పుడు మిమ్మల్ని స్మరిస్తాను. అంతవరకు మీరు యథేచ్ఛగా వెళ్ళండి' అన్నాడు.

అవి రామునికి ప్రదక్షిణం చేసి అదృశ్యమయ్యాయి.

విశ్వామిత్రుడు తృప్తిగా రామునివైపు చూచాడు.

రాముడు సవినయంగా ఆ మహర్షికి నమస్కరించాడు.

మరల మువ్వురు నడక సాగించారు.

అది సిద్ధాశ్రమం. వామనుని పూర్వాశ్రమం. విశ్వామిత్రుని ప్రస్తుతాశ్రమం. పవిత్రాశ్రమం. రాముడు ఎంతో ఆసక్తిగా ఆశ్రమ విషయం అడిగాడు. విశ్వామిత్రుడు రసవంతంగా దాని చరిత్ర చెప్పాడు. ఆశ్రమంలో అడుగుపెట్టగానే ఆశ్రమవాసులంతా విశ్వామిత్రుణ్ణి పూజించారు. రామలక్ష్మణులకు అతిథిమర్యాదలు చేశారు.

రాముడు విశ్వామిత్రునితో 'మహర్షి ! మీరిక యజ్ఞదీక్ష స్వీకరించండి. మారీచసుబాహుల సంగతి మాకు వదలండి' అన్నాడు ఎంతో ఆత్మ విశ్వాసంతో.

విశ్వామిత్రుడు వెంటనే యజ్ఞ దీక్ష స్వీకరించాడు. జ్యోతిర్మయుడుగా వెలుగుతున్నాడు. యజ్ఞగుండం జాజ్జ్వల్యమానంగా వెలుగుతూ ఉంది. యజ్ఞ వేదిక ఋత్విక్కులతో, సమిధలతో, దర్భలతో, తదితర హోమద్రవ్యాలతో నిండి ఉంది. సమంత్రకంగా యజ్ఞం సాగుతూ ఉంది. అయిదురోజులు గడిచాయి. అహోరాత్రులు ఆ రామలక్ష్మణులకు నిద్రలేదు. ఎత్తిన ధనుస్సు వారు దించలేదు. యజ్ఞానికి రక్షగా వేదికచుట్టూ వారు తిరుగుతున్నారు. సావధానంగా ఉన్నారు.

అది ఆరవరోజు. 'లక్ష్మణా ! ఇది చివరిరోజు. జాగ్రత్త !' అన్నాడు రాముడు. అంతలోనే ఆకాశంలో భయంకర ధ్వని. కారుమేఘాల్లా మారీచసుబాహులు మిగత రాక్షసులు అగుపించారు. రాముడు తక్షణం మానవాస్త్రం మారీచుని మీద ప్రయోగించాడు. వాడు నూరు ఆమడల దూరం ఆకాశంలో కొట్టుకు వెళ్ళి సముద్రంలో కూలబడ్డాడు. వెంటనే రాముడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. అది సుబాహుని, అతని అనుచరుల్ని భస్మీపటలం చేసింది.

మహర్షులందరూ ఆశ్చర్యపోయారు. ఆనందభరితులయ్యారు. విశ్వామిత్ర మహర్షి గాఢంగా ఆ రాముని కౌగిలించుకొన్నాడు. యజ్ఞం నిర్విఘ్నంగా సమాప్తమైంది. ఆ రాత్రి ప్రొద్దుపోయేదాకా అందరి నోటా రామపరాక్రమ ప్రశంసలే.

మరునాడు స్నాన సంధ్యాదికాలు, జపహోమాలు, పూర్తిచేసుకొని తన సిద్ధాశ్రమ మహర్షులతో విశ్వామిత్రుడు కొలువుదీరాడు. ఆయన ముఖంలో ఎంతో ఆనందం, సిద్ధి సంతృప్తి, ప్రశాంతత తాండవిస్తున్నాయి. రామలక్ష్మణులు స్నాన సంధ్యాదికాలు పూర్తిచేసుకొని సంసిద్ధులై వచ్చారు. విశ్వామిత్ర మహర్షికి ఆయన సహచరులకు నమస్కరించారు. 'ఏమి ఆజ్ఞ?' అన్నట్లు సమక్షంలో సవినయంగా నిలిచారు.

మహర్షులంతా నమస్కరించిన చెయ్యెత్తి ఆ రాకుమారులను ఆశీర్వదించారు. అంతలోనే సంభాషణలో జనకుని యజ్ఞాన్ని గూర్చిన ప్రస్తావన, శివధనుస్సును, సీతా స్వయంవరాన్ని గూర్చిన సంభాషణ ఆ మహర్షి మండలంలో ప్రారంభమైంది. విశ్వామిత్రుడు రాముని వైపు ప్రేమగా చూస్తూ 'మేమంతా జనకమహారాజు యజ్ఞానికి వెళ్ళాలనుకొంటున్నాము. ఆ జనకుని యింట గొప్ప ధనుస్సు ఉంది. అది శివధనుస్సు. ఎందరెందరో రాకుమారులు దాన్ని ఎక్కు పెట్టలేక విఫలురయ్యారు. రామా! నీవా ధనుస్సు చూడాలి' అన్నాడు. ఆ వీరకిశోరుని ఆసక్తిని రేకెత్తిస్తూ.

వచ్చిన త్రోవనే రామలక్ష్మణులు అయోధ్య తిరిగి వెళ్ళటం విశ్వామిత్రుని అభిమతం కాదు. శివధనుస్సు నెపంగా శ్రీరాముడు మిథిలకు రావాలి. సీతను వివాహమాడాలి. రామ వివాహానికి, లోకకల్యాణానికి నాంది జరగాలి.

విశ్వామిత్రుని మాటవినగానే రాముని కళ్ళల్లో ఉత్సాహం తొణికిసలాడింది. ఆ రోజే ఆ మహర్షి అక్కడి నుంచి లేచాడు. 'ఈ ఆశ్రమంలో నాకు సిద్ధి లభించింది. వనదేవతల్లారా! ఈ సిద్ధాశ్రమాన్ని విడిచి హిమాలయాలకు వెళ్ళు తున్నాను' అని ఆయన ఆశ్రమానికి ప్రదక్షిణం నమస్కారం చేశాడు. తోడి మునులతో, రామలక్ష్మణులతో అక్కడి నుంచి మిథిలకు బయలుదేరాడు.

సాయంత్రానికి శోణను చేరారు. సూర్యాస్తమయమైంది. అంతా స్నానాలు చేశారు. అగ్నికార్యాలు పూర్తిచేసుకొన్నారు. ఆ నదిగట్టున కూర్చున్నారు.

ఎటు చూచినా సస్యశ్యామలాలు, వనసమృద్ధాలు అయిన ప్రదేశాలు. రాముడు 'మునిపుంగవా ! ఇంత సంపన్నంగా ఉన్న ఈ దేశం ఎవరిది ?' అన్నాడు.

విశ్వామిత్రుడు కౌశాంబి చరిత్ర చెప్పాడు. తన కుశికవంశ చరిత్ర చెప్పాడు. కాని తన చరిత్ర చెప్పలేదు.

రాముడు త్వరపడి అడగలేదు.

విశ్వామిత్రుడు గొప్ప కథకుడు.

మరునాటి ఉదయం మరల ప్రయాణం. మధ్యాహ్నానికి అంతా గంగాతీరం చేరుకొన్నారు. అందరు స్నాన సంధ్యాద్యనుష్ఠానాలు ముగించుకొన్నారు. అగ్ని కార్యాలు నెరవేర్చుకొన్నారు. అమృతతుల్యాలైన హవిస్సులు పుచ్చుకొని చెట్ల నీడలో గంగ ఒడ్డున హాయిగా కూర్చున్నారు. మధ్య విశ్వామిత్రుడు, చుట్టూ మహర్షులు. విశ్వామిత్రుని ప్రక్కనే రామలక్ష్మణులు.

రాముడు 'మహాత్మా ! ఈ గంగకథ మాకు చెప్పు' అన్నాడు విశ్వామిత్రుని వైపు వినయపూర్వకంగా చూస్తూ. విశ్వామిత్రుడు గంగావతరణం రసమయంగా చెప్పాడు. అందరు ఆనంద వీచికల్లో తేలియాడారు.

మరునాడు విశాలానగరం చేరుకోగానే రాముడు ఆ నగర వృత్తాంతం గూడ అడిగాడు. విశ్వామిత్రుడు సాగరమథనంతో ఆరంభించి ఆ నగరకథ చెప్పాడు. ఆ రాత్రికి అక్కడే విశ్రాంతి. విశాలా నగరాధిపతి సుమతి విశ్వామిత్రుని విశేషంగా పూజించాడు. అందరికి అతిథి సత్కారాలు చేశాడు.

విశ్వామిత్రుని కథలంటే రామునికి వల్లమాలిన ఇష్టం. మరునాడు మిథిలా ప్రయాణం. మిథిలకు ముందే ఒక శూన్యమున్యాశ్రమం. దానిని చూడగానే శ్రీరామచంద్రుడు 'మహాత్మా ! ఈ ఆశ్రమం ఎవ్వరిది ? ఇలా ఎందుకుంది' అని ఆశ్చర్యంగా అడిగాడు. విశ్వామిత్రుడు ఇది గౌతమాశ్రమం అని అహల్యా శాప వృత్తాంతం చెప్పాడు. ఆశ్రమంలో రాముడు అడుగు పెట్టగానే అహల్యాశాప విమోచనం, అహల్యా గౌతముల పునస్సమాగమం; అందరిది అద్భుతమైన ఒక రసానుభూతి.

ఆ తరువాత మిథిలానగర ప్రవేశం. అప్పటికే జనకమహారాజు యజ్ఞం ఆరంభమైంది మిథిలనిండా వివిధదేశాలనుండి వచ్చిన వేదవిప్రులు; ఋత్విక్కులు; బ్రాహ్మణోత్తములు; రాకుమారులు,

విశ్వామిత్రుని రాక తెలియగానే జనకమహారాజు తన పురోహితుడు శతానందుని, అనేక ఋత్విక్కులను వెంటబెట్టుకొని వచ్చి ఆ మహర్షికి స్వాగతం పలికాడు. అర్ఘ్యపాద్యాలిచ్చి అర్చించాడు. యథార్హంగా అందరిని కూర్చుండ నియమించి 'మహర్షీ ! మీరాక మాకు శుభోదయం. యజ్ఞపరిసమాప్తికి ఇక పండ్రెండు రోజులే ఉంది. మీరంతా అంతదాకా ఉండి నన్ననుగ్రహించాలి' అన్నాడు. ఆయన ప్రక్కనే ఉన్న శ్రీరామలక్ష్మణులవైపు చూచి 'సూర్యచంద్రుల్లా, అశ్వినీదేవతల్లా వెలుగుతున్న ఈ వీరకిశోరులెవరు ?' అన్నాడు.

విశ్వామిత్ర మహర్షి నిండుగా ఒక చిరునవ్వు నవ్వి - రామలక్ష్మణులు దశరథ రాకుమారులని, యాగరక్షణార్థం వారిని తాను అయోధ్యనుండి ఆశ్రమానికి పిలుచుకు వచ్చానని చెప్పాడు. ఆ తరువాత ఆశ్రమంనుండి బయలుదేరింది మొదలు మిథిలా నగరం చేరేదాకా జరిగిన సంగతులన్నీ సంక్షిప్తంగా చెప్పాడు.

అహల్యా శాప విమోచనం వినగానే శతానందుడు చివాలున లేచి రాముని కౌగిలించుకొన్నాడు. తన తల్లి శాప విమోచనాన్ని, శ్రీరాముని మహానుభావాన్ని, విశ్వామిత్రుని మహోపకారాన్ని స్మరించి మహానందంతో 'రామా ! నీవు అప్రతిమతప్రభావుడైన విశ్వామిత్ర మహర్షితో ఇక్కడికి వచ్చావు. ఆయన చరిత్ర అద్భుతం. అది నీకు తెలుసా ?' అన్నాడు.

రాముడు అనేకచరిత్రలు విశ్వామిత్రుని నోట విన్నాడుగాని ఆయన చరిత్ర మాత్రం వినలేదు. అన్ని చరిత్రలు చెప్పిన విశ్వామిత్రుని చరిత్ర ఎంతో విస్తృతం. ఇప్పుడు శతానందుడది చెప్పటం ఎంతో సందర్భోచితం.

రాముని కన్నుల్లో కుతూహలం వెల్లివిరిసింది. శతానందుడు విశ్వామిత్రుని చరిత్ర అంతా చెప్పాడు. అందరు చెవులప్పగించి విన్నారు. రాముని ఆశ్చర్యానికి, ఆనందానికి అవధిలేదు.

విశ్వామిత్ర మహర్షికి అంతా ఒక స్వప్నంగా ఉంది.

మరునాడు సీతాస్వయంవరం, శివధనుర్భంగం, సీతారామకల్యాణం, ఊర్మిళాలక్ష్మణుల వివాహం, మాండవీ భరతుల పరిణయం, శ్రుతకీర్తి శత్రుఘ్నుల పెళ్ళి. అయోధ్యతో మిథిల సమ్మిళితమైంది. ఆ కల్యాణకారకుడు విశ్వామిత్రుడే.

ఒకనాడు విశ్వామిత్రుని వెంట రాముని పంపటానికి దశరథుడు ఎంతో సంకోచించాడు. ఈనాడు విశ్వామిత్రుడు రాముణ్ణి శస్త్రాస్త్రసంపన్నుని చేశాడు

విఖ్యాతతేజుని గావించాడు. సీతాసమేతుని చేశాడు. దశరథునికి అప్పగించాడు. ఒకనాడు జనకుడు సీతావరాన్వేషణ ఒక సమస్యగా భావించాడు. ఈనాడు విశ్వామిత్రుడు ఆ సమస్యను అందరికి ఆనందదాయకంగా పరిష్కరించాడు. లోకకల్యాణ కారకంగా తీర్చాడు.

ఆనాటి రాత్రి విశ్వామిత్రుడు విడిది ఇంట్లో ఒంటరిగా కూర్చున్నాడు. తన జీవితాన్నంతా ఒక్కసారి సమీక్షించుకొన్నాడు. అందులో ఎన్ని మిట్టపల్లాలు! ఎన్ని మలుపులు! ఎన్ని ఆఘాతంగాలు! ఎన్ని అపజయాలు, ఎన్ని విజయాలు! తనకు తానే నవ్వుకొన్నాడు. ఇంక చేయవలసింది లేదనుకొన్నాడు. తృప్తిగా ఊర్పు విడిచాడు. ఉదయాన్నే హిమాలయాలకు బయలుదేరాడు.

సీతారాములు, ఊర్మిళాలక్ష్మణులు, మాండవీ భరతులు, శ్రుతకీర్తి శత్రుఘ్నులు నునుసిగ్గు సింగారాలతో ఆ మహర్షికి పాదాభివందనం చేశారు.

ఆ మహర్షి అందరిని ఆనందాశ్రువులు రాలుస్తూ ఆశీర్వదించాడు.

దశరథమహారాజు చేతులు జోడించి క్షమాభిక్షనర్థించాడు. కృతజ్ఞతను ప్రకటించాడు.

ఆ మహర్షి ఆయనవైపు చూచి చిరునవ్వు నవ్వాడు.

జనకమహారాజు తృప్తిగా దోసిలొగ్గి నమస్కరించాడు.

విశ్వామిత్రుడు శుభమస్తు! అని ఆశీర్వదించాడు.

శతానందుడు, మహర్షులు, వేద విప్రులు, శిష్యులు అంతా ముకుళితహస్తులై నిలిచారు.

విశ్వామిత్రుడు చెయ్యెత్తి అందరిని ఆశీర్వదించాడు.

ఒకింత దూరంలో వసిష్ఠమహర్షి అట్టెచూస్తూ నిలబడి ఉన్నాడు.

విశ్వామిత్రుడు ఆయన దగ్గరికి వెళ్ళాడు.

ఒకనాడు ఇద్దరు ప్రత్యర్థులు. ఈనాడు ఇద్దరు మిత్రులు. ఒకనాడు ఇద్దరు పరస్పర వినాశానికి పూనుకొన్నారు. ఈనాడు ఇద్దరు లోక కల్యాణానికి కృషి చేశారు. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు, ధర్మపునరుద్ధరణకు శ్రీరామచంద్రుని తీర్చి దిద్దారు.

వసిష్ఠ విశ్వామిత్రులు పరస్పరం చిరునవ్వులతో పలుకరించుకొన్నారు.

గాఢంగా కౌగిలించుకొన్నారు. ఇరువురి శరీరాలు పులకరించాయి. ఇరువురి కళ్ళు చెమ్మగిల్లాయి.

అందరి చూపూ ఆ మహర్షుల మీదే.

మౌన గంభీరంగా విశ్వామిత్ర మహర్షి ముందుకు అడుగు వేశాడు. హిమాలయాలవైపు నడచి వెళ్ళాడు. ఆయన వెంట కమండలు యోగదండాలు వెళ్ళాయి. మిథిల అంతా అచ్చెరువొంది నిలబడింది. ఆయనవైపే చూచింది.

ఆ పిమ్మట రామాయణంలో విశ్వామిత్రుడు లేడు

ఒక వ్యక్తి జీవితంలో ఎంతో శ్రమిస్తేగాని, ఎంతో తపిస్తేగాని, ఎన్నో విఘ్నాల నెదుర్కొంటేగాని, ఎంతో పట్టుదల వహిస్తేగాని అతని రజస్తమో గుణాలు సత్త్వశుద్ధిని పొందలేవు. ఉన్నతోన్నతమైన స్థానాన్ని అందుకోలేవు. లోక కల్యాణ కారణాలు కాలేవు. కష్టనష్టాల ఊబిలో మానవుడు గొంతు దాకా కూరుకున్నా అతని దృష్టి మాత్రం సంతతం ఊర్ధ్వ ముఖంగానే ఉండాలి. అతని సంకల్పం మాత్రం సూర్యబింబంలా లక్ష్యసాధనవైపే చొచ్చుకుపోవాలి. అపజయాలు కలిగినంత మాత్రాన ఆదర్శాలు చెదిరిపోగూడదు. తీవ్ర మనస్తత్వం ఉన్నంత మాత్రాన మానవత్వం మరుగు పడగూడదు. రామాయణంలో విశ్వామిత్రుని జీవితం ఇందుకు చక్కని నిదర్శనం.

# గుహుడు

ఆతిథ్యం, ఉపకారం రెండూ ఉత్తమ మానవతాధర్మాలు. ఉన్నతోన్నత సంస్కారానికి చక్కని వ్యాఖ్యానాలు. నిజానికి ఒకరికి ఆతిథ్యమిచ్చే అవకాశం రావటం, ఉపకరించే సందర్భం దొరకటం గొప్ప అదృష్టం. అయినా కొందరు అతిథిని చూస్తే ముఖం తప్పిస్తారు. ఉపకారం అంటే వెనుకంజ వేస్తారు. మరి కొందరు ఆతిథ్యాన్ని, ఉపకారాన్ని అందిస్తారుగాని వాటిని ఏవో లౌకిక ప్రయోజనాలకు పెట్టుబడులుగా వాడుకొంటారు. కొందరు నిస్స్వార్థంగా వీటిని జరిపినా అహంకారంతో విర్రవీగుతారు. అధికులమని అనుకొంటారు. లోకంలో ఏ కొందరో అతిథిని పూజించటం, ఆర్తులకు ఉపకరించటం తమ ధర్మాలుగా భావిస్తారు. హృదయ

పూర్వకంగా చేస్తారు. జన్మ తరించినట్లు తృప్తి చెందుతారు. అందులోను ఒక మహాపురుషునికి కష్ట సమయంలో ఆతిథ్యమిచ్చే అవకాశం దొరికితే, ఉపకారంచేసే అవకాశం లభిస్తే వారి ఆనందానికి అంతుండదు. జీవితంలో గుహునికి ఈలాంటి అవకాశం దొరికింది. అతడు శ్రీరామచంద్రునికి ఆతిథ్య మిచ్చాడు. చేతనైన ఉపకారం చేశాడు. ఆ రామచంద్రుడికి అడవి నుండి మరలి అయోధ్యకు రమ్మని అర్థించటానికి వెళ్ళే భరతునికి గూడ ఆతిథ్య మిచ్చాడు. చేతనైన ఉపకారం చేశాడు.

గుహుడు పుట్టమైన మనిషి. అతనిది దిట్టమైన శరీరం. నల్లని రంగు. గుండ్రని ముఖం. ఎఱ్ఱని కళ్ళు. కొట్టవచ్చినట్లు ముందుకు దూకే తెల్లని గుబురు మీసాలు. పెద్ద తలపాగా అందులో రంగు రంగుల ఈకల అలంకారాలు మెళ్ళో రకరకాల పూసల హారాలు. ముంజేతుల కంకణాలు. ఇది గుహుని ఆకారం.

గుహుడు ఆటవికప్రభువు. గంగాతీరంలో అతని దెబ్బకు తిరుగులేదు. అతనికి ఐదువందల నౌకాబలం ఉంది. అత్యధిక కాల్బలం ఉంది కత్తులు-ఈటెలు అమ్ములవంటి అనేకానేక ఆయుధాలున్నాయి. అడవిలోని మృగపక్షి పదార్థ సంపద, గంగలోని జలచర సంపద అంతా అతనిదే.

శృంగిబేరపురం అతని ఊరు. అది గంగ ఒడ్డు గ్రామం. చుట్టూ అడవులు, కొండలు, ఊళ్ళో అంతా బోయలు, కోయలు, చెంచులు, బెస్తలు, నాగరిక జీవనానికి చాల దూరంగా బ్రతికే ప్రజలు. ఆ ఊరిని ఆనుకొనే ఉంది. ఓ పెద్ద గార చెట్టు ఆ చెట్టు మీద ఎన్నో పక్షులు. వచ్చేపొయ్యే వాళ్ళంతా ఆ చెట్టు నీడనకూర్చుంటారు. సేద తీర్చుకొంటారు. ఊళ్ళోవాళ్ళు ఆ గారచెట్టు క్రిందకూర్చుని కబుర్లు చెప్పుకొంటారు. పిల్లలు ఆడుకొంటారు.

ఆ రోజు సాయంకాలం ఒక పెద్ద రథం అతి వేగంగావచ్చి ఆ చెట్టు క్రింద ఆగింది. ఆ రథాన్ని, అందులో వ్యక్తుల్ని చూచి అక్కడున్న వాళ్ళంతా ఆశ్చర్య పడ్డారు. భయపడ్డారు. ఒక్క పరుగునపోయి గుహునితో చెప్పారు.

ఎవరు వచ్చారో! ఎందుకు వచ్చారో!

గుహుడు అరమోడ్పు కన్నులతో ఒక్కక్షణం ఆలోచించాడు. గబగబా తల పాగ సవరించుకొన్నాడు. క్రొత్త ఈకలు అలంకరించుకొన్నాడు. హడావిడిగా అనేకహారాలు వేసుకొన్నాడు. మంత్రులతో, భటులతో, పెక్కుమంది

కులపెద్దలతో ఆ చెట్టు దగ్గరికి పరుగులు దేరాడు. తీరా వెళ్ళిచూస్తే ఆ వచ్చింది ఎవరో కాదు_ దశరథరాముడు; శ్రీరాముడు; తన ప్రియమిత్రుడు. తమ్ముడు లక్ష్మణుడు, భార్య సీతమ్మ ఆయన ప్రక్కనే ఉన్నారు. నారచీరలతో ఉన్నారు. నలిగి ఉన్నారు. వాళ్ళను చూచేసరికి గుహుని కళ్ళు చెమ్మగిల్లాయి. అతడు చేతులు జోడి స్వాగతం పలుకుతూ ముందుకు నడిచాడు. చిరునవ్వు నవ్వే శ్రీరామ చంద్రుడ్ని గాఢంగా కౌగిలించుకొన్నాడు.

'రామా! నీవంటి అతిథి దొరకటం నా పూర్వపుణ్యఫలం రా. శృంగిబేరపురం అయోధ్యలాగే నీకు సొంతం. స్వామీ! నీకు స్వాగతం. మేమంతా నీసేవకులం, అమ్మా! అలసి ఉన్నారే. ఆకలిగొని ఉన్నారే. అన్ని ఆహారపదార్థాలూ సిద్ధంగా ఉన్నాయి. గుర్రాలకు గడ్డి మెండుగా వుంది. మీరు ఉండటానికి, పండుకోటానికి పాన్పులన్నీ ఉన్నాయి. అని గుక్కతిప్పుకోకుండా చెప్పుకుపోతూనే ఉన్నాడు. కన్నీళ్ళు రాలుస్తూనే ఉన్నాడు.

ఆ గుహుని ఎక్కడ ఆపాలో రామునికి అర్థంగాలేదు. ఎలా ఆపాలో అంతకంటె అర్థంగాలేదు. అతని పారవశ్యం అలా ఉంది.

రాముడు గుహుని కన్నీళ్ళు తుడిచాడు. అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అందంగా నవ్వాడు. ఆ ముగ్ధ మోహన మందహాసాన్ని అట్టే చూస్తూ గుహుడు మాట ఆపాడు. అప్పుడు రాముడు ఆప్యాయంగా అతని వీపు నిమురుతూ 'గుహా! నీవు స్వయంగా పాదచారివై వచ్చి ఇంత స్నేహపూర్వకంగా నన్ను ఆహ్వానించావు. అతిథి సత్కారాలన్నీ నాకు అందినట్లే' అని అతని చెయ్యి పట్టుకొని నడిపించుకొని వెళ్ళి ఆ గారచెట్టుక్రింద కూర్చో పెట్టుకొన్నాడు. అనేక కుశలప్రశ్నలు వేశాడు.

ఈ లోగా గుహుని మనుషులు ఎన్నో ఆహారపదార్థాలు తెచ్చారు. దొంతరలు దొంతరలుగా పేర్చారు. అందులో అనేకభక్ష్యాలు; భోజ్యాలు; చోష్యాలు; లేహ్యాలు పానీయాలు.

రామచంద్రుడు అన్నింటినీ చూచాడు. అల్లన నవ్వి గుహా! నేను తాపస వ్రతదీక్షలో ఉన్నాను. ఇవన్నీ అంగీకరించగూడదు. అన్నాడు. ఈ గుర్రాలు మొదలు నాతో వచ్చిన ఇవి ఎలా శ్రమపడుతున్నాయో. అవి నాన్నగారి గుర్రాలు. అలసి ఉన్నాయి. ఆకలి గొనిఉన్నాయి. ఆ ప్రాణులకు ఆహారం పెట్టు. అవి తృప్తిగా తింటే నేను తిన్నట్లే. అవి సుఖంగా ఉంటే నేను ఉన్నట్లే.అనేసరికి గుహుని మనసు

పులకించింది. ఆతడు తలయెత్తి ఆకాశాన్నంటే పర్వతశిఖరాన్ని చూచినట్లు ఆ రాముని ముఖంలోకి చూచాడు. అర్థనిమీలితనేత్రాలతో 'స్వామీ!' అని సంబో ధించి చేతులు జోడించాడు. భృత్యుల్ని పిలిచి గుఱ్ఱాలకు మేతపెట్టించాడు నీళ్ళు త్రావించాడు.

అంతలో ప్రొద్దు గ్రుంకింది. రాముడు సంధ్యావందనం పూర్తి చేసి, లక్ష్మణుడు తెచ్చిన గంగా జలాన్ని త్రావి, దర్భశయ్యమీద సీతతో గూడ శయనించాడు.

రాముడే గ్రుక్కెడు గంగత్రావి పడుకొంటే తక్కిన వాళ్ళంతా ఆ ఆహార పదార్థాలు తింటారా ?

గుహుడు చేతులు కట్టుకొని ఆ పదార్థాలవైపు చూస్తూ అలా నిలబడి పోయాడు. రాముడు ఏదీ తాకలేదు. ఆయనకు తాను ఎలా ఉపయోగపడాలో గుహు నికి తోచలేదు. అంతటి శ్రీరామునికి తానింతా ఇచ్చింది గుప్పెడుగడ్డి. తన సంపదకు ఏం సార్థకత? ఇదేమి అతిధి సత్కారం !

గుహుడు అలా ఆలోచిస్తూనే ఉన్నాడు. బాగా చీకటి పడింది. లక్ష్మణుడు, సుమంత్రుడు వెంటచేరి ఎన్నోసార్లు చెప్పారు తన్నింటికి వెళ్ళమని, వెళ్ళటానికి కాళ్ళాడితే గదా? వెళ్ళిమాత్రం తానేమి చెయ్యాలి? తన అతిథి తినకుండా తాను తినటమా? తన అతిథి నేలపై పడుకొంటే తాను తల్పంమీద శయనించటమా? ఎంత అపచారం !

అయితే తానిక్కడ ఉండి ఏం చెయ్యాలి ?

లక్ష్మణుడు ధనుస్సు చేపట్టి సీతారాములకు రక్షగా తిరుగుతున్నాడు.
సుమంత్రుడు మాత్రం నిద్రపోగలడా? అతని మనస్సు మరీ వికలంగా ఉంది. సీతారామ లక్ష్మణులతో వచ్చిన రథం రేపు ఖాళీగా వెనుతిరిగి వెళ్ళాలి. అయో ధ్యలో పరిస్థితులు ఎలా ఉన్నాయో? ఆ రథసారథికి రాత్రంతా ఏవేవో ఆలో చనలు.

సీతారాములు పడుకొన్నారే గాని వారికి మాత్రం గాఢంగా నిద్ర పట్టిందా? నిన్నటి ఆలోచనలు వారి మనసుల్లో లేకపోవచ్చు. రేపటి ఆలోచనలు చోటు చేసు కోకుండా ఉంటాయా ? అంతేగాదు. ఆ రాత్రి వారికి అలవాటు లేని నేల పడక.

పాపం! గాంచెట్టుగూడ ఆ రాత్రి గాఢంగా నిద్రపోలేదు. అది గాలికి ఊగుతూనే ఉంది.

గంగానది గూడ ఆ రాత్రి గాఢంగా నిద్రపోలేదు. అది గలగల పారుతూనే ఉంది.

అడవి గూడ ఆ రాత్రి అట్టే కన్నుమూయలేదు. ఏవో మృగాలు అరుస్తూనే ఉన్నాయి. ఎన్నో పాములు ప్రాకుతూనే ఉన్నాయి.

ఇక ఆకాశం సంగతి చెప్పనే అక్కరలేదు. అది కన్నుల్లో వత్తులు వేసుకొని అలా చూస్తూ నిలబడి ఉంది.

నిత్య నిరంతర విశ్వచైతన్యానికి ఆ రాత్రి ఒక గొప్ప ఉదాహరణ.

గుహుడు కొంతసేపు సుమంత్రుని దగ్గర కూర్చున్నాడు. అయోధ్యలో జరిగిన సంగతులన్నీ విన్నాడు. లేచి లక్ష్మణుని దగ్గరికి వెళ్ళాడు. ఆ చేతి విల్లు నా చేతికివ్వు నీవు వెళ్ళి పడుకో అన్నాడు. రాముడు నా స్వామి అన్నాడు. రాత్రంతా రెప్పవాల్చకుండా కావలాకాస్తా నన్నాడు. ఈ ప్రాంతమంతా నాకు పరిచయమున్నది. నా ఎరుక లేకుండ ఏ ప్రమాదమూ రాదన్నాడు.

లక్ష్మణుడు గుహుని మాటలకు నవ్వుకొన్నాడు. అతని హృదయం అర్థం చేసుకొన్నాడు. అయోధ్యలో జరిగిన విశేషాలు చెప్పాడు. ఇకముందు జరిగే అనర్థాలు సూచించాడు. అటూ ఇటూ తిరుగుతూనే లక్ష్మణుడు చెప్తున్నాడు. అతని అడుగులలో అడుగు వేస్తూనే ఆ గుహుడు వింటున్నాడు.

ఆ రాత్రంతా అలాగే గడిచి పోయింది.

రాముడు ప్రాతఃకాలాన్నే లేచాడు. ఒక్కసారి అలా గంగవైపు చూశాడు. హాయిగా నిద్రనుంచి కళ్ళు తెరిచినట్లు గంగలోని తామరలన్నీ ఒక్కటొక్కటే రేకులు విప్పుకొంటున్నాయి. వికసిస్తున్నాయి. చిరుచేపలు చివాలున ఎగిరి గంతులు వేస్తున్నాయి.

రాముడు లక్ష్మణుని పిలిచాడు

గాంచెట్టు పైన కోయిల కూసింది.

లక్ష్మణుడు గుహుని పిలిచాడు. గంగవైపు చూపాడు. కొన్ని పక్షులు పైకెగిరి గంగను దాటిపోతున్నాయి.

గుహునికి అంతా అర్థమైంది. తన అదృష్టానికి తానే మురిసి పోయాడు. తన జీవితానికి ఎంత సార్థకత !

అందరిని దుఃఖసాగరం దాటించగల ఆ శ్రీరామచంద్రుని తానీనాడు గంగ దాటిస్తున్నాడు. అందరికి ఉపకరించే ఆ శ్రీరామచంద్రునికి తానీనాడు ఉపకరిస్తున్నాడు. తరిస్తున్నాడు.

గుహుడు వెంటనే అందమైన నావ తెప్పించాడు. గంగనీట నిలిపాడు, చేతులు జోడించి, శిరము వంచి శ్రీరామునితో 'స్వామీ! ఆజ్ఞ ?' అన్నాడు.

జడలు ధరించటానికి మఱ్ఱిపాలు కావాలన్నాడు శ్రీరాముడు.

మహాప్రసాదమని గుహుడు వెంటనే మఱ్ఱిపాలు తెప్పించాడు.

రాముడు గుహుని ఆతిథ్యంపట్ల తన హర్షాన్ని వ్యక్తంచేశాడు. అతనికి అనేక రాజధర్మాలు గూడ చెప్పాడు.

అంతలో గంగ పిలిచినట్లు నీటిపక్షులు అరిచాయి. నదీ తరంగాల్లోని నావ నాట్యభంగిమలో ఆహ్వానించింది. ముందు సీతమ్మ, ఆ తరువాత లక్ష్మణుడు, అందరి దగ్గరసెలవు తీసుకొని ఆ రామచంద్రుడు నావయెక్కాడు.

గంగ గట్టంతా జనసమూహంతో నిండిపోయింది. కన్నీట తడిసి పోయింది.

రాముడు శాస్త్రోక్తంగా నావారోహణమంత్రాన్ని జపించాడు. గంగకు నమస్కరించాడు. సీతమ్మ జోడించింది. సౌమిత్రి శిరస్సు వంచాడు.

పడవ కదిలింది.

జనసమూహం గుహునితో పాటు ఒక్కసారిగా చేతులెత్తి ఆ రామచంద్రునికి నమస్కరించింది.

గుహుడు సుమంత్రునితో కలిసి ఇంటికి వెళ్ళాడు. రాముడు తన ఆతిథ్యం పట్ల, ఉపకారం పట్ల వ్యక్తం చేసిన తృప్తిని పదేపదే తలచుకొన్నాడు నిన్నటి నుండి తనకు అన్నంలేదు. అయినా తృప్తిగా భోంచేసినట్లుంది. నిన్నటి నుండి తనకు నిద్రలేదు. అయినా సుఖంగా నిద్రించినట్లుంది. నిన్నటి నుండి తనకు విశ్రాంతి లేదు. అయినా మనస్సెంతో ప్రశాంతంగా ఉంది. రాముని కష్టాలు తాను తీర్చగలడా ? అయినా ఆ మహానుభావునికి ఆతిథ్యమిచ్చే అవకాశం దొరకటం

ఇటువంటిచే సంబంధం ఏర్పడటం ఎంత అదృష్టం!

గుహుడు తన అదృష్టానికి తానే మురిసి పోయాడు. ఇల్లాలికి, పిల్లలకు, ప్రియులందరికీ తన ఆనందాన్ని పంచిపెట్టాడు. అంతేగాదు. అతడు తన మనుష్యుల్ని పంపి సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమాన్ని చేరటం, ప్రయాగక్షేత్రంలో ఉండటం, తరువాత చిత్రకూటానికి వెళ్ళటం తెలుసుకొన్నాడు. సుమంత్రునికి ఈ సంగతులన్నీ చెప్పి అయోధ్యకు సాగనంపాడు.

గుహుని జీవితంలో కొద్ది రోజుల్లోనే మరొక వింత అనుభవం. అతని ఆతిథ్యానికి, ఉపకారానికి మరొక మంచి అవకాశం.

ఆ రోజు ఇంకా ప్రొద్దుగ్రుంకలేదు. గంగ ఒడ్డున గుహునికి పెద్దసేన కన్పించింది. చతురంగ బలాలు, సైనికుల చేతుల్లో ఆయుధాలు; రకరకాల వాహనాలు తన రాజ్యం ప్రక్కనే గంగ ఒడ్డున అనేక గుడారాలు. గుహుడు కోపవద్దాడు. భయపడ్డాడు. ఆ సేన ఎవరిదో? ఎందుకు వచ్చిందో?

గుహుడు ఒక చెట్టెక్కి సూక్ష్మంగా పరిశీలించాడు. రథధ్వజం అగుపించింది. అది కోవిదారధ్వజం. గుహుడు గుర్తుపట్టాడు. అది భరతుని సేన. అయితే ఆ సేన ఎందుకు వచ్చినట్లు? బహుశః అదిరాముని మీదికే వచ్చిందేమొ! గుహుడు వెంటనే తన నౌకాదళాన్ని హెచ్చరించాడు. 'అవసరమైన ఆహారపదార్థాలన్నీ నౌకల్లో నింపుకొని ఆ సేనను అడ్డుకోటానికి గంగలో సిద్ధంగా ఉండండి. భరతుడు సద్బుద్ధితో ఉంటే గంగను దాటనిద్దాం. దుర్బుద్ధితో ఉంటే అక్కడే కట్టి అడ్డుకొందాం' అన్నాడు నావికులతో.

అయితే గుహుడు అవివేకి గాదు. అవేశపరుడు అంతకంటే గాదు. తొందరపడి అతడు యుద్ధానికి దిగలేదు. మీదు మిక్కిలి ఎంతో నేర్పుగ మత్స్యమాంస మద్యాది కానుకలు తీసికొని భరతుని దర్శనానికి వెళ్ళాడు. తన ఆతిథ్యాన్ని స్వీకరించవలసినదని అతివినయంగా అర్థించాడు. భరతుని అంతర్యం అర్థం చేసుకొన్నాడు. ఆయన భ్రాతృభక్తి చూచి పులకించాడు. అప్రయత్నంగా సిద్ధించిన రాజ్యాన్ని అన్నకొరకు వదలే నీవంటి ధార్మికుడు లోకంలో లేడన్నాడు. నీవు ధన్యుడివన్నాడు. నీ కీర్తి అన్నిలోకాల్లో శాశ్వతంగా నిలుస్తుందన్నాడు. నీకు అవసరమైన సాయమంతా చేస్తానన్నాడు.

ఇంతలో ప్రొద్దు గ్రుంకింది.

భరతుడు అన్నకు జరిగిన అన్యాయానికి దుఃఖిస్తూనే ఉన్నాడు. గుహుడు అనేక విధాల ఆయనను ఓదారుస్తూ ఆరోజురాత్రి సీతారాములు పవ్వళించిన దర్భ శయ్యను, ఆ దర్భశయ్యకు అక్కడక్కడ తగుల్కొన్న సీతాదేవి ఉత్తరీయపు పట్టు పోగులను, కొద్దికొద్దిగా రాలి ఉన్న ఆమె ఆభరణాల బంగారపు పొడిని చూపించాడు. ఆ మరునాడు సీతారామలక్ష్మణులు నారచీరలు ధరించి, మర్రిపాలతో జడలు దాల్చి అరణ్యాలకు వెళ్ళిన వైనం వివరించాడు. భరతుడు అన్నగారిని గూర్చి అనేకవివరాలు అడుగుతున్నాడు. గుహుడు అవన్నీ చెపుతున్నాడు.

భరతుడు గుహుడు అలా ఎంతసేపు ఆ రాత్రి మాట్లాడారో !

సూర్యోదయమైంది. భరతుని అభ్యర్థనను పురస్కరించుకొని గుహుడు రకరకాల నావలు సిద్ధం చేయించాడు. అందులో స్వస్తికం ఒక ప్రత్యేక నావ. ఉత్తమనావ దాని అడుగున వెన్నెల పరిచినట్లు ఒక మెత్తని కంబళి. దాని చుట్టూ పక్కలు ప్రేలాడినట్లు చిరుగంటలు.

భరతశత్రుఘ్నులు ముందుగా ఆనావ నధిరోహించారు. ఆ తరువాత వసిష్ఠుడు, వృద్ధబ్రాహ్మణులు, కౌసల్యాసుమిత్రా కైకలునావ నెక్కారు. గుహుడు ఒక్కసారి ఆ రాముని స్మరించుకొన్నాడు. చేతులు జోడించి భరతాదులకు నమస్కరించాడు.

స్వస్తికం కదిలింది. దాని వెంట తక్కిన నావలు వాటిలో కొన్నింట స్త్రీలు కొన్నింట పురుషులు : కొన్నింట పదార్థాలు , కొన్నింట గుర్రాలు ; కొన్నింట వృషభాలు ; కొన్నింట రథాలు : కొన్నింట శకటాలు. మావటీలు మాత్రం మదగజాలను ఏటిలో నడిపించారు.

గుహుని జీవితంలో ఇదొక మరపురాని అనుభూతి. ఆర్ద్రతతో ఇచ్చిన ఆతిథ్యం , అవసరానికి చేసిన ఉపకారం ; అంతా రామార్పణం అన్న తృప్తి.

ఆర్ద్రతతో ఇచ్చే ఆతిథ్యం, భక్తి భావంతో చేసే ఉపకారం ఎవరి హృదయాన్ని అయినా బలంగా ఆకర్షిస్తాయి. అందులోను మహాత్ముల హృదయాల్ని మరీవశం చేసుకొంటాయి. రాముడు జీవితంలో గుహుని ఆతిథ్యాన్ని మరువగలడా ? అతని ఉపకారాన్ని విస్మరింపగలడా ? అందుకే అయోధ్యకు ఆయన విమానంలో తిరిగి వెళ్ళుతున్నా భరద్వాజాశ్రమం నుండి హనుమంతుని పంపాడు. గుహునికి తనక్షేమవార్త చెప్పించాడు. అతడు నా ఆత్మసఖుడన్నాడు.

గుహునికి మంచి హృదయం ఉంది. జీవితంలో కొన్ని విలువలున్నాయి. అన్నిం టిని మించి ఆతిథ్యానికి ఉపకారానికి వెనుక ఉండవలసిన ఉత్తమ మనస్తత్వం ఉంది. అందుచేతనే అతనికి రాముని హృదయంలో స్థానం దొరికింది, అందుచేతనే అతని కా మహాత్ముని చేత 'ఆత్మసమస్సఖా' అని అనిపించుకొనే అదృష్టం లభిం చింది.

గుహుడు ధన్యజీవి

# జటాయువు

ప్రాణికోటిలో మట్టిమీద ప్రాకే చీమమొదలు మహాసౌధంలో నివసించే మానవుని దాకా ఎంత తిన్నా, ఎంత ఉన్నా ఏదో ఒకరోజు మరణింపక తప్పదు. పుట్టిన ప్రతి ప్రాణికీ మరణం అవశ్యపరిణామం. కాకుంటే ఒకరు ముందు; మరొకరు వెనుక. అంతే. అయితే కొన్ని ప్రాణులు సార్థకంగా మరణిస్తాయి. ఏ ధర్మానికో, దానానికో, స్నేహానికో ప్రాణాలర్పించి సత్కీర్తి పొందుతాయి. మరికొన్ని ప్రాణులు అవి ఎంత గొప్పవైనా నిరర్థకంగా మరణించి నీటి బుడగల్లా కాలప్రవాహంలో కలిసిపోతాయి.

ప్రపంచంలో ప్రాణికున్న అనేక సంబంధాల్లో స్నేహం ఒక ముఖ్యబంధం, అంతేగాదు. అది ఎంతో మధురమైంది గూడ. మన ఆనందాన్ని అంతకు అంత పెంచేది, మన ఆవేదనను కొంతకు కొంత పంచుకోగలిగేది ఉత్తమస్నేహమే. అయితే స్నేహానికి స్వార్థం వేరుపురుగు. స్వార్థపరులైన స్నేహితులు సంపదల్లోనే మన చెంతచేరుతారు. సాధ్యమైనంత వరకు ప్రయోజనాలు పొందుతారు. ఆపదలు వచ్చే సమయంలో అగుపించకుండ పోతారు. కాని ఉత్తమ స్నేహితుల సంగతి అలాకాదు. ఆపదల్లో వాళ్ళు చేయూత నిస్తారు. అవసరమైతే ప్రాణాలనైనా త్యాగం చేస్తారు.

కాగా, సాయం చేసే గుణం చాలా గొప్పది. అయితే స్వార్థంతో చేసే సాయం సరి అయింది గాదు, అది ఒక విధంగా వ్యాపారంతో పెట్టుబడి లాంటిది,

నిస్స్వార్థంగా చేసే సాయమే నిజమైన సాయం. అందులోను అడిగించుకొని చేసే సాయం కంటె అవసరాన్ని గుర్తించి స్వచ్ఛందంగా చేసే సాయం పరమపవిత్రం; బలవత్తరం. అటువంటి సాయమే వ్యక్తి ఉపకారశీలానికి వన్నె పెట్టుతుంది. ఉత్తమమైత్రికి బలాన్ని చేకూరుస్తుంది. ప్రాణిమాత్రమే గాదు పరమాత్మని గూడ పులకింపజేస్తుంది. ఎప్పుడైనా ఉన్నత త్యాగమే ఉత్తమమైత్రికి గీటురాయి.

రామాయణంలో జటాయువు దశరథుని స్నేహితుడు. అతనంటానే ఆప్తమిత్రుని పుత్రునికి ఆపదసమయంలో సాయంచేసిన స్నేహశీలి. అచ్చపు మైత్రికి కానుకగా, అధర్మనిరోధానికి మూల్యంగా తన అసువులే అర్పించిన త్యాగశీలి.

జటాయువు ఒక పెద్ద గ్రద్ద. అతని తండ్రి అనూరుడు. తల్లి శ్యేని. సంపాతి అతని అన్న. జటాయువు జవసత్వాలు. బలపరాక్రమాలు అమోఘాలు. అతడు చిన్నతనంలోనే సంపాతితో పందెం వేసుకొని సూర్యమండలం దాకా ఎగిరాడు. అయితే ఆ దుస్సాహసానికి పాపం! తట్టుకోలేక పోయాడు. స్పృహ తప్పి పడిపోయే సమయంలో అన్న తన రెక్కలు గప్పి తమ్ముని రక్షించాడు. తాను రెక్కలు కాలి వింధ్య పర్వతం మీద పడిపోయాడు.

జటాయువు సురక్షితంగా క్రిందికి దిగినా అతడు ఇంతకాలం ఎక్కడెక్కడ తిరిగాడో తెలీదు. దండకారణ్యం ఎప్పుడు వచ్చాడో తెలీదు. దశరథునికి, అతనికి మైత్రి ఎలా ఏర్పడిందో అంతకంటె తెలీదు.

జటాయువు వృద్ధుడయ్యాడు. అతని రెక్కల బలం కొంత తగ్గింది. చూపు సూక్ష్మత కొంత సన్నగిల్లింది. దండకారణ్యంలో ఒక పెద్ద వృక్షం మీద అతడు నివాసం ఏర్పరచుకొన్నాడు.

ఆనాడు ఉదయం బాగా ప్రొద్దెక్కింది. జటాయువు చెట్టుమీద కూర్చొని ముక్కుతో రెక్కలు గీరుకొంటూ అటూ ఇటూ చూస్తున్నాడు. ఎందుకో మృగాలు భయపడి పరుగులు తీస్తున్నాయి. అరుస్తున్నాయి. పక్షులన్నీ చెల్లాచెదురై పైకెగురుతున్నాయి. పెద్దగా కూస్తున్నాయి. జటాయువు బాగా మెడ సాచి ముందుకు చూచాడు. జడలు దాల్చి, నారచీరలు గట్టి, చేత ధనుస్సు పట్టి తేజోమూర్తులైన ఇద్దరు పురుషులు, వారి మధ్య ఒక స్త్రీ నడిచి వస్తున్నారు. వారెవ్వరో తెలీటం

లేదు. పోల్చుకోవటం కష్టంగా ఉంది. ఎక్కడికి వెళ్ళుతున్నారో ? ఎందుకు వెళ్ళుతున్నారో ?

ఏమీ తెలీదు.

జటాయువు రెక్కలు జలజల విదిలించాడు. ఒక్క ఊపున పైకెగిరాడు. ఆ దెబ్బకి చుట్టుపక్కల చెట్లన్నీ సుడిగాలి తాకినట్లు ఊగాయి. జటాయువు శ్రీరాముని పరిశీలించాడు. ఆయనను వెంటనే గుర్తు పట్టాడు. ఎలా గుర్తు పట్టాడో మరి ! బహుశః పక్షిజాతికి ఈ విషయంలో విశేషజ్ఞానం ఉంటుందేమో.

జటాయువు రూపాన్ని, అతని రాకను, చెట్లన్నీ ఊగటాన్ని రాముడు చూశాడు. ఆశ్చర్యపడ్డాడు. అతని నొక రాక్షసునిగా భ్రమించాడు. 'ఆగు. ఎవ్వరవు ?' అన్నాడు.

జటాయువు శిరస్సు వంచి వినమ్రంగా ముందు కదులుతూ 'నేను నీ తండ్రి స్నేహితుణ్ణి. నా పేరు జటాయువు. ఈ అరణ్యంలో నీకు సాయంగా ఉంటా. నీవు లక్ష్మణుడు ఎన్నో పనులమీద అరణ్యంలోకి వెళ్ళుతుంటారు. అప్పుడు సీతమ్మకు నేను రక్షగా ఉంటా' అని ఎంతో ప్రియంగా పలుకు చెప్పాడు.

రాముడు ఆనందించాడు. 'ఈ మహారణ్యంలో మా తండ్రికొక స్నేహితుడా ! అతనొక పక్షిరాజుడా ! పైగా ఈ కష్ట సమయంలో నన్ను చూచి మొగం తప్పించి అవతలికి పోకుండా తనంత తాను వచ్చి సాయం చేస్తానని అంటున్నాడా ! ఎంత మంచి తనం ! ఎంత స్నేహశీలం ! ఇవి మానవజాతికే మేలు బంతులు' అని రాముడనుకొన్నాడు. ఆ గృధ్రరాజును కౌగిలించుకొన్నాడు. అతని పుట్టుపూర్వోత్తరాలడిగి తెలుసుకొన్నాడు. ఆ పితృసఖుని పూజించాడు.

జటాయువు తన జన్మవృత్తాంతంతోపాటు జగత్సృష్టిక్రమం ఆ జగదీశ్వరుడికి చెప్పాడు. తానుండే చెట్టు చూపాడు. సీతకు రక్షగా ఉంటానని ఇంకోమారు చెప్పాడు. ఆముగ్గురిని పంచవటికి సాగనంపాడు.

జటాయు సమాగమం రాముని జీవితంలో ఒక చిత్రమైన అనుభవం. శ్రీరామసమాగమం జటాయువు జీవితంలో జన్మ సఫలతకు ఒక చక్కని అవకాశం.

పర్ణశాలలో సీతారామలక్ష్మణులు. కొంత దూరాన చెట్టుమీద జటాయువు. కొన్నిరోజులు గడచాయి.

ఆ రోజు జటాయువుకు ఎందుకో అమితమైన నిద్ర. ప్రొద్దెక్కింది. అయినా అతనికి నిద్రమత్తు వదలలేదు. ఆ నిద్రమత్తులోనే ఏదో ఆక్రందన స్వరం వినిపించింది. అది స్త్రీస్వరం. అలా వింటూ ఉండగానే రామా ! రామా ! అన్న మాటలు గూడ వినిపించాయి. అంతలోనే జటాయూ ! అన్న సంబోధన గూడ చెవిసోకింది. జటాయువు నిద్రమత్తు వదిలింది. అతడు తలయెత్తి చూచాడు. ఆకాశమార్గంలో అతివేగంగా వెళ్ళే ఒక రథం. అది బంగారురథం. అందులో రావణుడు. అతని తొడ మీద సీత. సీత జుట్టును రావణుడు గట్టిగాపట్టుకొన్నాడు. అతని పట్టు తప్పించుకోవటానికి ఆమె గట్టిగా పెనుగులాడుతూ ఉంది. అతని కళ్ళు అగ్నికణాలు. ఆమె ముఖం అశ్రుసిక్తం. అతనిది వికటాట్టహాసం. ఆమెది ఆర్తనాదం.

జటాయువుకు ఒక్కక్షణంలో అంతా అర్థమైంది.

జటాయువును చూడగానే సీత కళ్ళల్లో ఆశారేఖ తళుక్కున మెరిసింది. ఏ మహార్ణవంలోనో పడి మునిగిపోయే ప్రాణిచేతికి ఒక సాలెగూటి నూలిపోగు చిక్కినట్లుంది. ఆమె ఎలుగెత్తి జటాయువును సంబోధించి 'ఈ పాపిష్ఠి రావణుడు నన్నపహరించుకొని పోతున్నాడు. వీడు బలవంతుడు. పరమక్రూరుడు. ఆయుధధరుడు. జయశీలుడు. నీవితనిని ఎదుర్కోలేవు. నన్నపహరించినవార్త మాత్రం రామునితో చెప్పు. ఆ సాయంచాలు' అని ప్రాధేయ పూర్వంగా అడిగింది.

జటాయువు ఒక్కసారి రెక్కలు విదిల్చాడు. చెట్లన్నీ గడగడ లాడాయి. నోరు విప్పాడు. 'రావణా ! ఆగు,' అన్నాడు.

రావణుడు ఒకింత ఆగాడు.

'నేను జటాయువును. గృధ్రరాజును. ధర్మం తప్పను. అసత్యం ఆడను. నా మాట విను. రాముడు లోకనాథుడు. హితకరుడు. ఇంద్రసముడు. ఆయన పత్ని పత్నిని అపహరించటం మహాపాపం. నీ భార్యను అపహరిస్తే నీ కెలా ఉంటుందో ఆలోచించు. నీవు రాజువు. ధర్మ రక్షణ నీ కర్తవ్యం. రాముడు నీకే అపకారం చేశాడని ఈ పని చేస్తున్నావు. శూర్పణఖను అవమానించాడంటావేమో, ఖరుని వధించా

దంటావేమో. అందులో రాముని తప్పేముంది ? శూర్పణఖ హద్దుమీరింది. ఖరుడు అహంకరించి ఆయననెదిరించాడు.

రామపత్నిని వదలిపెట్టు. సీతను చెరబట్టటం మహాసర్పాన్ని కొంగున ముడి వేసుకోవటమే. మోయలేని భారాన్ని మీదికెత్తుకోవటమే. జీర్ణంకాని ఆహారాన్ని ఆరగించటమే. ఇది అవివేకం. ప్రమాదకరం. నీ కంఠానికి కాలపాశం తగులుకొన్న సంగతి తెలుసుకో. నేను వృద్ధుణ్ణి, నిరాయుధుణ్ణి. నీవు యౌవనవంతుడివి. ధనుర్బాణపాణివి. కవచధారివి. పైగా రథస్థుడివి. అయినా నీ ప్రయత్నం సాగనివ్వను. సీతను అపహరించుకొని పోనివ్వను. తర్కంతో గూడిన వేదాన్ని ఖండించటం ఎలా సాధ్యంగాదో, నేను చూస్తుండగా సీతనపహరించటం నీకు అలా సాధ్యంగాదు. వీరుడివైతే నాతో యుద్ధంచెయ్యి. ఖరునికి పట్టిన గతే నీకూ పట్టిస్తా. నా శరీరంలో ప్రాణం ఉండగా సీతను తీసుకు పోనివ్వను. దశరథుడు నా ప్రాణమిత్రుడు. నా ప్రాణాలు అర్పించి అయినా అతని కొడుకు భార్యను రక్షిస్తా"— అని జటాయువు అనేసరికి రావణుడు బహుశః అపహసించాడేమో, వెడమొగం పెట్టి పోబోయాడేమో. జటాయువు 'రావణా! ఆగు'—అన్నాడు. ఇదుగో నీకు యుద్ధాతిథ్యం ఇస్తున్నానన్నాడు. తొగిమనుండి పండును పడద్రోసినట్లు రథం నుండి నిన్ను నేలకు త్రోస్తానన్నాడు. ఎగిరి రావణుని వీపుమీద కూర్చున్నాడు. ముక్కుతో పొడిచాడు. గోళ్ళతో గీరాడు. రెక్కలతో కొట్టాడు. అతని శరీరాన్నంతా నెత్తురుముద్దలా మార్చాడు. రావణుడు అగ్రహోదగ్రుడయ్యాడు. అతని కన్నులవెంటనిప్పులు కురిశాయి. అతని చేతులు శరపరంపరను వర్షించాయి. అయినా జటాయువుజంకలేదు. రావణుని ధనుస్సు విరిచాడు. అతని శరీరాన్నంతా మరోవరస పొడిచాడు రావణుడు ఇంకో ధనుస్సు తీసుకొన్నాడు. మరల బాణవర్షం కురిశాడు. ఆ బాణాలమధ్య చిక్కుకొన్న జటాయువు గూటిలో కూర్చున్న పక్షిలా కన్పించాడట. రావణుని ఆ రెండో ధనుస్సును గూడ జటాయువు విరిచాడు. అతని కవచం చీల్చాడు. రథగార్ధభాలను వధించాడు. రథాన్ని ముక్కలు చేశాడు. సారథిని చంపాడు. రావణునికి దిక్కుతోచలేదు. సీతనెత్తుకొని అతడు నేలకు దూకక తప్పలేదు. అయినా జటాయువు అతనిని వదల్లేదు. తానూ నేలకు దూకాడు. అసలే వృద్ధుడు. అందుకు తోడు ఈపెద్ద యుద్ధం. పైగా తోడు లేని తీవ్ర యుద్ధం. అందుచేత ఆ పక్షిరాజు అలసిపోయాడు. వేగంగా కదలలేకపోయాడు. అదిచూచి రావణుడుమరల ఆకాశానికెగిరాడు. జటాయు

గూడళ్ళ శక్తినంతా చిక్కబట్టి రావణుని వెంబడించాడు. అతని అడ్డగించాడు. 'పరాపహ
రణం నీ సర్వనాశనానికి దారి తీస్తుందని, నీవు కాలపాశబద్ధుడివై [illegible] వని,
గాలం మ్రింగిన మత్స్యంలాంటి వాడివని, నీ పెక్కువికి [illegible]
నిన్ను వదలరని, నీవు చేసింది పిరికిపని అని, దొంగపని అని. [illegible]
కలువచ్చేదాకా ఆగమని చేతనైతే యుద్ధం చెయ్యమని' చెప్పాడు. [illegible] రావణుడు
సీతతో పారిపోవటానికి ప్రయత్నించాడు. జటాయువును మాటలవల్ల [illegible] లాభం
లేదనుకొన్నాడు. మావటీడు మదగజాన్నెక్కి అంకుశంతో పొడిచినట్లు రావణుని
వీపు ఎక్కి ఉక్కు గునపంలాటి ముక్కుతో పొడిచాడు. తన [illegible] లాటి
రెక్కలతో తట తట కొట్టాడు. ఆ రాక్షసరాజుకు ఊపిరాడలేదు. [illegible] సీత.
శరీరమంతా బాధ. ఎట్టకేలకు సీతను ఎడమ చంకకెత్తుకొన్నాడు. [illegible] జటా
యువు వీపుమీద గ్రుద్దాడు. ఆ దెబ్బకు జటాయువు తగ్గలేదు. [illegible] పైపెచ్చు
విజృంభించాడు. ఒక్కపెట్టున ముక్కుతో ఆ రావణుని [illegible] పదింటిని
త్రుంచివేశాడు కాని ఏం లాభం? ఒక్కక్షణంలో [illegible] పుట్టకొచ్చి
నట్లు ఆ రావణుని పదిచేతులు ఆశ్చర్యకరంగా మొలిచాయి. [illegible]
మండిపడ్డాడు. సీతను క్రిందికి దించాడు. పిడికిటి పోట్లతో, [illegible] జటా
యువును చితక కొట్టాడు. ఇద్దరికీ కొంతసేపు పెద్ద యుద్ధం [illegible] ఎవ్వరూ
తగ్గలేదు. రావణునికి ఆలస్యమౌతూఉంది. ఆలస్యమైతే రామలక్ష్మణులు [illegible]
వాళ్ళువస్తే చేసిన ప్రయత్నమంతా చెడిపోతుంది. దాను [illegible] ఎత్తుకొని
వెళ్ళాలి. కాని జటాయువు ముందుకు సాగనివ్వటంలేదు. ఏంచెయ్యాలో తోచటం
లేదు. రావణుడు ఆలోచించాడు. పక్షికి బలం రెక్కలు. వెంటనే ఒక ఖడ్గాన్ని తీసు
కొన్నాడు. జటాయువు రెక్కలను, కాళ్ళను ఒక్కఊపున నరికి [illegible]. పాపం!
జటాయువు పెద్ద బండలా క్రింద బడ్డాడు. నెత్తుటి బురదలో [illegible] పోయాడు,
సంధ్యాకాల నీలమేఘంలా' ఆరిపోతున్న దావాగ్నిలా అగుపించాడు

సీత పెద్దపెట్టున ఏడ్చింది. రావణుడు ఊపిరి పీల్చుకొన్నాడు. సీత జటా
యువును కౌగిలించుకొని కన్నీటి జల్లు కురిసింది. రావణుడు సీతను [illegible]
చూచాడు. ఆమె జటాయువు చాటున తలదాచుకొటానికి ప్రయత్నించింది. పాపం
పక్షిపోయినచెట్టు ఏం నీడనిస్తుంది.

రావణుడు ఒక్కఊపునవెళ్ళి సీతను ఒడిసి పట్టుకొన్నాడు. ఆకాశాని కెగ
రాడు. ఆమె 'రామా!' అని కేకపెట్టింది. అప్పుడు గాలి [illegible]. సూర్యుడి

సీతను చూడలేక మొగం చాటు చేసుకొన్నారు. లోకంమీద చీకటి పడింది. ఏదో ఆలోచిస్తూ బ్రహ్మదేవుడు 'అనుకొన్నదే అయింద'ని అన్నాడు. ఇవరకు జటాయువు రెండు కన్నీటిబొట్లు రాల్చారు. మెదవాల్చారు. కొంగున ముడివేసుకొని దేవునికిచ్చే ముడుపులా గొంతులో కొన ఊపిరి నిలుపుకొన్నారు.

పంచవటిలో మారీచవధానంతరం రామలక్ష్మణులు పర్ణశాలకు వచ్చారు, ఎక్కడా ఆలస్యం చెయ్యకుండానే వచ్చారు. ఏదో భయపడుతూనే వచ్చారు. అప శకునాలను గూర్చి ఆందోళన చెందుతూనే వచ్చారు.

సీత అగుపించలేదు,

అన్నదమ్ములిద్దరూ అపారమ స్తకం కంపించిపోయారు. అంతులేని దుఃఖంలో సీత నన్వేషిస్తూ బయలు దేరారు. ముందు రాముడు వెనువెంట లక్ష్మణుడు. కొండలు గుట్టలు, చెట్లూ అన్నీ వెదకుతున్నారు. మారీచుడు మోసం చేశాడు. ఏ రాక్షసుడు సీతను వంచించాడో ఏం జరిగిందో, అంతా అయోమయంగా ఉంది. ఆవేశంతో, ఆవేశంతో ఆ అన్నదమ్ములిద్దరు నడచి వస్తున్నారు. ఎదుట పర్వతాకారంగా జటాయువు పడి ఉన్నాడు. అతని చుట్టూ నెత్తురు బురద ఉంది. రాముడు అతనినొక రాక్షసునిగా భ్రమించాడు. సీత నితడే భక్షించి ఉంటాడని అనుమానించాడు. వెంటనే అర్ధచంద్రాకార బాణాన్ని వింట సంధించాడు. జటాయువు మీదికి విజృంభించాడు,

బహుశః ఆవేశం ఎంతటి వారినైనా అవివేకులుగా మార్చి వేస్తుందేమో. రాముడు తానిదివరకు కౌగిలించుకొన్న జటాయువునే ఇప్పుడు గుర్తించలేక పోయాడు. తనకు సాయం చేస్తానన్న పితృసఖునే చంప సిద్ధమయ్యాడు.

బాణాన్ని వింట సంధించి మహోగ్రుడై మీదికి వచ్చే రాముణ్ణిచూచి జటాయువు కదలలేక కదలలేక కొంత కదిలాడు. ఎత్తలేక ఎత్తలేక మెడకొంత పైకెత్తాడు. ఏదో చెప్పబోయాడు. నోట నురుగులు గ్రక్కుతూ నెత్తురు పడింది. అయినా జీవశక్తినంతా చిక్కబట్టి హీన స్వరంతో 'శ్రీరామా! నేను జటాయువును. ఈ మహారణ్యంలో నీవు దివ్యౌషధిని వెదకినట్లు సీతాదేవిని వెదకుతున్నావు. ఆమెను నా ప్రాణాలను రావణుడే హరించాడు. నాశక్తికొలది అతనితో యుద్ధంచేశాను. అతని ధనస్సు ద్రుంచాను, కవచం చీల్చాను. రథం విరిచాను. సారథిని చంపాను. అటుచూడు. అవన్నీ అగుపిస్తాయి. కాని ఏం లాభం? సీతను రక్షించలేక

పోయాను. వృద్ధుణ్ణిగదా, అలసిపోయాను. రావణుడు విజృంభించాడు. నా రెక్కలు ఖండించాడు. సీత నెత్తుకొని పారిపోయాడు.

ఆ రాక్షసుడే నన్ను చంపాడు. నీవు క్రొత్తగా నన్ను చంపనక్కరలేదు. అని జటాయువు కన్నీరు కార్చి, నిట్టూర్పువిడిచి, పెదవాల్చేసరికి రాముని మతిపోయింది. ఆయన సిగ్గుపడ్డాడు. దుఃఖపడ్డాడు. [illegible] ప్రక్కన [illegible] అతని మేను నిమురుతూ సీత గతికి, అతని స్థితికి పరి పరివిధాల విలపించాడు. జటాయువు ఆరిపోయేముందు వెలిగే దీపంలా లేని శక్తి తెచ్చుకొన్నాడు. 'రామా! విలపించకు. రావణుడు సీతనెత్తుకొని దక్షిణ దిక్కుగా వెళ్ళాడు. అతడు విందము అనే ముహూర్తంలో సీతనపహరించాడు. అందుచేత అతడు శీఘ్రంగా నశిస్తాడు. ఆమె నీచెంత చేరుతుంది. చింతించకు. నా ప్రాణాలు పోతున్నాయి. కళ్ళు తిరుగుతున్నాయి. అవసాన దృశ్యాలు అగుపిస్తున్నాయి. రావణుడు, విశ్రవసుని ఔరస పుత్రుడు. కుబేరుని తమ్ముడు. సీతనపహరించాడు. సీతనపహ... ... ... ...అని గద గద చెప్పి మాంసఖండాలతో కూడిన నెత్తురు క్రక్కి [illegible] గిలగిల కొట్టుకొన్నాడు.

జటాయువు శిరస్సుమీద రాముడు రెండు అశ్రుబిందువులు [illegible].

జటాయువు గొంతులో కడసారి గుటకమ్రింగాడు. కన్నుమూశాడు. రాముడు స్వయంగా జటాయువుకు దహన సంస్కారం జరిపాడు. [illegible]తో పిండప్రదానం చేశాడు. గోదావరి స్నానంచేసి జలతర్పణాలు వదిలాడు.

జటాయువు జీవితం సమాప్తమైంది. అయినా జటాయువు చరితార్థజీవి. అతడు తన జీవితాన్ని ఒక మిత్రకార్యానికి, అధర్మ నిరోధానికి హారతి కర్పూరంలా అర్పించాడు. ఆ రామునిచేతనే అంత్యక్రియలు జరిపించుకొన్నాడు.

జనన మరణాలు, ఆహార నిద్రామైథునాలు అన్నిప్రాణులకు సమానమే అయినా జీవితాన్ని ఏ ప్రాణి ఎలా వినియోగించుకొన్నదన్నదే ప్రశ్న. పెద్ద పనులకు తమ ప్రాణాలనర్పించే మానవులకంటె మంచిపనులకు తమ ప్రాణాలనర్పించే పశుపక్ష్యాదులే పూజార్హాలుగదా.

జటాయువు రామాయణంలో ఒక చిన్నపాత్ర. అయినాఅది [illegible]. కరుడుగట్టినపాత్ర. అద్భుతమైత్రికి ఆదర్శంగా నిలిచినపాత్ర. అధర్మ నిరోధానికి అడ్డుకట్టలా పనిచేసిన పాత్ర.

# మారీచుడు

వంచన గూడ ఒక కళే. అది చౌర్యానికి సోదరకళ. వంచితుడైన వ్యక్తి గూడ విచారించటం మాని 'ఆహా! ఎంత గొప్పగా వంచించా' డని అభినందించేంతగా వంచిస్తారు కొందరు. ఆ కళలో వారు సిద్ధహస్తులు. కొందరు మాటలు చెప్పి వంచిస్తే, మరికొందరు వేషం మార్చి వంచిస్తారు. విధానం ఏదైనా వ్యక్తులను వంచించటం మొత్తం మీద అంత తేలికైన పనేమీగాదు. అబ్బో! దానికి గొప్ప ప్రజ్ఞ ఉండాలి. ఎంతో చాకచక్యం కావాలి. ఎదుటివారి ఇష్టాయిష్టాలు మొదట తెలుసుకోవాలి. సమయ సందర్భాలు చూచుకోవాలి. వాళ్ళను ఆకర్షించాలి. వాళ్ళు అనుమానించే లోగానే పని అంతా పూర్తి చేసుకోవాలి.

అయితే వంచన ఎంతో కాలం సాగదు. అది బయట పడగానే వంచకుని కొరకు అన్వేషణ ఆరంభమౌతుంది. ఒక్కొక్కసారి వంచకులు వెంటనే దొరుకుతారు. దెబ్బలు తింటారు. దెబ్బతిని కొందరు మారిపోతారు గూడ. మరికొంత మంది ఎన్ని దెబ్బలు తిన్నా మారరు. అసలు దెబ్బతినకుండానే మారిపోయే వంచకులు గూడ లేకపోలేదు. నవ్వితే ఒకచెట్టు పూస్తే, నమిలి ఉమ్మేస్తే ఇంకొక చెట్టు పూస్తుందట. మరో చెట్టు తన్నితే గాని తాను పూయదట. ఏమి చెప్పగలం? ఏ చెట్టుకు ఆ దోహదక్రియ.

కాని వంచకుల విషయంలో, దుర్మార్గుల విషయంలో దెబ్బప్రభావం మాత్రం అద్భుతం. దెబ్బకు వారిని భయపెట్టే గుణం ఉంది. వారిలో వివేకాన్ని మేల్కొల్పే గుణం ఉంది. మనిషి జీవితాన్నే మార్చివేసే గుణం ఉంది.

రామాయణంలో మారీచుడొక రాక్షసుడు. వాడు మహావంచకుడు. పరమ దుర్మార్గుడు. రూపం మార్చి చూపరులను, స్వరం మార్చి శ్రోతలను వంచించటంలో వాడు సిద్ధహస్తుడు. అద్వితీయుడు. ఈ వంచన కళే మారీచుణ్ణి ఒక మరపురాని పాత్రగా మలచింది. రామాయణ మహాకథనే పెద్దమలుపు త్రిప్పింది

మారీచుడు తాటక కొడుకు, అతనిది వెయ్యి యేనుగుల బలం. పర్వతాకారం కాలమేఘకాంతి. అతనికి ఋషిమాంసం అంటే మహాయిష్టం. ఒకసారి పరిభ్రా

దాన్ని దాల్చి దండకారణ్యంలో ఋష్యాశ్రమాల మీద దండయాత్ర సాగించాడు. ఎందరో మహర్షులను చంపితిన్నాడు. చివరకు విశ్వామిత్రుని మీదికి గూడ విజృంభించాడు. సుబాహుడు ఇతనికి తోడు. వీళ్ళను చూచే విశ్వామిత్రుడు అయోధ్యకు వెళ్ళటము, దశరథ మహారాజును అర్థించి యాగరక్షణకు శ్రీరాముని తీసుకురావటము జరిగింది.

మారీచుడు మొట్టమొదటి సారిగా శ్రీరాముని చూచింది విశ్వామిత్రాశ్రమంలోనే. చూచీ చూడగానే శ్రీరాముని తేజస్సు అతణ్ణి ఆశ్చర్యపరచింది. అయినా ఈ బాలుడేం చేస్తాడని అహంకరించి, సుబాహునితో చేయి కలిపి, యాగవేదిక మీదికి వెళ్ళాడు. రామబాణం తగిలింది. మారీచుని తల తిరిగింది. ప్రాణాలన్నీ ఎక్కడికో పోతున్నట్లనిపించింది. సుబాహుని మాత్రం కేకపెట్టి అక్కడిక్కడే కాలి క్రిందపడటం కొంతకు కొంత అగుపించింది. అంతే, తానేమయ్యాడో తనకే తెలీదు. ఎన్నిరోజులకో మూర్ఛతేరుకొన్నాడు. మృత్యుముఖం నుండి బయట పడినట్లుంది. అటుఇటు చూచుకుంటే నూరు యోజనాల దూరంలో సముద్రమధ్యంలో ఉన్నాడు. ఆ రామబాణం దెబ్బ అలాంటిది ! ఎందుచేతనో ఆయన ఆగ్నేయాస్త్రం సుబాహుని మీద ప్రయోగించాడు. అతణ్ణి అక్కడికక్కడే బూడిద చేశాడు. మారీచుని మీద మానవాస్త్రం మాత్రమే ప్రయోగించాడు. మూర్ఛనొందించి ప్రాణాలతో విడిచాడు. బహుశః ఇతనిలో రాక్షసత్వం తొలగి ఏనాటికైన మానవత్వం రాకపోతుందా అని అనుకొన్నాడేమొ. లేదా ఇతని పాత్ర ఇంకా ముగియలేదని ప్రాణాలతో మిగిల్చి వదిలాడేమొ. విధి విధానం విచిత్రం. మొత్తం మీద మారీచునిది—చావు తప్పి కన్నుపోయిన స్థితి. అయినా అతని బుద్ధిమారలేదు. అంత దెబ్బ తిన్నా మారలేదు. జీవితంలో కొంచెము ఒక మాత్రైన మారదు.

సాత్త్వికరూపం పంచవటుల అనుకూలం. జింక సాత్త్విక జంతువు. మహర్షులు గూడ ఆశ్రమాల్లో ఆ జంతువును చేరదీస్తారు. ప్రియమార పెంచుతారు. అందుచేత మారీచుడు పంచవటి జీవితంలో జింకరూపం ఎన్నుకొన్నాడు. మహర్షులను మోసగించటానికి, వారిని హింసించటానికి అదొక మంచి రూపం. అందులో అతడు అనుభవజ్ఞుడు: సర్వసమర్థుడు. అంతేగాదు. అవసరమైనప్పుడు మారీచుడు అన్యుల స్వరాన్నిగూడ అద్భుతంగా అనుకరించగలడు. ఒకసారి మారీచునికి మహర్షుల హింసించాలని, వారిని భక్షించాలని బుద్ధి పుట్టింది. వెంటనే జింకరూపం ధరిం

గాడు. ఇంకా ఇద్దరు రాక్షసులను వెంట బెట్టుకొన్నాడు. దండకారణ్యం ప్రవేశిం
చాడు. కొందరు మహర్షులను భయపెట్టాడు. మరికొందరిని భక్షించాడు. విలాసం
గా అలా తిరిగి వచ్చేటప్పుడు అతని కొక క్రొత్త ఆశ్రమం కన్పించింది. ఆగిచూ
డు. అందులో రాముడున్నాడు. ఆశ్చర్యం! ఆ రాముడే ఈ రాముడా ? ఆ
రాముడు బాలుడు. ఈ రాముడు. (ఈ రాముడు) యౌవనుడు. ఆ రాముడు రాకు
మారుడు. ఈ రాముడు తాపసుడు. చాల తేడా ఉంది. అయినా అతడే ఇతడు.
ప్రక్కన లక్ష్మణుడు గూడా ఉన్నాడు. సీత గూడ ఉంది. ఎందుకు వచ్చారో ?
ఎప్పుడు వచ్చారో ? ఇదంతా తనకెందుకు ? రాముడు ఇదివరకు తన్ను దెబ్బ
కొట్టాడు. అది తలుచుకొంటే నెత్తురుడికి పోతుంది రాముడిప్పుడు తాపస రూపం
తో ఉన్నాడు. తన్నేమి చేయగలడు ? కసి తీర్చుకోటానికి ఇదే సమయం.
మారీచుడు సాహసించాడు. రాముని మీదికి దూకాడు. వెంటనే రాముడు వింట
మూడు బాణాలు సంధించి, అల్లెత్రాడు ఆకర్ణాంతం లాగి విడిచాడు. వింట ఆ బాణా
లు సంధించి విడిచే రాముని మహోగ్రరూపాన్ని, ఆ వింటి నుండి మంటలు గ్ర
క్కుతూ మీదికి వచ్చే బాణాల వేగాన్ని మారీచుడు చూచాడు. అతని గుండెలది
రాయి. కాళ్ళు వణికాయి. పెదవులెండాయి. రామబాణం ఇదివరకే రుచి చూచాడు.
అందుచేత ఇప్పుడు ప్రాణాలు గుప్పిట పట్టుకొని పరుగెత్తాడు. పరుగెత్తాడు. పరుగె
త్తాడు. ఎంతదూరం పరుగెత్తాడో అతనికే తెలీదు. పాపం! ప్రక్కరాక్షసులు మా
త్రం ఆ బాణాలు తగిలి అక్కడి కక్కడే పడిచచ్చారు. మారీచుడు మాత్రం
ప్రాణాలు దక్కించుకొని ఎక్కడో సముద్రతీరంలో ఉన్న ఒక వనాన్ని చేరుకొ
న్నాడు. ఇంకా అతని గుండెలు అదురుతూనే ఉన్నాయి. కాళ్ళు వణకుతూనే
ఉన్నాయి. పెదవు లెండుతూనే ఉన్నాయి. ఓ చెట్టు క్రింద కూర్చున్నాడు. అన్ని
వైపులా చూచాడు. మనుష లెవరూ లేరు. అన్నీ చెట్లే ఎటు వైపు చూచినా చెట్లే.
కాని ఏం లాభం ? చెట్టు చెట్టునా రాముడు కన్పిస్తున్నాడు. నారచీరలు, కృష్ణాజినం
కట్టుకొని, చేతిలో యమపాశం లాంటి ధనుస్సు పట్టుకొని చెట్టు చెట్టునా కన్పిస్తు
న్నాడు. కళ్ళు మూసుకొన్నా కన్పిస్తున్నాడు. గుండె లదురుతున్నాయి. కాళ్ళు
వణుకుతున్నాయి పెదవులెండుతున్నాయి. ఎక్కడ ఏ శబ్దమైనా భయంగానే ఉంది.
రాముడు వస్తున్నాడేమో ! అతని బాణం మీద బడుతున్నదేమో ! అంతేగాదు,
రకారముంటేనే భయపడే స్థితి ఏర్పడింది. రత్నాలు, రథాలు ఇత్యాది రకారాది
పదాలు గుర్తు వస్తేచాలు, ఆ రాత్రి నిద్రపట్టటంలేదు.

మారీచుని జీవితంలో ఓ క్రొత్త ఆలోచన. ఎందుకీ భయం ? దెబ్బవల్ల. ఎందుకా దెబ్బ ? దుర్మార్గాన ఉన్నందుకు. ఆ దుర్మార్గాన్ని త్యజిస్తే దెబ్బలేదు; భయంలేదు. దుర్మార్గంగా ప్రవర్తిస్తూ ప్రతిక్షణం దెబ్బకు భయపడి జీవచ్ఛవంలా బ్రతకటం కంటె, సన్మార్గం స్వీకరించి శాంతంగా, సంతృప్తితో జీవించటం ఎంత మేలు ఒకటికి రెండు దెబ్బలు తగిలే సరికి ఎవరికైనా అలాగే అనిపిస్తుందేమో.

మారీచుడు మారిపోయాడు. దుర్మార్గానికి స్వస్తి చెప్పాడు. సన్మార్గాన్ని స్వీకరించాడు. ఆశ్రమాన్ని నిర్మించాడు. జడలు దాల్చాడు. నారచీరలు ధరించాడు. నియతాహారుడయ్యాడు. మునివృత్తినవలంబించాడు. బహుశః అంతర్లీనంగా అతనిలో దాగి ఉన్న ఈ తత్వాన్ని ఉద్బోధించే ఆనాడు రాముడు మానవాస్త్రం ప్రయోగించాడేమో ! లేక మానవాస్త్ర ప్రభావం వల్లనే అతని అంతరంగంలో ఈ మార్పు వచ్చిందేమో ! మొత్తానికి మారీచుడు మారిపోయాడు. వంచకుడు మంచివాడయ్యాడు. రాక్షసుడు తాపసు డయ్యాడు.

ఒకరోజు మారీచుని ఆశ్రమం ముందు రావణుని రథం ఆగింది రావణుని రాకకు మారీచుడు ఆశ్చర్యపడ్డాడు. మారీచుని మార్పుచూచి రావణుడు గూడ ఆశ్చర్యపోయాడు. మారీచుడు రావణునికి ఆతిథ్యమిచ్చాడు, అనేక కుశల ప్రశ్నలు వేశాడు. వచ్చినపని అడిగాడు. 'మామా! రాముడట. దశరథ రాజకుమారుడట. జనస్థానం వచ్చాడట. భార్యా సహితంగా సమేతంగా వచ్చాడట. మన శూర్పణఖను అవమానించాడట. ఖరదూషణుల ససైన్యంగా వధించాడట. ఇది ధిక్కారం. సహించరాని ధిక్కారం. అతని భార్యను అపహరించాలను కొన్నాను. అందుకు నీ సాయం కావాలి' అని సూటిగా రావణుడు వచ్చినపని చెప్పాడు. రాముని పేరు వినగానే మారీచుడు అదరిపడ్డాడు. ఎలాగో స్వస్థచిత్తుడై 'రావణా! ఏమిటి నీ ఆలోచన ? ఏమిటి నీ ప్రయత్నం ? ఎవడో నీవైభవం చూచి ఓర్వలేనివాడు నీకీ ఆలోచన చెప్పాడు. ఎవడో మిత్రుడుగా నటిస్తూ నీ నాశనం కోరే శత్రువే నిన్నీ పనికి పురికొల్పాడు. సీతాపహరణం మహాసర్పం నోటినుంచి కోరల్ని పెరికే ప్రయత్నం. మదపుటేనుగును రెచ్చగొట్టే ప్రయత్నం. మహాభయంకర సింహాన్ని మేలు కొలిపే ప్రయత్నం. సీతాపహరణం అంత ప్రమాదకరం. రాక్షసవంశ నాశకరం. ఆ ప్రయత్నంమాను. వెనుదిరిగి వెళ్ళు. భార్యలతో, బంధుమిత్రులతో సకలభోగాలు అనుభవించు. లంకా మహాసామ్రాజ్యాన్ని క్షేమంగా పాలించు — అని హితం చెప్పాడు. వారిద్దరికీ అదొక సుముహూర్తం.

మారీచుని మాటలు రావణుని మనస్సుకెక్కాయి. వచ్చిన పని విరమించుకొని రావణుడు రథం ఎక్కాడు. మారీచుడు ఒక్క నిట్టూర్పు విడిచాడు.

మరల ఒకరోజు మారీచుని ఆశ్రమంముందు రథం ఆగింది. దుమ్మంతా ఆశ్రమంలోకి కొట్టుకువచ్చింది. మారీచుడు వెలుపలికి వచ్చి చూచాడు — రావణుడు. ఆ రాక్షసరాజుకు అతిథి మర్యాదలన్నీ చేశాడు. కాని రావణుని ముఖంలో ఏదో తీవ్రత కనిపిస్తూ ఉంది. అతని కళ్ళలో ఏదో స్థిరనిర్ణయం తొంగి చూస్తూ ఉంది. మారీచుడు — 'రావణా! లంకలో అంతా కుశలమా ?' అన్నాడు. 'మళ్ళా వచ్చావే!' అన్నాడు.

'మారీచా! నేనిప్పుడు దుఃఖితుణ్ణి. ఆర్తుణ్ణి. రాముని దౌష్ట్యం నా నరనరాలను దహిస్తున్నది. అకారణ వైరంలో అతడు నాచెల్లెలి ముక్కుచెవులు కోశాడు. జనస్థానంలో ఉన్న నా రాక్షసబలాన్నంతా సంహరించాడు. నన్ను రెచ్చగొట్టాడు.

అతడు క్రూరుడు. కఠినాత్ముడు. మూర్ఖుడు. హంతకుడు. నాకు చేసిన ఈ అవమానానికి, అపకారానికి అతనికి బుద్ధి చెప్పాలి. అతని భార్య నపహరించాలి. అందుకు నీ సాయం కావాలి. నీవు మహావీరుడివి. ఉపాయజ్ఞుడివి. సర్వమాయా విశారదుడివి. నీ సాయం కావాలి. అది ఏ రూపంలో కావాలో ఆలోచించాను. మృగరూపం ధరించటంలో నీవు అనుభజ్ఞుడివి. నీవు కాంచన మృగరూపం ధరించాలి. సీతను ఆకర్షించాలి. ఆమె నిన్ను పట్టి తెమ్మని రాముణ్ణి కోరాలి. రాముడు నీ వెంట బడాలి. అప్పుడు నీవు స్వరం మార్చి హా సీతా! హా లక్ష్మణా! అని రాముడు అరచినట్లే అరవాలి. సీత రామునికి సాయంగా లక్ష్మణుని పంపాలి. అప్పుడు నేను సీతను అపహరించాలి. ఇది మన ప్రణాళిక. అయితే రాముడు యుద్ధానికి రాడా? అని అంటావేమో. సీతాపహరణంతోనే అతడు కృశిస్తాడు. కృశించిన ఆ రాముణ్ణి చంపటం ఎంత పని! సులభంగా అంతంచేస్తాను — అని రావణుడన్నాడు. రావణుని ముఖం సెగలు పొగలు క్రక్కుతూ ఉంది. అతని స్వరం తీవ్రంగా ఉంది.

రావణుని నిర్ణయం, రాముని పేరు వినగానే మారీచునికి కాళ్ళు చేతులు వణికాయి. ఏదో మంటలో దూకినట్లు, శూలం గ్రుచ్చుకొన్నట్లు, కాలపాశం

తగులుకొన్నట్లు, మృత్యువు కబళించినట్లు మారీచుడు బాధపడ్డాడు. నాయకతో పెదవులు తడుపుకొంటూ, చేతులు మోడ్చి రావణునికి నమస్కరిస్తూ, 'రావణా! లోకంలో ఇచ్చకాలాడే వాళ్ళు ఎంతోమంది. అప్రియమైనా హితం చెప్పే వాళ్ళు చెప్పిన హితాన్ని చెవులొగ్గి వినేవాళ్ళు చాల తక్కువ. నేను చెప్పేది సావధానంగా విను. రాముని సంగతి నీకు తెలియదు. అతనికి ఆగ్రహం వస్తే లోకాన్నే అరాక్షసం చేస్తాడు. సీత సంగతి నీకు తెలియదు; ఆమె నీ పాలిటి మృత్యువుగా పుట్టింది. ఆమె కారణంగా నాకూ దుఃఖం కలుగుతుంది. కామవృత్తుడు, దుష్ట స్వభావుడు, దురాలోచనపరుడు అయిన ప్రభువు తన్ను, తన వారిని సమస్త రాజ్యాన్ని చెడగొట్టుకొంటాడన్న సంగతి మరచిపోకు. రాముడు లుబ్ధుడుగాదు. క్రూరుడుగాదు. ధర్మదూరుడుగాదు. ఆయన సత్పురుషుడు. సత్యపరాక్రముడు. ఇంద్ర సమానుడు. సూర్యతేజుడు. ఆయన భార్యను అపహరించటం నీకు సాధ్యం గాదు. సమరంగంలో అతని చూపు సోకితే చాలు. నీవు సర్వనాశనమౌతావు. జీవితాన్ని, రాజ్యాన్ని సుఖంగా అనుభవించాలనుకొంటే ఆయన జోలికి వెళ్ళకు.' అని ఎంత దూరమో హితం చెప్పాడు. అంతేగాక విశ్వామిత్ర యాగంలో తాను రుచి చూచిన రామబాణం సంగతి, దండకారణ్యంలో రాముని మీదికి పోకి తాను పడిన దురవస్థ, ఆ రెండు దెబ్బలతో తన చిత్తంలో వచ్చిన మార్పు. ఈ నాటికీ చెట్టు చెట్టున రామరూపం కన్పించే సంగతి, రత్నం, రథంవంటి రకారాది పదాలు వింటే భయంతో బాధపడే విషయం పూసగ్రుచ్చినట్లు ఆ పౌలస్త్యునికి చెప్పాడు. శూర్పణఖ తప్పును, ఖరుని అహంకారాన్ని ఎత్తి చూపాడు. జరిగిన దానిలో రాముని తప్పేమీ లేదని నొక్కి చెప్పాడు. ఆ మహాత్మునితో అకారణవైరం అన్ని విధాల అనర్థదాయక మన్నాడు. తాను రాముని దెబ్బతో బుద్ధి తెచ్చుకొని సాధువృత్తిని స్వీకరించిన విషయంగూడ చెప్పాడు. సీతాపహరణ విషయంలో తాను సాయం చేయలేనని సవినయంగా మనవి చేసుకొన్నాడు.

రావణుని కన్నులు నిప్పులు తురిశాయి. తల అడ్డంగా ఆడిస్తూ నీ హిత బోధ నాకక్కరలేదన్నాడు. నా నిర్ణయానికి తిరుగు లేదన్నాడు. సీతాపహరణం జరిగి తీరాలన్నాడు. కాలయాపన కాకుండా కాంచనమృగరూపం ధరించమన్నాడు. కాదంటే ఖడ్గంతో నీ శిరస్సు ఖండిస్తానన్నాడు.

పాపం! మారీచునికి ముందు రామబాణం. వెనుక రావణఖడ్గం. ఏంచేయాలో తోచలేదు. ఎటు వెళ్ళినా మరణమే. మారీచుడు ఆలోచించాడు. రావణునిచే

నిరర్థకంగా మరణించటం కంటె ఆ రాముని చేత సార్థకంగా చావటమే మంచిదని నిర్ణయించుకొన్నాడు. 'రావణా! నేను ఎంతో దూరం హితం చెప్పాను. అయినా నీవు వినలేదు. రామదర్శనమాత్రాన్నే నా మరణం సంభవిస్తుంది. సీతాపహరణం కాగానే నీ మరణం నిజమౌతుంది. ఆ రాముని ఆశ్రమంనుండి సీతాదేవినే హరిస్తే — రావణా! నేనుంటానా! నీవుంటావా! రాక్షసులుంటారా! లంకా మహాసామ్రాజ్యం ఉంటుందా! వినాశకాలే విపరీతబుద్ధిః. కానున్నది కాక మానదు. రానున్నది రాక మానదు. పద' అని బయలుదేరాడు మారీచుడు

రావణుడు పిండుగా నవ్వాడు. గాఢంగా మారీచుణ్ణి కౌగలించుకొన్నాడు.

మారీచుడు బొట బొట రెండు కన్నీటి బొట్లు రాల్చాడు.

ఇద్దరు రథం ఎక్కారు.

అది రామాశ్రమం. ప్రశాంతవాతావరణం. ముచ్చట పర్ణశాల. చుట్టూ అరటి చెట్లు, కొండగోగు చెట్లు, రకరకాల పూలచెట్లు. సీతాదేవి ఉదయాన్నే తలస్నానం చేసింది. ఆరవేసిన చీర ధరించింది. నొసట కుంకుమ దిద్దింది. కురులు తడి ఆరటానికి కొసన ముడివేసింది. సౌందర్య శోభ, మాంగల్య పవిత్రత ఆమెలో మూర్తీభవించినట్లుంది. పూజకు పూలు కోయటానికి బుట్ట చేతపట్టుకొని బయలుదేరింది. కొండగోగుపూలు కొన్ని కోసింది. ఎండుపుల్ల ఒకటి కంటికి తగిలింది. ఏ కాకి పడవేసిందో. దాన్ని అవతలికినెట్టి అటువైపు తిరిగిచూసే సరికి అరటిచెట్లు ప్రక్కన అతిలోక సుందరంగా ఒక జింక కన్పించింది. బంగారురంగు అక్కడక్కడా వెండి మచ్చలు. ఇంద్ర నీలాలవంటి కొమ్ములు. నల్లకలువల వంటి చెవులు. ముచ్చటైన మూతి. రంగు రంగుల తోక. పచ్చిక మేస్తూ చెంగు చెంగున గంతులు వేస్తూ ఉంది. ఎంత అందం! ఎంత కాంతి! ఏమి చైతన్యం! సీత ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె సగం కోసిన సంపంగి పువ్వు అలాగే కొమ్మకు ఉండిపోయింది. స్వామీ! అని ఆమె పిలిచింది. 'వస్తున్నా' అని రాముడు వచ్చాడు. అన్న వెంట లక్ష్మణుడూ హడావిడిగా వచ్చాడు. 'అటు చూడండి ఆ జింక ఎంత అందంగా ఉందో' అన్నది సీత. రాముడు అవునన్నట్లుగా రెప్పలు ఎగురవేశాడు. ఇంతలో లక్ష్మణుడు 'అన్నా! ఇది అనుమానాస్పదంగా ఉంది. అసహజంగా ఉంది. ఇది మృగం కాదు. మారీచుని మాయగా ఉంది. మృగరూపం ధరించి మనుషులను వంచించటంలో వాడు సిద్ధహస్తుడు. — — — —

అని చెపుతూ ఉండగానే సీతాదేవి అతని మాటకు అడ్డు తగిలింది. అలా మగల మధ్య ఇతని అధిక ప్రసంగం ఎందుకని అనుకొన్నదేమొ. ఆ జింకసౌందర్యాన్ని వర్ణించింది. రాముని ప్రక్కకు వచ్చి నిలిచి అది కావాలని ప్రియమార అడిగింది. రాముడు తల ఊపాడు. తమ్ముని వైపు తిరిగి 'లక్ష్మణా! ఈ మృగం ఎంతో అందంగా ఉంది. పైగా ఏదీ అడగని మీ వదినె ఇప్పుడట కావాలని అడుగుతున్నది. నీవన్నట్లు అది మారీచుని మాయే అయితే అవశ్యం వాడు హంతవ్యుడు. నేనిప్పుడె వెళ్ళి ఆ మృగాన్ని పట్టుకు వస్తా. లేదా వధించి తెస్తా. నీవు సీతకు రక్షగా ఉండు. జాగ్రత్త' — అని ఖడ్గాన్ని, ధనుస్సును ధరించి బయలు దేరాడు. జింక రాముని చేజిక్కలేదు. ఆయనను అనేక విధాల వంచించింది. కొంత దూరం నడిపించింది. కొంతదూరం పరుగెత్తించింది. ఎంతోదూరం విసిగించింది. ఎట్టకేలకు రాముడు ధనుస్సు ఎక్కుపెట్టాడు. బాణం వదిలాడు. మారీచుడు మృగరూపం విడిచి హా సీతా! హా లక్ష్మణా! అని రాముడరచినట్లే అరచి ప్రాణాలు విడిచాడు.

రాముడు ఆశ్చర్య పోయాడు. ఆ కేక విన్న సీత బలవంతపెట్టి లక్ష్మణుని రామునికి సాయంగా పంపింది. ఆశ్రమంలో ఆమె ఒంటరిగా నిలిచింది.

రావణుడు అనుకొన్నట్లే అంతా అయింది.

సీతాపహరణం జరిగింది.

మారీచుని పాత్ర ముగిసింది.

రావణనాశానికి రంగం సిద్ధమైంది.

రామాయణ కథ మలుపు తిరిగింది.

# వాలి

జీవితంలో పరిస్థితులు ఒక్కొక్కసారి చిత్రవిచిత్రంగా ఏర్పడుతాయి. ఆత్మీయుల మధ్యనే అపార్థాలు కల్పిస్తాయి. వైరాన్ని వృద్ధిచేస్తాయి. ఎన్నో అనర్థాలకు దారితీస్తాయి. అపార్థాలు తొలగిపోవాలంటే ఆవేశాలు అణగిపోవాలి. ఆలోచన ఆరంభం కావాలి. పరిస్థితులను గూర్చి, వ్యక్తులను గూర్చి ప్రశాంత మనస్సుతో పునరాలోచన చేయాలి. అయితే బలగర్వం, అధికారమదం, కామోద్రేకం— ఇలాంటివి వ్యక్తిని పునరాలోచనకు పూనుకోనివ్వవు. ఏదో పెద్దప్రమాదం జరిగేదాకా అతణ్ణి ఆవేశంలోనే ఉంచుతాయి. అహంకారాన్ని పెంచుతాయి. వివేకాన్ని చంపుతాయి. పగను రగుల్కొల్పుతాయి. చివరకు జీవితాన్నే చిందరవందర చేస్తాయి.

వాలి విషయంలో ఇదే జరిగింది.

వాలి మహాబలశాలి. పర్వతశిఖరాలను బంతుల్లా ఆడుకొనేవాడు. మహావృక్షాలను ఒక్కపెట్టున విరిచివేసేవాడు. అంతేగాదు. వాలి ఒకగొప్ప నైష్ఠికుడు— బ్రాహ్మీముహూర్తాన్నే లేచి, సూర్యోదయం అయ్యేలోగా చతుస్సముద్రాలనుచుట్టి సంధ్యావందనం చేసి వచ్చేవాడు. అతని బలపరాక్రమాలను మెచ్చి దేవేంద్రుడు కాంచనమాలను గూడ ఇచ్చాడు. ఆ కాంచనమాల మెడలో ఉంటే వాలితేజస్సు వర్ణనాతీతం. వాలి తేజోబలాలకు అధికారం గూడ తోడైంది. తండ్రిమరణానంతరం అతణ్ణే వానరులంతా తమ మహారాజుగా ఎన్నుకొన్నారు. పట్టాభిషిక్తుణ్ణి చేశారు. అందుకు తోడు యౌవనం. ఇంకేంకావాలి. వాలి భోగాలకు అంతులేదు. సుషేణుని కూతురు తార అతని అర్ధాంగి. ఆమెతోపాటు ఎందరో వానర కాంతలు అతని ప్రియురాండ్రు. మద్యపాన మదోన్మత్తత, కామకేళీవిలాసత అతని ఉచ్ఛ్వాసనిశ్వాసాలు. వీటికితోడు విజయగర్వంగూడ వాలికి తోడైంది. అతడు గోలభుడనే గంధర్వుడితో పదునైదేళ్ళు హోరాహోరీగా పోరాడి విజయం సాధించాడు. దక్షిణసముద్రంలో దోసిటనీరు తీసుకొని సంధ్యావందనం చేసే సమయంలో యుద్ధం చెయ్యాలని శబ్దంకాకుండా వచ్చిన రావణుణ్ణి చంకలో ఇరికించుకొని మూడుసముద్రాల్లో ముంచి తేల్చాడు. నలిపినలిపి నానాబాధపెట్టాడు. చిట్టచివరకు అతని ప్రార్థ

నను మన్నించి అగ్నిసాక్షిగా మైత్రిచేశాడు. అట్టిది వాలిబలం! అట్టిది అతడు సాధించిన విజయం.

దుందుభి ఒకపెద్ద రాక్షసుడు. మహిషాకారుడు. వాడిది వెయ్యియేనుగుల బలం. బలగర్వంతో, వరదానబలంతో వాడు క్రొవ్వి, ఒకరోజు సముద్రుడి దగ్గరకు వచ్చి 'నాతో యుద్ధానికి రమ్మ'ని అడిగాడు. సముద్రుడు తనకంతటి సమర్థత లేదన్నాడు. హిమవంతుని మీదికి వెళ్ళమన్నాడు. ఒక్క పరుగున హిమవంతుని మీదికి వెళ్ళాడు. నీతో నాకు పోరుకావా'లన్నాడు. అతడు గూడ తన అసమర్థతను దెలిపి వాలిమీదికి వెళ్ళమన్నాడు. అతడే నీశక్తికి ఆగగలడన్నాడు. వెంటనే దుందుభి కిష్కింధకు వచ్చాడు. భయంకరంగా అరిచాడు. వాలి మీదకు విజృంభించాడు. వాలి కాంచనమాలను ధరించాడు. దుందుభిమీదికి దూకాడు. వాలి దుందుభుల పోరు ఘోరంగా సాగింది. క్రమంగా దుందుభి బలం తగ్గింది. వాలి బలం పెరిగింది. వాలి దుందుభిని పైకెత్తి నేలమీద విసిరికొట్టాడు. ఆ దెబ్బతో వాడు నెత్తురు గ్రక్కుతూ చచ్చాడు. వాలి అంతటితో ఆగితే ఎంతో బాగుండేది. విజయగర్వం ఒకవైపు, విపరీతమైన ఆవేశం ఇంకో వైపు అతనికి ఆగలేదు. వాలి, నెత్తురు గారే ఆ దుందుభి కళేబరాన్ని పైకెత్తాడు. గిరగిరత్రిప్పాడు. ఒక్కయోజనదూరంలో పడేలా విసిరివేశాడు. ఆ విసురుతోనే వాలి దురదృష్టం ప్రారంభమైంది. ఆ కళేబరం ఋశ్యమూకపర్వతం మీద మతంగాశ్రమంలో ఒకప్రక్కన పడింది దాని దెబ్బకు అనేక ఆశ్రమవృక్షాలు విరిగిపోయాయి. ఆ నెత్తురు గాలికి చింది మతంగాశ్రమంలోనే పడింది. దానితో ఆశ్రమమంతా మలినమైపోయింది. అదిచూచి మతంగ మహర్షి ఆగ్రహోదగ్రు డయ్యాడు. తపశ్శక్తిచే అంతా గ్రహించాడు. తక్షణమే వాలిని శపించాడు.

పాపం!, ఇది వాలి కావాలని చేసిన పనిగాదు. విజయగర్వంతో విఱ్ఱవీగి, ఆవేశంతో అవివేకంగా చేసినపని. తెలిసితాకినా తెలియకతాకినా నిప్పు నిప్పే గదా!

జీవితంలో వాలి శాపగ్రస్తుడయ్యాడు. శాపంవల్ల వాలికి ఋశ్యమూకం మీదికి వెళ్ళే అవకాశం పోయింది. మతంగాశ్రమానికి ఆమడదూరం ఇవతల అడు గిడితే అసువులు గోల్పోయే ప్రమాదం ఏర్పడింది. ఆశ్రమవృక్షాలమీద ఎంత కాలంగానో జీవించే తన అనుచరులంతా ఒక్కరోజులో అవలికి వెళ్ళవలసిన పరి స్థితి కలిగింది.

జరిగినదానికి వాలి బాధపడ్డాడు. వెంటనే వెళ్ళి మతంగ మహాముని పాదాల మీద బడ్డాడు. అయినా ప్రయోజనం లేక పోయింది.

అయితే, తరువాత వాలి ఈ శాపాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచించలేదు. అది సుగ్రీవుని పాలిటి వరంగా మారటము, అతడు తలదాచుకోటానికి, తన బలాన్ని పెంచుకోటానికి ఆ ఋశ్యమూకం ఓ చక్కని స్థావరంగా రూపొందటము కేవలం కాలప్రభావమే.

వాలిది ఎదురులేని బలం. తిరుగులేని అధికారం. పొంగి పొరలే యౌవనం. అహంకారం, ఆవేశం అతనిలో పెరిగాయేగాని తరుగలేదు. వాలి ఒక బలగర్వితుడు. అధికార దర్పితుడు. మధ్యపాన మదోన్మత్తుడు. కామకేళీపరవశుడు.

ఈ దశలో ఒక చిత్రమైన సంఘటన. తమ్మునికి అతనికి మధ్య అపార్థాలు కల్పించిన సంఘటన. ఒక పెద్ద అగాధాన్ని ఏర్పరచిన సంఘటన. మున్ముందు అతని జీవితాన్నే తారుమారు చేసిన సంఘటన.

దుందుభి పెద్దకొడుకు మాయావి. వాడు మహా పరాక్రమశాలి. వాలికీ, వాడికీ స్త్రీనిమిత్తంగా తగాదా. ఓరోజు అర్ధరాత్రి వాడు కిష్కింధకు వచ్చాడు. వాలిని యుద్ధానికి పిలిచాడు వద్దని సుగ్రీవుడు, అంతఃపుర స్త్రీలు ఎంత చెప్పినా వాలి వినలేదు. యుద్ధానికి వెళ్ళాడు. వాలికి సాయంగా సుగ్రీవుడు గూడ రావటం మాయావి చూచాడు. భయపడి పరుగెత్తాడు. వాలిసుగ్రీవులు మాయావిని వదలలేదు. వెన్నంటి పరుగెత్తారు.

కటిక చీకటి. కొండలు, గుట్టలు, రాళ్ళు, ముళ్ళు. ఇంతలో చంద్రోదయమైంది. గడ్డి కప్పువద్ద ఓపెద్ద బిలం కన్పించింది. మాయావి అందులో దూరాడు. 'సుగ్రీవా!' నీవు ఈ బిలం వాకిట జాగ్రత్తగా ఉండు. శత్రువును వధించి వెంటనే వస్తా' అని వాలి అందులో దూరాడు. సుగ్రీవుడు నేనూ వస్తానన్నాడు. కాని వాలి వద్దన్నాడు.

ఒక్క సంవత్సరం దాటింది. అయినా వాలి రాలేదు. ఏమైందో తెలీలేదు. ఏం చెయ్యాలో అర్థంగాలేదు. సుగ్రీవుడు దిక్కులో పడ్డాడు. ఓరోజు ఆ బిలం నుండి బురబుర పొంగుతూ నెత్తురు పైకివచ్చింది. రాక్షసుల హాహాధ్వానాలు వినిపించాయి. వాటి మధ్య వాలి కేక వినిపించింది. అదిచావు కేకలాఉంది.

సుగ్రీవుడి గుండెలదిరాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. అన్న మరణించాడని అతడు నిర్ణయించాడు. ఆ నెత్తురు ఆతనిదే అని అనుకొన్నాడు. పర్వతమంత పెద్ద బండ తెచ్చి ఆ బిలద్వారాన్ని మూశాడు.

ఆ బండే వాలి, సుగ్రీవులమధ్య అపార్థాలు సృష్టించింది. అగాధం ఏర్పర చింది. చివరకు అన్నదమ్ము లిద్దరిని వేరు చేసింది.

సుగ్రీవుడు బిలద్వారాన్నిమూసి దుఃఖభారంతో అన్నకు జలతర్పణంగూడ చేసి కిష్కింధకు తిరిగి వచ్చాడు. మంత్రుల ప్రార్థనతో పట్టాభిషిక్తుడయ్యాడు. పాలన ప్రారంభించాడు.

అప్పుడే వచ్చాడు వాలి. కొలువు దీరిన తమ్ముని చూచాడు. కన్నుల నిప్పులు కురిశాడు.

పాపం! సుగ్రీవుడు అన్ననుచూచి సంతోషించాడు. అతనిని ఆహ్వానిం చాడు. నమస్కరించాడు. జరిగిందంతా చెప్పాడు. క్షమించి, రాజ్యం స్వీకరించి పాలించమని పరిపరివిధాల ప్రార్థించాడు.

అయినా వాలి ఆవేశం తగ్గలేదు. ఆగ్రహం చల్లబడలేదు. అనుమానం తొలగిపోలేదు. రాజ్యకాంక్షతో తమ్ముడు తన్ను మోసంచేశాడని మంత్రులతో చెప్పాడు. తమ్ముని దారుణంగా నిందించాడు. మాయావి బిలంలో ప్రవేశించి మాయమయ్యాడని, వాడిని వెదకి వధించటానికి వత్సరం పట్టిందని, ఈ లోగా దురు ద్దేశంతో సుగ్రీవుడు పర్వతోపమానమైన బండతో బిలద్వారాన్ని మూసి కిష్కింధా పట్టడానికి పరుగెత్తి వచ్చాడని, ఆ బండను ఎలాగో తొలగదన్ని తాను బయట పడ్డానని పదిమందితో చెప్పాడు. తమ్ముణ్ణి తన్ని, కట్టు బట్టలతో తరిమివేశాడు. రాజ్యంతోపాటు అతని భార్య రుమను గూడ తానే గ్రహించాడు.

పరిస్థితుల ప్రభావంవల్ల మాయావివైరం వాలిసుగ్రీవుల మధ్య అపార్థాలు కల్పిస్తే - బలగర్వం నుండి పుట్టి, అధికారదర్పంతో పెరిగి, విజయపరంపరతో విఱ్ఱవీగి, మద్యపానమదంతో మత్తెక్కి కాముకతతో కళ్ళుగప్పిన వాలి అహం కారం, ఆవేశం సుగ్రీవుణ్ణి శాశ్వతంగా దూరంచేశాయి. రామసుగ్రీవసఖ్యానికి త్రోవతీశాయి. కడకు అతని ప్రాణాంతకాలుగా పరిణమించాయి.

ఋశ్యశృంగం మీద రామసుగ్రీవ సఖ్యం జరిగింది. కిష్కింధలో వాలి వధకు రంగం సిద్ధమైంది.

అది వాలిజీవితంలో చాలచెడ్డరోజు. చివరిరోజు. అతడు తన మీదికి వచ్చిన సుగ్రీవుణ్ణి చన్ని తరిమాడు. ఆ సంగతి తారతో చెప్పి సంతోషిస్తున్నాడు. మళ్ళీ సుగ్రీవుడు వచ్చాడు. ముందు రోజు కంటె మహాతీవ్రంగా వచ్చాడు. భయంకరంగా గర్జించాడు. దారుణంగా తొడగొట్టాడు. కయ్యానికి కాలుదువ్వాడు. వాలికి అదొక పెద్ద వెక్కిరింతగా ఉంది. చెంపదెబ్బగా ఉంది. అతని అభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని జుట్టిపట్టి వీధిలోకి ఈడ్చినట్లుంది. సహించటం ఏలాగ ?

అప్పుడు వాలి తన అంతఃపురంలో తార కౌగిట్లో ఆనందమయ డోలికల్లో ఊగుతున్నాడు.

అయినా ఆగలేకపోలాడు. వడివడిగా లేచాడు. నడుం బిగించాడు. పళ్ళు గొరికాడు. యుద్ధానికి బయలుదేరాడు.

తార అడ్డుపడింది. వెళ్ళవద్దని బ్రతిమాలింది. సుగ్రీవుని గర్జనలోని ఊపును దాని వెనుక ఉన్న కాపును తెలియజెప్పింది. తాను విన్న రాముని బలపరాక్రమాలను వల్లెవేసింది. రానున్న ప్రమాదాన్ని సూచించింది. ఎన్నో విధాల హితబోధ చేసింది. అయినా వాలి వినలేదు. అతని ఆవేశం ఆగలేదు. ఆ మహాత్ముడు రాముడు అకారణంగా నా కెందుకు అపకారం చేస్తాడన్నాడు. తమ్ముణ్ణి తన్ని తరుముతానే గాని తుదముట్టించనన్నాడు. తారను వెంటరావద్దన్నాడు. ఎతాయెకి తాను యుద్ధానికి బయలుదేరి వెళ్ళాడు.

ఆ రోజు సూర్యునిలా సుగ్రీవుడు వెలుగుతున్నాడు. నిన్న అలాలేడు. అతని మెళ్ళో గజపుష్పిలత మేఘాన్ని చుట్టిన కొంగలబారులా ఊగిసలాడుతూ ఉంది. అది నిన్నలేదు.

అతనిలో ఏదో మార్పుంది. ఎంతో మార్పుంది. ఎందుచేతనో! అదంతా తన కెందుకు. తమ్ముణ్ణి తన్ని తరమటమే తన ఉద్దేశం. వాలి వెళ్ళి కలియబడ్డాడు. ఒక్క దెబ్బ కొట్టాడు.

సుగ్రీవుడు 'అబ్బా!' అన్నాడు.

ఎక్కటిదో ఒక్క బాణం తోకచుక్కలా దూసుకు వచ్చింది. వాలి గుండెలో

గ్రుచ్చుకొంది. కొండలా వాలి క్రింద బడ్డాడు. గిల గిల తన్నుకొన్నాడు. ప్రక్క-నున్న చెట్టుమీది పక్షి రెప రెప రెక్కలాడించి అరుస్తూ అంతరిక్షంలోకి ఎగిరి వెళుతూ ఉంది. వాలి ఆ చెట్టు వైపు చూచాడు. 'రామా! నీవా' అన్నాడు కళ్ళ వెంట నీళ్ళు కారుస్తూ

నేలంతా నెత్తుటి మయం.

ఆకాశమంతా ఆశ్చర్యమయం.

అన్ని దిక్కుల అమిత భయం

అంతా మౌనం.

గంభీరమందగమనంతో ఆ మౌనాన్ని చీల్చుకుంటూ కోదండ రాముడు ముందుకు అడుగువేశాడు. వాలి చెంత నిలిచాడు. ప్రక్కనే లక్ష్మణుడు. ఇద్దరూ వాలి ముఖంలోకి చూచారు. వాలిగూడ రామునివైపు ఓరగా చూచాడు. ఆ చూపులో బాధ ఉంది. క్రోధం ఉంది. అన్నింటిని మించి ఒక ఈసడింపుగూడ ఉంది.

వాలి గుండెలోంచి నెత్తురు కారుతూనే ఉంది. ఆ గుండె గాయాన్ని, ఆ గుండెలో గ్రుచ్చుకొని నెత్తురు త్రాగుతున్న ఆ రామబాణాన్ని వాలి ఒక చేత ఒత్తి పట్టుకున్నాడు 'రామా! నీవు రాకుమారుడివి. ఉత్తమ క్షత్రియుడివి. ధర్మజ్ఞుడివి. అన్యునితో యుద్ధంచేస్తుంటే ఎక్కడో నక్కి నన్నుకొట్టడం నీకు న్యాయమా? అన్నాడు వాలి.

రాముడు మౌనం.

'రాముడు దయాపరుడని, ప్రజాహితరతుడని, దృఢవ్రతుడని, సమయజ్ఞుడని అందరూ నిన్ను కీర్తిస్తుంటారే! ఇంద్రియ నిగ్రహం, చిత్తశుద్ధి, ఓర్పు, ధైర్యం ధర్మం ఇలాంటివి రాజలక్షణాలే! తార వద్దంటున్నా నీ సత్కులాన్ని, నీ సద్గుణాల్ని స్మరించి నీలాంటి మహానుభావుడు అకారణంగా నాకెందుకు అపకారం చేస్తాడని నమ్మి యుద్ధానికి వచ్చానే! ఇదా నీవు చేసేది? నీ దేశానికి అపకారం చేశానా? నీ పట్టణానికి ప్రమాదం కలిగించానా? లేక నిన్నేమైనా అవమానించానా? నీ ఆజ్ఞ ధిక్కరించానా? నీతో యుద్ధానికి వచ్చానా? ఎక్కడో అడవుల్లో పడి ఫలాలు, మూలాలుతిని బ్రతికే వానరుణ్ణి. ఏదో వైరం ఏర్పడి వేరొకనితో యుద్ధం చేస్తుంటే. చాటుమాటుగా నన్ను చంపావే — ఇది నీకు న్యాయమా? ధర్మమా? అని వాలి నిక్కచ్చిగా అడిగాడు.

రాముడు మాటాడలేదు.

'రామా! అందరూ ప్రశంసించే నీగుణాలన్నీ అబద్ధాలేనా ! ఒక దుర్మార్గునిలా, వంచకునిలా, కపటధార్మికునిలా ప్రవర్తించావే! ఇలాంటి నీవా దాశరథివి. ఇలాంటి నీవా ధర్మపాలకుడివి!' అని ఆవేశంగా వాలి అడిగాడు.

రాముడు అందుకూ బదులు చెప్పలేదు.

''మృగాన్ని కనుక నన్ను వేటాడానంటావేమో. ధార్మికులు, పండితులు, సత్పురుషులు వానరమాంసాన్ని తినరు. వానర చర్మాన్ని తాకరు. మా రోమాల్ని, ఎముకల్ని ఎందుకు ఉపయోగించరు. పంచనఖ జంతువుల్లో ఏవి భక్ష్యాలో ఏవి కావో నీకు తెలీదా ? నీవు జ్ఞానసంపన్నుడివే. నన్నెందుకు వధించినట్లు'' అన్నాడు వాలి.

అందుకు సమాధానంలేదు.

'నిరపరాధినైన నా మీద నీ పరాక్రమం చూపకపోతే - నీ బాణ ప్రయోగ కౌశలమంతా ప్రదర్శించకపోతే - నీ అర్ధాంగినే అపహరించి నీ కంత అపకారం చేసిన ఆ రావణుని మీద ప్రయోగించగూడదా ! పైగా చాటుమాటుగా నన్ను చంపావే. ఇంకొకరితో యుద్ధం చేసేటప్పుడు — మద్యం త్రాగి మత్తెక్కి నిద్ర పోయేవాణ్ణి క్రూరసర్పం కాటువేసినట్లు కొట్టావే. ఇది న్యాయమా ? నా ఎదుటే నిలిచి నీవు యుద్ధం చేసి ఉంటే నన్ను చంపటం నీ తరంగాదు. అంతేగాదు. నీవు ఈ పాటికి యమలోకానికి వెళ్ళి ఉండేవాడివి' అన్నాడు వాలి రాముని రెచ్చ గొట్టుతూ.

అయినా రాముడు పెదవి విప్పలేదు.

'నీవు నాకింత అపకారం చేసిందీ, అన్యాయం చేసిందీ సుగ్రీవుడు నీకు సీతను వెదకటంలో, రావణుని చంపటంలో సాయం చేస్తాడనేగదా ? ముందుగా ఆమాట నాతో చెపితే నీ సీత ఎక్కడున్నా ఒక్కరోజులో వెదకి తెచ్చియిచ్చేవాణ్ణి. ఆ రావణుణ్ణి చావగొట్టి గొంతుకు త్రాడుకట్టి యీడ్చితెచ్చి నీ కాళ్ళముందు పడవేసే వాణ్ణి. రామా ! ఆలోచించకుండా ఎందుకింత అపకారం చేశావు. అన్యాయంచేశావు' అన్నాడు వాలి.

క్రుంగే ప్రాణాలు బిగబట్టుకొని 'పుట్టిన ప్రతిప్రాణి గిట్టకమానదు. అయినా రామా ! నీవు చేసిన ఈ అపకారం, ఈ అన్యాయం యుక్తమో, అయుక్తమో

ఆలోచించు. యుక్తమనిపిస్తే ఎలా యుక్తమో చెప్పు' అని సూటిగా అడిగాడు రాముని కళ్ళల్లోకి సూదులు గ్రుచ్చినట్లు చూస్తూ.

రాముడు పెదవి విప్పక తప్పలేదు. వారివైపు సార్థకంగా చూడకా తప్ప లేదు.

అప్పుడు వాలి వెలిగి వెలిగి కాంతివిహీనుడైన సూర్యునిలా ఉన్నాడట. వర్షించి, వర్షించి శూన్యుడైన మేఘునిలా ఉన్నాడట. మండి మండి చల్లబడిన అగ్నిహోత్రునిలా ఉన్నాడట.

రామునిలో ఒక వెలుగు అగుపించింది. 'వాలీ' అని ఆయన పిలిచాడు. ఆ పిలుపు వాలిలోని అణువణువునూ మేల్కొల్పి నట్లుంది. ఆ వెలుగు ఏ దివ్యలోకా లకో నడిపిస్తున్నట్లుంది.

వాలి 'స్వామీ !' అన్నాడు. చేతులు జోడించాడు.

'అపకారం—అన్యాయం' ఇవేగా నామీద నీ అభియోగాలు; అనుమానాలు. ధర్మతత్త్వం సమగ్రంగా నీకు తెలియు. అందుకే సన్నంతంగా నిందించావు. ధర్మ తత్త్వం ఎంతో సూక్ష్మం. దాని సమగ్ర తత్త్వం సర్వాంతర్యామి అయిన పరమాత్మకే తెలుసు. నీవా వానరుడవు, చపలుడవు. నీకెలా తెలుస్తుంది. నిన్నెందుకు వధిం చానో చెప్తాను విను. ఈ సమస్త భూమండలం ఇక్ష్వాకులది. ఇందలి మృగపక్షి మనుష్యులను శిక్షించే అధికారం వారికుంది. ధర్మపాలన వారి కర్తవ్యం. భరతు డిప్పుడు ధర్మబద్ధంగా ఈ భూమిని పాలిస్తున్నాడు. అతని ననుసరించి మేమూ ధర్మప్రకారం దుష్టులను శిక్షిస్తున్నాం. సనాతన ధర్మానుసారం కొడుకు, తమ్ముడు, శిష్యుడు ముగ్గురూ పుత్రులే.' నీ తమ్ముడైన సుగ్రీవుని భార్యను ధర్మవిరుద్ధంగా నీవు అనుభవిస్తున్నావు. కుమార్తెతో, తోబుట్టువుతో, తమ్ముని భార్యతో కామా రుడై రమించే వానికి ధర్మశాస్త్రానుసారం మరణదండనే శిక్ష. అందుచేతనే నిన్ను ఆవధించాను. పైగా మనుధర్మశాస్త్రానుసారం పాపకర్ముని శిక్షించకుండా విడిస్తే పాపం ప్రభువుకే సంక్రమిస్తుంది ఈ భూమిని ధర్మబద్ధంగా పాలించే భరతుడు— అతని ననుసరించి ధర్మపాలన దక్షాదక్షులమైన మేము—ధర్మపాలనలో భాగంగానే నిన్ను వధించటం జరిగింది. నీవు వానరుడివే అయినా మానవ పద్ధతిలో సంధ్యా వందన, రాజ్యపాలనాది కర్మలు నిర్వర్తిస్తున్నావు గనుక శాస్త్రీయ పద్ధతిలో ఇంత దూరం నీకు సమాధానం చెప్పాను.

నీవు కోతివి. వన్యమృగానివి. వన్యమృగాలను మానవులు వధిస్తారు. వివిధ పద్ధతులవలంబించి వధిస్తారు. అవి సఖ్యాలా ? అతిక్ష్యాలా ? ఎదిరించాయా ? ఏమరి ఉన్నాయా ? పారిపోయాయా ? ఎలా వధింపబడ్డాయి? అన్న ప్రశ్నలే ఉత్పన్నం కావు. నీవు వన్యమృగానివి. నిన్ను వధించాను. అంతే.

పైగా, నాకు ముందుగా పరిచయం ఏర్పడింది సుగ్రీవునితో. అగ్నిసాక్షిగా అతనితో సఖ్యం చేశాను. అందరి ముందు నిన్ను వధిస్తానని మాట యిచ్చాను. అది సుగ్రీవుని మీద సానుభూతితోనే కావచ్చు. పరిస్థితుల ప్రభావంవల్లనే కావచ్చు; స్వప్రయోజనాన్ని అపేక్షించే కావచ్చు. అయినా సంఖ్యం సఖ్యమేగదా. మాట మాటేగదా. అందుకే నిన్ను వధించాను' అన్నాడు రాముడు సూటిగా చూస్తూ.

ఇందుకు సమాధానం ఏముంది ? ఇక వాదానికి తావెక్కడుంది ? ఎవరైనా, వాలీ ! నీవు రాముడు చెప్పిందంతా విన్నావా ?

నీ ప్రశ్నకు అది సమాధానం అవునోకాదో ఆలోచించావా ? అని అడిగితే అతడేం చెప్పేవాడో ! వాల్మీకిముని ఏం వ్రాసేవాడో ! కాని ఎవ్వరూ అతని నడగ లేదు. అసలు ఆ విషయం తర్కించ తలచుకోనూలేదు.

అయినా తర్కాలు అన్ని సమస్యలను తీరుస్తాయా ! జరిగిన సంఘటనలను మారుస్తాయా ! పోయే ప్రాణాలను ఆపుతాయా ! అట్లని తర్కం నిరుపయోగమని గాదు. సత్యశోధనకు, జ్ఞానసాధనకు అదొక ఉపకరణం. అయితే ప్రయోజనం పరిమితం. ఆత్మానుభూతే అన్ని శోధనలకు, అన్ని సాధనలకు పరమావధి, దాని ముందు తర్కం ఆగగలదా ! సూర్యుని ముందు చిన్నదీపం ప్రకాశించగలదా ! అందుకే వాలి తర్కాన్ని వదిలాడు. అనిర్వాచ్యదివ్యతేజస్సునొకదాన్ని ఆ రామ చంద్రుని ముఖంలో అట్టెచూస్తూ చేతులు జోడించాడు. 'నా అజ్ఞానం నశించింద న్నాడు. నా జన్మ తరించింద'న్నాడు.

అంతలో అంగదుని ఆర్తనాదం వినిపించింది. వాలి మనస్సు ఈ లోకంలోకి దిగింది. వాలి తనయుని దగ్గరకు తీసుకొన్నాడు. 'రామా! వీడు నా ప్రియపుత్రుడు. పసివాడు. నిరపరాధి నా మీది కోపం వీడిమీద చూపకు. సుగ్రీవుని చూచినట్లే అంగ దుణ్ణీ ప్రేమతో ఆదరించు'. అని దీనంగా అర్థించాడు.

పిదపవాడు కుమిలికుమిలి దుఃఖించే తారవైపు చూచాడు. 'రామా, ఈమె నా ప్రియపత్ని తార నిరపరాధ. సుగ్రీవుడు ఆమెమీద ఆగ్రహపడరాదేమో. అవమా

నిస్తాడేమో. అలా జరుగకుండా చూడు. నేను అజ్ఞానంలో నిన్ను నిందించాను. అందుకు క్షమించు' అని చేతులెత్తి జాలిగా మ్రొక్కాడు. కళ్ళనిండా నీళ్ళు రాల్చాడు.

ప్రక్కనున్న సుగ్రీవుని చేరబిలిచాడు. చెయ్యిపట్టుకొని 'తమ్ముడూ ! జరిగిన దానికి చింతించకు. విధి బలీయం. వానరరాజ్యాన్ని స్వీకరించి, సుఖంగా పాలించు. నాకు చివరి ఘడియలు సమీపిస్తున్నాయి. మన అంగదుణ్ణి నీ చేతుల్లో పెట్టుతున్నాను. ఇక వాడికి అన్నీ నీవే. నీ పుత్రునిలా చూచుకో' అని అంగదుని చేయి సుగ్రీవుని చేతి కందించాడు. అంగదుని వీపు నిమురుతూ 'కుమారా ! ఇది మొదలు సుగ్రీవుడే నీ తండ్రి. అతని ఆధీనంలో సుఖదుఃఖాలు, ఇష్టానిష్టాలు దేశకాలాలు తెలిసి జాగ్రత్తగా జీవించు.' అని చివరిమాటగా చెప్పాడు.

పాపం ! ఆపుకోలేక ఒక్కసారి తారవైపు తిరిగాడు. ఆమె కన్నీళ్ళు చేత తుడిచాడు. తానేమో గొల్లుమని ఏడ్చాడు. ఏలాగో మనసు కుదుటపరచుకొని — తలవంచి నిలుచున్న తమ్మునితో 'సుగ్రీవా ! తార మేధాసంపన్నురాలు. రానున్న ప్రమాదాలను పసిగట్టటంలో, చేయవలసిన పనులతీరును నిర్ణయించటంలో ఆమె కడు సమర్థురాలు. తార ఆలోచనలు తప్పుగావు ఆమె సలహాలు అనుసరించు. అన్ని విధాల నీకు శుభం కలుగుతుంది'. అని తార బాధ్యతను గూడ తమ్మునికి అప్పగించాడు.

సుగ్రీవా ! ఇంతకాలం ఈ కాంచనమాల నా కంఠాన్ని అలంకరించింది. దీని ప్రభావం నీకు తెలుసు. నేను ప్రాణం విడిస్తే ఇది కాంతి హీనమౌతుంది. వెంటనే స్వీకరించు - అని మెడ మెల్లగా నిక్కించి తమ్మునివైపు చూచాడు. నోట నెత్తురు, నురుగు నిండుతూఉంది. మాట తడబడుతూ 'సుగ్రీవా ! రామకార్యం ఏమరకు — రామ కార్యం ...... రామ కార్యం ...... అంటూ వాలి ప్రాణాలు విడిచాడు.

తార 'స్వామీ !' అని వాలి మీద వ్రాలింది.

అంగదుడు 'అమ్మా ! అని కేకవేశాడు.

సుగ్రీవుడు 'అన్నా !' అని తల వంచుకున్నాడు.

వానరులంతా ఒక్కసారిగా గొల్లుమని ఏడ్చారు.

రామచంద్రుడు భారంగా నిట్టూర్పు విడిచాడు.

లక్ష్మణుడు శూన్యంగా ఆకాశంలోకి చూచాడు.

కిష్కింధ కాంతి విహీనమైంది. ప్రకృతి అంతా స్తంభించిపోయింది.

ఒక మహాయోధుని జీవితం సమాప్తమైంది. అపార్థాలతో ఆరంభమయిన వాలి సుగ్రీవుల వైరం అహంకారావేశాలతో పెరిగి చివరకు మహాయోధుడైన వాలి వ్యర్థమరణంతో సమాప్తం కావటం చిత్రమైన విధివిలాసం.

# సుగ్రీవుడు

మైత్రి వెన్నెల లాంటిది. వెన్న లాంటిది. మంచినీటి చలమలాంటిది. బల మైన ఒక చేయూత లాంటిది. మంచి మిత్రుడు ఆనందాన్ని అంతకంత పెంచుతాడు. ఆవేదనను కొంతకు కొంత పంచుకొంటాడు. చక్కని మైత్రికి సమస్థాయి చాల అనుకూలం. పరిస్థితులు గూడ సమానమైతే మైత్రి ప్రగాఢమౌతుంది. మానవ జీవితంలో మైత్రి ఒక ముఖ్యాంశం.

లోకంలో గుణాలు చూచి కొందరు మిత్రులైతే, ప్రయోజనాలు కోరి మరి కొందరు స్నేహితులౌతారు. మైత్రి మైత్రి కొరకే కానక్కరలేదు. ప్రయోజనాపేక్ష ఉన్నా దోషంగాదు. కాని చిత్తశుద్ధి ఉండాలి. మిత్రహితం కోరాలి. కొల్లగొట్టే గుణం పోవాలి. అప్పుడే ఆ మైత్రి రాణిస్తుంది. ఉభయత్రా ప్రయోజనకరమౌతుంది. ఇరువురు సమర్థులు చిత్తశుద్ధితో స్నేహితులైతే వారి స్నేహం పరస్పర ప్రయోజనకరంగా ఉండటమే గాదు - ప్రపంచంలో పెక్కు ఘనకార్యాలు సాధిస్తుంది గూడ. రామాయణంలో రామ సుగ్రీవుల సఖ్యం అలాంటిది.

సుగ్రీవుడు సూర్యసుతుడు. శక్తి సంపన్నుడు. సుగుణ భూషితుడు. తేజో విరాజితుడు. అన్న వాలికి, అతనికి మాయావి కారణంగా అపార్థాలు ఏర్పడ్డాయి. వాలి అతణ్ణి తన్ని తరిమివేశాడు. అన్నకు భయపడి అతడు రాజ్యాన్ని, భార్యను వదలి ఎక్కడో ఋశ్యమూకం మీద కొందరు అనుచరులతో కొంత కాలం గడిపాడు.

ఉభయులకు ఎంతో ప్రయోజనకరం. వాలి రావణులకు అది ప్రాణాంతకం. అందు కే అటు లంకలో సీతారావణులకు, ఇటు కిష్కింధలో వాలికి వామనేత్రాలు ఒక్క-సారిగా అదిరాయట. అది సీతకు శుభ సూచన. వాలి రావణులకు అశుభసూచన.

మొత్తానికి సుగ్రీవుడు వాలిని వధిస్తానని మొదట రాముని చేత ప్రతిజ్ఞ చేయించాడు. ఆ తరువాత గుహలోకి వెళ్ళి సీతాదేవి ఆభరణాల మూట తెచ్చాడు. రామునికి చూపించాడు. ఆభరణాలు చూచి దుఃఖించే రాముని అనేక విధాల ఓదార్చాడు. సీతారాముల పునస్సమాగమానికి శక్తి వంచన లేకుండ సహాయపడతానన్నాడు. ఆకోదండ రాముని హృదయాన్ని గాఢంగా ఆకర్షించాయి. సుగ్రీవుడు సంయమంతో చూపే సానుభూతి, చెప్పే ధైర్యమే మైత్రిని దృఢతరం చేస్తాయి.

అయితే సుగ్రీవుడు ఒక ప్రయోజనాన్ని ఆశించి రామునితో సఖ్యం చేశాడు. ఆ ప్రయోజనం సిద్ధించాలంటే వాలిని జయించగల శక్తి సామర్థ్యాలు ఆ రామునికి ఉండాలి. మరి ఉన్నాయో ! లేదో , ఆ సంగతి తేల్చుకోవడం ఎలాగ ?

'రామా ! శౌర్య వీర్య ఔదార్యాది సద్గుణ సంపన్నుడవైన నీతో మైత్రి లభించటం నా అదృష్టం. నీ సహాయంతో వానర రాజ్యమేగాదు – దేవ రాజ్యం అయినా సులభంగా పొందవచ్చు. మహోత్తములు, ఆత్మజ్ఞాన సంపన్నులు అయినా నీలాంటి వారి ప్రేమ – వీరుల ధైర్యం ఎంతో స్థిరంగా ఉంటుంది. జీవితంలో మిత్రుని మించిన ఆప్తుడు లేడు. ఉత్తమ మైత్రి ఉన్నత స్థానాలు కోరుతుంది' ... అని సుగ్రీవుడు మొదట రాముని గుణగణాలు ప్రశంసించాడు. ఆ తరువాత మిత్ర ధర్మాలు ప్రస్తావించాడు. అశ్రుసిక్త నయనాలతో యౌవరాజ్యం నుంచి అన్న తన్ను తొలగించిన తీరు, తన భార్య నపహరించి తన్నతన్ని తరిమిన వైనం విన్నవించాడు. ఆ తరువాత అన్నకు తనకు మాయావి కారణంగా ఏర్పడిన వైరాన్ని తెలిపాడు. వాలి దుందుభిని వధించిన విషయం గూడ వివరించాడు. బల గర్వంతో వాలి విసిరివేసిన ఆ దుందుభి కళేబరాన్ని చూపాడు. ఎదుట ఉన్న ఏడుసాల వృక్షాలను చూపి, వాలి ఒకే సారిగా ఒక్కొక్క వృక్షన్ని ఛేదించేలా బాణం వేయగల అలాంటి వాడని చెప్పాడు. అతని బలపరాక్రమాలు అసదృశాలన్నాడు. ఎలా వధిస్తావో ! ఏమో ! అని అనుమానం వ్యక్తం చేశాడు.

సుగ్రీవుని మాటలకు లక్ష్మణుడు చిరునవ్వు నవ్వి, 'సుగ్రీవా ! ఏం చేస్తే రాముడు వాలిని వధించగలడన్న నమ్మకం నీకు కలుగుతుంది' అని అడుగగానే అనుమానం లేకుండ 'ఆసాల వృక్షలలో ఒక్కదాన్ని బాణంతో కొట్టమను. ఆ

దుందుభి కళేబరాన్ని బాణంతో దూరంగా

అంతలో రాముని కన్ను ఎరుపెక్కటం గూడ వెంటనే ఆయన వైపు తిరిగి 'రామా ! వాలి మహావీరుడు. వధించాడు దేవతలకే సాధ్యంగాని మహాకార్యాలు చేశాడు. నాకంత భయం. మతంగ మహాముని శాపం వల్ల వాలి అడుగుపెట్టడు. అందుకే ఈ పర్వతాన్ని ఆశ్రయించి గొప్ప మిత్రుడివి నీవు దొరికావు. నాకు హిమాలయం వాలి బలం నాకు తెలుసు. అది తలుచుకొంటేనే నాకు భయం. నేను చూడలేదు. అందుచేతనే అలా మాట్లాడాను. అని గాదు. అవమాన పరచాలని గాదు. నీమాట తీరు, ఆకార వైభవం అన్నీ చూస్తుంటే ఏదో నిపురుగప్పిన వని అనిపిస్తున్నది. అనుమానం లేదు' — అనగానే దుందుభి కళేబరాన్ని కాలి బొటన వ్రేలితో పది ఆమడల వేశాడు.

అయినా సుగ్రీవుని అనుమానం తీరలేదు. ఏమాత్రం మొహమాట పడకుండా, 'రామా ! మా అన్న విసిరి నప్పుడు అది కళేబరం. డు ఎండు కళేబరం. మాంస రహితం. అలసిపోయి మత్తెక్కి ఉన్న స్థితిలో దాన్ని విసిరివేశాడు. ఉన్న సమయంలో దాన్ని ఎగురగొట్టావు. టం కష్టం. ఎదుట ఉన్న ఆసాల వృక్షాల్లో ఒక్కదాన్ని బట్టి నామనస్సు ధైర్యం వహిస్తుంది. ఇది నిన్ను పరీక్షించ ధైర్యం తెచ్చుకోవటానికి. నీవు పురుషోత్తముడివి' అన్నాడు.

రాముడు బాణాన్ని ఎక్కుపెట్టి ప్రయోగించాడు. గాదు - ఏడు సాల వృక్షాలను ఏకంగా ఛేదించి తూణీరంలో దూరింది. అది చూచే సరికి సుగ్రీవుని మతి పోయింది. ంచి సరాసరి శ్రీరాముని పాదాల మీద సాగిల పడ్డాడు.

'స్వామీ! నీవు వాలినే గాదు, సాక్షాత్తు దేవేంద్రుడినైనా అవలీలగా వధం చగలవు. ఒక్క బాణంతో ఏడు వృక్షాలను, భూమిని భేదించావే - యుద్ధంలో నీ ముందు ఎవరు నిలువగలరు! నిన్ను స్నేహితునిగా పొందటం నా భాగ్యం. నా కెంతో ఆనందంగా ఉంది. వాలిని వధించి నా కష్టాలు గట్టెక్కించు' — అన్నాడు.

రాముడు సుగ్రీవుని గాఢంగా కౌగిలించు కొన్నాడు. వీపు తట్టాడు. వెంటనే కిష్కింధకు బయలు దేరమన్నాడు. వాలిని యుద్ధానికి పిలవమన్నాడు. మీ అన్న దమ్ములు యుద్ధం చేస్తుంటే సమయం చూచి ఆ వాలిని వధిస్తానన్నాడు.

సుగ్రీవుడు 'సరే' అన్నాడు. రామలక్ష్మణులతో కలసి కిష్కింధకు బయలు దేరాడు. ఊరి వెలుపల ఒక అరణ్యం. అక్కడ ఉండి సుగ్రీవుడు ఆకాశం బ్రద్దల య్యేలా గర్జించాడు. వాలిని యుద్ధానికి ఆహ్వానించాడు.

అది వాలీ సుగ్రీవుల ద్వంద్వయుద్ధం. భయంకరంగా ఎంతో సేపు సాగింది. కాని ఎంతకూ రాముడు వాలిని కొట్టలేదు. సుగ్రీవుడు అన్న చేతుల్లో చావు దెబ్బలు తింటున్నాడు. చూచాడు, చూచాడు. ఎంత చూచినా ఆ రామబాణం రాలేదు. బ్రతుకు జీవుడా అని ఋశ్యమూకానికి పరుగెత్తి వెళ్ళాడు. తిరిగి వచ్చిన ఆ రామలక్ష్మణులను దీనంగా చూచి 'రామా! వాలిని యుద్ధానికి పిలవమన్నావు. పిలిచాను అతడు నన్ను చావ చితక కొట్టాడు. నీవు చూస్తు ఊరకున్నావు. ఇదా నీవు చేసే సాయం? వాలిని చంపటం చేతగాదని మొదటనే నాకు చెపితే ఈ సాహసానికి దిగే వాణ్ణి గాదు కదా. ఈ చావుదెబ్బలుతినే వాణ్ణి గాదు కదా. అన్నాడు కన్నీరు కారుస్తూ.

రాముడు సానునయంగా 'సుగ్రీవా! మీ అన్నదమ్ములిద్దరు రూపంలో, వేషం స్వరంలో, గమనంలో ఒకే రీతిగా ఉన్నారు. ఎవ్వరెవరో పోల్చుకోవటం సాధ్యం గాలేదు. అందుచేతనే బాణం వదల లేదు పొరపాటునబాణం నీకే తగిలిందనుకో అభయహస్త మిచ్చి అసువులుతీసినట్లు అవుతుంది. అది మహాపాతకం. ఈసారి ఏదైనా గుర్తు ధరించి వాలితో యుద్ధంచెయ్యి. ఒక్క బాణంతో అతనిని హత మారుస్తా' అన్నాడు. తమ్మునివైపు తిరిగి 'లక్ష్మణా! అదిగో ఆ గజపుష్పి లతను గుర్తుగా సుగ్రీవుని కంఠాన అలంకరించు' అని ఆదేశించాడు.

ఆ గజపుష్పిలతను ధరించిన సుగ్రీవుడు కొంగల బారుతో కూడు కొన్న సంధ్యాకాల మేఘంలా ప్రకాశించాడట.

ఈ సారి సుగ్రీవుడు ద్విగుణీకృతోత్సాహంతో సింహనాదం చేశాడు. వాలిని యుద్ధానికి రమ్మని ఆహ్వానించాడు. చెప్పిన మాట చెల్లించు కొమ్మని శ్రీరాముని హెచ్చరించాడు.

వాలి సుగ్రీవుల రెండవ యుద్ధం ఆరంభమైంది రామబాణం వాలి గుండెలో దూసుకు పోయింది.

ఎంత పోరినా అన్నదమ్ములు అన్నదమ్ములే. ఆత్మీయతలు ఆత్మీయులే. అనుబంధాలు అనుబంధాలే. అవి అంత సులభంగా అంతరించవు. వాలినేల కూల గానే సుగ్రీవుని కళ్ళు చెమ్మగిల్లాయి. తారా విలాపంతో, అంగద శోకంతో, వానర దుఃఖంతో వాతావరణమంతా విషాద పూరితమైంది. అందుప దోసు కొన ఊపిరితో వాలి అప్పగింతలు. అర్ధనిమీలిత నయనాలతో భార్యతారను, పుత్రుడు అంగదుని సుగ్రీవుని కి అప్పగించాడు. మెడలో కాంచన మాలను బహూకరించాడు. బాధ భరించలేక గిలగిల తన్నుకొని ప్రాణాలు విడిచాడు.

రాముకు సానుభూతిని పెంచే గుణముంది. ఆత్మీయులను ఆదరం చేసే బల ముంది. అన్నమరణంతో తమ్ముని మనస్సు వికలమై పోయింది. ఎటు జూచినా విషాదవాతావరణమే. కన్నీటి ప్రవాహాలే. ఎవరి కొరకీ రాజ్యం ? ఎందుకొరకీ అధి కారం ? ఒక విధమైన వైరాగ్యం. దట్టమైన పొగమంచులా సుగ్రీవుని మనుస్సు ను అలముకొంది. అతడు మెల్లగా అడుగులు వేసుకొంటూ రాముని సమీపించాడు ఆయన ముందు నిలిచాడు. చేతులెత్తి నమస్కరించాడు. కన్నీళ్ళు కారుస్తూ 'రామా ! నీ ప్రతిజ్ఞ నీవు చెల్లించావు. వాలిని వధించావు. రాజ్యం నాకు సిద్ధం చేశావు. నాకు రాజ్యం మీదనే గాదు - జీవితం మీద గూడ ఇప్పుడు ఆశలేదు. ఆ తార దుఃఖం చూడలేను. ఈ అంగద శోకం సహించలేను. వానరరోదనలు వినలేను. వాలి పెట్టే బాధలు భరించలేక అతనిని వధించమన్నానేగాని, అతని మరణం తరువాత రాజ్య సుఖం కంటె భ్రాతృదుఃఖం ఎంత ఎక్కువో తెలుసు కొన్నాను. వాలి ఔదార్యం నన్ను వధించనని చెప్పి వదిలివేసింది. నా దుర్మార్గం వాలిని నీచేత వధింపచేసింది. వాలిదెబ్బలకు నేను కేక పెడుతుంటే ఇంకెప్పుడు తనతో యుద్ధం చెయ్యవద్దని హెచ్చరించి విడిచాడు. నేను మాత్రం క్రూరంగా నీ చేత అతనికి చావు దెబ్బ కొట్టించాను. నేను భ్రాతృహంతను. మహాపాపిని. అగ్ని

ప్రవేశమే నాపాపానికి పరిష్కారం. నీ ఆజ్ఞప్రకారం ఈ వానరులంతా సీతాదేవిని వెదుకుతారు. నేను మరణించినా నీ కార్యం నిరాటంకంగా సాగిపోతుంది' అని సుగ్రీవుడు అనే సరికి రామునికి కొంతసేపు ఏమీ తోచలేదు. తరువాత ఆయన తారనో దార్చాడు. సుగ్రీవుని సమాశ్వాసించాడు వాలికి ఉత్తర క్రియలు జరిపించాడు.

రామాజ్ఞమేరకు సుగ్రీవుడు అన్నగారి ఉత్తర క్రియలు నిర్వర్తించి, కిష్కింధారాజ్యపట్టాభిషక్తు డయ్యాడు.

అంగదుని యువరాజుగా అభిషేకించాడు

అది శ్రావణమాసం. వర్షాకాలం. సీతాన్వేషణకు అనుకూలం. అందువల్ల శరత్కాలం రాగానే సీతాన్వేషణ ప్రారంభించాలను కొన్నారు. కాని సుగ్రీవుడు కామసుఖాల్లో మునిగిపోయాడు. కాలగమనాన్నే మరచాడు. అప్పటికి హనుమంతు డొకసారి రామకార్యం గుర్తుచేశాడు. అప్పుడు సుగ్రీవుడు నీలుని పిలిచి వివిధ దిశల్లో వానరులను సమీకరించ మన్నాడు. అందుకు దిశల్లో వానరులను సమీకరించమన్నాడు. అందుకు పదునైదు రోజులు వ్యవధి ఇచ్చాడు. వ్యవధి మీరి ఏ వానరుడు వచ్చినా వానికి మరణదండన తప్ప దన్నాడు. మరల తాను మద్యపానంలో, మన్మథక్రీడల్లో మునిగిపోయాడు.

వర్షాకాలం గడచిపోయింది. శరత్కాలం వచ్చింది. అయినా సుగ్రీవునికి ఆ సంగతి తెలియనేలేదు. సీతాన్వేషణ ఆరంభమే కాలేదు. అతని మద్యపాన మదోన్మత్తత, మన్మథ క్రీడా విలాసం అలాంటివి. ఆగ్రహోదగ్రుడైన లక్ష్మణుడు వచ్చి అతని అంతు చేస్తానని అంతఃపురంలో ధనుష్టంకారం చేసేదాకా సుగ్రీవుని మత్తు వదలలేదు. ఆ ధనుష్టంకారం వినగానే అతడు గడగడ లాడిపోయాడు. తారచాటున తలదాచుకొన్నాడు. 'తారా ! మహాత్ములు అతివలపట్ల ఆగ్రహం చూపరు. అందువల్ల నీవే లక్ష్మణుని కలుసుకో. ఆయన కోపకారణం తెలుసుకో, మెత్తనిమాటలతో ప్రసన్నుని చేసుకో. ఆ తరువాత నేను వస్తాను. లక్ష్మణుని చూస్తాను' అన్నాడు.

అప్పుడు తారే అడ్డుపడకుంటే పరిస్థితి ఎలా పరిణమించేదో ! తార తన వ్యక్తిత్వంతో, వాక్చాతుర్యంతో లక్ష్మణుని ఆగ్రహావేశానికి అడ్డుకట్ట వేసింది. అప్పుడు సుగ్రీవుడు ముందుకు వచ్చాడు. రాముని పరాక్రమాన్ని ప్రశంసించాడు,

తన రామభక్తి ప్రపత్తిని ప్రకటించాడు. జరిగిన ఆలస్యానికి క్షమాపణ చెప్పు కొన్నాడు. వానరుల విజయ వేళ రమ్మని లక్ష్మణుతో పాటు పల్లకి ఎక్కి, రామ సమక్షానికి వెళ్ళాడు. సర్వవానర సైన్యాన్ని ఆ రాముని ప్రభావం చూపి ఆజ్ఞాపించమని ఆయన పాదాల మీద వ్రాలాడు.

రాముడు సుగ్రీవుని లేవనెత్తాడు. ప్రియమార కౌగిలించు కొన్నాడు. మహా సముద్రంలా ముందు నిలిచిన వానర సైన్యాన్ని చూచి ఆశ్చర్యపోయాడు. మహా పర్వతంలా ఎదుట నిలిచిన సుగ్రీవుని కృతజ్ఞతాభావాన్ని చూచి పులకించాడు.

సుగ్రీవుడు అంజలి ఘటించి 'రామా ! సర్వ వానరులు నీ ఆజ్ఞాను వర్తులు కర్తవ్యాన్ని ఆదేశించు' అన్నాడు

శ్రీరాముడు సుగ్రీవుని సూటిగా చూస్తూ 'వానరేశ్వరా ! సీతాన్వేషణమన సత్వర కర్తవ్యం. నీవు మిత్రుడవి. హితుడివి. పరాక్రమోపేతుడివి. పండితు డివి. ప్రాజ్ఞుడివి. కార్యచతురివివి. అందుకు తగిన వ్యూహాన్ని నీవే నిర్ణయించు. వానరులను ఆదేశించు' అన్నాడు.

సుగ్రీవుడు వినతుని నాయకత్వంలో ఒక లక్షవానర వీరులను ప్రాగ్దిశకు పంపించాడు. పర్వతాల్లో, నదుల్లో, అరణ్యాల్లో ఆ సీతాదేవిని రావణుడు ఎక్కడ దాచాడో వెదకండని ఆజ్ఞాపించాడు. ఆయా పర్వతాలపేర్లు, నదులపేర్లు, వాటిని చేరే మార్గాలు అందలి విశేషాలు సవిస్తరంగా చెప్పాడు అందుకు ఒక నెల వ్యవధి ఇచ్చాడు.

అట్లే మరో మహాసైన్యాన్ని అంగదుని నాయకత్వంలో దక్షిణదిశకు పొమ్మని ఆదేశించాడు. అందులో నీలుని, హనుమంతుని, జాంబవంతుని, గవయ గవాక్ష ఋషభమైంద ద్వివిదాది మహావీరుల్ని చేర్చాడు. వెదక వలసిన ప్రదేశాలు చెప్పాడు వెళ్ళవలసిన మార్గాలు వివరించాడు.

సుషేణుని నాయకత్వంలో రెండు లక్షల సైన్యాన్ని పశ్చిమ దిశకు పొమ్మని చెప్పాడు. అక్కడ వెదుక వలసిన ప్రదేశాలను, వెళ్ళవలసిన మార్గాలను, చూడ దగిన విశేషాలను వివరించాడు.

శతవలి నాయకత్వంలో లక్షమంది వానరులను ఉత్తర దిక్కు పొమ్మన్నాడు అక్కడ వెదుక వలసిన ప్రదేశాలను, వెళ్ళవలసిన మార్గాలను, చూడ దగిన విశే షాలను చెప్పాడు.

వానరులంతా సీతాన్వేషణ యాత్రకు సిద్ధంగా నిలవటము, ఆ సమయంలో సుగ్రీవుడు ప్రత్యేకించి పవమానసుతుని శక్తిసామర్థ్యాలు ప్రశంసించటము, కార్య సాఫల్యం ఆ హనుమవల్లనే కావాలని అనటము, అదిచూచి రామచంద్రుడు తన అంగుళీయకాన్ని ఆనవాలుగా సీతకిమ్మని ఆ హనుమ కివ్వటము చిత్రంగా జరిగి పోయాయి.

అది చూచి మిక్కిన వానరులంతా తక్కువ తనం భావించు కొని మనస్సు నొచ్చుకోకుండా సర్వవానరులను సుగ్రీవుడు ఉత్సాహపరిచాడు. కర్తవ్యాన్ని గట్టిగా నొక్కి చెప్పాడు.

మహీతలాన్ని మిడుతల దండు కప్పినట్లు వానరసేన ఒక్కుమ్మడిగా వివిధ దిక్కులకు బయలు దేరింది. సుగ్రీవుని భూగోళ పరిజ్ఞానాన్ని వానరసేనమీద అతనికున్న ఆజ్ఞాబలాన్ని చూచి రాముడు ఆశ్చర్యపోయాడు. వానరులంతా వెళ్ళిన తరువాత 'సుగ్రీవా! ఇంత భూగోళాన్ని ఎలా చూచావు. కంటికి కట్టినట్లు వర్ణించావు' అని అడిగాడు శ్రీరాముడు. తనకు, అన్నకు అంతా మాయావి కారణంగా ఏర్పడిన వైరాన్ని, అన్న తన్ను వెంటాడగా ప్రాణ దాచుకోటానికి తాను నేల నాలుగు దిక్కుల తిరిగిన వైనాన్ని వివరించాడు సుగ్రీవుడు.

మాసం గడువు ముగిసింది. మూడు దిక్కుల వానరులు తిరిగి వచ్చారు. సీత అగుపించలేదని చెప్పారు. అయితే అంగద నాయకత్వంలో వెళ్ళిన వానర సేన ఇంకా తిరిగి రాలేదు. ఎందుచేతనో ! ఏమో !

ఉన్నట్టుండి ఒకనాడు మధువన పాలకుడు దధిముఖుడు వచ్చాడు. సుగ్రీవునికి నమస్కరించాడు. అంగద హనుమాది వానర వీరులంతా మధువనాన్ని ధ్వంసం చేశారని, విపరీతంగా మధువు త్రాగి మత్తెక్కిపడి ఉన్నారని, వనపాలకులు వారిస్తే వారిని బాధించారని మొరపెట్టుకొన్నాడు. సుగ్రీవుడు ఆలోచించాడు. కార్యసిద్ధికానిదే అంగదాదులు ఆ సాహసం చెయ్యలేరని, ఆంజనేయుడె సీతను చూచి ఉంటాడని, ఆ ఉత్సాహంతోనే వానరులంతా మధువనం చొచ్చి ఉంటారని, మధువు త్రాగి మత్తెక్కి మితిమీరి ప్రవర్తించి ఉంటారని ఊహించాడు. మేనమామ దధిముఖునితో అంగద హనుమాదులను తక్షణం తన దగ్గరకు పంపమన్నాడు. చింతాక్రాంతుడై ఉన్న శ్రీరాముని ఓదార్చి — అంగద బృందం కాలనియమాన్ని అతిక్రమించటం

సాహసించి మధువనం ప్రవేశించటం, మధువును గ్రోలి మైమరచి ప్రవర్తించటం అన్నీ కార్యసిద్ధి చిహ్నాలే అని చెప్పాడు. జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు చేపట్టిన ఏ కార్యం అయినా సఫలం గాక తప్పదన్నాడు.

అలా మాట్లాడుతూ ఉండగానే అంగదహనుమాదులు అగుపించారు. అల్లంత దూరం నుండి హనుమ 'చూచా సీతమ్మ'నని అన్నాడు. అందరి పాలిట ఆ మాట అమృత ధారలా ఉంది.

రాముని ఆనందానికి అంతులేదు.

ఆంజనేయుడు తన సీతాదర్శన వృత్తాంతాన్ని సవిస్తరంగా చెప్పాడు. చూడామణి రామునికి చేతికిచ్చాడు. శ్రీరాముడు సముద్రతరణాన్ని గూర్చి, రాక్షస సంహారాన్ని గూర్చి చింతిస్తూ ఉంటే 'మహాత్మా!' అదెంత పని అని సుగ్రీవుడు ఆయనకు ధైర్యం చెప్పాడు. సమస్త వానరసేనను శ్రీరాముని స్వాధీనం చేశాడు.

సేతు నిర్మాణం జరిగింది. వానరసేన సముద్రం దాటింది. రాక్షస వానర యుద్ధానికి రంగం సిద్ధమైంది.

యుద్ధభూమిలో సుగ్రీవుని పాత్ర ఒక అద్భుతం, యుద్ధారంభం కాకముందే అతడొక అద్భుత కార్యం చేశాడు. సువేలాద్రి శిఖరం మీద రావణుడగుపించేసరికి ఆగ్రహావేశంతో అతని మీదికి హఠాత్తుగా లంఘించాడు. అతని కిరీటం నేల పడగొట్టాడు. వివిధ రీతుల ద్వంద్వ యుద్ధం చేశాడు.

ఆ దానవేశ్వరుని అదర గొట్టాడు. రామ పక్షబలం ఏపాటిదో అతనికి రుచి చూపించాడు. ఒక్క ఊపున ఎగిరి మరల సువేలాద్రి చేరుకొన్నాడు. రాముని ప్రశంసలందుకొన్నాడు.

సుగ్రీవుని ధైర్యసాహసాలు, బలపరాక్రమాలు యుద్ధరంగంలో రావణుని తల్లడిల్లచేశాయి. రాక్షస సేనను చీల్చి చెండాడాయి. ఎందరెందరో రాక్షస వీరులను ఎదిరించి నిలిచాయి. కుంభుని కూల్చాయి. విరూపాక్షుని హతమార్చాయి. శ్రీరామ విజయానికి విశేషంగా దోహదం చేశాయి.

రామ సుగ్రీవ సఖ్యం రామరావణ యుద్ధంతోనే ఆగిపోలేదు. అది చివర వరకు చిత్తశుద్ధితో సాగింది. సుగ్రీవుడు స్నిగ్ధమిత్రుడుగా, వానర ప్రభువుగా

అయోధ్యా నగరానికి వెళ్ళాడు. ఆ రామపట్టాభిషేకాన్ని దర్శించాడు. ఆయన చేత అనేక సత్కారాలు పొందాడు. అశ్వమేధానికి గూడ సుగ్రీవుడు అతిధిగా వెళ్ళాడు. ఎన్నో కానుకలు ఇచ్చాడు. చిట్టచివరకు శ్రీరామునితోపాటు తానూ సరయూ ప్రవేశం చేశాడు, తనువు త్యజించాడు. సూర్య మండలం చేరు కొన్నాడు.

వాలి సుగ్రీవుల వైరమే లేకుంటే శ్రీరామ సుగ్రీవ సఖ్యం సంభవించేది కాదేమో! శ్రీరామ సుగ్రీవ సఖ్యమే లేకుంటే సీతాన్వేషణ ఏ విధంగా సాగేదో! రాక్షస సంహారం ఎలా జరిగేదో! శ్రీమద్రామాయణంలో శ్రీరామ సుగ్రీవ సఖ్యం ఒక ప్రముఖ ఘట్టం. అది ఇద్దరు మిత్రుల చిత్తశుద్ధికి, పరస్పర ప్రయోజన సిద్ధికి ప్రబల తార్కాణం.

# ఆంజనేయుడు

ప్రపంచంలో ప్రభువుకు ప్రశస్తి రావటం సులభం. కాని ఒకవ్యక్తి ప్రభువు కడ సేవకుడుగా ఉంటూ పదిమందిలో పేరుపొందటము, విశేషించి తన ప్రభువుతో సమానంగా ఒక పూజ్యత సంపాదించటము అసంభవం కాకపోవచ్చు గాని అసాధా రణం అని మాత్రం అనకతప్పదు. అందులోను ప్రభువు గుణవంతుడయ్యేనా ప్రక్కనున్న వాని ప్రజలు రాణించటం చాల కష్టం. సూర్యుని ముందు చుక్క ప్రకాశించగలదా? కాని సుగుణాభిరాముడైన శ్రీరాముని వంటి మహాప్రభువుకు సేవకుడై, ఆయనతోపాటు తానూ ఆలయాలు నిర్మింపచేసుకుంటూ, ఆయనతోపాటు తానూ అర్చనలందుకొంటూ "శ్రీరామ దూతం శిరసా నమామి" అనే స్తోత్రానికి పాత్రుడైన సేవకోత్తముడు ఆంజనేయుడు. ఇంచుక సాహసమైనా ఒక మాట ముందుకు మిగిలి అంటే మన దేశంలో అక్కడక్కడ రామభక్తులకంటె ఆంజనేయ భక్తులే అధికంగా ఉన్నారేమో. అసాధారణమైన ఇంత ప్రశస్తి, అపారమైన ఇంత పూజ్యత రామదూతగా ఆంజనేయుడు ఎలా ఆర్జించగలిగాడు? అందుకు కారణం ఆయన వ్యక్తిత్వం. అమేయమైన ఒక శక్తి, అద్భుతమైన యుక్తి, అచంచలమైన

శక్తి సంగమించిన ఒక మహాపవిత్ర త్రివేణీతీర్థం ఆంజనేయుని వ్యక్తిత్వం. అందుచేతనే ఆ రామదూతకు అంత ప్రశస్తి లభించింది. అంత ప్రాధాన్యత కలిగింది.

కాగా శ్రీమద్రామాయణంలో - శ్రీరాముని జీవిత మార్గంలో ఆంజనేయుడు నిర్వహించిన పాత్రగూడ అత్యద్భుతం; ఎంతో ప్రధానం. అయోధ్యకు మిథిలకు వియ్యాన్ని కూర్చి సీతారాముల వివాహానికి కారణభూతుడైంది విశ్వామిత్రుడైతే, అయోధ్యకు కిష్కింధకు నెయ్యాన్ని కూర్చి సీతారాముల పునస్సమాగమానికి కారణభూతుడైంది ఆంజనేయుడు. సీతాన్వేషణకు, రాక్షస సంహారానికి అవసరమైన వానరబలాన్ని సుగ్రీవ సఖ్యంద్వారా శ్రీరామునికి సమకూర్చిన వ్యక్తి ఆంజనేయుడు. అందుచేతనే వాల్మీకి మహర్షి ఆంజనేయపాత్రను శ్రీమద్రామాయణంలో ఎంతో కీలకమైన సన్నివేశంలో ఒక కొలికిపూసలా ప్రవేశపెట్టాడు.

అది రమణీయ పంపా సరోవరం. సుగంధి శీతల జలమయం. నానావిధ తరులతా పుష్పసంశోభితం. ఆ కొలను ప్రక్కనే ఒక మహాపర్వతం-ఋశ్యమూక మహాపర్వతం. నానావిధ ధాతు సమన్వితం. అనేకానేక ఫలభార వినమ్రవృక్ష పరివృతం. రాజ్యాన్ని వదలి, భార్యావియోగదుఃఖంతో ఆ కొలనుగట్టున ఒక పిచ్చివానివలె తమ్మునితో గూడ తిరుగుతున్నాడు — శ్రీరామచంద్రుడు. తన రాజ్యాన్ని, భార్య రుమను అపహరించిన అన్న చేత తన్నులు గూడ తిని భయభ్రాంతుడై ఆ పర్వతశిఖరం మీద బ్రదుకుజీవుగా అని పదిమంది సహచరులతో కాలం గడుపుతున్నాడు — సుగ్రీవుడు. ఇద్దరు ఆపదల్లో చిక్కుకున్నవారే. ఇద్దరు సర్వసమర్థులే. జీవితంలో అలాంటి వాళ్ళ మధ్య సఖ్యం ఏర్పడితే అది ఉభయత్రా ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. ఎన్నో మహాకార్యాలను సాధిస్తుంది. కాని వీరిద్దరికి సఖ్యం ఏర్పడటం ఎలాగ? అటు కొలనుగట్టున శ్రీరాముడు; ఇటు కొండ కోనమీద సుగ్రీవుడు. ఈ స్థితిలో ఆంజనేయుడు సుగ్రీవుని మాటగా శ్రీరాముని కడకు వచ్చాడు. ఎంతో చాకచక్యంగా తన శక్తియుక్తుల్ని ప్రదర్శించాడు. శ్రీరామ సుగ్రీవ సఖ్యాన్ని సాధించాడు ఉత్తమ దూతకు ఉదాహరణగా నిలిచాడు. కార్యసాధనకు మారుపేరుగా కీర్తికెక్కాడు.

లోకంలో ఏ మహాకార్యాన్ని సాధించటానికైనా మొదట అవసరమైంది శక్తి. శక్తి మానవునికి మూలధనం అది శారీరకం, మానసికం అని రెండు

రకాలు. కేవల శారీరక శక్తిగాని, కేవల మానసికశక్తిగాని స్వయం సంపూర్ణతను సాధించలేవు. ఈ రెండింటి కలయికే మహా కార్యసాధనను గడిస్తుంది. ఆంజనేయుడు పుట్టుకతోనే బలవంతుడు. మహాబలుడైన వాయుదేవుని పుత్రుడు. విద్యాంశగల అంజనకు తనయుడు బాల్యంలోనే సూర్యమండలందాకా ఎగిరిన శక్తిమంతుడు. ఉదయభానునే ఫలమని భక్షించటానికి ప్రయత్నించిన సాహసవంతుడు. వజ్రాయుధం దెబ్బకు హనుడు కాకుండా బ్రదికిన వీర్యవంతుడు. ఇంద్రుని మెప్పుతో స్వచ్ఛంద మరణాన్ని, బ్రహ్మ అనుగ్రహంతో అవధ్యత్వాన్ని వరాలుగా పొందిన అదృష్టవంతుడు. అందుకుతోడు ఆంజనేయునిది ఆజన్మ బ్రహ్మచర్యం. బ్రహ్మచర్యం శక్తిసంవర్ధకం. ఇక ఆయన బలానికి అవధి ఎక్కడ !

రామాయణంలో ఆంజనేయుని దేహబలం ప్రకటమైన ఘట్టాలు అనేకాలు; ఆశ్చర్యజనకాలు. సీతాన్వేషణ ఘట్టంలో సముద్రలంఘనం ఒక పెద్ద సమస్య. అంగదుని నాయకత్వంలో సీతాన్వేషణకు బయలుదేరిన వానరబృందానికి దక్షిణ సముద్రతీరంలో అనేక విషమ సమయం. ఒకవైపు సుగ్రీవాజ్ఞ. మరొకవైపు మహాసముద్రం. ముందు నుయ్యి. వెనుకగొయ్యి. ముందుకు వెళ్ళి ఈ మహాసముద్రాన్ని దాటటం ఏలాగ ? వెనుకకు వెళ్ళి ఆ సుగ్రీవుణ్ణి చూడటం ఏలాగ ? వానరులంతా ఎంతోసేపు ఆలోచించారు. సతమతమయ్యారు. సమస్య పరిష్కారం కాలేదు. ఒకరు అంత దూరం దాటగలనన్నారు. మరొకరు ఇంత దూరం దాటగలనన్నారు. అంతేగాని మొత్తం సముద్రాన్ని దాటి తిరిగిరాగలనన్నవారు ఎవ్వరూ లేరు. చివరకు జాంబవంతుడు గూడ తొంబది యోజనాలే దాటగలనన్నాడు. అంగదుడు నూరు యోజనాలన్నాడు. అయితే వెనుదిరిగి రావటం అనుమానాస్పదమన్నాడు అందువల్ల ప్రయోజనం ? అదొక దిక్కుతోచని స్థితి. దిగులుతో అందరు క్రుంగిపోతున్న స్థితి. అంత జరుగుతున్నా ఆంజనేయుడు ఏకాంతంగా ఎక్కడో మౌనంగా కూర్చొన్నాడుగాని ముందుకు వచ్చి మాటాడలేదు. జాంబవంతుడు చూచాడు. ఆంజనేయుని చెంత చేరాడు. కొండంత ఆశతో పలుకరించాడు. 'వానరలోకవీరా ! సర్వశాస్త్ర విదాంవర ! ఏమీ పట్టనట్లు ఇలా కూర్చున్నావేమి ? బలంలో, బుద్ధిలో, తేజస్సులో, సత్త్వంలో నీవు సర్వప్రాణుల కంటె మిన్న. అయినా నీ శక్తి నీవు తెలియలేకున్నావు' అని ప్రశంసించాడు. ఆ ప్రశంసతో ఆంజనేయుడు పొంగిపోయాడు. పొగలేని నిప్పులా ప్రజ్వరిల్లాడు. అలనాటి త్రివిక్రమునిలా విజృం

ధించాడు. తన శక్తి తాను తెలుసుకున్నాడు. సముద్రాన్ని క్షోభింపచేస్తానన్నాడు. పర్వతాలను చూర్ణం చేస్తానన్నాడు. లంకనే పెకలించి తెస్తానన్నాడు. ఒక్కసారిగ మేనుపెంచి, సర్వశక్తుల్ని పుంజీభవింపజేసి ఆ మహేంద్ర పర్వతం మీదనుండి ఆకాశమార్గాని కెగిరాడు. మహోద్ధతమైన ఆ హనుమంతుని దూకుడువేగానికి మహా పర్వతం మీది వృక్షాలన్నీ పట్టుదప్పి, పెల్లగిరి పైకిలేచి సాగనంపటానికి వెంట వెళ్ళే బంధువుల్లా చాలదూరం ఎగిరాయట. మద్దిచెట్లవంటి మహావృక్షాలు గూడ మహారాజును అనుసరించే సైనికుల్లా చాల దూరం సాగిపోయాయట. ఆంజనేయుని జవసత్త్వాలట్టివి !

కాగా ఆంజనేయుని స్వభావంలో ఒక చిత్రమైన అంశం ఉంది. అది అతని బలం అతనికి తెలియక పోవటం. ఎదుటివారు ప్రశంసించి ప్రోత్సహించేదాకా అది నివురు గప్పిన నిప్పులా దాగి ఉండటం. ఉన్నదానికంటె ఎక్కువ ఊహించుకొని ఎగిరెగిరి పడటం ఉత్తరుని స్వభావమైతే, ఆత్మబలం తెలియక అడగిఉండటం ఆంజనేయుని స్వభావం.

ఆంజనేయుని దేహబలం అశోకవనంలో తన్నెదిర్చిన కింకరజంబుమాలి విరూపాక్షయూపాక్షాది రాక్షసవీరులను అంతమొందించింది. అంతేగాదు, యుద్ధ రంగంలో రావణునికి తన తీవ్రతను రుచి చూపించింది.

అది స్వయంగా రావణుడే యుద్ధానికి వచ్చినరోజు ఆ రాక్షసరాజుమీదికి మొదట లక్ష్మణుడు విజృంభించాడు. ఆంజనేయుడు అడ్డువచ్చి భృత్యుడుండగా మీకేల ఈ శ్రమ అని లక్ష్మణుని వారించాడు. తాను ముందు కడుగువేశాడు. రావ ణుని ఎదుర్కొన్నాడు. 'నా కుడిచెయ్యి ఇప్పుడే నిన్ను కడతేరుస్తుందన్నాడు. బహుకాలంగా నీ దేహంలో ఉన్న జీవుడికి విముక్తి కలిగిస్తుందన్నాడు. ముందే నా చేత చచ్చిన నీ అక్ష కుమారుణ్ణి ఒక్కసారి గుర్తు చేసుకొమ్మన్నాడు.' ఆంజ నేయుని మాటలకు రావణుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. పిడికిట ఒక్క పోటు పొడిచాడు. ఆ రావణుని దెబ్బకు అంజనేయుడు తట్టుకొన్నాడు. తాను గట్టిగా అర చేత రావణుని కొట్టాడు. ఆ దెబ్బకు అంతటి రావణుడు భూకంపానికి పర్వతం చలించినట్లు కంపించిపోయాడట 'లెస్స ! వానరవీరా ! లెస్స ! నా శత్రువైన నీవు పరాక్రమంలో ప్రశంసింపదగినవాడివి అని మెచ్చుకొన్నాడు రావణుడు అందుకు

ఆంజనేయుని సమాధానం 'ఛీ ! నా బలమెందుకు ? ఇంకా నీవు బ్రదికే ఉన్నావు' అని.

మరొకసారి యుద్ధరంగంలో మూర్ఛిల్లిన లక్ష్మణుని ఎత్తుకొని పోవటానికి రావణుడు ప్రయత్నించాడు. అప్పుడు గూడ ఆంజనేయుడు అడ్డు తగిలాడు పిడికిటి పోటున రావణుని రొమ్మున గ్రుమ్మాడు ఆ దెబ్బకు అంతటి రావణుడు తూలి మోకాళ్ళన నేలబడి నోట, ముక్కున నెత్తురు గ్రక్కాడట. మూర్ఛపోయ్యాడట. ఆంజనేయుని శక్తిసామర్థ్యాలట్టివి !

కాగా ఆంజనేయుని శక్తిసామర్థ్యాలను గూర్చి యుద్ధభూమిలో జాంబవంతుడన్న వాక్యాలు స్మరించదగినవి. ఆనాడు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రప్రభావానికి సర్వ వానర సైన్యమేగాదు — రామలక్ష్మణులు గూడ మూర్ఛపోయారు. అది అర్ధరాత్రి కన్ను కన్పించని కటిక చీకటి. యుద్ధభూమి మహాబీభత్సంగా ఉంది. భయానకంగా ఉంది. వానరవీరులు చేతులు విరిగి, తోకలు తునిగి, తలలు తెగి నెత్తుటి బురదలో తేలాడుతున్నారు. ఎటు చూచినా మూలుగులు; ఏడ్పులు; నిట్టూర్పులు. ఆవాతావరణంలో ఆంజనేయ విభీషణులిద్దరు కొరివికట్టెలు చేతబట్టుకొని కొన ఊపిరితో ఉన్న వానరవీరులను పరామర్శిస్తూ చివరకు జాంబవంతుని చేరుకొన్నారట. జాంబవంతుడు అసలే వృద్ధుడు. పైగా అప్పుడు శస్త్రాస్త్ర పీడితుడు. అందుచేత ఆరిపోవనున్న అగ్నిలా ఉన్నాడట. జాంబవంతుడు చెంతచేరిన విభీషణుని గొంతుగుర్తు పట్టాడు వెంటనే ఆంజనేయుడు బ్రదికి ఉన్నాడా ? అని అడిగాడు ఆమాటకు విభీషణుడు ఆశ్చర్యపోయాడు. జాంబవంతా ! నీవు అంగద సుగ్రీవాదులను గూర్చి అడుగలేదు. కడకు రామలక్ష్మణులను గూర్చి గూడ అడుగలేదు. ఆంజనేయుని గూర్చి మాత్రమే ఎందుకు అడుగుతున్నావని విభీషణుడన్నాడు. అందుకు జాంబవంతుడు చెప్పిన సమాధానమిది — 'హనుమంతుడు ఒక్కడు బ్రదికి ఉంటే చాలు — సర్వవానరసైన్యం హతమైనా అంతా జీవించి ఉన్నట్లే. ఒక్క హనుమంతుడు హతుడైతే చాలు ఎంత మంది జీవించిఉన్నా అంతా హతులైనట్లే హనుమంతుడు బలంలో వాయుదేవుడు. పరాక్రమంలా అగ్నిదేవుడు. అతడు బ్రతకాలి. అతడు బ్రతికి ఉంటేగాని మాకు బ్రతుకు మీద ఆశ ఉండదు.' ఇదుగో హనుమంతుడు ప్రక్కనే ఉన్నాడని విభీషణుడన్నాడు. ఆ మాట వినేసరికి జాంబవంతుడు పునర్జన్మ పొందినట్లు పొంగిపొయ్యాడట. వయోవృద్ధు, జ్ఞానవృద్ధు అయిన జాంబవంతుని వాక్యాలు ఆంజనేయుని శక్తి సామర్థ్యాలకు సరియైన తూకపురాళ్ళు.

ఆంజనేయుని బలశౌర్యాలను, పాండిత్యపరాక్రమాలను, ధైర్యస్థైర్యాలను, తేజో వినయాలను సీతాదేవిగూడ చాలసార్లు ప్రశంసించటం జరిగింది.

అయితే దేహబలం ఎంతటన్నా బుద్ధిబలంలేనిదే అది సార్థకంగాలేదు. బుద్ధి బలంతోగూడిన దేహబలమే సర్వకార్య సాధనకు ఉత్తమఉపకరణం. కాగా విజ్ఞులను మొదట ఆకర్షించేది వ్యక్తి బుద్ధిబలమే. బుద్ధిబలంచాలవరకు పుట్టుకతో వస్తుంది. భగవద్దత్తమైన ఈ బుద్ధిబలానికి పదును పెట్టేది పాండిత్యం. పుష్టినిచ్చేది పాండిత్యం. ఒక వ్యక్తికి బుద్ధిబలం, పాండిత్యం ఎంత ఉన్నా వాక్చాతుర్యం లేకుంటే అవి రాణించలేవు.

ఆంజనేయునిలో మొట్టమొదట ఆ రామచంద్రుణ్ణి ఆకర్షించింది ఆయనబుద్ధి బలం; వేదపాండిత్యం: అన్నింటిని మించి ఆయన మృదుమధుర సంభాషణ చాతుర్యం. ఆనాడు ఆంజనేయుడు ఋశ్యమూకాన్ని దిగి సుగ్రీవుని దూతగా శ్రీరాముని దగ్గరకు వచ్చాడు. వానరరూపం వదలి భిక్షుకరూపంలో వచ్చాడు. వచ్చివారికి నమస్కరించాడు. మీరు రాజర్షులన్నాడు. దేవతుల్యులన్నాడు. తాపసవరులన్నాడు. వ్రతదీక్షితులన్నాడు. స్నిగ్ధ స్వరూపులన్నాడు. ఇచ్చటికి ఎందుకు వచ్చారన్నాడు. హస్తిహస్తాలవంటి మీ బాహువులు చూచి వన్యమృగాలు బెదురుతున్నాయన్నాడు. ఇంద్రధనుస్సుల వంటి కోదండాలు ధరించి వృషభరాజాల్లా ఈ వనభూమిలో చరించే మీరెవ్వరన్నాడు. మీ దేహకాంతి ఈ ఋశ్యమూకమంతా ప్రకాశిస్తున్నదన్నాడు. ఈ సర్వ[illegible]ర్వంసహాచక్రాన్ని పాలింపదగిన మీరు జటాధారులై అడవికెందుకు వచ్చారన్నాడు. ఎంతచూచినా మీరు పలుకరే ! అన్నాడు. ఏదో పన్నీరు చిలికినట్లు ప్రశ్నించాడు. రామలక్ష్మణుల రూపరేఖా విలాసాలను రసవంతంగా వర్ణించాడు. వారి తేజోబలాలను విశేషంగా ప్రశంసించాడు. ఆ అపరిచితుల మనస్సులను మొదట ప్రసన్నం చేసుకొన్నాడు. తరువాత తాను సుగ్రీవుని దూతనన్నాడు. ధర్మాత్ముడైన ఆ సుగ్రీవుడు సఖ్యాన్నిగోరి మీ వద్దకు నన్ను పంపాడన్నాడు. చేతులుకట్టుకొని శిరస్సువంచి నిలిచాడు.

హనుమ మాట్లాడుతున్నంతసేపూ శ్రీరాముడు ఆయనమాటతీరును, ముఖకవళికలను అట్టె చూస్తూ నిలబడ్డాడు. ఏదో అనుబంధం, ఎంతో ఆత్మీయత ఎక్కడినుండో వెతుక్కుంటూ వచ్చినట్లుంది. వెన్నెల వర్షించి నట్లుంది. ఆశ చిగురించినట్లుంది. మనస్సెంతో హాయిగాఉంది. శ్రీరాముని హృదయంలో ఆనందం వెల్లివిరిసింది. ఆయన ప్రక్కనున్న లక్ష్మణునివైపు తిరిగి 'లక్ష్మణా ! వేదత్రయ విశార

దునికి గాని, వ్యాకరణవిద్యాపారంగతునికి గాని ఇంత పాండిత్యస్ఫోరకంగా, ఇంత అపశబ్దరహితంగా మాట్లాడటం సాధ్యంగాదు. హనుమ మాట్లాడుతూ ఉంటే ఆయన ముఖంలోగాని, కళ్ళల్లోగాని, లలాటంలోగాని, కనుబొమల్లోగాని, తక్కిన అవయవాల్లోగాని ఏమాత్రం దోషం అగుపించలేదు. ఆయనమాటతీరులో వెగటు గొలిపే వేగంగాని, విసుపు కొలిపే మాంద్యం గాని లేవు. విశేషించి మాటమాటలో సంస్కారం ఉట్టిపడుతున్నది. స్వరం మనోహరంగా ఉంది చమత్కారంగా ఉంది. ఆహా! ఇలాంటి దూతగల ప్రభువుదే గదా కార్యసిద్ధి' అన్నాడు. హనుమ బుద్ధిబలాన్ని మాటనేర్పును మనసారా మెచ్చుకొన్నాడు. ఆనందంగా ఆయన ముఖంలోకి ఒక్కసారి చూచాడు.

ఆంజనేయుని బుద్ధిబలం, మాటనేర్పు ప్రకటమైన మరోఘట్టం విభీషణ శరణాగతి. అది సాగరతీరంలో శ్రీరాముడు సర్వవానరసైన్యంతో రావణుని మీదికి యుద్ధానికి సన్నద్ధమవుతున్న సమయం. అప్పుడు వచ్చాడు శరణార్థి విభీషణుడు; శత్రురాజు తమ్ముడు. శరణన్నాడు గదా అని ఆ శత్రురాజు తమ్ముణ్ణి చేరదీయటం ఏలాగ? శత్రురాజు తమ్ముడు గదా అని శరణన్న వానిని తిరస్కరించటం ఏలాగ? ఇదీ సమస్య. శ్రీరాముడు వానరముఖ్యుల అభిప్రాయాలు అడిగాడు. సుగ్రీవ, అంగద, జాంబవంతాది వీరులందరు విభీషణుని చిత్తశుద్ధిని శంకించారు. శిక్షించాలని సలహా చెప్పారు. చివరకు శ్రీరాముడు హనుమ అభిప్రాయం అడిగాడు. హనుమ 'శ్రీరామా! నీకు చెప్పగల వారెవ్వరని ఆరంభించాడు. బుద్ధిలో నీవు బృహస్పతివన్నాడు. నా తర్కబలం చూపటానికి గాని, గొప్పతనాన్ని కాంక్షించిగాని, ఏదో ప్రయోజనాన్ని ఆశించిగాని నేను చెప్పటం లేదన్నాడు.' నీవు నాపట్ల చూపిన గౌరవానికి సమాధానంగా నాకు తోచిన మాటచెప్తానన్నాడు. తనకంటె పెద్దలైన సుగ్రీవ జాంబవంతాదుల అభిప్రాయాలను మెత్తగా కత్తిరించాడు. విభీషణుని రాకలో, అతని ముఖవైఖరిలో, మాటతీరులో ఏ దురుద్దేశము తనకు అగుపించటం లేదన్నాడు. 'నీ రావణ సంహారప్రయత్నాన్ని, నీవు ఇదివరకు వాలిని చంపి కిష్కింధారాజ్యాన్ని సుగ్రీవుని కిచ్చిన విషయాన్ని తెలుసుకొని, రావణుని దురాచారాన్ని నిరసించి, అతని అంతాన్ని ఊహించి, లంకారాజ్యాన్ని ఆశించి అతడు నిన్ను శరణు వేడటానికి వచ్చాడన్నాడు. అందుచేత అతనిని గ్రహింపవచ్చునన్నాడు. మీరు మహామతిమంతులు. మీద మీ యిష్టం. అన్నాడు నిదానంగా, అర్థవంతంగా, మృదుమధురంగా, ముక్తసరిగా, హృదయానికి హత్తుకునేలా తాను చెప్పదలచుకొన్నది

సామాన్యంగా ఏ కార్యసాధనగూడ సరళరేఖవలె సాగిపోదు. ఎన్నో వంపులు కొన్నిచోట్ల కత్తిరింపులు దానికి తప్పవు. అందుచేత వంపుల్లో వెనుకబడకుండ, కత్తిరింపుల్లో త్రెంచబడకుండ కార్యసాధన కొనసాగాలంటే శక్తి ఒక్కటే చాలదు. దానికితోడు ఉపాయజ్ఞత గూడ ఉండాలి. దేహశక్తిని ఎక్కువ ప్రయోజనకరంగా చేసేది ఉపాయజ్ఞతే. కొండకు తలమోటించి తల బ్రద్దలు కొట్టుకొనే మూర్ఖశక్తికంటె సమయానుకూలంగా ప్రక్కకు తిరిగిపోగల ఉపాయజ్ఞతే ఎక్కువ ఉపయోగకరం. ఈ ఉపాయజ్ఞతనే వివేకం అనవచ్చు. యుక్తిఅనవచ్చు. ఇది వ్యక్తియొక్క బుద్ధిబలంలో భాగమే.

సముద్రలంఘన సమయంలో హనుమంతుని శక్తిసామర్థ్యాలను పరిశీలించడానికి దేవతలు, గంధర్వులు, మహర్షులు సురసను ప్రయోగించారు. సురస దక్షపుత్రి. ఆమె రాక్షస రూపం ధరించింది. హనుమంతుణ్ణి మార్గమధ్యంలో అడ్డుకొన్నది. మ్రింగజూచింది. హనుమంతుడు రామకార్యార్థినై లంకకు వెళ్ళుతున్నానన్నాడు తరువాతవచ్చి నీకు ఆహారం అవుతానన్నాడు నన్ను విడువుమన్నాడు. సురస సేమిరా కాదన్నది నానోట పడకుండ తప్పించుకోవటం నీకు సాధ్యంగాదన్నది. అది బ్రహ్మవరమన్నది. పెద్దపెట్టున నోరు తెరిచింది. హనుమంతుడు మేనుపెంచాడు. సురస మరీ నోరు పెంచింది. హనుమ హఠాత్తుగా అంగుష్ఠమాత్రుడయ్యాడు. సురసనోట ప్రవేశించాడు. వెంటనే వెలుపలికి వచ్చాడు. చేతులెత్తి నమస్కరించాడు. దక్షపుత్రీ! నీనోట ప్రవేశించాను. బ్రహ్మవరం సత్యమైంది. ఇక సీతాన్వేషణకు వెళ్ళివస్తా. సెలవు అని బయలుదేరాడు. హనుమంతుని ఉపాయజ్ఞతకు సురస ఆశ్చర్యపోయింది ఆశీర్వదించి పంపింది.

సింహిక ఒక చిత్రమైన రాక్షసి. అది నీడను బట్టి ప్రాణులను లాగుతుంది. మ్రింగుతుంది. హనుమంతుణ్ణి గూడ అలాగే తనవైపు లాగింది నోరు తెరిచింది. హనుమంతుడు ఎప్పుడో సుగ్రీవుడు చెప్పగా విన్నాడు ఆ ఛాయాగ్రాహి, ప్రమాదకరప్రాణి, వింతజంతువు ఇదే అని తక్షణం గ్రహించాడు. వెంటనే మేనుపెంచాడు. సింహిక గూడ నోరుపెంచింది. హనుమంతుడు లోనికి చూచాడు ఆమె ఆయువుపట్లన్నింటినీ వాడిగోళ్ళతో చీల్చి వెంటనే పైకెగిరి బయటికి వచ్చాడు. సింహిక చచ్చింది. వాల్మీకి గూడ హనుమంతుని ఉపాయజ్ఞతకు ముగ్ధుడైనట్లుంది. 'మతిమాన్ కపిః' అని మనసార మెచ్చుకొన్నాడు.

సింహికను గూడ సంహరించాను గదా అని ఆనందోత్సాహంతో హను మంతుడు అనాలోచితంగా లంకలో ప్రవేశించి ఉంటే రామకార్యం భగ్నమయ్యేది. లంక శత్రునగరం. పైగా దుర్భేద్యనగరం. ఆహోరాత్రాలు కండ్లలో వత్తులు వేసు కొని రాక్షసులు దాన్ని కాపాడుతుంటారు. అందుచేత అనాలోచితంగా అడుగు వేస్తే అతడు పట్టుబడే ప్రమాదముంది. హనుమంతుడు ఆలోచించాడు. ముందుగానే ఏ ద్వారం గుండా, ఏసమయంలో ఆనగరంలో ప్రవేశించాలో నిర్ణయించాడు. జీవుడు స్థూలదేహాన్ని వదలి సూక్ష్మరూపమైన ఆత్మస్థితిని పొందినట్లు పిల్లివంటి చిన్నదైన రూపంలో, రాత్రివేళ, ఆ ద్వారం గుండా, హనుమ ఎడమకాలు ముందుమోపి ఆ శత్రు నగరాన్ని ప్రవేశించాడట. ఎదిరించిన లంకాధిదేవతను గూడ జయించాడట. హనుమలంకలో ఎడమకాలు మోపటం లంకాధిపతితలను ఎడమకాలితో తన్నటమే అతని పతనానికి పునాదివేయటమే.

సముద్రలంఘనం, లంకాప్రవేశం ఆంజనేయుని ఘన కార్యాలుగా అనేకులు ప్రశంసిస్తారు. అవి ఘనకార్యాలే. కాదని కాదు. నిజానికి అంతకంటె ఘన కార్యాలు—తాను మున్నెన్నడు చూడని ఒక స్త్రీమూర్తిని అంతశ్శత్రుపురమధ్యంలో అన్యులెవ్వరు చూడకుండ అల్పవ్యవధిలో వెదకి చూడటం. రాక్షసాంగనలతో విసిగి విసిగి సాక్షాత్తు శ్రీరామచంద్రుడే వచ్చినా శంకించే స్థితిలో ఉన్న సీతకు తగిన రూపంలో, తగిన సమయంలో కన్పించి, తగినవిధంగా మాట్లాడి తాను రామ దూతనన్న నమ్మకం కలిగించటం. ఏకాకియై కూడ శత్రుబలం యొక్క శక్తి సామర్థ్యాలను పరీక్షించటానికి, రామబలం ఏ పాటితో రాక్షసులకు రుచి చూపించ టానికి అశోకవనధ్వంసాన్ని, లంకానగర దహనాన్ని విజయవంతంగా ఆచరించి తిరిగి రావటం.

ఆంజనేయుడు అర్ధరాత్రివేళ రావణాంతఃపురంలో ఎందరో సుందరాంగనలను చూశాడు. వారి రూపురేఖావిలాసాలను, వారున్న పరిసరాలను, వారు నిద్రించే వాల కాలను పరిశీలించి, ఎంతో నిపుణంగా తర్కించి వారిలో సీతాదేవి లేదని తేల్చు కొన్నాడు. ఒక్క మందోదరీ విషయంలోనే ఒకింత భ్రమకులోనయ్యాడు. చివ రకు ఆమెకూడ సీతగాదని అనుకొన్నాడు అశోకవనికి వెళ్ళాడు. సీతను కను గొన్నాడు. కొండంత సంతోషంతో గంతులు వేశాడు. అయినా తొందరపడ

లేదు. సీత ఎక్కడికి పోలేదు. ఒక చెట్టు కొమ్మమీద చేరాడు. ఆకులమాటున దాగాడు. రావణుడు, రాక్షసస్త్రీలు సీతాదేవిని ఎలా బాధిస్తున్నారో చూచాడు. రావణుని కామప్రలాపాలను, రాక్షసస్త్రీల బెదిరింపులను, త్రిజటా స్వప్నవిశేషాలను వివరంగా విన్నాడు. అంతలో సీత శింశుపావృక్షం క్రిందికి వచ్చింది. ఆ చెట్టు కొమ్మను పట్టుకొన్నది. మెడకు ఉరి బిగించుకొన్నది. ఆత్మహత్యకు పూనుకొన్నది. ఆంజనేయుడు తాను అగుపడటానికి ఇదే సమయమనుకొన్నాడు. అయినా తొందరపడి క్రిందికి దూకలేదు. సీతకు ఏ రూపంలో కన్పించాలో, ఏ భాషలో మాట్లాడాలో ఆలోచించాడు. సంస్కృతంలో మాట్లాడితే ఆమె శంకిస్తుందనుకొన్నాడు. సామాన్య మానవభాషే మంచిదనుకొన్నాడు. అయినా కోతి తన ముందుకు వచ్చి మనుష్యభాషలో మాట్లాడితే ఆమెభయపడి అరుస్తుందేమో ? ఆమె అరిస్తే రాక్షసులంతా చుట్టుముట్టుతారు చంపే ప్రయత్నం చేస్తారు. వచ్చినపని చెడిపోతుంది. పనికిమాలిన యుద్ధం ప్రాప్తిస్తుంది. అందుచేత హనుమ తొందరపడలేదు. చెట్టుదిగలేదు. పైనుంచే రామకీర్తన చేశాడు. సీతకు ఆసక్తి కలిగించాడు. ఆమెను రావణుడు అపహరించింది మొదలు తాను వెదకటానికి వచ్చేదాకా జరిగిన వృత్తాంతమంతా వినిపించాడు. ఆమెకు ఆనందం కలిగించాడు. సీత తలయెత్తి మీదికి చూచింది. తెల్లనిమబ్బు పింజెలా అప్పుడు హనుమ అగుపించాడు. హనుమను చూచిన సీత ఆశ్చర్యపడింది. అనుమానించింది కూడ అయితే ఆలోచించింది. లంకలో రామస్మరణమా ? ఇది నిజమా ? స్వప్నమా ? సీతకు అంతా అయోమయంగా ఉంది. నాకు స్వప్నం శుభదం. అందుకు ఆమె మనస్సు కుంచించుకొంది. అయినా రాముని గూర్చి తాను విన్నమాటలు నిజమయ్యేలా చూడండని దేవతలకు చేతులెత్తి మ్రొక్కింది అప్పుడు దిగాడు హనుమంతుడు. సీతకు నమస్కరించాడు. రామవృత్తాంతం వినిపించాడు. ఆమె అడిగిన వివరాలన్నీ పొల్లుపోకుండా వివరించాడు. సీతారాముల అంతరంగిక విషయాలను కూడ ప్రస్తావించాడు. ఆమెకు తనమీద నమ్మకం కలిగించాడు. తాను రామదూతనని చెప్పాడు. ఆమె దుఃఖాన్ని తొలగించాడు. ఎంతో ఊరడించాడు. అగ్నిదేవుడు హవిస్సును గొనిపోయి దేవేంద్రుని కిచ్చినట్లు తాను సీతను గొనిపోయి శ్రీరాముని కిస్తానన్నాడు. తన మూపును వంచాడు. ఆమెను కూర్చొమ్మని బ్రతిమాలాడు.

‘చిన్నకోతివి నన్నెట్లా తీసుకుపోగలవని’ అన్నది సీత. ఆమె మాటకు హనుమ నవ్వాడు. మేను పెంచాడు. మేరుమంధరపర్వత సమానుడయ్యాడు. అగ్ని హోత్రునిలా ప్రకాశించాడు. ఆమెకు నమ్మకం కలిగించాడు. ఆనందాన్నికూర్చాడు. ఆ రామచంద్రునికి ఏదైనా ఆనవాలిమ్మన్నాడు. చూడామణిని స్వీకరించి ఎంతో అంతరంగికమైన వాయసవృత్తాంతాన్ని గూడ విని సీతకు నమస్కరించి, బయలు దేరాడు.

అయినా అంజనేయునికి తృప్తి కలుగలేదు. తాను చేయవలసింది ఇంకా ఏదో ఉందని అనిపించింది. ఇంతదూరం వచ్చి రావణుని చూడకుండ, రాక్షస వీరుల బలం తెలుసుకోకుండా, వనబలం, ఏపాటిదో ఆ రావణునికి తెలియజేయ కుండా వెళ్ళటం ఏ మాత్రం బాగుండదనుకొన్నాడు. పరిశీలించి రావణుని హృదయం తెలుసుకోవాలనుకొన్నాడు. అందుకు మార్గం? రావణుడు రాక్షసుడు. సామో పాయానికి సమాధానం చెప్పడు. పైగా లంకేశ్వరుడు. దానోపాయానికి లొంగడు విశేషించి బలగర్వితుడు. అందుచేత భేదోపాయం పనిచెయ్యదు. ఇకమిగిలింది పరాక్రమోపాయమే. అదే రావణునిపట్ల బాగా పనిచేస్తుందని హనుమ అను కొన్నాడు. అతనికి ప్రియమైన ఆ అశోకవనాన్ని ధ్వంసం చేస్తే ఆగ్రహించి అతడు తనమీదికి సైన్యం పంపుతాడని అనుకొన్నాడు. అప్పుడు తనసంకల్పం సిద్ధిస్తుందని ఆలోచించాడు. అశోకవనధ్వంసం ఆరంభించాడు. అక్కడున్న కావలివారిని కొట్టాడు. రావణుడు పంపిన సైన్యాన్ని హతమార్చాడు. చైత్య ప్రాసాదాన్ని గూడ బ్రద్దలుకొట్టాడు. రాక్షసవీరులకు వానరబలం వివరించాడు. రామ ప్రభావం శ్లాఘించాడు. జంబుమాలిని సంహరించాడు. రాక్షసయోధులను హతమార్చాడు. అక్షకుమారుని గూడ అంతమొందించాడు రావణునికి పుత్రశోకం కలిగించాడు. చిట్టచివరకు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రానికి బద్ధుడై అనుకొన్నట్లే ఆ రావణసభకు వెళ్ళి దేదీప్యమానంగా వెలిగే ఆ రాక్షసేశ్వరుని దర్శించాడు. అతని రూపాన్ని, ధైర్యాన్ని, బలాన్ని, తేజాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు. అనర్థమే చేయకుంటే రావణుడు అసురలోకానికేగాదు_అమరలోకానికి గూడ అధిపతి కాదగిన వాడని అనుకొన్నాడు. తనవృత్తాంతం అంతా రావణునికి చెప్పాడు. అశోక వనాన్ని ధ్వంసం చేసింది, బ్రహ్మాస్త్రానికి బద్ధుడినై వెంటవచ్చింది నీ దర్శనం

కోసమే అని అతనితో అన్నాడు. రామవృత్తాంతం వినిపించాడు. సీతను ఆయనకు అప్పగించటం నీకు నీ ప్రజలకు శ్రేయస్కరమన్నాడు. రాముని బలపరాక్రమాలు వర్ణించాడు. రానున్న ప్రమాదాన్ని సూచించాడు అందుకు రావణుడు ఆగ్రహించి. తోకకు నిప్పంటిస్తే హనుమ లంకనంతా కాల్చాడు. తనదెబ్బ చూపించాడు. ఆవేశంతో జరిపిన ఆ లంకాదహనంలో సీతకు ప్రమాదం జరిగిదేమో అని చింతించాడు. ఒక్కవరుగున అశోకవనం వచ్చాడు. సీత సురక్షితంగా ఉండటం చూచి సంతోషంతో గంతులు వేశాడు. ఆమె దగ్గర సెలవు తీసుకుని, అరిష్ట పర్వతం అధిరోహించి, మేనుపెంచి సముద్రం దాటాడు. తోడి వానరులతో కలిసి శ్రీరాముని చెంతకు చేరాడు. సీతావృత్తాంతం వినిపించాడు. అందరిని సంతోషింపచేశాడు.

ఆంజనేయునిలో సముద్రాన్ని లంఘించగల శక్తిసామర్థ్యాలతోపాటు, అవరోధాలను దాటగల ఉపాయజ్ఞత ఉండటట్టే సీతను చూడగలిగాడు. అనుకొన్న దాని కంటె అధికంగా విజయం సాధించాడు. సీతను చూచిరమ్మంటే లంకనే కాల్చి వచ్చాడు.

కానా, కేవలం శారీరికబలం, బుద్ధిబలం ఉన్నంతమాత్రాన ఒక వ్యక్తి జీవితంలో ఉన్నతస్థాయి నందుకోలేడు. ఉత్తమదూత కాలేడు. పల్లంవైపు ప్రవహించటం నీటికెంత సహజమో స్వార్థం వైపు మొగ్గటం శక్తి యుక్తుల కంత సహజం. మితిమీరిన స్వార్థం సమాజానికి ప్రమాదకరం. వ్యక్తికి పతనకారణం అందుచేత ఒక వ్యక్తిశక్తియుక్తులు సద్వినియోగం కావాలంటే, అవి అతని ఉన్నతికి, సమాజకల్యాణానికి దోహదం చెయ్యాలంటే భక్తిగూడ ఉండాలి. భక్తి అంటే పువ్వులు, పండ్లు పెట్టి కొబ్బరికాయలు కొట్టటంగాదు. కుంకుమబొట్లు, విభూతిరేఖలు ధరించటంగాదు. భక్తి-హృదయపవిత్రత; ఆశయశుద్ధి; ఆత్మార్పణ.

ఆంజనేయుడు రామభక్తుడు. మహాభక్తుడు. ఆరాముని చూచింది. మొదలు ఆంజనేయుని అంతరంగం భక్తిభావంతో నిండిపోయింది. కాలం గడిచేకొద్దీ అది అపారంగా పెరిగింది. రామశబ్దం విన్నా, రామనామం అన్నా అమహాభక్తుని లోని అణువణువు పులకించేది. పరవశతనొందేది. ఆంజనేయుడు ఒక సుగుణాభిరామునికి ఒక ధర్మమూర్తికి, ఒక పురుషోత్తమునికి తన అంతరంగం అర్పణ చేసుకున్నాడు. ఒక మహాకార్యానికి తనశక్తి యుక్తుల్ని వినియోగించాడు. జీవితాన్నే చరితార్థం చేసుకొన్నాడు.

యుద్ధరంగంలో రావణుని ఎదుర్కొనటానికి లక్ష్మణుడు సిద్ధమౌతుంటే 'సేవకుడుండగా మీకీ శ్రమ ఎందుకని ఆంజనేయుని భక్తి ఆ రామానుజుని వారించింది. రాము డెందుకు నడిచి రావణునితో తలపడింది. రథస్థుడైన రావణునితో భూమిస్థుడై యుద్ధంచేసే శ్రీరాముణ్ణి చూసి ఆంజనేయుని భక్తి భుజంవంచి తన్నధిరోహించమని అర్థించింది. మూర్ఛితుడైన లక్ష్మణుని ఎత్తుకొనిపోవటానికి ప్రయత్నించి అంతటి రావణుని బాహుబలం విఫలమైతే ఆంజనేయుని భక్తి అవలీలగా లక్ష్మణుని చేతులతో పైకెత్తింది. శ్రీరాముని చెంతకుచేర్చింది అందుకే భగవంతుడు భక్తపరాధీనుడంటారేమొ.

రామాయణంలో రామకార్య నిపుణుడైన ఆంజనేయుడు ఎన్నో అద్భుత విజయాలు సాధించాడు. ఎందరికో ప్రాణదాతగా ఉపకరించాడు. సముద్రాన్ని లంఘించి ప్రాయోపవేశానికి పూనుకున్న అంగదజాంబవంతాది వానరవీరుల ప్రాణాలు నిలిపింది ఆంజనేయుడు. అశోకవనిలో ఆత్మహత్యకు పూనుకున్న సీతాదేవికి ఆశాకిరణంగా అగుపించి ఆమెను బ్రతికించింది ఆంజనేయుడు. విరహతాపంతో వాడిపోతున్న శ్రీరామునికి సీతాసందేశామృతాన్ని అందించింది ఆంజనేయుడు. శక్తివ్రేటుకు మూర్ఛితుడై కొన ఊపిరితో ఉన్నలక్ష్మణునికి సంజీవని తెచ్చియిచ్చి సజీవుణ్ణి చేసింది ఆంజనేయుడు. ఓషధీపర్వతాన్ని తెచ్చి యుద్ధరంగంలో హతమైన సర్వవానరసైన్యాన్ని బ్రతికించింది ఆంజనేయుడు. శృంగిబేర పురంలో శ్రీరామాగమన శుభవార్తను గుహునకు అందించింది ఆంజనేయుడు. అన్నరాక కోసం అహోరాత్రాలు ఎదురుచూచే భరతునికి శ్రీరాముని రాకను చెవినివేసింది కూడ ఆంజనేయుడే. ఈవిధంగా ఆంజనేయుడు ఎందరి ప్రాణాలనో నిలిపాడు. ఎంత మందికో శుభవార్తలందించాడు. సంతోషాన్ని కూర్చాడు.

తత్త్వవేత్తలు ఆంజనేయుని శబ్దస్వరూపుడంటారు: మంత్ర స్వరూపుడంటారు. పరమాత్మ సందేశాన్ని జీవాత్మకందించే దేవదూత అంటారు. మానవుని ఇంద్రియాలు పదింటిని మనస్సు పరిపాలిస్తున్నది. పరమాత్మనుండి వేరైన జీవాత్మ మానవశరీరంలో బంధింపబడిఉంది. దానిచుట్టూ సంసారసాగరం. ఈ స్థితిలో పరమాత్మ సందేశాన్ని జీవాత్మకు అందించి, ఆ సంసారసాగరాన్ని తరించటానికి ఇంద్రియాలతో కూడిన మనస్సును జయించటానికి, జీవాత్మ పరమాత్మతో సంగమించటానికి సాధనభూతుడైన దేవదూత ఆచార్యుడట, అదే రామాయణంలో

హనుమత్తత్వం అట. పదితలల రావణుడు పాలించే మహానగరం

చుట్టూ సముద్రం. శ్రీరాముని సతి వేత్తన సీత ఆ లంకలో బంధింప

ఆజన్మబ్రహ్మచారి అయిన హనుమ సంసారసాగరాన్ని స్పృశించకుం

మార్గంలో అనగా విష్ణుపదమార్గంలో పయనించి శ్రీరామసందేశాన్ని

అందించాడు. సముద్రం దాటడానికి, మనోరూపుడైన లంకేశ్వరుని జయి

జీవాత్మపరమాత్మలైన సీతారాముల పునఃకలయికానికి మార్గాన్ని సిద్ధ

ఇవి నిగూఢాలు, మహోన్నతాలు అయిన తాత్త్వికరహస్యాలు

తపస్సు చేసి దర్శింపదగిన పరమసత్యాలు. కాని సామాన్యమాన

చూచినా ఆంజనేయునిది ఒక విశిష్టవ్యక్తిత్వం. భక్తి, యుక్తి,

మించిన ఒకపవిత్ర త్రివేణీ సంగమతీర్థం. వ్యక్తిత్వానికీ స

నికి దోహదం చేసిన ఒక మహనీయ జీవితమార్గం. అందుచేతనే

అంతప్రశస్తి వచ్చింది. పూజ్యత లభించింది.

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాంవరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి — అనే స్తోత్ర

అక్షరసత్యంగా లోకంలో నిలిచింది.

# కుంభకర్ణుడు

కుంభకర్ణుడనగానే గుర్తువచ్చేది గాఢనిద్ర. గాఢనిద్ర కతడు పర్యాయ పదంగా నిలిచిపోయాడు. ఏ ప్రాణికైనా గాఢనిద్ర గొప్ప వరమే. అది లేకుంటే ప్రాణిజీవితం అతిభయంకరం; బాధాకరం. అయితే అతినిద్ర వ్యక్తి జీవితాన్ని వ్యర్థం చేస్తుంది. కాని లోకకంటకుల నిద్ర లోకానికే గొప్పరక్ష. ప్రాణిని పాషాణంగా మార్చివేస్తుంది.

రావణుని తమ్ముడుగా కుంభకర్ణుడు కైకసీ విశ్రవసులకు జన్మించాడు. పుట్టుకతోనే అతడు పెద్ద బలవంతుడు. మహాకాయుడు. దీర్ఘదేహుడు. వికృత రూపుడు. క్రూరస్వభావుడు.

కుంభకర్ణుడు ప్రజలను భక్షించాడు. ఋషులను హింసించాడు. దేవతలను బాధించాడు. పరస్త్రీలను బలాత్కారించినాడు. అందుకు ఆగ్రహోదగ్రుడై అమరేంద్రుడు వజ్రాయుధం విసిరితే, ఐరావత దంతాన్ని పెరికి అతని వక్షస్థలం మీదనే కొట్టాడు. కుంభకర్ణుడు లోకకంటకుడయ్యాడు. కొరకరాని కొయ్యగా తయారయ్యాడు.

దేవతలు, దేవేంద్రుడు అతని దెబ్బకు భయపడ్డారు. విష్ణుతో కలిసి బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళారు. కుంభకర్ణుని ఆట కట్టించమని అర్థించారు. అందుకు బ్రహ్మదేవుడు అంగీకరించి, కుంభకర్ణుని పిలిచి మొదట కొనియాడి, ఆ తరువాత వచ్చినట్లుపడి నిద్రించమని శపించాడు. అప్పటినుంచి కుంభకర్ణుడు పడి నిద్రపోయాడు. అదిచూచి రావణుడు ఆందోళన పడ్డాడు. బ్రహ్మకు ప్రణమిల్లి కుంభకర్ణుని నిద్రకు, అతని మెలకువకు కాలపరిమితి విధించమని అర్థించాడు. ఆరు మాసాలు వరుసగా అతడు నిద్రిస్తాడని, ఆ తరువాత ఒకరోజు లేస్తాడని, ఆకలితో అగ్నిహోత్రునిలా నోరు తెరుస్తాడని బ్రహ్మదేవుడు నిర్ణయించాడు.

ఇది కుంభకర్ణుని నిద్రకథ. అయితే అతని నిద్రకు మరోగాథ వుంది. అతడు బ్రహ్మను గురించి ఘోర తపస్సు చేశాడని, బ్రహ్మ అతనికి ప్రత్యక్ష మయ్యే సమయంలో దేవతలు, దేవేంద్రుడు కుంభకర్ణుని క్రూరకృత్యాలు వివరించి, ఆ రాక్షసుని నిద్రాపరవశుని గావించి, లోకాల రక్షించమని అర్థించారని, అందుకు

ఆయన అంగీకరించి సరస్వతీదేవి సాయంతో కుంభకర్ణుని నోట నిద్రావరమిమ్మని అడిగించాడని, అదే అనుగ్రహించి అంతర్ధాన మయ్యాడని ఆ గాథ.

శాపమైనా, వరమైనా మొత్తానికి కుంభకర్ణుని జీవితం గాఢ నిద్రామయ మైంది.

రావణుడతనికి ఒకగొప్పమేడ కట్టించాడు. అందులోనే అతని నిద్ర. అతడు లేవగానే అక్కడి సేవకులు అనేకానేక ఆహారపదార్థాలు సిద్ధంచేస్తారు. రకరకాల మద్యాలు కడవల్లో నింపుతారు. అన్నీ అతడు ఖాళీచేస్తాడు. మళ్ళీ ఆవులించి నిద్రపోతాడు.

ఇది అతని జీవితం.

ఇందువల్ల లోకాలకు మేలే కలిగింది.

అది రావణసభ. రాముడు వానరసేనతో సముద్రం చేరవచ్చాడని తెలిసి రాక్షసేశ్వరుడు ఆ సభ చేశాడు. ఎందరెందరో రాక్షసవీరులు రావణుని బలపరాక్రమాలు ప్రశంసించారు. అతని సీతాపహరణాన్ని శ్లాఘించారు. సమర నిర్వహణ విజయ స్వీకరణ ఒకసమస్య కాదని త్రోసిపుచ్చారు. అప్పుడు కుంభకర్ణుడు లేచాడు.

'రావణా! సీతాపహరణానికి ముందే నీవు మాతో సంప్రతించి ఉంటే బాగుండేది. ఇప్పటి సమాలోచన ఒక విధంగా గతజలసేతు బంధనం. ప్రాజ్ఞుడైన ప్రభువు పని ప్రారంభించటానికి ముందే న్యాయాన్యాయాలు విచారించాలి. లాభనష్టాలు లెక్కించాలి. మంచిచెడ్డలు ఎంచిచూడాలి. అంతేగాని పని ప్రారంభించి పరిస్థితులు విషమించినప్పుడు గాదు. నీవు సీతాపహరణం చేశావు. అందులో ఎంత ప్రమాదం ఇమిడి ఉందో గుర్తించకుండా చేశావు. జరిగినదేదో జరిగిపోయింది. ఇప్పుడు నన్ను యుద్ధానికి పంపు. ఇంద్రసూర్యులనైనా వధించి వస్తా. నీకు విజయం తెస్తా, అలాంటప్పుడు నాకు రామలక్ష్మణులొక లెక్కా! వారినెత్తురు త్రాగి, వానరులనంతా భక్షించివస్తా. నీవు నిశ్చింతగా కాలంగడుపు నిండుగా భోగాలు అనుభవించు' — అన్నాడు అన్నగారి తప్పును మెత్తగా ఎత్తిపొడుస్తూ తన తోడ్పాటును స్పష్టంగా తెలియపరుస్తూ.

కుంభకర్ణుని మాటలు కొన్ని రావణునికి రుచించలేదు. అందుకే మహాపార్శ్వుడు ఆ తరువాత లంకేశ్వరుని ప్రసుతించాడు. ప్రసన్నుని చేశాడు. పాపం!

రాక్షస వానర యుద్ధారంభానికి తొమ్మిది రోజులు ముందే కుంభకర్ణు నిద్రపోయాడు. మధ్యలో అతనిని మేల్కొల్పటం మహాకష్టం.

అనాడు రావణుడు రాముని చేతులో అవమానపడి తిరిగి వచ్చాడు. ఏం చేయ్యాలో దిక్కుతోచక కూర్చున్నాడు. అప్పటికే పేరు మోసిన ధూమ్రాక్ష వజ్రదంష్ట్రి — అకంపన — ప్రహస్త మహావీరులంతా యుద్ధభూమికి బలి అయ్యారు. తగుదునని తాను వెళ్ళాడు. తలవంపులై తిరిగి వచ్చాడు. అనరణ్యుని శాపం, వేదవతి శాపం, నందీశ్వరుని శాపం రంభ శాపం, పుంజికస్థలశాపం అన్నీ ఒక్కసారి అతని మనస్సులో మెదిలాయి. అందువల్ల మళ్ళీయుద్ధానికి వెళ్ళడం మంచిది కాదనుకున్నాడు. ఈలాంటి శాపాలు లేని వాడు కుంభకర్ణుడు. మహా వీరుడు. అయితే అతడు నిద్రపోతున్నాడు. ఇంత జరుగుతుంటే కుంభకర్ణుడు గుఱ్ఱుకొట్టి నిద్రపోవటమా! లేపండని లంకేశ్వరుడు సేవకుల నాదేశించాడు.

అది కుంభకర్ణుని నిద్రాగృహం. అతడొక మహాపర్వతంలా పడి నిద్ర పోతున్నాడు. అతని ఒంటినిండా పొడవైన వెంట్రుకలు. నాసికరంధ్రాల వెంట పెనుతుఫానుల్లాంటి పెద్ద ఊర్పులు. కొండగుహ వంటినోరు. అంతటా పులిసిన రక్తమాంస దుర్గంధం. బంగారు బాహుపురులు. శిరస్సున సువర్ణకిరీటం.

రాక్షసులు ముందుగా నానావిధ మాంసాలు సిద్ధం చేశారు. అనేక మద్యాలు భాండాల్లో నింపారు. ఆ తరువాత కుంభకర్ణుని దేహాన గంధాలు పూశారు. పూల మాలలు వేశారు. గట్టిగా అరిచారు.

అయినా అతడు లేవలేదు.

శంఖాలు పూరించారు. భేరులు వాయించారు. కుంభకర్ణుని పట్టి అటు ఇటు పొరలించారు.

అయినా ప్రయోజనం లేదు.

పిడికిళ్ళతో పొడిచారు. కఱ్ఱలతో కొట్టారు. ఎట్టకేలకు ఏనుగులతో త్రొక్కించారు.

అప్పుడా రాక్షసుడు లేచాడు. పెద్దగా ఆవులించాడు.

అతని నోరు మేరుపర్వత శిఖరాన ఉదయించే అరుణబింబంలా అగుపించిందట. అతని మేను ఆభరణాలతో నిండి మిటకొంగలతో గూడిన వర్షాకాల మేఘంలా ప్రకాశించిందట. అతని కళ్ళు మహాగ్ని గోళాల్లా మెరిశాయట.

మొత్తానికి కుంభకర్ణుడు నిద్రలేచాడు. పేర్చిపెట్టిన మాం
ప్రీతిగా భక్షించాడు. మద్యభాండాలు మొత్తం ఖాళీ చేశాడు. తృప్తిగ
త్రేన్చాడు. అప్పుడు రాక్షసులంతా ఆయన చుట్టూ చేరారు. అం
నిలిచారు.

కుంభకర్ణుడు అందరిని ఒక్కసారి కలయ జూచాడు 'అన్నగా
అన్నాడు. 'ఆయనకేదో భయము కలిగినట్లుందే ! అందుకే నన్ను
నిద్ర లేపారు. ఆయన భయాన్ని తక్షణం తొలగిస్తా. అమరవతి
మహేంద్రుడైనా నాచేత హతం కాక మానడు. అసలు విషయం చెప్పం

అప్పుడు యూపాక్షుడు ముందుకు వచ్చాడు. రాముని పరా
వించాడు. రావణుని భంగపాటు వివరించాడు.

కుంభకర్ణుడు పటపట పండ్లు కొరికాడు ఒక్కసారి
పడ్డట్లుంది. రామలక్ష్మణులను, వానరసేనలను వెంటనే వధిస్తానన్నా
మేఘాలు ఒక్కసారి గర్జించినట్లుంది.

అప్పుడు మహోదరుడు ముందుకు వచ్చాడు. అందరము రా
వెళ్ళదామన్నాడు. ఆయన అభిప్రాయం విని ఆ తరువాత యుద్ధానికి

కుంభకర్ణుడు పడక నుండి పైకి లేచాడు. స్నానం చేశా
అలంకరించుకొన్నాడు. మరొకసారి మద్యం త్రావాడు. అటు

అలవోక మహాపర్వతంలా లంకానగర రాజమార్గాన నడిచి వెళ్ళు
పరవశులైన రాక్షసులు అన్ని వైపుల నుండి చూచారట. మేడల మీది
చల్లారట. చేయెత్తి జయజయ ధ్వానాలు చేశారట. అక్కడక్కడ
వానరులు భయ భ్రాంతులై పరుగెత్తి వెళ్ళారట. ఆ రాక్షసవీరుని
ఆశ్చర్యచకితుడై అతడెవ్వడని విభీషణుని అడిగాడట.

కుంభకర్ణుడు సరాసరి రావణుని అంతఃపురానికి వెళ్ళాడు.

రావణుడు క్రుంగి కూర్చుని ఉన్నాడు. అతని ముఖంలో
నం, ఆవేదన కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి.

కుంభకర్ణుని చూడగానే రావణుడు కొండంత ఆశతో పైకి
మార తమ్ముని కౌగిలించు కొన్నాడు.

తమ్ముడు అన్నపాదాలకు నమస్కరించాడు. ఆయన చూపిన ఆసనం అలంకరించాడు.

'రాక్షసేశ్వరా! ఎందుకు నన్ను నిద్రలేపావు? ఎవరి వల్ల ప్రమాదం వచ్చింది? ఎవరి మరణం మనము ఇప్పుడు కళ్ళారచూడాలి?' అన్నాడు.

రావణుని ముఖం వికసించింది. అతడు రాముని దండయాత్ర సంగతి చెప్పాడు. రాక్షసవీరుల మరణాన్ని వివరించాడు. తనకు, లంకకు ఏర్పడిన ప్రమాదాన్ని ప్రస్తావించాడు. ప్రస్తుత పరిస్థితుల్లో శత్రుసంహారంచేసి ఆ ప్రమాదాన్ని తొలగించగల మహావీరుడివి నీవొక్కడివే అన్నాడు.

అందుకు కుంభకర్ణుడు పకపక నవ్వాడు. 'అన్నా! ఏ ప్రమాదం కలుగుతుందని ఇదివరకు అనుకున్నామో ఇప్పుడదే కలిగింది. పాపాత్ములు నరకఫలం పొందినట్లు సీతాపహరణ ఫలం నీవు శీఘ్రంగానే పొందావు. బలగర్వంతో నీవు సీతాపహరణ పరిణామాలు ఎలా ఉంటాయో ముందుగ ఆలోచించలేదు. మంచి చెడ్డలు గూడ విచారించలేదు. ముందువెనుకలు ఆలోచించకుండా ప్రవర్తించే ప్రభువు న్యాయాన్యాయాలు తెలియవు. దేశకాలవిరుద్ధంగా చేసే పనులు అపవిత్రాలై అపరిశుద్ధులచే వ్రేల్చబడిన హవిస్సుల్లా వ్యర్థమౌతాయి. సచివులతో, స్నేహితులతో చక్కగా సంప్రదించి కార్యాకార్యజ్ఞుడైన ప్రభువే సమర్థుడు. ధర్మార్థకామాలను త్రికాలాల్లో శాస్త్రపద్ధతుల్లో ఆచరించడం ఉత్తమ పురుష లక్షణం. అలా కాక సర్వకాలాల్లో కామాన్నే సేవించటం అధమాధముల స్వభావం. ఆచరణలేని శాస్త్ర విజ్ఞానం అన్ని విధాలవ్యర్థం. ప్రభువు సామదాన భేద దండోపాయాలను గూడ సమయానుకూలంగా ప్రయోగించాలి. హితులెవరో అహితులెవరో జాగ్రత్తగా గుర్తించుకోవాలి. ఎంత అప్రియంగా ఉన్నా హితవాక్యాలను రాజు ఆలకించాలి. ఆచరించాలి.

తమ్ముడు విభీషణుడు చెప్పిందే అన్నివిధాల మనకిప్పుడు హితం. తదనుగుణంగా చెయ్యటమే సర్వవిధాల శ్రేయస్కరం తరువాత నీయిష్టం' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలకు రావణుడు కన్నెఱ్ఱ చేశాడు.

'నీవు నాకంటె చిన్నవాడవు. ఏదో గొప్పగురువులా ఉపదేశిస్తున్నావు. ఈ శాస్త్రచర్చలకు, న్యాయాన్యాయవిచారణకు ఇప్పుడు వ్యవధిలేదు. భ్రాంతివల్లనో

అజ్ఞానం వల్లనో, బలపరాక్రమ గర్వం వల్లనో ఏదో చేసింది చేశాను. జరిగింది జరిగింది. మాటిమాటికి దాన్ని గూర్చి అనుకోవడం అనవసరం. బుద్ధిమంతులు గతాన్ని విచారించరు. వర్తమానకర్తవ్యమే ఆలోచనాంశం. నామీద నీకు ప్రేమ ఉంటే, నీలో పరాక్రమమే ఉంటే, గతంలో నా అక్రమ ప్రవర్తనవల్ల కలిగిన దోషాల్ని నీపరాక్రమంచేత ప్రస్తుతం చక్కదిద్దు. ఆపదలో ఆదుకున్నవాడే ఆప్తుడు' అన్నాడు ఆగ్రహావేశంతో.

కుంభకర్ణుడు రావణుని మనస్సు తెలుసుకొన్నాడు. తదనుగుణంగా 'అన్నా! నేను జీవించి ఉండగా నీకు శత్రువిచారమా! సత్వరం శ్రీరాముని సంహరిస్తాను. నీ చింత తొలగిస్తాను. సోదరుడుగా, ఆప్తబంధువుగా అన్నివేళల నీకు హితం చెప్పటం నావిధి. అందుకే అలా మాట్లాడాను. మనస్సు నొచ్చుకోవద్దు. రామ లక్ష్మణసుగ్రీవులను, వానరసేనలను యుద్ధరంగంలో వధించి నీకు' మనరాక్షసవీరు లకు మహానందం కలిగిస్తాను. నేనుండగా రాముడు నీవైపు తేరిపార జూడగలడా! ఆజ్ఞాపించు. అతనిని అంతం చేసి వస్తాను' అని లేవబోయాడు.

మధ్యలో మహోదరుడు కల్పించుకొని తన మాటలు అనుచితాలని, రావణుని సీతాపహరణ నిర్ణయం సరిఅయినదని, రామలక్ష్మణులు మరణించారని, ఒక మాయోపాయం పన్ని సీతను మోసగించి రావణుడామెను అనుభవింపదగునని అధిక ప్రసంగం చేసేసరికి కుంభకర్ణుడు గట్టిగా అతనిని మందలించాడు. లంకలో ఇంత వినాశం జరగటానికి, రాక్షసేశ్వరునికి ఇంత విపత్తు రావటానికి మీవంటి ఇచ్చకాల మంత్రులే ముఖ్యకారణం మన్నాడు. మీ అందరి తప్పువల్ల వాటిల్లిన మహా ప్రమాదాన్ని వారించటానికే నేనిప్పుడు యుద్ధానికి వెళ్ళుతున్నానని ఒక్క ఊపున పీఠం నుండి పైకి లేచాడు.

తమ్ముని రణోద్వేగాన్ని చూచి రావణుడు మెచ్చుకున్నాడు. ప్రోత్సహించి పోరాటానికి పొమ్మన్నాడు. తన భయాన్ని పోగొట్టమన్నాడు. శత్రువులను సర్వ నాశనం చెయ్యమన్నాడు. బంగారు బాహుపురులను, ఉంగరాలను, ఉత్తమాభర ణాలను ముక్తాహారాలను స్వహస్తాలతో తమ్ముని మేన అలంకరించాడు.

కుంభకర్ణుడు అన్నగారి మాటలకు, ఆయన చూపిన ఆదరాభిమానాలకు అంతకంత పెరిగాడు. బలమైన కవచాన్ని ధరించాడు. భయంకరమైన శూలాన్ని

చేత బట్టాడు. అన్నగారికి ప్రదక్షిణం చేశాడు. పాద నమస్కారం చేశాడు. వికటాట్టహాసం చేసి ఒక్క ఊపున మహోగ్ర సైన్యంతో వానరసేన మీద ఒక మహా పర్వతంలా విరుచుకు పడ్డాడు. శూలం పోటుతో పవనతనయుని మూర్ఛపడగొట్టాడు. ఋషభుని కౌగిట నొక్కి నెత్తురు క్రక్కించాడు. పిడికిటి పోటుతో శరభుని వధించాడు. మోకాటిగ్రుమ్ముతో నీలుని నొప్పించాడు. అరచేతి దెబ్బతో గవాక్షుని బాధించాడు. కాలి తన్నుతో గంధమాదనుని క్రింద పడగొట్టాడు. ఎందరెందరో వానరులను కరకర నమిలి మ్రింగాడు.

విపరీత భయంతో చెల్లాచెదురై పరుగెత్తిన వానరసైన్యాలను సమీకరించటం అంగదునికి పెద్ద కష్టమైంది. గుంపులు గుంపులుగా వానర వీరులు కుంభకర్ణుని మీద ఎక్కారు. గోళ్ళతో రక్కారు. పళ్ళతో కొరికారు. పిడికిళ్ళతో పొడిచారు. అయినా అతనికి చీమలు, దోమలు కుట్టినట్లు కూడలేదు. మీదకెక్కిన వానరులతో ఆ రాక్షసుడు వృక్షమయ మహాపర్వతంలా అగుపించాడట.

అంగదుడు పర్వత శిఖరాన్ని పెకలించి [illegible] కుంభకర్ణుని తలమీద కొట్టాడు. ఆ దెబ్బకతడు పెద్దగా అరచి, శూలాన్ని చేపట్టి అంగదుని మీదికెగిరాడు. అంగదుడు ఆ తాకిడి తప్పించుకొని పిడికిడి పోటుతో కుంభకర్ణుని పొడిచాడు. ఆ దెబ్బకు అతడు మూర్ఛపోయాడు. వెంటనే మూర్ఛదేరి ఎడమచేత అంగదుని పొడిచి అతనిని మూర్ఛపడ గొట్టాడు. ఆ తరువాత శూలంతో సుగ్రీవుని ఎదుర్కొన్నాడు. సుగ్రీవుడు పర్వతశిఖరంతో కుంభకర్ణుని కొట్టాడు. ఆ పర్వత శిఖరం పొడి అయిందిగాని అతనిని పడగొట్టలేదు. కుంభకర్ణుడు మహోగ్రుడై సుగ్రీవుని మీద శూలం విసిరాడు. అది చూచి హనుమంతుడు అడ్డుపడ్డాడు. ఆ శూలాన్ని పట్టుకున్నాడు. మోకాటికానించి ముక్కలుగా విరిచివేశాడు. వానరులు సింహనాదాలు చేశారు. గంతులు వేశారు. తోకలు ఆడించారు.

కుంభకర్ణుడు కుపితుడై కొండ శిఖరంతో సుగ్రీవుని కొట్టాడు. ఆ దెబ్బకు అంతటి సుగ్రీవుడు మూర్ఛపోయాడు. అప్పుడు కుంభకర్ణుడు మేఘాన్ని పెనుగాలి గొనిపోయినట్లు మూర్ఛిల్లిన సుగ్రీవుని మూపున వేసుకొని లంకకు తీసుకుపోయాడు. వానరరాజును మూపున వేసుకొని కుంభకర్ణుడు లంకాపురీరాజమార్గాన మోసుకు వెళ్ళుతుంటే రాక్షసులంతా జయజయనాదాలు చేశారు. పూలుచల్లారు. సుగంధ

జలాలు చిలకరించారు. అవి సోకి సుగ్రీవుడు మూర్ఛదేరాడు. గోళ్ళతో కుంభకర్ణుని చెవులు గీరాడు. పళ్ళతో అతని ముక్కు కొరికాడు. పార్శ్వాలు చీల్చాడు.

కుంభకర్ణుడు ఆ బాధ భరించలేక సుగ్రీవుణ్ణి క్రింద వేశాడు. కాలితో నలగ ద్రొక్కాడు. కాని సుగ్రీవుడు ఎలాగో తప్పించుకొన్నాడు. ఒక్క ఊపున పైకెగిరాడు. ఆ శ్రీరాముని చేరుకొన్నాడు.

కుంభకర్ణుని దేహమంతా గాయాలు. నెత్తుటిధారలు. అతడప్పుడు సెలయేళ్ళతో నిండిన మహాశైలంలా చూపట్టాడు. సంధ్యాకాల మేఘంలా కనిపించాడు. ప్రళయాగ్నిలా విజృంభించాడు. వేలకువేలు వానరులను భక్షింపసాగాడు. గుంపులు గుంపులుగా వానరులను విరిచివేశాడు.

వానరసైన్యం వణికి పోయింది. శ్రీరాముని శరణు జొచ్చింది.

అప్పటికి ఆ రాక్షసుని లక్ష్మణుడు అడ్డుకొన్నాడు. అనేక బాణాలు ప్రయోగించాడు. అయినా కుంభకర్ణుడు అతనిని లెక్కచేయలేదు. సూటిగా శ్రీరాముని మీదికే వచ్చాడు.

శ్రీరాముడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు.

కుంభకర్ణుడు కొండ శిఖరం విసిరాడు. రామ కుంభకర్ణుల రణం తీవ్రమైంది. ఇద్దరు మహావీరులూ ఎంతసేపో యుద్ధం చేశారు. కుంభకర్ణుడు కుడిచేతితో ముద్గరం పట్టుకొన్నాడు. వాయవ్యాస్త్రంతో రాముడు ఆ చెయ్యి ఖండించాడు.

కుంభకర్ణుడు ఎడమచేతిలో ఒక వృక్షం పట్టుకొన్నాడు. ఐంద్రాస్త్రంతో రాముడా ఎడమచెయ్యి ఖండించాడు.

అయినా కుంభకర్ణుడు యుద్ధం మానలేదు. గట్టిగా అరచి రాముని మీద కుప్పించి దూకాడు. రాముడు అర్ధచంద్రాకార బాణాలతో అతని కాళ్ళు రెండూ ఖండించాడు.

మిగిలిన మొండెంతోనే ఆ రాక్షసుడు రాముని మీదికి పొరలివస్తున్నాడు. కొండ గుహలా నోరు తెరిచాడు. మ్రింగబోయాడు.

రాముడు అతని నోటి నిండా బాణాలు కొట్టాడు.

అప్పుడు కుంభకర్ణుడు పెద్దగా మూల్గాడు. మూర్ఛపోయాడు.

రాముడు దివ్యాస్త్రాన్ని వింట సంధించాడు. ఆ దానవవీరుని తల త్రుంచాడు

మణికుండల మండితంబైన ఆ కుంభకర్ణుని తల నేల రాలింది.

రాక్షసులు రోదన ధ్వనులతో లంకను పమిగులెత్తారు. వానరులు విజయో త్సాహంతో సింహనాదాలు చేశారు.

కుంభకర్ణుని జీవితం సమాప్తమైంది.

రామాయణంలో విభీషణుని తరువాత రావణునికి గట్టిగా హితబోధచేసిన వాడు కుంభకర్ణుడు. అయితే అతడు విభీషణునిలా అన్నను వదలలేదు. తాను చెప్పదగింది చెప్పాడు. తుది నిర్ణయాన్ని అన్నకే వదిలాడు. ఆయన ఆజ్ఞను శిర సావహించాడు. అన్నకోసంగా యుద్ధం చేశాడు అసువు లర్పించాడు.

# విభీషణుడు

రామాయణంలో విభీషణునిది వివాదగ్రస్త శీలం. కష్టకాలంలో అతడు స్వార్థబుద్ధితో స్వజనులను వీడి, శత్రుపక్షంచేరి తిన్నయింటికే నిప్పుపెట్టాడని నింది స్తారు కొందరు. కాదు - అన్నగారి దుర్మార్గాన్ని గర్హించి, అతనికి మంచి చెప్పి చెడ్డ అయి, ఆ రాముని మహాత్వాన్ని, రానున్న ప్రమాదాన్ని దర్శించి, అధర్మ పక్షం వీడి, ధర్మపక్షాన్ని స్వీకరించిన పరమధార్మికుడని ప్రశంసిస్తారు మరికొందరు ఆందులో ఏది నిజం ? రెండూ రెండు భిన్నదృక్పథాలు.

జీవితంలో పుట్టుకను బట్టి, ఉనికిని బట్టి, వృత్తిని బట్టి, ఉద్యోగాన్ని బట్టి ఎన్నోధర్మాలు మనిషి చుట్టూ పెనవేసుకొంటాయి. అయితే మనిషి పెరిగేకొందీ అతనిదైన ఒక వ్యక్తిత్వంగూడ పెరుగుతుంది. వ్యక్తిత్వం ప్రధానంగా వ్యక్తి ఆలోచనాక్రమం. ఆలోచనాక్రమమే అతనిని ఇతరులనుండి వేరుచేస్తుంది. అతనిని అతనినిగా చేస్తుంది. దానిమీద జన్మాంతర సంస్కారం, పరిస్థితుల ప్రభావం బాగా పనిచేస్తాయి. వ్యక్తిత్వం పక్వమయ్యే కొందీ స్వపరభేదాన్ని అధిగమించి ఆలోచించ గలిగిన స్థితివ్యక్తి కేర్పడుతుంది. సత్త్వశుద్ధి కలుగుతుంది. ధర్మదృష్టి ప్రబలుతుంది. సత్యదర్శనంసాధ్యమౌతుంది. ఆయాపరిస్థితులను బట్టి ఆత్మీయతలను,

బాంధవ్య బాధ్యతలను, వృత్తి ఉద్యోగ కర్తవ్యాలను గూడ అవలకునెట్టి తాను నమ్మిన ధర్మాన్ని లేదా తాను దర్శించిన సత్యాన్ని అన్నింటి కన్న మిన్నగా ఆరాధించటం, అనుసరించటం జరుగుతుంది. ఒక్కొక్కప్పుడది ఎన్నో అపార్థాలకు, అనర్థాలకు దారితీయవచ్చు, లేక అనేక లాభాలకు అపారకీర్తి ప్రతిష్ఠలకు ఆలవాలంకావచ్చు. అయితే ఆయాసందర్భాల్లో వ్యక్తి ఆలోచన, ప్రవర్తన ధర్మదృష్టి ప్రధానంగాసాగాయా లేకస్వార్థ దృష్టి ప్రధానంగా సాగాయా లేక ఉభయతారకంగా ప్రవర్తిల్లాయా అన్నదేవిచారింప దగిన అంశం.

రామాయణంలో విభీషణుని ఆలోచన, ప్రవర్తన ధర్మదృష్టి ప్రధానంగా ప్రారంభమయ్యాయి. ఉభయతారకంగా పరిణమించాయి. విభీషణుడు స్వార్థపరుడని కొందరు వ్రేలెత్తి చూపటానికి అవకాశ మిచ్చాయి.

విభీషణునికి తండ్రి అనుగ్రహం వల్ల పుట్టుక నుండే ధర్మదృష్టి ఏర్పడింది. విశ్రవసుడు కైకసి ప్రార్థనను మన్నించి నీ కడగొట్టు కొడుకు ధర్మాత్ముడౌతాడని వరమిచ్చాడు. అందువల్ల మొదటినుండి విభీషణునిది రావణకుంభకర్ణుల కంటె భిన్నమైన మనస్తత్త్వం. అన్నలతోపాటు అతడు గూడ కఠోరమైన తపస్సు చేశాడు. అయితే అతడు బ్రహ్మదేవుని అడిగిన వరాలే వేరు. అనవరతం తనమనస్సు ధర్మబద్ధంగానే ఉండాలని, అభ్యసించకుండానే తనకు బ్రహ్మాస్త్రం సిద్ధించాలని ఆ బ్రహ్మదేవుణ్ణి అడిగాడు. అందుకు బ్రహ్మ అంగీకరించటమేకాక 'అధర్మంలో నీ బుద్ధి ప్రవేశించదు గనుక నీకు అమరత్వాన్ని గూడ అడుగకుండానే ఇస్తున్నా నన్నాడు.

విభీషణుడు రాక్షసవంశంలో జన్మించినా, రాక్షసుల మధ్య నివసించినా అతని అభిరుచులేవేరు; ఆలోచనాక్రమమే వేరు; జీవితవిధానమే వేరు. అన్యాయాలు, అక్రమాలు అతనికి గిట్టవు. అందువల్ల రావణుని దృష్టిలో, రాక్షసజాతి దృష్టిలో అతడొక అపశ్రుతి; అపశకునం. అయితే అన్యులదృష్టిలో అతడు కాకులలో కోకిల, గంజాయివనంలో తులసిమొక్క. అందుచేత అతడు రాక్షసుడైనా కానట్లే, లంకలో ఉన్నా లేనట్లే.

పైగా అతని భార్య సరమ, కూతురు త్రిజటగూడ సాధుస్వభావం గలవారు. అందుచేత అతని కుటుంబ వాతావరణమే వేరు. అదొక అరాక్షస వాతావరణం.

అయితే విభీషణుని ధర్మదృష్టి మీద రావణునికి కొంత గౌరవం లేకపోలేదు. రావణుడు హనుమంతునికి మరణదండన విధించే సమయంలో మొదటిసారి విభీషణుడు రామరావణవ్యవహారాల్లో జోక్యం కల్పించుకొన్నాడు. అన్నా! దూతను వధించటం అధర్మమన్నాడు. అందుకు తగిన శాస్త్రప్రమాణాలు, పెద్దల వాక్యాలు అనేకం చూపాడు. వానరులకు వాలమ్మే ప్రియమైంది గనుక అది కాల్చి వదలి వేయమన్నాడు.

విభీషణుని ధర్మదృష్టిని రావణుడు గౌరవించటం చేతనే ఆనాడు మారుతికి మరణదండన తప్పింది.

మారుతి వెళ్ళిన తరువాత రావణుడు మరల సభ చేశాడు. కోతి సముద్రం దాటటం, సీతను చూడటం, అశోకవనాన్ని కూల్చటం, విస్మరింపదగిన విషయాలు కాదన్నాడు. కోతిమూకతో రాముడు లంకమీదికి రాగలడన్నాడు. మన కర్తవ్యం ఆలోచించండన్నాడు.

సభలో కొందరు మూర్ఖరాక్షసులు శత్రుబలాన్ని తక్కువచేసి మాట్లాడారు. ముఖస్తుతి పరాయణులు కొందరు రావణుని బల పరాక్రమాలను, ఇంద్రజిత్తు విజయాలను ప్రస్తుతించారు. కొందరు మంత్రులు ఆ రామలక్ష్మణులను, ఆ వానర సేనలను వధించటం అదెంత పని అన్నారు. అప్పటికప్పుడే ఆయుధాలు గూడ చేపట్టారు.

విభీషణుడు అందరిని ఆపాడు. ముందుగానే దండోపాయం మంచిది గాదన్నాడు. అది రామునిపట్ల అసలే పనిచేయదన్నాడు. శత్రుబలాన్ని చులకనగా చూడవద్దన్నాడు. రాముడు ధర్మాత్ముడన్నాడు. అందుకు తోడు అపారశక్తి సంపన్నుడన్నాడు. అన్నగారివైపు తిరిగి 'అటువంటి రాముని భార్యను అన్యాయంగా నీవు అపహరించి తెచ్చావన్నాడు. పరదారా గమనం అపకీర్తికర మన్నాడు. ఆయుఃక్షీణకరమన్నాడు. లంకాపట్టణం ప్రమాదాల్లో మునుగకముందే సీతను రామునికిచ్చి సఖ్యంచేసుకోవటం సర్వవిధాల శ్రేయస్కర మన్నాడు. కోపాన్ని విడనాడ మన్నాడు. ధర్మాన్ని అవలంబించమన్నాడు. రాక్షసజాతిని రక్షించమన్నాడు.

రావణునికి ఊపిరాడలేదు, సభచాలించాడు. హఠాత్తుగా అంతఃపురంలోకి కెళ్ళాడు.

అయినా విభీషణుడు ఊరుకోలేదు. మరునాడు మళ్ళా అన్నదగ్గరికి వెళ్ళాడు. ఆయనకు నమస్కరించాడు. ఎదురుగా ఆసనంమీద కూర్చున్నాడు. అనేక ప్రియో క్తులతో అన్నను ప్రసన్నం చేసుకొన్నాడు. సీత లంకచేరింది మొదలు సంభవించిన అశుభాలన్నీ వివరించి చెప్పాడు. అగ్నిహోత్రగృహాల్లో, వేదాధ్యయన స్థలాల్లో విషసర్పాలు వస్తున్నాయన్నాడు. ఆవుల పాడి తరిగి పోయిందన్నాడు. ఏనుగుల మదం ఇంకి పోయిందన్నాడు. అశ్వాల అరుపులు దీనంగా ఉన్నాయన్నాడు కాకు లు, గ్రద్దలు గుంపులు గట్టి ఇళ్ళమీద తిరుగుతున్నాయన్నాడు. నగరపరిసరాల్లో ప్రతిదినం నక్కలు అరుస్తున్నాయన్నాడు. లంకాదహనం సంగతి నీకే తెలుసుగదా అన్నాడు. ఈ అశుభాలు అందరికీ తెలిసినా కొందరు నీకు భయపడి చెప్పటంలేదన్నాడు మరికొందరు నీమెప్పుగోరి చెప్పటంలేదన్నాడు. ఇచ్చకాలు చెప్పటం తనచేతకా దన్నాడు. లంకానగరం నాశనం కాకముందే న్యాయదృష్టితో వ్యవహరించమన్నాడు. కర్తవ్యం నిర్ణయించమన్నాడు.

అయినా రావణుడు మారలేదు. తన పట్టు వీడలేదు. అంతచెప్పిన విభీషణుని ఆవేదనను అర్థం చేసుకోలేదు.

అయితే మరునాడు రావణుడు మరల సభచేశాడు.

అది లంకేశ్వరుని సభ. మహాసభ. ఒకవైపు వేదధ్వనులు. మరోవైపు భేరీని నాదాలు. ఇంకోవైపు వందిమాగధ విజయధ్వానాలు. ఎటుచూచినా ధ్వజతోరణాలు. అగరుధూపాలు. వివిధ పరిమళాలు. సభలో ఒకప్రక్క మంత్రులు. మరోప్రక్క బంధుమిత్రులు. ఇంకోప్రక్క లంకాపుర ప్రముఖులు.

ఎదురుగా ఎత్తైన సింహాసనం మీద రావణుడు. రావణుడు దేదీప్యమానంగా వెలుగుతున్నాడు. సభనంతా ఒక్కసారి కలయజూచాడు. అందరు ఊర్పులు బిగ బట్టి ఆయన వైపే చూచారు.

రావణుడు సీతాపహరణ విషయం చెప్పాడు. ఆమె మీద తనకున్న మోహా న్ని గూడ తెలియజేశాడు. తన శాప విషయాలు ప్రస్తావించాడు. గతంలో తాను సాధించిన విజయాలు గుర్తుచేశాడు. స్వకీయశక్తి సామర్థ్యాలు వివరించాడు. రామ లక్ష్మణుల రణప్రయత్నాలు సూచించాడు. ఆంజనేయుని ఆగడాలు పేర్కొన్నాడు. అయితే సీత నివ్వకుండా శత్రు సంహారమార్గం ఆలోచించమన్నాడు.

కుంభకర్ణుడు కోపోద్రిక్తుడై అన్నగారి అధర్మాన్ని, ఆయన సీతాపహరణాన్ని నిరసించాడు గాని చివరకు రావణుని మాటననుసరించి రామలక్ష్మణుల వధిస్తానన్నాడు. వానరసేననంతా పిండి పిప్పిచేస్తానన్నాడు.

మహాపార్శ్వుడు మహాప్రియంగా మాట్లాడాడు. పెద్దయెత్తున ప్రభుస్తుతి చేశాడు. సంశయం లేకుండా సీతననుభవించమన్నాడు. శత్రుసంహారం అదెంతపని అన్నాడు.

ప్రహస్తుడు గూడ అదే పని చేశాడు.

రావణుడు పొంగిపోయాడు. ఒక్క క్షణాన శ్రీరాముని శక్తి యుక్తుల్ని త్రోసిపుచ్చాడు. ఆత్మస్తుతితో హర్షధ్వానాల మధ్య అట్టహాసం చేశాడు.

ఆ సభలో రాముని శక్తి సామర్థ్యాలు గుర్తించిన వివేకిగాని, రానున్న ప్రమాదాన్ని దర్శించిన దీర్ఘదర్శిగాని ఒక్కరూలేరు. ఆత్మస్తుతి, మూర్ఖత అన్నివైపుల తాండవం చేశాయి.

అప్పుడు లేచాడు విభీషణుడు. 'ప్రభూ! సీతను కోరటం మహాసర్పం మీద మరులుగొనటం. వానరులు లంకపైకి రాకముందే, రామబాణాలు రాక్షసశిరస్సులు త్రుంచకముందే సీతను రామునికి అప్పగించటం శ్రేయస్కరం అన్నాడు. ప్రహస్తుని వైపు తిరిగాడు. 'ప్రహస్తా! నీవా రాముని ఎదుర్కొనేది? కుంభకర్ణుడుగాని, ఇంద్రజిత్తుగాని, కడకు రావణుడుగాని రామునెదుట నిలువలేరు. ప్రాణభీతితో పాతాళానికి పారిపోయినా రామబాణం తప్పించుకోలేరు. మాటలు కట్టిపెట్టి, మంచితనం కొంతైనా మిగుల్చుకొని, మనం సీతను రామునికప్పగించటం అన్ని విధాల మేలు' అనగానే ఇంద్రజిత్తు కల్పించుకొన్నాడు. 'పినతండ్రి! నీవు పిరికితనంతో శత్రువును పొగడుతున్నావు. పులస్త్యవంశంలో పొరపాటున పుట్టావు. నా బలపరాక్రమాలు నీకు తెలీవా? నా ముందు రాముడొక లెక్కా?' అన్నాడు రెప్పలెగురవేస్తూ. విభీషణుడు 'ఇంద్రజిత్తూ! నీవు బాలుడివి. బుద్ధిపక్వంగని వాడివి. రామబాణం బ్రహ్మదండం. రామబాణం మృత్యుపాశం. సీతాసమర్పణం సర్వశ్రేయం' అనేసరికి రావణుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు.

'విభీషణా! నీవు జ్ఞాతివి. శత్రుపక్షపాతివి. నావైభవం చూచి ఓర్వలేనివాడివి. నాయెదుట శత్రుప్రశంస చేసేవాడివి. అయినా సోదరుడివని నిన్ను సహించాను. మ

రొకడివై లే గంపాటికి మరణించేవాడివే' అన్నాడు. పటపట పళ్ళు గొరికాడు. చుర చుర చూచాడు.

విభీషణుని మనస్సు విరిగిపోయింది. దానింతచెప్పింది అన్న మేలుకోరి. అందరిక్షేమంకోరి. అంత హితబోధ బూడిదలో పోసిన పన్నీరైంది. అందుకుదోడు అంరా చస్ప్రశమూసంచారు అనుమాని చాటు. అన్న బుద్ధి ఇక మారదు. వినాశకాలే విపరీతబుద్ధిః.

ఇక విభీషణునికి మిగిలిన మార్గాలు మూడు జీవచ్ఛవంలా అన్న పక్షాన్నె ఉండి అవమానాలు, అందరింపులు, బెదిరింపులు భరిస్తూ అందరితో పాటుతానూ రాముని చేతులో హతం కానటం. అట్లుగాక అన్నను వదలి ఏ అరణ్యాలకో వెళ్ళ టం. లేదా అన్నింటిని మించి ధర్మాన్ని అనుసరించి ఆరాముని శరణువేడటం.

విభీషణుడు దీర్ఘదర్శి; ధర్మబుద్ధి. అతడు రాక్షసనాశాన్ని, రామ విజయాన్ని దర్శించాడు. ఆత్మీయతలను, అనుబంధాలను అధిగమించి ధర్మతత్త్వాన్ని గూడ దర్శించాడు. ఆ రామునే ఆశ్రయించాలని నిర్ణయించాడు. నలుగురు సహచరులతో కలిసి ఆకాశాన కెగురుచూ 'అన్నా ! నీవు పితృసమానుడవు. పూజార్హుడవు. నీ మేలు గోరి ఎంతో హితం చెప్పాను నీ కది రుచించలేదు. లోకంలో అందరు ప్రియవా దులే. ఆ ప్రియవాదుల పలుకులే అందరు వింటారు. అవే వినాలని కోరుకొంటారు. అప్రియమైనా హితం చెప్పేవారు గాని, చెప్పినా వినేవారుగాని ఎవ్వరు దొరకరు. ఇల్లు కాలుతుంటే చూచి ఊరకుండలేక నీళ్ళుచల్లినట్లు నీ కింత దూరం హితం చెప్పాను. అయితే అది అంతా వ్యర్థమైంది. రామబాణానికి నేవు, రాక్షసులు, లంక దగ్గం కాక తప్పదు. అయినా ప్రయత్నించు. నిన్ను నీవు రక్షించుకో. రాక్షసులను రక్షించు. లంకను రక్షించు మీకు మేలగు గాక. నన్ను క్షమించు. నేవెళ్ళవస్తా అని చివరి సారిగా చెప్పాడు.

రావణుడు అతని వైపే చూడలేదు. అతని మాటలే వినిపించుకోలేదు.

విభీషణుడు రావణుని వదలి రాముని చేరాలనుకొన్నది రాజ్యకాంక్షతోగాదు. అన్నగారి అధర్మానికి రోసి; ఆయన అనుచరుల వైఖరికి విసిగి: తనకు జరిగిన అవమానానికి కినిసి; రాముని గుణగణాలకు మురిసి, రానున్న ప్రమాదాలకు జడిసి. ఆ తరువాత అతనికి రాజ్యం రావటం అనేది ఆనుషంగికం యాదృచ్ఛికం.

కాగా విభీషణుడు రాముని చేరటం గూడ అంత సులభమైన పనిగాదు. పైగా అది ప్రమాదంతో కూడుకొన్న పని. శత్రుపక్ష ప్రవేశం ఏ మాత్రం అనుమానానికి గురి అయినా అది ప్రాణాంతకమౌతుంది. అందుచేత విభీషణుడు చేసింది గొప్ప సాహసం. అయితే అతడు ఎంతో వివేకి గనుక ఆ సాహసం సఫలమైంది. అందులోను అతనికి చిత్తశుద్ధి ఉంది; ధర్మబుద్ధి ఉంది; దూరదృష్టి ఉంది.

సహచరులతో కలసి విభీషణుడు వెంటనే రాముని చెంత వ్రాల లేదు. అల్లంతదూరాన ఆకాశంలోనే నిలిచాడు. ఏ మౌతుందో అని ఎంతో భయపడ్డాడు. రామభక్తులైన వానరులు తన్ను రాముని చెంత చేరనిస్తారా! ఇంతలో సుగ్రీవాదులు మీదికి రానేవచ్చారు. వారితో తాను రావణుని సోదరుడనని, పేరు విభీషణుడని, సీతమ్మను రామునికిమ్మని హితం చెప్పినందువల్లనే అన్న తన్ను అవమానించాడని, అందుచేతనే భార్యాపుత్రులను గూడ వదలి సర్వలోకశరణ్యుడైన శ్రీరాముని శరణు వేడటానికి వచ్చానని, ఆ సంగతి రామునితో చెప్పి సహాయం చేయుండని సవినయంగా ప్రార్థించాడు. వారి దెబ్బ తప్పించుకొన్నాడు.

సుగ్రీవుడు లక్ష్మణునితో కలసి రాముని సమక్షానికి వెళ్ళాడు. విభీషణుని విషయం చెప్పాడు. అతనికి ఆశ్రయ మివ్వటం ప్రమాదకరమని హెచ్చరించాడు.

అయితే రాముడామాట విని ఊరుకోలేదు. చెంతనున్న ప్రముఖవానరుల నంతా సంప్రతించాడు. వారు తలకొక రీతిగా ఆలోచించారు. నోటికొక మాటగా చెప్పారు. అందరిలో ఆంజనేయుని ఆలోచన, మాట రాముని మనస్సుకు నచ్చాయి. ఆంజనేయుడు 'స్వామీ! విభీషణుని ముఖం ప్రసన్నంగా ఉంది. చిత్తశుద్ధిప్రతి ఫలిస్తూ ఉంది. ద్రోహబుద్ధి ఉంటే ఇంత ధైర్యంగా అతడు వస్తాడా! అన్న దుర్మార్గానికి రోసి, నీ గుణగణాలను, బలపరాక్రమాలను గ్రహించి నిన్ను శరణు వేడటానికి వచ్చాడు. బహుశః నీవు వాలిని చంపి సుగ్రీవునికి రాజ్యమిచ్చిన సంగతి గూడ అతని మనస్సులో ఉండవచ్చు' అన్నాడు. శ్రీరాముడు తన శరణాగత వాత్సల్యదీక్షను చాటించాడు. విభీషణునికి అభయమిచ్చాడు.

విభీషణుడు రామపాదాలకు నమస్కరించాడు. తన వృత్తాంతమంతా వివరించాడు. సర్వము నాకు నీవే అన్నాడు. ఆ రామునికి తన్నర్పించుకొన్నాడు.

విభీషణుని జీవితంలో ఇది పెద్దమలుపు.

ఇది అతనికి ఎంతో అనుకూలించింది. అతనికే కాదు రామునికి గూడ ఎంతో ఉపయోగించింది. అయితే రావణునికి మాత్రం ప్రమాదకరంగా పరిణమించింది. రావణుని ఆయువు పట్టు రాముని చేత చిక్కినట్లయింది.

రాముడు రాక్షసవీరుల బలాబలాలు అడిగాడు. విభీషణుడు రాక్షససేనా రహస్యాలన్నీ చెప్పాడు. రాక్షస సంహారంలో, లంకాపుర ఆక్రమణంలో అన్ని విధాల సహకరిస్తానన్నాడు. అంతేగాక శత్రుసైన్యం చొచ్చి యుద్ధం చేస్తానని గూడ చెప్పాడు.

రాముడు విభీషణుని ప్రియమార కౌగిలించుకొన్నాడు. లక్ష్మణుని పంపి సముద్రజలం తెప్పించాడు. విభీషణుని భావి లంకాధిపతిగా అభిషేకించాడు, దీనితో రామవిభీషణమైత్రి అభేద్యమైంది. అది రావణుని ప్రాణాంతకమైంది.

యుద్ధంలో విభీషణుడు అనేకవిధాల రామునికి ఉపకరించాడు. ససైన్యంగా సముద్రం దాటటానికి సముద్రోపాసనమే సరియైన మార్గమని శ్రీరామునికి చెప్పిన వాడు విభీషణుడు. వానర రూపం దాల్చి వంచనతో వానరసేనా రహస్యాలు కని పెట్టాలని వచ్చిన రావణచారులు శుకసారణులను రామునికి పట్టియిచ్చిన వాడు విభీషణుడు. శార్దూలుని నాయకత్వంలో రెండవసారి వచ్చిన రావణచారులను పట్టి యిచ్చిన వాడుగూడ విభీషణుడే. తన సహచరులైన అనలశరభ సంపాతి ప్రఘసులను పక్షుల రూపంలో రావణసైన్యంలో ప్రవేశపెట్టి అక్కడి వ్యూహరహస్యాలన్నీ సేకరించి రామునికిచ్చినవాడుగూడ విభీషణుడే. ఇంద్రజిత్తు వధించిన మాయా సీతను నిజమైన సీతగా నమ్మి మానసికంగా చతికిలబడిన రామలక్ష్మణులను ఆమె మాయాసీత అని తెలియచెప్పి వారి ఉత్సాహాన్ని ఉద్ధరించిన వ్యక్తిగూడ విభీషణుడే అంతే గాక ఇంద్రజిత్తు నికుంభిలాహోమం చేసే వ్యవధి సంపాదించటానికే ఈ మాయాసీత వధ జరిపి మిమ్మల్ని యుద్ధ విముఖుల గావించాడని, ఆ హోమం పూర్తి అయితే అతడు అవధ్యుడౌతాడని, అది బ్రహ్మవరమని, అందువల్ల ఆ హోమం విఘ్నం చేసే పని లక్ష్మణుని కప్పగించమని రామునికి సలహాచెప్పిన వాడు గూడ విభీషణుడే. లక్ష్మణుని వెంటవెళ్ళి, హోమం జరిగే ప్రదేశం చూపి, సమయోచితంగా అనేకసూచనలిచ్చి ఇంద్రజిత్తు వధకు దోహదం చేసినవాడు గూడ విభీషణుడే. అంతేగాక విభీషణుడు స్వయంగా పెక్కుమంది రాక్షసవీరులతో

పోరాడాడు. రావణనాశానికి, రామవిజయానికి గణనీయమైన కృషి చేశాడు.

ఆత్మీయతలు, అనుబంధాలు సంక్షోభసమయాల్లో వెల్లువెత్తుతాయి అన్న అధర్మానికి రోసి, శత్రుపక్షంచేరి, ఆయన పతనానికి కృషిచేసినా-చివరకు ఆయన ఊడలు తెగి, మొదలు విరిగిన మహావటవృక్షంలా యుద్ధభూమిలో పడిపోయేసరికి విభీషణుని భ్రాతృదుఃఖం కట్టలు తెంచుకొని పైకి పొంగింది. అతడు కంటికి మంటికి ఏకధారగా ఏడ్చాడు. అన్నగారి గుణగణాలు స్మరించుకొన్నాడు. ఆయన అధర్మాన్ని, మూర్ఖస్వభావాన్ని తలచి తలచి వలవించుకొన్నాడు.

రాముడు శత్రువిజేత. అన్నగారి అంత్యక్రియలకు ఆయన అనుమతి కావాలి. విభీషణుడు రాముని అనుమతి పొందాడు. అన్నగారి అంత్యక్రియలు శాస్త్రోక్తంగా తానే చేశాడు. అనంతరం రాముని అనుగ్రహంతో లంకారాజ్యానికి పట్టాభిషిక్తుడయ్యాడు.

ఆ పదవికోరి విభీషణుడు రాముని చేరలేదు. పరిస్థితుల ప్రభావం వల్ల అతని కాపదవి వచ్చింది. ధర్మప్రవృత్తికి ప్రతిఫలంగా అది లభించింది.

విభీషణుడు లంకాధిపతి అయ్యాడు.

రామాజ్ఞ ననుసరించి, రాక్షసస్త్రీలను పంపించి, సీతాదేవిని సాలంకృత గావించి ఆయన సమక్షానికి తోడ్కొని వచ్చాడు. ఆ సాధ్వీమణి అగ్నిశుద్ధ అయిన తరువాత ఆనందపారవశ్యంతో ఆ రామలక్ష్మణులను, వానరవీరులను తన ఆతిథ్యం స్వీకరించి వెళ్ళండని కృతజ్ఞతా పూర్వకంగా ప్రార్థించాడు. భరతుని చూడనిదే ఏ సుఖము వల్లని రామహృదయాన్ని గ్రహించి పులకించాడు. వానరవీరులకు విశేష సత్కారాలు చేశాడు అయోధ్యా ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు చేశాడు. పుష్పకాన్ని భక్తి పురస్సరంగా రామునికి అర్పించాడు. తానూ పుష్పకం ఎక్కి రాముని వెంట అయోధ్యవెళ్ళి ఆయన పట్టాభిషేకాన్ని తిలకించి ఆనందించాడు. ఆయన చేసిన అతిథి సత్కారాలన్నీ స్వీకరించి జీవితంలో ఒక సంతృప్తితో లంకకు తిరిగి వచ్చాడు.

అది మొదలు లంకకు అయోధ్యకు సఖ్యత. రాముని పట్ల విభీషణుడు భక్తుడు; శక్తుడు; కృతజ్ఞతాయుక్తుడు.

రాముని అశ్వమేధయాగానికి విభీషణుడు మరల అతిథిగా వచ్చాడు.

తరువాత శ్రీరాముని సరయూ ప్రవేశసంకల్పాన్ని విని సపరివారంగా తానూ సహగమనం చెయ్యాలని తరలివచ్చాడు. రామునితో విభీషణునికున్నది రాజ్యసంబంధం మాత్రమే గాదు. అంతకంటె ఎంతో ఉన్నతమైన ఆత్మసంబంధం అందుచేతనే ఆయనతోపాటు సరయూప్రవేశం చెయ్యటానికి అంతటి రాజ్యాన్ని వదలి వచ్చాడు. అంతదూరం నుంచి వచ్చాడు. తనువు త్యజించటానికి సిద్ధమై వచ్చాడు

అయితే రాముడు అందుకు అనుమతించలేదు. 'విభీషణా ! ఎంతవరకు ప్రజలుంటారో అంతవరకు నీవు లంకలో జీవించి ఉంటావు. ఎంతవరకు సూర్య చంద్రులుంటారో, ఎంత వరకు భూమి ఉంటుందో ఎంత వరకు నా చరిత్ర లోకంలో వ్యాపించి ఉంటుందో అంతవరకు నీవు రాజ్యం చేస్తావు. ధర్మబద్ధంగా ప్రజలను పాలించు. జగన్నాథుని పూజించు — ' అని చెప్పిపంపాడు.

విభీషణుడు ఎంతకాలమో లంకను పాలించాడు. ధర్మ ప్రభువుగా పేరు గడించాడు.

ఆనాడు రాముని ఆశ్రయించబట్టే విభీణుడు ఇంతటి వాడయ్యాడు. రావణుని వెంటనే ఉంటే అతడు ఏమయ్యేవాడో !

అయినా ఉండలేదుగదా.

ఎందుకు ఉండలేదో అతడే ఎన్నోసార్లు చెప్పాడు.

అయితే ఇంత జరిగినా మందోదరి మాత్రం విభీషణుని నిందించలేదు; పైగా అతని ధార్మికతను, అన్నకతడు చేసిన హితబోధను ప్రశంసించింది. రావణుని దుష్టనే నిందించింది.

మొత్తానికి రామాయణంలో విభీషణుని దొక విశిష్టపాత్ర. పెద్దమలుపు తిరిగిన పాత్ర. లోకం మరువలేని పాత్ర.

# దశరథుడు

మానవ జీవితంలో కామం ఎంత సహజభాగమో సంతాన కాంక్ష గూడ అంత సహజ భాగం. కామానికి తాత్కాలిక ఫలం శారీరక మానసిక తృప్తి అయినా శాశ్వత ఫలం మాత్రం సంతాన ప్రాప్తి.

సాంసారిక జీవనాన్ని స్వీకరించిన ఏవ్యక్తిలో అయినా సంతాన కాంక్ష క్రమంగా చోటు చేసుకుంటుంది. బలంగా పెరుగుతుంది. ఫలాన్ని పొందాలని పరిపరివిధాల ప్రయత్నిస్తుంది. పున్నామనరకం నుండి రక్షించటానికే పుత్రుడన్న మాట ఎలా ఉన్నా ప్రతి మానవుడు తన రూపాన్ని తాను చూచుకోవాలనుకుంటాడు. తాను సాధించిన పదవులను, పేరు ప్రతిష్ఠలను తనవారు అనుభవించాలను కుంటాడు కష్టసమయంలో, ముసలిప్రాయంలో మరణకాలంలో తనవారి సాహాయ్యసాహచర్యాలు కావాలను కుంటాడు. ఉన్నవారి ద్వారా తాను నామమాత్రంగానైనా మిగిలి ఉండాలను కుంటాడు. అందుకే అతనికా సంతాన కాంక్ష అయితే జీవితంలో మానవునికి తనయుణ్ణి మించిన తన వాడు లేడు. తనయుడు తండ్రికి రూపాంతరం అందుకే తనయుని కొరకు ఆ తండ్రికి అంత తపన.

తనయుని ఎడబాటు భరించటం ఏ తండ్రికైనా కష్టమే అందులోను వృద్ధాప్యంలో అన్ని విధాల చేతి కెదిగిన కొడుకుతో ఎడబాటు సంభవిస్తే జీవితంలో ఆ తండ్రికి అంతకంటె శాపం ఉండదు.

రామాయణంలో దశరథుడు అలాంటి శాపం అనుభవించాడు. ఆయన ఎంతకాలమో పుత్రుల కొరకు తపించాడు. పుత్రులను పొందాడు. ప్రియాతి ప్రియుడైన జ్యేష్ఠపుత్రుణ్ణి శ్రీరామచంద్రుణ్ణి చివరి రోజుల్లో చేతులార దూరం చేసుకున్నాడు. ఆ మనోవ్యధలోనే మంచపట్టి మరణించాడు.

అప్పటికింకా దశరథునికి పెళ్ళికాలేదు. అజమహారాజు పుత్రుడుగా, కోసల సామ్రాజ్య యువరాజుగా ఆయన ఒకనాడు వేటకు వెళ్ళాడు. వేట అంటే

దశరథునికి ఎంతో ఇష్టం. అందులోను శబ్దాన్ని బట్టి మృగాన్ని కొట్టడం ఆయన ప్రత్యేకత. ఆ నాటి రాత్రిపూట గూడ ఆయన వేటలోనే ఉన్నాడు.

అది నీటి మడుగు. కటిక చీకటి. ప్రక్కనే ఒకపెద్ద పొద. అందులో దశరథుడు పొంచి ఉన్నాడు. ఎనుబోతుగాని, ఏనుగుగాని, ఇంకేదైనా క్రూర మృగం గాని నీటికొరకు వస్తే బాణం ఎక్కుపెట్టి కొట్టాలనుకున్నాడు. కొంతసేపటికి బుడబుడమన్న శబ్దం విన్పించింది. మదపుటేనుగు నీరుత్రాగుతున్నదని భ్రమించాడు. వాడి బాణం వింట సంధించి విడిచాడు. వెంటనే 'అమ్మా! అన్న ఆర్తనాదం వినిపించింది. దశరథుని గుండెలదిరాయి. పెదవులెండాయి. ఆయన కొయ్యబారిపోయాడు.

అది మానవస్వరం. ఎవరిదో। 'అయ్యో! నేను మునికుమారుణ్ణి. ఎవ్వరికి ఏ అపకారం చెయ్యని వాణ్ణి. నన్నెందుకు ఇలా కొట్టారు. ఎవరా పాపాత్ముడు.

అయ్యో! నా తల్లిదండ్రులు పండు ముదుసలులే పైగా అంధులే. వాళ్ళ గతియేమి? ఒక్కబాణంతో మూర్ఖుడెవడో మా ముగ్గురి ప్రాణాలు తీశాడు' అని ముని కుమారుడరచాడు.

దశరథుడు దుఃఖభారంతో క్రుంగి పోయాడు. భయభ్రాంతుడయ్యాడు. అనుకోకుండ మహాపరాధం జరిగి పోయిందని ఎంతో బాధపడ్డాడు.

ఎలాగో ధైర్యం తెచ్చుకొని మడుగు దగ్గరకి వెళ్ళాడు. ముని కుమారుడు గిలగిల తన్నుకొంటున్నాడు. అతని దేహమంతా నెత్తురు. జడల నిండా బురద.

దశరథునికి దిక్కుతోచలేదు. ముని కుమారుడు చురచుర చూచాడు.

దశరథుడు కన్నీళ్ళు కార్చాడు.

'దశరథమహారాజా! నీవా। మేము తాపసులం. నీకేమి అపకారం చేశాం? అన్నాడు ముని కుమారుడు.

దశరథుడు మౌనం. ఆయన కన్నీళ్ళే అందుకు సమాధానం.

'నా తల్లిదండ్రులు దప్పికతో బాధపడుతుంటే నీళ్ళ కొరకు వచ్చాను. వాళ్ళు ఎదురు చూస్తుంటారు. నీవు నీళ్ళు తీసుకొని వెళ్ళి వాళ్ళ కిచ్చి జరిగిందంతా చెప్పు. క్షమాపణ అడుగు. లేకుంటే మా తండ్రి నిన్ను శపిస్తాడు. ఆలస్యం చెయ్యవద్దు. అదుగో అదే మా ఆశ్రమానికి మార్గం. నీబాణం నన్ను బాధిస్తూఉంది బయటకు లాగి వెళ్ళు' అన్నాడు బాధపడుతూ ఆ ముని కుమారుడు.

దశరథుడు దీనంగా చూచాడు. బాణం పెరికితే బాలుడు మరణిస్తాడు. బ్రహ్మహత్యా పాతకం చుట్టు కొంటుంది.

ముని కుమారుడు మహారాజు మనస్సు అర్థం చేసుకున్నాడు. తాను బ్రాహ్మణ కుమారుణ్ణి కానన్నాడు. బ్రహ్మహత్యాపాతకం అంటదన్నాడు. బాణం తీసి బాధ తొలగించమన్నాడు.

దశరథుడు బాణం తీశాడు. మునికుమారుడు మరణించాడు.

కడవ నిండ దశరథుడు నీళ్ళు తీసుకున్నాడు. ఆయన కాళ్ళు వణుకుతున్నాయి. కాలిబాట వెంట అడుగులు వేసుకొంటూ, అశ్రుబిందువులు రాల్చుకొంటూ ఆశ్రమానికి వెళ్ళాడు. అడుగుల సవ్వడివిని వృద్ధుడు-

'కుమారా ! ఎందుకింత ఆలస్యం చేశావు. నన్ను, మీ అమ్మను వదలి ఎన్నడు నీ వింతసేపు ఉండలేదు. మేము ఆందోళన పడుతున్నాము' అన్నాడు ఆవేదనతో.

దశరథుడు మాట్లాడలేదు. ఏమి మాట్లాడాలో ఆయన తెలియలేదు. ఒక వైపు భయం మరొకవైపు దుఃఖం.

'నాయనా ! మాట్లాడవేమి ! ఆలస్యంగా వచ్చావని అన్నందుకు ఆగ్రహమా? మాకు కళ్ళు, కాళ్ళు రెండూ నీవే గదా ? మా ప్రాణాలు గూడ నీ మీదే నిలుపుకున్నాము. నీవు కోపడితే ఎలా చెప్పు' అన్నాడు ఆ వృద్ధ తపస్వి అనునయ స్వరంతో

దశరథుడు ఏదో చెప్పబోయాడు చెప్పలేకపోయాడు. పాపం ! ఆయన మాట తడబడుతూ ఉంది.

'పలుకవేం నాయనా ?' అన్నాడు పెద్దగా ఆ వృద్ధ తాపసుడు.

'స్వామీ, నేను మీ కుమారుణ్ణికాను. దశరథుణ్ణి క్షత్రియుణ్ణి. పాపాత్ముణ్ణి వేటకు వచ్చాను. మీ కుమారుడు నీళ్ళలో కడవ ముంచె శబ్దం విని, అది మదపు ఏనుగు నీరు త్రావే ధ్వని అని భ్రమపడి బాణంతో కొట్టాను.

మీ కుమారుడిక లేడు. తిరిగిరాడు.

మీకు నీళ్ళు తెచ్చాను. మీ సేవచేస్తాను. నన్ను మన్నించండి' అన్నాడు దశరథుడు గద్గద స్వరంతో, గడగడ వణకుతూ.

'దశరథా ! ఎంత పని చేశావు. మా ప్రాణాలు నిలువునా తీశావు. నీవై నీవు వచ్చి చేసిన తప్పు చెప్పుకొన్నావు. అందుచేత బ్రతికిపోయ్యావు. లేకుంటే ఈ పాటికి నీ తల ముక్కలయ్యేది.

అజ్ఞానంలో ఈ పని చేశావు. కాకుంటే ఇక్ష్వాకువంశమే ఈ పాటికి నాశనమై పోయ్యేది. నన్ను, నా భార్యను మా కుమారుని దగ్గరకు చేర్చు' అని కుండ పోతగా ఆ మహర్షి కన్నీరు కార్చాడు.

దశరథుడు ఆ వృద్ధ దంపతులను వారి కుమారుని శవం కడకు చేర్చాడు. చేతులు కట్టుకొని నిలుచున్నాడు.

ఆ ముని దంపతులు కుమారుని కళేబరం మీదపడి పరిపరి విధాల శోకించారు అతడు చేసిన సేవలను స్మరించారు.

కొడుకుచేత అంత్యక్రియలు జరిపించు కొని తరించవలసిన ఆ తండ్రి కొడుకుకే అంత్యక్రియలు చేశాడు. ఎంతో కుమలి పోయాడు. కడుపుమండి 'దశ రథా ! ఈ వృద్ధాప్యంలో నా కింత పుత్రశోకం కలిగించావు. నీవూ నాలాగే పుత్ర శోకంతో మరణిస్తావు' అని శపించి సహధర్మచారిణితో గూడ చితి మీద చేరి క్షణం లో దగ్ధమయ్యాడు.

దశరథుడు జీవితంలో శాపగ్రస్తుడయ్యాడు. అయితే ఆయన యౌవనం అప్పుడు. ఆ శాపాన్ని అంతగా లెక్కచెయ్య లేదు.

క్రమంగా దశరథుడు కోసల రాజ్య సార్వభౌముడయ్యాడు. కౌసల్యా సుమిత్రాకైకలను వివాహ మాడాడు. కామవాంఛకు మరో మూడువందల యాభై మంది కాంతలను చే పట్టాడు. అందరిలో కౌసల్య అంటే ఆయనకు ఎంతో గౌరవం. కైకేయి అంటే ఎంతో యిష్టం. ఆమె అందరి కంటె ఎంతో చిన్నది. ఆమె అందం, వయస్సు, మాటతీరు, తెలివితేటలు, ముద్దుమురిపాలు అన్నీ ఆయన మనస్సును మరీ గిలిగింతలు పెట్టేవి.

దశరథుడు మహాపరాక్రమశాలి. ఆయన అప్పుడప్పుడు దేవాసుర యుద్ధాల్లో దేవతలకు సాయంగా వెళ్ళేవాడు. అది శంబరాసురునితో సంగ్రామం. ఆనాడు భర్తకు సాయలగా కైకేయి గూడ వెళ్ళింది. శంబరుడు విజృంభించాడు. వివిధ శస్త్రాస్త్రాలు ప్రయోగించాడు. దశరథుని తీవ్రంగా గాయ పరిచాడు. రాత్రికావస్తూ

వుంది. అది రాక్షసులకు ఇంకా అనుకూలం. అప్పుడు సమయస్ఫూర్తితో కైక దశరథుని రథాన్ని రణరంగం నుండి తప్పించింది. ఒక రహస్య స్థలానికి చేర్చింది. అనేక సపర్యలు చేసి ఆయన సేద తీర్చింది. బాధ నోగొట్టింది. దశరథుడు ఆనంద పరవశుడయ్యాడు. ఆప్యాయంగా ఆమెను కౌగిట్లోకి తీసుకొన్నాడు. అడుగకుండానే రెండు వరాలిచ్చాడు. ఆమె అవసరమైనప్పుడు వాటిని అడుగు తానంది.

తానిచ్చిన వరాలే కాలసర్పాలై తన్ను కాటు వేస్తాయని దశరథుడు ఊహించ లేదు. ఆ వరాలడిగి భర్తను బాధించాలని కైక అనుకోలేదు.

ఆ క్షణంలో వారిద్దరిది ఒకే మనస్సు. ఒకే అనుభూతి. కొండంత తృప్తి. సముద్రమంత సంతోషం.

కాలం గడచి పోయింది. ఆ అనుభూతి ఒక కలలా మిగిలిపోయింది.

దశరథునికి జీవితంలో అన్నీ ఉన్నాయి. సరయూ తీరాన సమస్త సంపదల తో తులతూగే అయోధ్య ఆయన రాజధాని. మంత్రులు ఎనమండుగురు – అతి సమర్థులు, విశ్వాసపాత్రులు, పురోహితులిద్దరు – వసిష్ఠవామదేవులు; పుణ్య మూర్తులు, ప్రజలంతా ప్రభు భక్తులు; ధర్మాను రక్తులు. రాజ్యంలో ఈతి బాధలు లేవు. శత్రుభయాల్లేవు. ఎటు చూచినా సుఖ సంతోషాలు.

దశరథునికి యౌవనం ఉంది అధికారం ఉంది. ఐశ్వర్యం ఉంది. అందమైన అంతఃపుర కాంతా సమూహం ఉంది. అంతకంటె ఏం కావాలి ? కాని ఆయనకు సంతానం లేదు. అదొక పెద్ద అసంతృప్తి. అన్నీ ఉండి సంతానం లేకుంటే అది మరీ అసంతృప్తి వయస్సు గడిచేకొంది ఈ అసంతృప్తి సాయంకాలపు నీడలా ఆమహారాజులో అధికమైంది.

దశరథుడు తన ఆవేదనను మంత్రులతో చెప్పుకున్నాడు. విశేషించి సుమంత్రుడు ఆయనకు చాల సన్నిహితుడు. అతనితో సంతాన చింతను గూర్చి చెప్పుకోని రోజేలేదు. చివరకు దశరథుడు సుతానార్థం అశ్వమేధయాగం సంకల్పి ంచాడు. అన్ని ముఖ్య విషయాల్లాగే ఆ విషయాన్ని ఆయన మంత్రి పురోహితుల ముందుంచాడు. అందరు ఆయన సంకల్పాన్ని హర్షించారు. వసిష్ఠమహర్షి 'మహారాజా ! నీ యాగ సంకల్పం స్తుతి పాత్రంగా ఉంది. సంభారాలన్నీ సమ కూర్చు. యజ్ఞాశ్వాన్ని విడిచిపెట్టు. సర్వలక్షణ సంపన్నులైన సుతులు నీకు

జన్మిస్తారు. అనగానే దశరధుడు అమృతాన్ని ఆస్వాదించినట్లు ఆనందించాడు.

మంత్రులందరికీ ఆయాపనులు అప్పగించాడు. అంతఃపురానికి వెళ్ళి భార్యలను పిలిచి యాగదీక్ష వహించ వలసిన దని కోరాడు. సుమంత్రుని సలహాతో వసిష్టుని ఆమోదాన్ని పొంది అంతఃపుర రాణులతో అంగదేశం వెళ్ళి ఋశ్యశృంగుని యాగ ఋత్విక్కుగా ఆహ్వానించాడు.

సశాస్త్రీయంగా అశ్వమేధం జరిగింది. ఋత్విక్కు ఋశ్యశృంగుడు 'మహారాజా! నీకుగుడు నలుపుత్రులు జన్మిస్తారు. వారు వంశవర్ధను లౌతారు. అశ్వమేధానికి అనుబంధంగా పుత్రకామేష్టి గూడ ప్రారంభించు' అన్నాడు.

అది పుత్రకామేష్టి పూర్ణాహుతి.

వేద ధ్వనులు మార్మోగుతున్నాయి. అగ్నిహోత్రం జాజ్వల్యమానంగా వెలుగుతూ ఉంది. అందరూ లేచి నిలుచున్నారు. చేతులు జోడించి చూస్తున్నారు. పూర్ణాహుతి పూర్తిఅయింది. అగ్నిహోత్రం నుండి సూర్యతేజస్సుతో ఒక మహాపురుషుడు పైకి లేచాడు. ఆయన చేతుల్లో ఒక బంగారు పాత్ర, దానికొక వెండి మూత. మధుర గంభీర స్వరంతో 'మహారాజా! ఇది దివ్య పాయసం; ఆరోగ్య వర్ధకం; సంతాన ప్రదం నీ భార్యలకు పంచిపెట్టు. పుత్రులు జన్మిస్తారు' అన్నాడు ఆ పాయస పాత్ర చేతికిచ్చి అంతర్ధాన మయ్యాడు. అప్పుడందరిది ఒక దివ్యానుభూతి.

దశరధుని ఆనందానికి అవధి లేదు. ఆ పాత్రను ఎలా అందుకొన్నాడో ఆయనకే తెలీదు. మాటిమాటికి ఆయన ఆ పాత్ర వైపు చూస్తాడు అప్రయత్నంగా ఆనందబాష్పాలు రాలుస్తాడు. మాటిమాటికి ఆ పాత్రను కళ్ళకు అద్దుకుంటాడు. నిండుగా ఊర్పులు విడుస్తాడు. అలా చూస్తూనే, ఊర్పులు విడుస్తూనే ఆయన అంతఃపురానికి వెళ్ళాడు. కౌసల్యా సుమిత్రా కైకలను చేరపిలిచాడు పాయసాన్ని పంచియిచ్చాడు. శీఘ్రమే మీరు సంతాన వతులౌతారని, మీ జన్మలు సఫలమౌతాయని అన్నాడు.

అది చైత్ర శుద్ధ నవమి. పునర్వసునక్షత్రం కర్కాటక లగ్నం. అయిదు గ్రహాలు ఉచ్చస్థితిలో ఉన్నాయి అప్పుడు కౌసల్య ఆనంద వర్ధనుని ఆ శ్రీరామ చంద్రుని కన్నది. పుష్యమీనక్షత్ర మీనలగ్నాన కైకకు భరతుడు పుట్టాడు.

గొప్ప తేజస్సుతో వెలిగాడు. ఆశ్లేషా నక్షత్ర కర్కాటక లగ్నాన శుభలక్షణులైన లక్ష్మణ శత్రుఘ్నులు సుమిత్రకు జన్మించారు.

అయోధ్య అందంగా అలంకరించు కొన్నది. ఆనంద నాట్యాలు ఆడింది. ఆహ్లాదగీతాలు పాడింది. మనోహర వాద్యాలు ప్రయోగించింది. దశరథుని అంతః పురం అపూర్వకాంతులతో శోభిల్లింది. అన్నదానాలు చేసింది. గోదానాలు చేసింది. భూదానాలు చేసింది. సువర్ణదానాలు చేసింది. సరయూనది సంతోషంతో ఉప్పొంగి పొరలి పారింది. దశరథమహారాజు మనస్సు గాలితో తేలాడింది. అమృతంలో ఈదులాడింది. పారిజాతాల మీద పవ్వళించింది. పర్వత శిఖరాల మీద విహరించింది. మోసులెత్తిన ఆశలతో మంతనాలాడింది.

రామలక్ష్మణభరతశత్రుఘ్నులు అల్లారు ముద్దుగా పెరిగారు. బాల్యం లోనే భరతుని మేనమామలు పిలుచుకొని వెళ్ళారు, ఆయన వెంట శత్రుఘ్నుడూ వెళ్ళాడు. ఇక అయోధ్యలో ఉన్నది రామలక్ష్మణులే.

రాముడంటే దశరథునికి పంచప్రాణాలు. రాముని చూడకుండా, 'రామా !' అని పిలువకుండ ఆయన ఒక్కక్షణం గూడ ఉండలేడు. రాముని చూస్తుంటే ఆయన ఆత్మను దర్శించినట్లుంది. రామా ! అని పిలుస్తుంటే ఆయనకు ప్రణవనాదం పలికినట్లుంది. దశరథునిది ఏదో అతిలోకమైన అనుభూతి. ఆయనకు శరీరంలోని అణువణువులో రామరూపం అగుపిస్తూ ఉంది. గాలిపీల్చినా, గాలి వదలినా రామ గానమే వినిపిస్తూ ఉంది. ఎడబాటు గలిగితే ఎలా సహిస్తాడో ! ఏమౌతాడో !

దశరథుని కాలం హాయిగా గడచి పోతూఉంది. పుత్రులు పెరిగి పెద్ద వాళ్ళవుతున్నారు. విద్యాబుద్ధులు నేర్చుకుంటున్నారు. సాటిలేని మేటి వీరులుగా రూపొందుతున్నారు. తండ్రిని మించిన తనయులౌతారని పేరు తెచ్చుకుంటున్నారు. అందులోను రామునికున్న ప్రజానురాగం, పేరుప్రతిష్ఠలు అనుపమానాలు. అంత కంటె ఏ తండ్రికైనా జీవితంలో ఏంకావాలి !

ఇక కొడుకుల వివాహమే ఆ తండ్రి ఆలోచన. ఆనాడు దశరథుడు కొలువు తీరాడు. కొడుకుల వివాహాన్ని గూర్చి అందరితో ఆలోచిస్తున్నాడు. అంతలోనే విశ్వామిత్రుడు ! ప్రశాంత సరోవరంలో పెద్ద బండ పడ్డట్లు ఎక్కడినుండో ఆయన అక్కడ ఊడిపడ్డాడు. దశరథుడు ససంభ్రమంగా సింహాసనం నుండి లేచి, మంత్రి సామంత పురోహిత పౌర జానపద ప్రముఖులతో ఎదురేగి ఆ మహర్షిని తోడ్కొని వచ్చాడు ఆసీనుని గావించాడు. అర్ఘ్యపాద్యాలిచ్చాడు. అర్చనలు చేశాడు. వచ్చిన పని ఏమి

గాదు, అవశ్యం అది నెరవేరుస్తానన్నాడు.

'మహారాజా ! నేనొక యజ్ఞం చేస్తున్నాను. మారీచ సుబాహులనే రాక్షసులు రక్తమాంసాలతో యజ్ఞవేదికను మలినం చేస్తున్నారు. ఆ రాక్షసులను సంహరించాలి అందుకు నీవు రాముణ్ణి పంపాలి' అన్నాడు.

దశరథుని ఊపిరి ఆగింది. ముఖం వెలవెల పోయింది. గాలం వేసి గుండెను గుంజుతున్నట్లు ఆయన గిలగిల పడ్డాడు, భయ పడ్డాడు, ఏం చెప్పాలో, ఏం చెయ్యాలో ఆయనకేమీ తోచలేదు.

సభ అంతా నిశ్శబ్దం.

విశ్వామిత్రుడు 'దశరథరాజా !' అన్నాడు కోపంగా. పైనుంచి పిడుగు పడ్డట్లుంది.

'మహాత్మా ! నా రాముడు పసివాడు పదహారేళ్ళ వాడు. యుద్ధయోగ్యత లేనివాడు, నేను వస్తాను. అక్షౌహిణీపూర్ణ సైన్యం తెస్తాను. ఆ రాక్షసులను హతమారుస్తాను. మీ ఆజ్ఞ నిర్వర్తిస్తాను. అనుగ్రహించండి అన్నాడు దశరథుడు ఆ మహర్షికి నమస్కరిస్తూ.

అందుకు విశ్వామిత్రుడు తల అడ్డంగా ఆడించాడు.

స్వామీ ! ఎన్నో వ్రతాలు, ఉపవాసాలు, యజ్ఞాలు, యాగాలు చేసి నేను రాముణ్ణి కన్నాను. రాముడు నా జ్యేష్ఠపుత్రుడు. నా రాముడు లేకుంటే నేను బ్రతుకలేను. మన్నించండి. నన్ను గాని పొండి" – అని చేతులుచాచి బ్రతిమాలుకొన్నాడు. విశ్వామిత్రుడు తీవ్రంగా చూచాడు. దశరథుడు కన్నీళ్ళు కారుస్తూ 'మహర్షీ ! ఎవరా మారీచ సుబాహులు. వాళ్ళ బలాబలా లేమిటి చెప్పండి' అన్నాడు గద్గద స్వరంతో.

'దశరథా వాళ్ళు రావణప్రతినిధులు. మహా మాయావులు' అనగానే ఆ మహారాజుకు అగ్నిపర్వతం బ్రద్దలైనట్లుంది. భూమి కంపించినట్లుంది. సముద్రం ఘూర్ణిల్లినట్లుంది.

'స్వామీ ! ఆ రావణుని – నేనుగాదు దేవదానవ యక్షరాక్షస గంధర్వులంతా ఏకమైనా ఎదిరించలేరు, జయించలేరు. అతని ప్రతినిధులు మారీచసుబాహులు మహా మాయావులే. మహోగ్ర శక్తి సంపన్నులే. వారిమీదికి నారాముని

పంపటమా ?' అనగానే విశ్వామిత్రుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు.

'మహారాజా ! ఆడిన మాట తప్పుతున్నావు అది నీ వంశానికే అపచారం. అందుకు తగిన ఫలితాన్ని అనుభవిస్తావు" అని బయలు దేరాడు.

అప్పుడు వసిష్ఠుడు సత్వరుడై ముందుకు వచ్చాడు. 'మహారాజా ! అసత్య దోషం అన్ని పుణ్యాలను హరిస్తుంది. రాముణ్ణి పంపించు. విశ్వామిత్రుని రక్షణలో రాముడుంటే రాక్షసులేమీ చెయ్యలేరు. అగ్ని మధ్య అమృతం ఉన్నట్లే. విశ్వామిత్రుని శక్తి అపారం. ఆయన దగ్గర అనేక శస్త్రాస్త్రాలున్నాయి. అమేయ తపోబలం ఉంది. అనుకొంటే ఆరాక్షసులను ఆయనే అంతమొందించగలడు. నీ కొడుకులను అనుగ్రహించటానికే ఆయన వచ్చాడు. నీకీ అవకాశ మిచ్చాడు మారు మాటాడకుండా మన రాముని పంపించు' అన్నాడు.

విశ్వామిత్రుని ముఖంలో అపూర్వమైన ఒక చిరునవ్వు. అంతరూ ఊపిరి పీల్చుకొన్నారు.

దశరథుడు రామలక్ష్మణులను పిలిపించాడు గాఢంగా కౌగిలించుకొన్నాడు. ప్రాణాలు యమధర్మరాజుకు చేబదులుగా ఇచ్చి పంపినట్లు ఆ బాలురిద్దరిని విశ్వామిత్రుని వెంట పంపాడు.

పంపాడేగాని ప్రతిక్షణం దశరథునికి రామ లక్ష్మణులను గూర్చిన ఆలోచనలే పట్టపురాణులతో తన్ను దర్శించిన వ్యక్తులతో ఆ కుమారులను గూర్చిన ప్రస్తావనలే ఇక ఒంటరిగా ఉంటే ఒకటే ఆలోచన వసిష్ఠుని మాట విని తాను రామలక్ష్మణులను పంపాడు. వసిష్ఠుని మాట వినవలసిందే, ఆయన మహర్షి, హితైషి. విశ్వామిత్రుడు తన కుమారుల వెంట ఉన్నాడు, ఆయన అపారశక్తి సంపన్నుడు. అసాధారణ తపోధనుడు. అయినా రామలక్ష్మణులు వెళ్ళింది రాక్షసుల మీదికి. ఆ రాక్షసులు రావణ ప్రతినిధులు, మహామాయావులు మదబోద్ధతులు. ఏమౌతుందో ఏమో ?

రామలక్ష్మణులు రాక్షసుల జయించాలని, క్షేమంగా తిరిగి రావాలని ఆ దశరథుడు ఎన్నో పూజలు చేశాడు. ఎన్నో దానాలు చేశాడు. అయినా రాముడు ఎప్పుడు వస్తాడో ? ఎలా వస్తాడో ?

ఆ రోజు అనుకోకుండా మిథిల నుండి రాజభటులు వచ్చారు. 'శ్రీరాముడు శివధనుర్భంగం చేశాడని, సీతాదేవిని స్వయంవరంలో గెల్చుకొన్నాడని, సీతా

రాముల వివాహానికి సకుటుంబంగా, సపరివారంగా బయలుదేరి రమ్మని జనక మహారాజు పంపిన ఆహ్వానాన్ని అందచేశారు.

దశరథుని ఆనందానికి అంతులేదు. తన రాముడు రాక్షసులను సంహరించట మేగాక, సకలరాజ సమక్షంలో శివధనుర్భంగం గావించటమా! వీర్యశుల్కంగా సీతాదేవిని గెల్చుకోవటమా! జనక మహారాజుతో తాను వియ్యమందటమా! ఎంత అదృష్టం! ఆ దశరథుని కళ్ళలో కోటి పాల సముద్రాలు పరవళ్ళు త్రొక్కాయి. ఆయన కాళ్ళలో కోటి గుఱ్ఱాలు పరుపులెత్తాయి. అంతటి వృద్ధుడు హఠాత్తుగా యువకుడయ్యాడు అంతఃపురానికి వెళ్ళాడు. అందరికి ఆ శుభవార్త స్వయంగా చెప్పాడు. అయోధ్యలో చాటింపు వేయించాడు. మంత్రి పురోహిత బ్రాహ్మణ పౌరజానపదుల నంతా పిలిపించాడు. రేపే మిథిలకు ప్రయాణం అన్నాడు.

మిథిలలో సీతారాముల వివాహం. ఊర్మిలా లక్ష్మణుల వివాహం. మాండవీ భరతుల వివాహం. శ్రుతకీర్తి శత్రుఘ్నుల వివాహం. ఒకటికి నాలుగు పెళ్ళిళ్ళు. నలుగురు కోడళ్ళు. వియ్యాల వారి విందులు. వివిధ మర్యాదలు. అయోధ్యకు తిరుగు ప్రయాణం. మార్గ మధ్యంలో హఠాత్తుగా పరశురామ ప్రమాదం. దశరథుని స్థితి కొండమీది నుండి క్రిందికి కాలు జారినట్లుంది.

పరశురాముడు ప్రళయభీకరుడు. క్షత్రియ జాతికి మృత్యుతుల్యుడు. రాముడు ధనుష్యగుద్ధతో ఉన్నాడు. పాణిపాదాలతో ఉన్నాడు. ప్రమాదం నుండి బయటు పడటం ఎలాగ? దశరథుడు మానసికంగా మెలికలు తిరిగి పోయాడు. నలిగిపోయాడు.

అయితే అనుకోకుండా ఆప్రమాదం త్రుటిలో తప్పిపోయింది. రాముని ఎదుట పరశురాముడు వెలవెల పోయాడు పరశురాముని చాపం అవలీలగా అ రాముడందు కొన్నాడు. అంతటి పరశురాముడు ఓడిపోయాడు. రామునికి ప్రణమిల్లాడు. మారుమాడాడ కుండా మహేంద్ర గిరికి తరలివెళ్ళాడు.

దశరథునికి అంతామాయగా ఉంది. ఇరువది ఒక్కమారు ధరణీశులనెల్ల వధించి తద్రుధిర ధారలతో తండ్రి తర్పణం చేసిన ఆపరశురాముణ్ణే తనకుమారుడు పరాభూతుణ్ణి చేశాడు. కొడుకు గొప్పతనం తండ్రి ఊహ కందలేదు.

దశరథుడు సపరివారంగా అయోధ్య చేరుకొన్నాడు. శోభాయమానంగా

కోడళ్ళ గృహప్రవేశం జరిపించాడు. సంతోషంగా ఒక్క ఊపిరి విడిచాడు. కొడుకులు లేరనుకున్న తనకు కొడుకులు గలిగారు. వాళ్ళు పెరిగి పెద్ద వారయ్యారు పేరు ప్రతిష్ఠ లార్జించారు. పెళ్ళి చేసుకున్నారు. అందరిలో రాముడు జ్యేష్ఠుడు. అన్నివిధాలశ్రేష్ఠుడు తేజస్సులో, పరాక్రమంలో, ప్రజానురాగంలో, ధర్మశీలంలో, దయాస్వభావంలో, దాన గుణంలో ఆయన తండ్రిని మించిన తనయుడు.

అప్పుడు దశరధునికి తన ముసలితనం గుర్తు వచ్చింది. రాముని ప్రభువుగా పొందాలన్న ప్రజాభిప్రాయం కళ్ళముందు కన్పించింది. వెంటనే ఆయన మంత్రులను పిలిపించాడు. సామంతులను సమావేశ పరిచాడు. పురోహితులను ఆహ్వానించాడు. పౌరజానపద ప్రముఖులను రప్పించాడు. రాముని యౌవరాజ్యాభిషేకాన్ని గూర్చి ప్రస్తావించాడు. అందరు అందుకు హర్షించే వాళ్ళే. అందరు అందుకు ఆమోదించే వాళ్ళే. అందరు ఆ రాముని గుణాగణాలు ప్రశంసించే వాళ్ళే.

పుత్రప్రశంస విని దశరథుడు పులకించాడు. పట్టాభిషేకాన్ని నిర్ణయించాడు.

దశరథుని జీవితంలో అదొక పండుగదినం. అయితే ఎందుచేతనో దశరథుడు జనక మహారాజును పిలువలేదు. కేకయరాజును రమ్మనలేదు. దూరంలో ఉన్నారు గనుక వారి రాక ఆలస్యమౌతుందని అనుకొన్నట్లుంది. అయినా అది తగిన కారణం గాదు. ఎందుకో ఆ వృద్ధరాజు అన్నీ త్వరగా జరిపించాలనుకొన్నాడు. తొందరపాటు ఆయన స్వభావంలో ఒక భాగం. అందుకు దోడు భరతుడు పోటీవస్తాడేమో అని ఆయన భావన. ఆ భావనకు అనేక అపశకునాలు గూడ దోహదం చేశాయి.

దశరధుడు సుమంత్రుని పంపాడు. రాముని వెంటనే పిలుచుకొని రమ్మన్నాడు. మేడ మీద కొలువుదీరిన ఆ దశరథుని చూపంతా రాజమార్గం మీదనే. ఆయన రథంలో కూర్చుని వచ్చే రాముని రూపాన్ని చూచాడు. రథం దిగి మదేభంలా మేడ మెట్లెక్కి వచ్చే ఆ రాముని నడక తీరు చూచాడు. చేతులు మొగిడ్చి సమక్షాన నిలిచిన రాముని వినయవిధేయతలు చూచాడు. రత్నఖచిత సువర్ణాసనం మీద కూర్చున్న ఆ రాముని రాచఠీవి చూచాడు. మేరు పర్వతం మీద ఉదయభానునిలా ప్రకాశిస్తున్న ఆ ప్రియ పుత్రునిలో ఆత్మబింబాన్ని దర్శించాడు. ఆనందభరితుడయ్యాడు. రాజస్వరంతో

'రామా ! నీవు శ్రేష్ఠుడివి, గుణశ్రేష్ఠుడివి. ప్రజాభిప్రాయాన్ని మన్నించి నీ యౌవరాజ్యాభిషేకాన్ని నిర్ణయించాను. వ్యసనదూరంగా ప్రజాహితధ్యేయంగా నీరాజ్య పాలన సాగాలి' అన్నాడు.

అందరు హర్షధ్వానాలు చేశారు. శ్రీరాముడు శిరస్సు వంచి సవినయంగా తండ్రికి నమస్కరించాడు. సెలవుదీసికొని వెళ్ళాడు.

దశరథుడు సభ చాలించి సుమంత్రుని పంపి మరల రాముని ఏకాంత మందిరానికి పిలిపించాడు.

'రామా ! నేను వృద్ధుణయ్యాను. జీవితంలో అనుభవించ వలసిన భోగాలన్నీ అనుభవించాను. చేయవలసిన దానధర్మాలు, యజ్ఞయాగాలు పూర్తి చేశాను. ఇక మిగిలింది ఒక్కటే. అది నీ యౌవరాజ్యాభిషేకోత్సవం.

ఎందుకో అనేక దుస్స్వప్నాలు వస్తున్నాయి. దుర్నిమిత్తాలు కనిపిస్తున్నాయి జ్యోతిష్కులు జాతకరీత్యా నాకు చెడ్డ దశ వచ్చిందంటున్నారు. ప్రాణాపాయం సంభవిస్తుందో, లేక పెద్ద ఆపదే ఏర్పడుతుందో ? అందుచేత నీ అభిషేకం ఆలస్యం కావటం నాకిష్టం లేదు. ఆలస్యం జరిగితే ఏ ఆటంకాలు వస్తాయో ! రేపే పుష్యమీ నక్షత్రం. నీ యౌవరాజ్యాభిషేకం.

ఈ రాత్రికి భార్యా సహితంగా నీవు ఉపవాసవ్రతం స్వీకరించు. దర్భల మీద శయనించు శుభకార్యాలకు విఘ్నాలు అనేకాలు. నీ మిత్రులనంతా హెచ్చరించు. ఏ విఘ్నాలూ ఏర్పడకుండా చూడు.

భరతుడు రాకముందే నీ అభిషేకం జరగాలి. నీ తమ్ముడు మంచివాడే, నీకు విధేయుడే. అనుమానం లేదు. అయినా ఎవరి మనస్సు ఎప్పుడు ఎలా మారుతుందో చెప్పలేము. ఆలస్యం కాకుండ నీ అభిషేకం జరిగి పోవాలి ' అన్నాడు ఆప్యాయంగా.

రాముడు ఏమీ బదులు చెప్పలేదు. పితృదేవునికి నమస్కరించి మాతృమూర్తి మందిరానికి బయలుదేరాడు.

దశరథుడు తృప్తిగా ఒక్కదీర్ఘ నిట్టూర్పు విడిచాడు.

ఆ సంతోష సమయంలో ఆయన మనస్సు కైకేయి మీదికి మరలింది. ఆమె సౌందర్యం, యౌవనం, ఆయనను మరులు గొలిపాయి. ఆనాడు వృద్ధరాజు

విశేషంగా అలంకరించుకున్నాడు. ఆ ప్రియ భార్యకు శుభవార్త స్వయంగా చెప్పాలని, ఆమె సౌందర్యాన్ని, యౌవనాన్ని చూసి తనివి తీరా అనుభవించాలని కైకేయి అంతఃపురానికి వెళ్ళాడు. శయ్యామందిరంలో ఆమె లేదు. ఆ మందిరమంతా చిన్నబోయి ఉంది. చెలికత్తె కోప గృహం వైపు చూపించింది. దశరథుడు ఆ కోప గృహాలోకి వెళ్ళాడు. అటు ఇటూ చూశాడు. కైకేయి ఎక్కడో ఒకమూల పడి ఉంది చెట్టు నుంచి తెగిపడిన తీవలా ఉంది. పుణ్యమంతా తరిగి పోయి దివి నుంచి భువికి పడిన దేవతలా ఉంది.

దశరథుడు 'కైకా !' అని పిలిచాడు. ఆమె పలుకలేదు.

ప్రియమార ప్రక్కన వచ్చికూర్చున్నాడు. అటుఇటు పొరలించాడు.

ఆమె పెడ మొగం పెట్టింది.

'కైకా ! ఎందుకీ కోపం. ఎవరైనా నిన్ను అవమానించారా ? ఆరోగ్యం సరిగా లేదా ? ఏదైనా కోరుతున్నావా ? చెప్పు. నా ప్రాణాలైనా ఒడ్డి నీ కోరిక నెరవేరుస్తా. అలకమాను. నన్ను అనుగ్రహించు అన్నాడు దశరథుడు ఒనుని యిస్తూ.

'ప్రభూ నాకే అనారోగ్యమూ లేదు. నన్నెవ్వరూ అవమానించలేదు. నా కోరిక తీరుస్తానని మాటయిస్తే మనవి చేస్తా' అంది కైక ఎంతో బిగుపుగా.

దశరథుడు ఆమె ముంగురులు సవరిస్తూ 'కైకా ! నాకు నీ కంటె ప్రియ కాంత లేదు. ఆ రాముని కంటె ప్రియపుత్రుడు లేడు. ప్రాణాధికుడైన రాముని సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. జన్మజన్మల పుణ్యం మీద ప్రమాణం చేస్తున్నాను నీ కోరిక నెరవేరుస్తాను' అన్నాడు ఆమె కళ్ళల్లోకి ప్రేమగా చూస్తూ.

కైక అప్పుడు చిరునవ్వు నవ్వింది. మురిపాలు ఒలకపోస్తూ మగని మెడ చుట్టూ చేతులు మెలివేసింది. 'శంబరాసుర సంగ్రామంలో నాకిచ్చిన వరాల సంగతి మీకు గుర్తుందా ?' అంది చిలిపిగా చూస్తూ.

దశరథుడు ఆమెను గాఢంగా కౌగిలించుకొన్నాడు.

'శ్రీరామునికై సిద్ధం చేసిన అభిషేక సామగ్రితో భరతునికి పట్టాభిషేకం జరిపించండి. పదునాలుగేళ్ళు ఆరాముని అరణ్యవాసం పంపించండి' అంది కైక,

కైక కోరికలు కాల సర్పంలా ఒకటికి రెండుకాట్లు వేసినట్లున్నాయి.

దశరథుడు స్పృహతప్పిపడి పోయాడు. ఎంతసేపటికో మూర్ఛదేరాడు. ఒక కంట కోపాగ్ని. మరో కంట శోకాగ్ని, దశరథుని రెండు కళ్ళు ఎఱ్ఱబడ్డాయి.

'కైకా! నీవు క్రూరురాలివి. నేనుగాని, నా రాముడుగాని నీకేం అపకారం చేశాము. రాముడు నిన్ను కన్నతల్లి కన్న అధికంగా గౌరవిస్తున్నాడే. అతనికే ఇంత అపకారం తలపెట్టావా! రాముడు నా జ్యేష్ఠపుత్రుడు. ప్రాణప్రియుడు. అతనిని చూడకుండ క్షణమైనా బ్రతుకలేను. నీ పాదాలకు నమస్కరిస్తాను. ఆ పాపచింతన వదలు. నా రాముని దూరంచేయకు. నా ప్రాణాలు తీయకు' అని పరిపరి విధాల ఆ రాత్రంతా ఆమెను బ్రతిమాలు కొన్నాడు. రామున్ని ప్రమాదాలు పేర్కొన్నాడు. కన్నీళ్ళు కార్చాడు. కాళ్ళు పట్టుకొన్నాడు.

అయినా కైక మనస్సు కరుగలేదు. పైగా చెప్పినా మాట చెల్లించమని ఆమె భర్తను నిర్బంధించింది.

ఆ రాత్రి ఎలా గడిచిందో దశరథునికి తెలీదు. తెల్ల వారిన సంగతి గూడ ఆయనకు తెలీదు. ఆయన దృష్టికి అంతా చీకటి మయం.

అయోధ్యలో అభిషేక సన్నాహాలు ముమ్మరంగా సాగుతున్నాయి. రాజ మార్గాలన్నీ రకరకాల అలంకారాలతో, జనసమూహాలతో అలరారుతున్నాయి. ప్రతి వ్యక్తి ఇంట్లో, కంట్లో పండుగ వేడుకలు గూళ్ళు కట్టుకొన్నాయి. అంతః పురం మహామనోహరంగా ఉంది.

ప్రభాత మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి. బ్రాహ్మణోత్తములు బంగారు కలశాల్లో అభిషేక జలాలు తెస్తున్నారు. పాలు. పెరుగు, నెయ్యి, తేనె, దర్భలు పండ్లు, పూలు సిద్ధం చేస్తున్నారు. సింహాసన ఛత్రచామర శ్వేతాశ్వభద్రగజాది సకల రాజలాంఛనాలు సిద్ధంగా ఉన్నాయి. మంత్రి సామంత పౌరజానపద ప్రముఖులంతా వచ్చారు. వసిష్ఠుల వాడు గూడ సభామంటపం ప్రవేశించారు. యాజ్ఞికపు పేర్పాట్లన్నీ స్వయంగా సమీక్షించారు, అందరు ఆ మహారాజు కొరకే ఎదురు చూస్తున్నారు.

దశరథుడు ఇంకా రాలేదు. ఆయన కైకేయి అంతఃపురంలో కన్నీరు కారు స్తూ పడుకొనే ఉన్నాడు.

అక్కడికి సుమంత్రుడు వచ్చాడు! సుప్రభాత వచనాలతో ప్రభువును

దర్శించాడు. మహారాజా ! సభా మంటపంలో అందరు తమ కొరకు ఎదురుచూస్తు న్నారు. ముహూర్తం సమీపిస్తూ ఉంది. కుమారుని త్వరగా పిలుచుకొని రమ్మని వసిష్ఠులవారు నన్ను పంపారు. సర్వాలంకారాలతో సత్వరం బయలు దేరండి. శోభాయ మానంగా శ్రీరామాభిషేకం జరిపించండి' అన్నాడు.

దశరథుడు ఒకసారి బిగ్గరగా ఏడ్చాడు సుమంత్రుడు అదరి పడ్డాడు. అంత లోనే కైక ముందుకు వచ్చింది.

'సుమంత్రా! శ్రీరామభిషేకం జరుగుతుందన్న సంతోషంలో రాజుగారికి రాత్రంతా నిద్రలేదు. నీవు శీఘ్రంగా వెళ్ళి శ్రీరామచంద్రుణ్ణి పిలుచుకొనిరా' అని చెప్పిపంపింది.

సుమంత్రుడు శ్రీరాముని తో వచ్చాడు. శ్రీరాముడు తండ్రికి, తల్లికి నమ స్కరించి నిలిచాడు. కైకేయి తానే దశరథుడిచ్చిన వరాల సంగతి చెప్పింది. తానే దశరథుని మాటగా రాముని అడవికి వెళ్ళమని తొందర పెట్టింది.

పాపం ! దశరథుడు మాట్లాడలేక పోయాడు. దుఃఖభారంతో క్రుంగి పోయాడు.

అది రాముడు సీతాలక్ష్మణులతో అడవులకు బయలుదేరి తండ్రి అనుమతి కొరకు కైకేయి అంతఃపురానికి మరొకసారి వచ్చిన సమయం. అప్పటికి దశ రథుడింకా దుఃఖంలోనే మునిగి ఉన్నాడు. అయితే సుమంత్రుని పంపి అంతఃపుర రాణులనంతా పిలిపించాడు. ఆనాడు అభిషేకం పూర్తి అయి ఆపాటికి అయోధ్యా సామ్రాజ్య యువరాజుగా సింహాసనం మీద అలరార వలసిన ఆ శ్రీరామచంద్రుడు అర్ధాంగితో, అనుగు తమ్మునితో అడవులకు బయలుదేరి అనుమతి కొరకు తన యెదుట నిలిచే సరికి ఆ తండ్రి హృదయం దహించుకు పోయింది. పైకి లేచి పుత్రుని కౌగిలించుకోబోయాడు. పట్టరాని దుఃఖంతో నేల మీద కూలబడ్డాడు అందరు ఆ వృద్ధరాజును పడక మీదికి చేర్చారు. ఎంతసేపటికో ఆయన తేరు కొన్నాడు. కొడుకు వైపు తిరిగి కళ్ళనిండా నీళ్ళుకారుస్తూ రామా ! నీవు కానలకు వెళ్ళవద్దన్నాడు. కైకేయి నన్ను మోసం చేసిందన్నాడు. ఆమె కుటిలాత్మురాలు అన్నాడు. క్రూరురాలన్నాడు. నీవు లేనిదే నేను బ్రతుకలేనన్నాడు. ఈ రాత్రి కైనా ఇక్కడ ఉండి వెళ్ళమన్నాడు.

రాముడు- అలా ఉండటం ఉచితం కాదని, సత్యపాలన అవశ్య కర్తవ్యమని, వెంటనే అడవులకు వెళ్ళక తప్పదని అనగానే, దశరథుడు సుమంత్రుని వైపుతిరిగి

'నా రాముడు కష్ట పడటం నేను భరించలేను. అడవిలో నా రామునికి ఉపయోగకరంగా రత్నరాసులను, చతురంగ బలాలను సిద్ధం చేసి పంపు' అన్నాడు.

అందుకు కైకేయి అభ్యంతరం తెలిపింది. పాపం! దశరధుడు సుడివడిపోయాడు.

'అరణ్యవాసానికి నార చీరలు తప్ప నాకేమీ అక్కర లేద'న్నాడు రాముడు.

వెంటనే కైక స్వయంగా సీతారామలక్ష్మణులకు నార చీరలు తెచ్చి యిచ్చింది.

దశరధుడు కొయ్యబారి చూస్తూ కూర్చున్నాడు. అప్పుడు సీతకు ఆ నార చీర కట్టుకోవడం చేతకాక పోవటం రాముడు ఆ విషయంలో ఆమెకు సహాయం చేయటం, ఒక్కసారిగ సీతారామలక్ష్మణులు మునివేషధారులుగా మారిపోవటం తనకు, కౌసల్యా సుమిత్ర కైకలకు తక్కిన రాణులకు వారు నమస్కరించటం, సుమంత్రుడు సిద్ధం చేసిన రధమెక్కి అడవులకు బయలు దేరటం, ఆ రథం కదిలే సరికి అంతఃపురం అంతఃపురమూ ఏక కంఠంగా ఏడ్వటమూ, అయోధ్యాపుర వాసులంతా అడవులకు మేమూ వస్తామని ఆక్రోశిస్తూ ఆ రథం వెంట పరుగెత్తటమూ — అంతా ఆ దశరథుని కళ్ళముందే జరిగిపోయింది.

పాపం! దశరథుని హృదయం బద్దలైపోతూ ఉంది. రథం రాజమార్గాన సాగిపోతూ ఉంది. ప్రజలంతా రథం వెంట బడి పరుగెత్తుతున్నారు అంతఃపురంలో అయోధ్యా నగరంలో ఏటు చూచినా ఏడుపులే, కన్నీటిధారలే.

దశరథుడు నిలువలేక పోయాడు. తడబడే కాళ్ళతో, కన్నీట తడిసే ముఖంతో, పెద్దగా ఊర్పులు విడుస్తు పరుగెత్తలేక పరుగెతలేక పరుగెత్తి అలసిపోయి అల్లంత దూరాన ఆగి 'సుమంత్రా! రథం ఆపు'అన్నాడు.

రాముడు ఆ తండ్రి దీనస్థితిని దుఃఖాన్ని చూడలేక 'సుమంత్రా! రథం పోనీ' అన్నాడు.

రథం ఆగలేదు.

దశరథుడు వాడిన తోటకూరకాడలా తల వాల్చి వెనుదిరిగాడు. అంతఃపురంలో కైకేయి కన్పించింది.ఆమెను చూడగానే దశరథుని ఆవేశం పొంగి పొరలింది. కైకేయి!నీకోరిక నెరవేరింది. నా రాముని విడిచి నేను బ్రతుక లేను.నీవు ఇక విధవగా

అమితంగా శోకించాడు. ప్రక్కనున్న పరిచారికలతో నాకిక్కడ మనశ్శాంతి లేదు. నన్ను శీఘ్రమే కౌసల్యా మందిరానికి చేర్చండన్నాడు.

అది కౌసల్యా మందిరం. సమయం అర్ధరాత్రి అయినా దశరథుడు నిద్ర పోలేదు. ఆయన దుఃఖిస్తునే ఉన్నాడు.

కౌసల్య గూడ నిద్రపోలేదు. ఆయనతోపాటు ఆమె గూడ దుఃఖిస్తూ కూర్చునే ఉంది. 'కౌసల్యా! కుటిలాత్మురాలైన కైక మాట విని నీకు నేను అన్యాయం చేశాను. రామునికి అన్యాయం చేశాను. దుఃఖతాపంలో నాశరీరం దహించుకు పోతూ ఉంది. నన్ను క్షమించు. నీచేత్తో నాదేహాన్ని, నిమురు. కొంతకు కొంత ఉపశమనంగా ఉంటుంది. అని కౌసల్యాను బ్రతిమాలు కొన్నాడు

ఆ రాత్రి అలాగే గడిచింది. అతరువాత ప్రతి పగలు ప్రతి రాత్రి అంతే.

సుమంత్రుడు తిరిగి వచ్చాడు. సీతారామలక్ష్మణులను అరణ్యంలో దించి. వచ్చిన వైనం వివరించాడు. పాపం దశరథుడు అడిగిందేఅడిగాడు వినిందేవిన్నాడు, సుమంత్రుడు చెప్పిందే చెప్పాడు.

దశరథునిది దుఃఖమనే ఊబిలో దిగబడిన ఏనుగు లాంటి స్థితి. తరిగి పోతున్న తైలంలో ఉన్న దీపశిఖలాంటి స్థితి. ప్రతిక్షణం ఆయన క్రుంగిపోతూనే ఉన్నాడు.

అది ఆరవ రోజు రాత్రి. దశరథుడు కన్ను మూయలేదు. కౌసల్యా! నేనొక శాపగ్రస్తుణ్ణి అన్నాడు. తన శాపవృత్తాంతం చెప్పాడు ఆ శాపఫలమే ఈశోక మన్నాడు. కౌసల్యా! నా దృష్టి మందగిస్తున్నదన్నాడు. ఏమీ అగుపించటం లేదన్నాడు. కౌసల్యా! నా స్మృతి తప్పుతున్నదన్నాడు. ఏం చెబుతున్నానో తెలియటంలేదన్నాడు. అదుగో యమదూతలు రమ్మంటున్నారన్నాడు. మరణ కాలంలో నా రాముడు లేడే అన్నాడు. కన్నీళ్ళు కార్చాడు.

'కౌసల్యా! కౌసల్యా! సుమిత్రా! సుమిత్రా! శ్రీరామా! శ్రీరామా!' అంటూ శ్వాస వదిలాడు. శాశ్వతంగా కన్నుమూశాడు.

దశరధుడిక లేడు. తిరిగిరాడు.

దశరథుని జీవితం చిత్రమైంది. పుత్రులు లేరని ఆయన జీవితంలో పెద్దకాలం దుఃఖించాడు. ఉన్న పుత్రులను వదులుకొని వృద్ధాప్యంలో విపరీత శోకం అనుభవించాడు. చివరకు ఆ శోకంతోనే మరణించాడు

మరి ఆయన పుత్రానందం ఏ మాత్రం ననుభవించాడో! ఎప్పుడు అనుభవించాడో!

రావణ వధానంతరం అగ్నిశుద్ధ అయిన అర్థాంగిని రాముడు పరిగ్రహించే సమయంలో బ్రహ్మాదులతో పాటు దశరథుడు గూడ స్వర్గలోకం నుండి దివ్య విమానంలో వచ్చాడట. తనకు నమస్కరించిన రామలక్ష్మణుల కౌగిలించుకొన్నాడట ఆనందాతిరేకంతో ఆ రాముని అభినందించాడట. రావణ సంహార రూపమైన మహాకార్యం జరిపించటానికే దేవతలు రామ పట్టాభిషేకం భంగం చేశారని ఆయనను అడవులకు పంపించారని గ్రహించాడట. రాముని అభ్యర్థన మన్నించి కైకేయి భరతులను క్షమించానన్నాడట. బ్రహ్మాదులు వర్ణించినట్లు విష్ణు స్వరూపుడైన రామునికి, లక్ష్మీ స్వరూపురాలైన సీతకు సపర్యలు చేసి నీజన్మ ధన్యం చేసుకొన్నావని లక్ష్మణుని అభినందించాడట. నీ పరిశుద్ధతను ప్రకటించటానికే రాముడు నిన్నగ్నిప్రవేశం చేయించాడని సీతకు చెప్పాడట. ఆ రాముడే నీకు పరమదైవమని పలికి అంతర్ధానమయ్యాడట.

పితృదేవుడు పుత్రుల వలన ఆనందాన్ని ఫలాన్ని అప్పుడు పొందాడట.

అదొక అలౌకికానందం.

లౌకికంగా దశరథుడు శాపగ్రస్తుడు. పుత్రశోక పరితప్తుడు. ఉత్తమోత్తములైన పుత్రుల్ని కని లోకానికిచ్చి, జీవితంలో చివరిదాకా వారి అభివృద్ధిని కన్నార గాంచే, అదృష్టం వారితో సహజీవనం చేసే సదవకాశం లేక చివరి రోజుల్లో చేతులార వారిని దూరం చేసుకొని దుఃఖసాగరంలో మునిగి మరణించిన తండ్రి దశరథుడు.

# లక్ష్మణుడు

లోకంలో అన్న ననుసరించే తమ్ముడుండటమే అరుదు. అన్నకు సేవలు చేసే తమ్ముడుండటం ఇంకా అరుదు. అలాంటప్పుడు యౌవన సుఖాలు, భోగ భాగ్యాలు, స్వార్థభావాలు సర్వమూ త్యాగం చేసి, అన్న కష్టాల్లో తానూ పాలు పంచుకొని అడవులపాలై, అన్నసేవకే జీవితాన్ని అంకితం చేసే తమ్ములెంద రుంటారు ? బహుశః విశ్వచరిత్రలో అలాంటి తమ్ముడు ఒక్క లక్ష్మణుడే యేమో.

అన్న గుణవంతుడే కావచ్చు. బలవంతుడే కావచ్చు. కీర్తిమంతుడే కావచ్చు. ఆయనను గౌరవించవచ్చు. ఆటపాటల్లో, విద్యావిహారాల్లో ఆయనను అనుసరించవచ్చు కాని ఆయనతోపాటు తానూ వివాహమాడి, ఎవరివల్లనో ఆయన కన్యాయం జరిగిందని, ఆయన జీవితం అడవుల పాలౌతున్నదని, ఒక విధ మైన భక్త్యావేశంతో యౌవనభోగాలకు, సర్వసుఖాలకు స్వస్తి చెప్పి, అర్ధాంగిని గూడ అయోధ్యానగరంలోనే వదలి, ఆ తరుణ వయస్సులో అన్నవెంట అడవులకు తరలి వెళ్ళి అతికఠోరతాపస దీక్ష వహించి, పగలనక రేయనక పదునాలుగేళ్ళు అన్నకు, వదినెకు సేవలు చేయటం, అనేక కష్టాలు అనుభవించటం సామాన్య మైన త్యాగంకాదు. సాధారణమైన భ్రాతృభక్తి గాదు. అందువల్లనే లక్ష్మణుడు లోకంలో భ్రాతృభక్తికి పర్యాయపదమయ్యాడు. స్వార్థత్యాగానికి ప్రతి రూప మయ్యాడు.

అయోధ్యలో ఆనాడు అంతపెద్దయెత్తున తలపెట్టిన రామాభిషేకం ఆగి పోయింది. అంతేగాక అయోధ్యాసింహాసనాన్ని అధిష్ఠించటానికి ఆయత్తమైన ఆ రామచంద్రుడు అరణ్యవాసానికి బయలుదేరాడు. కన్నతల్లి కౌసల్య అంతః పురానికి వెళ్ళాడు. ఆమె ఆశీస్సులందు కోవటానికి : అనుమతి పొందటానికి. అక్కడ లక్ష్మణుడు అన్న కొరకు ఎదురుచూస్తున్నాడు.

లక్ష్మణుడు ఆవేశపరుడు, అన్నపట్ల ఆయనది భక్త్యావేశం , అపరాధులపట్ల ఆగ్రహావేశం. అరణ్యవాసానికి సిద్ధమై వచ్చిన ఆ అన్నను, కంటికి కడివెడుగ ఏడ్చే

ఆ తల్లి కౌసల్యను, అయోధ్యానగరాన్ని అలముకొన్న ఆ విషాదవాతావరణాన్ని, కైకేయి కౌటిల్యాన్ని, దశరథుని ఆదేశాన్ని, అశుభపరిణామాన్ని చూచేసరికి లక్ష్మణుని ఆగ్రహావేశం పట్టు తప్పింది. కట్టలు త్రెంచుకొంది. అతడు నొసలు ముడిచాడు. పెదవులు బిగించాడు. కుపితసర్పంలా బుసలు విడిచాడు. ఇంతలో రాముడు తల్లి పాదాలకు నమస్కరించాడు: 'అమ్మా! అరణ్యవాసానికి అనుమతించి ఆశీర్వదించు' అని అర్థించాడు. రాముని తలమీద కన్నీళ్ళు వర్షిస్తూ ఆ తల్లి అలాగే నిలబడి ఉంది. అంతఃపురమంతా ఆమె కన్నీళ్ళల్లో ఎక్కడికో కొట్టుకు పోతున్నట్లుంది.

లక్ష్మణుడు ఆవేశంతో తన చేతి ధనుస్సుకొసను నేలకు తట్టి, అడ్డంగా కడగంట అన్నవైపుచూచి 'అన్నా ఆగు. అరణ్యానికి వెళ్ళొద్దు' అన్నాడు. తల్లి కౌసల్యవైపు తిరిగి 'అమ్మా! అడవులకు వెళ్ళవలసిన అపరాధం అన్న ఏం చేశాడు శత్రువులు గూడ ఆయనవల్ల ఏ దోషాన్నీ ఎత్తి చూపలేరే. ఆయన సర్వసద్గుణ సంపన్నుడే. రాజ్యాధికారానికి ఎందుకు దూరం కావాలి ? అడవులకు ఎందుకు వెళ్ళాలి ?

దశరథుడు వృద్ధుడయ్యాడు. మతి చెప్పాడు. అంతేగాదు, కామలోలుడయ్యాడు కైకేయి వలలో పడ్డాడు ధర్మం తప్పాడు. తానే నిర్ణయించిన పట్టాభిషేకం ఆపాడు. అకారణంగా అన్నను అడవులకు పొమ్మన్నాడు. అలాంటి దశరథుని మాటను మనం ఎందుకు పాటించాలి' - అన్నాడు ఆవేదనగా.

అన్నవైపు చూడలేక ఎటోచూస్తూ ఆయనను సంబోధించి 'అన్నా! ధనుర్ధారినై నేను నీ ప్రక్కన నిలబడతా. పట్టాభిషేకం జరిపిస్తా, ఎవడడ్డు వస్తాడో చూస్తాను. అవసరమైతే అయోధ్యలో అందరిని నరికివేస్తా, ఆ దశరథుడు అడ్డువచ్చినా దచేడన తప్పదు. నిన్ను, నన్ను ఎదిరించి ఆ దశరథుడు భరతునికి ఎలా పట్టం గడతాడో చూస్తా. ఆయన మన తండ్రి కావచ్చు. ఉచితానుచితాలు ధర్మాధర్మాలు విస్మరించి విషయలోలుడై ఒక మగువకులొంగి మనకు అన్యాయం చేస్తే ఆయనకూ దండన తప్పదు' అన్నాడు ఆవేశంగా తలపంచుకుంటూ.

రాముడు తమ్ముని వైపు చూస్తూ అట్లే నిలబడాడు. అంతా విన్నాడు.

కౌసల్య లక్ష్మణుని కౌగిలించుకొంది కన్నీరు రాల్చింది.

'అమ్మా ! ఈ ధనుస్సాక్షిగా చెప్తున్నాను. అన్న అంటే నాకు అమిత ప్రేమ ; అపారభక్తి. ఆయన అగ్నిలో దూకినా, అడవికి వెళ్ళినా నేనే ఆయన కంటె ముందుంటాను. సూర్యుడు చీకట్లను పారద్రోలినట్లు మీ దుఃఖాన్నంతా త్రుటిలో తొలగిస్తాను' – అని పళ్ళుగొరికి వెళ్ళబోయే సరికి రాముడు భుజంపట్టి ఆపాడు. ఆప్యాయంగా 'తమ్ముడూ ! ఆవేశపడకు' అన్నాడు. అమ్మను, తమ్ముణ్ణి అనేక విధాల అనునయించాడు. భర్తృసేవ భార్యలకు విహితధర్మ మన్నాడు. తల్లి పాతివ్రత్యాన్ని ప్రస్తుతించాడు. తండ్రి ఆజ్ఞ తనయులకు శిరోధా ర్యమన్నాడు. తమ్ముని బలపరాక్రమాలు ప్రశంసించాడు.

తన నిర్ణయం మారదన్నాడు. అంతా దైవఘటన అన్నాడు. అయినా లక్ష్మణుని ఆవేశం తగ్గలేదు. అతడింకా రోజుతూనే ఉన్నాడు.

రాముడు 'తమ్ముడూ ! ఇది వరకెన్నడైన కైకమ్మ నాపట్ల ఈ విధంగా ప్రవర్తించిందా. కన్నతల్లిలా నన్ను ప్రేమించిది గదా. భరతునితో సమానంగా నన్నాదరించింది గదా. ఇప్పుడామెకీ బుద్ధి దైవమే పుట్టించింది. అందుకు దుఃఖించగూడదు. ఆమెను దూషించగూడదు. అభిషేకం కొరకు తెచ్చిన తీర్థజ లాలతో తాపసవ్రత స్నానంచేసి నిశ్చింతగా నేను అడవులకు వెళ్ళతా? ఆగ్ర హావేశాలకు, ఆవేదనలకు ఇది అదనుగాదు. దైవ నిర్ణయం దాటరానిది. ధర్మం తప్పరానిది' – అనేసరికి లక్ష్మణునికి ఊపిరాడలేదు. అతని ఆగ్రహావేశానికి ఎటు పోవటానికి తోచలేదు.

లక్ష్మణుని ఆవేశానికి ధర్మం, దైవం పెద్దకొండల్లా అడ్డుపడ్డాయి. అయినా అతని ఆవేశం ఆగలేదు. ఆ కొండలనే శక్తికొలది ఢీకొన్నది. అతడు అన్నవైపు తిరిగాడు. ఏదో చెప్పబోయాడు చెప్పలేకపోయాడు. అతని పెదవుల కంటె ముందు ఊపిరితిత్తులు వేగంగా కదులుతున్నాయి. బుసలు విడుస్తు న్నాయి. సెగలు గ్రుక్కుతున్నాయి. అలాగే తలవంచుకొని కడగంట అన్న వైపు అడ్డంగా చూస్తూ 'అన్నా ! నీ వనే ధర్మం నిజం కాదు. నీవు చెప్పే దైవా నికి శక్తి లేదు. దశరథుడు చేసింది ధర్మమా ! అది కుట్ర. ఒక పెద్ద కుట్ర. ధర్మమే అయితే కైక ఏనాడో తన రెండు వరాలు కోరి ఉండేది. ఆయన ఇచ్చే ఉండేవాడు. ఇంతకాలం ఇద్దరూ ఊరుకోవటమా ! ఇప్పుడు నీ పట్టాభిషేకం అనేసరికి ఆమె వరాలు కోరటమా ! ఆయన ఇవ్వటమా ! నీవుండగా భరతునికి

పట్టం గట్టటం సాధ్యం కాదని ఇద్దరు కలిసి పన్నిన కుట్రఇది. ఇది ధర్మమా! ధర్మంకోస ధర్మాన్ని, లోకవిరుద్ధమైన ధర్మాన్ని తండ్రి చెప్పినంత మాత్రాన తుచ తప్పకుండా పాటించటం ధర్మమా! ఏ మాత్రం కాదు.

పైగా దశరథుని వార్ధక్యాన్ని, కామలౌల్యాన్ని స్వార్థానికి ఉపయోగించు కొన్న కైకేయి చేష్ట దైవనిర్ణయమా! అది అవిలంఘ్యమా!

అయితే దైవం మీదనే నాకు గౌరవం లేదు. నమ్మకం లేదు. బలహీనులు, అవివేకులు ఆ దైవాన్ని ఆశ్రయిస్తారేమో! పరాక్రమ వంతులు మాత్రం ఆ దైవానికి లొంగరు. స్వసామర్థ్యం చేతనే తమ కార్యాలు సాధించుకొంటారు. సమర్థుడు తన పురుషకారం చేత దైవాన్ని అణచివేస్తాడు. ఆశించిన ఫలితాన్ని అందుకొంటాడు.

పురుషసామర్థ్యం గొప్పదో, దైవబలం గొప్పదో ఇప్పుడే నిరూపిస్తాను. మీ పట్టాభిషేకాన్ని చెడగొట్టిన ఆ దైవాన్ని నా పౌరుషంతో ప్రతిహతం చేస్తాను. మావటివాడు మదగజాన్ని అంకుశంతో ఏ విధంగా మళ్ళిస్తాడో అనివార్యమని చెప్పే ఆ దైవనిర్ణయాన్ని నా పౌరుషంచేత నివారిస్తాను. నీ పట్టాభిషేకం జరిపిస్తాను. అష్టదిక్పాలకులు లేత్తివచ్చినా, ముల్లోకాలు మీదికి వచ్చినా నీ పట్టాభిషేకం ఎలా ఆగుతుందో చూస్తాను. నిన్నెవరు పదునాలుగేళ్ళు అడవులకు పొమ్మన్నారో వాళ్ళే పదునాలుగేళ్ళు అడవుల్లో పడరాని పాట్లు పడేటట్లు చేస్తాను. అభిషేకానికి నీవు సిద్ధం కా- అని అని ఆవేశరుద్ధ కంఠంతో పలికి అశ్రుబిందువులు రాల్చాడు.

రాముడు తమ్ముని కన్నీళ్ళు తుడిచి, అతని ముఖాన్ని పైకెత్తి, సూటిగా కళ్ళల్లోకి చూచాడు. తమ్ముడూ! శాంతించు. నీ శక్తి నాకు తెలుసు అయినా నేను తండ్రి మాట దాటను. పరమధర్మం. దైవం బలవత్తరం. అగుపడనంత మాత్రాన అది లేదని కాదు. కష్టసుఖాలు, లాభనష్టాలు' జననమరణాలు అన్నీ దైవఘటనలే, అర్థంచేసుకోవాలి. అంతే —అని' ఖండితంగా తేల్చి చెప్పేసరికి లక్ష్మణుడు తలవంచాడు.

రాముడు కౌసల్య నూరడించి ఎట్టకేలకు ఆమె అనుమతిని, ఆశీర్వచనాన్ని పొంది సీతమ్మ అంతఃపురానికి బయలుదేరాడు.

లక్ష్మణుడు అక్కడే ఆగలేదు. అన్న వెంట సీతాదేవి సౌధానికి గూడ వెళ్ళాడు. మౌనంగా అంతా చూస్తూ నిలబడ్డాడు.

సీతాదేవి సౌధంలో అనేక విషాద సన్నివేశం. అడవులకు తానూ వస్తానంటుంది సీత. వద్దంటాడు రాముడు. వస్తానంటుంది సీత. వద్దంటాడు రాముడు. అది పతివ్రతాధర్మమంటుంది సీత. అక్కడ కష్టాలు పడలేవంటాడు రాముడు. పతిసాహచర్యమే పరమసుఖమంటుంది సీత. అరణ్యవాసం అతిభయంకరమంటాడు రాముడు. భర్తవెంట ఉంటే ఏ భయమూ లేదంటుంది సీత. అంతే గాదు. భర్తను ఎడబాసి తాను బ్రతకలేనంది. కంటి నిండా ఆగని కన్నీరు కార్చింది. భర్త హృదయాన్ని కరిగించివేసింది. 'అలాగే రమ్మని' ఆయనచే చెప్పించింది. సీతమ్మ చివరకు నెగ్గింది.

అంతా చూస్తూ నిలబడ్డ లక్ష్మణుడు అప్పుడు ముందుకు వచ్చాడు. అన్న పాదాలు పట్టుకొన్నాడు. తనకూ అనుమతి ఇమ్మని అర్థించాడు.

అనునయించి ఎంతదూరమో ఆ తమ్ముణ్ణి వారించటానికి రాముడు ప్రయత్నించాడు. నీవు సుకుమారుడివన్నాడు. ధర్మచారివన్నాడు. వీరుడివన్నాడు. సన్మార్గవర్తివన్నాడు. నాకు ప్రియుడివన్నాడు. ప్రాణసముడవన్నాడు. వశ్యుడివన్నాడు స్నేహితుడివన్నాడు. ఎంతో ఇష్టమైన తమ్ముడివి అన్నాడు. నీవు నా వెంటవస్తే ఎంతో అనుకూలమన్నాడు. అయితే అయోధ్యలో నీ ఉనికి అత్యవసరమన్నాడు. మాతృదేవతల యోగక్షేమాలు చూడమన్నాడు. ఏవేవో అడ్డంకులు చెప్పి రాముడు ఆ తమ్ముణ్ణి ఆపటానికి అనేక విధాల ప్రయత్నించాడు.

అయినా లక్ష్మణుడు వినలేదు, పట్టిన పాదాలు వదలలేదు. అయోధ్యలో మన మాతృదేవతలకు ఎవరి రక్షణ అక్కరలేదన్నాడు. నీ వెంట వస్తానన్నాడు. మీ దంపతులకు సహాయంగా ఉంటానన్నాడు. ధనుర్బాణాలు ధరించి క్రూరమృగాకీర్ణమైన అరణ్యంలో మీ ముందు నడుస్తానన్నాడు. ముళ్ళను, రాళ్ళను తొలగించి మీ మార్గం సుగమం చేస్తానన్నాడు. మీ ఆహారానికి కందమూలాలు సిద్ధం చేస్తానన్నాడు. ఫలాలు సేకరిస్తానన్నాడు. అహర్నిశలూ మీ సేవ చేస్తానన్నాడు. అదే తన జీవిత పరమార్థమన్నాడు. పసిబాలునిలా కాళ్ళకు పెనవేసుకొన్నాడు.

రాముడు దీర్ఘంగా ఒక్క నిట్టూర్పు విడిచాడు. 'అలాగే' అన్నాడు ఆ తమ్ముణ్ణి గ్రుచ్చియెత్తి కౌగిలించుకొన్నాడు. నీ స్నేహితులందరికి చెప్పి సెలవు తీసుకొని

రమ్మన్నాడు. వరుణుడిచ్చిన దివ్యధనుస్సు, అభేద్యకవచం, అక్షయతూణీరం సూర్యకాంతిసదృశఖడ్గద్వయం మనం వసిష్ఠ మహర్షియింట ఉంచాము-వచ్చేటప్పుడు వాటిని గూడ తీసుకొని రమ్మన్నాడు.

లక్ష్మణు ఆనందానికి అవధి లేదు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు సేవ లభించిన భక్తునిలా ఆనందపరవశుడయ్యాడు అన్న పాదాలు కళ్ళకద్దుకొన్నాడు. ఒక్క-ఊపున వెళ్ళాడు.

ఆయన ఎక్కడెక్కడికి వెళ్ళాడో !

ఎవరెవరిని కలుసుకొన్నాడో ?

తల్లి సుమిత్ర దగ్గరికి తప్పక వెళ్ళి ఉంటాడు. బాల్యమిత్రుల దగ్గరకు పరుగెత్తి ఉంటాడు. భార్య ఊర్మిళ దగ్గరకు పోకుండా ఉంటాడా! ఆనాడు లక్ష్మణుడు ఆమె దగ్గరికిఎలా వెళ్ళాడో! ఏం చెప్పాడో !ఎలా చెప్పాడో! ఆఇల్లాలు ఏమందో. ఏమీ తెలీదు. ఎవ్వరికీ తెలీదు.

మొత్తానికి లక్ష్మణుడు అన్నవెంట అడవికి బయలుదేరాడు. ఆయన చెప్పిన ఆయుధాలు తెచ్చాడు. ఆయన చేయిదలచిన దాన ధర్మాలకు అన్ని ఏర్పాట్లు చేశాడు. అన్న ఆనతిపై సమ్మానించటానికి సుయజ్ఞుని గూడ పిలుచుకొని వచ్చాడు. నారచీరలు ధరించాడు; చేత ధనుస్సు పట్టుకొన్నాడు. అరణ్యంలో త్రవ్వటానికి, ఎత్తిపోయటానికి అవసరమైన కొన్ని కొరముట్లు తీసుకొన్నాడు. సీతారామసేవకు-డుగా మారిపోయాడు.

లక్ష్మణుని జీవితంలో ఇది పెద్ద మలుపు. చిత్రమైన మలుపు. ఆయన స్వార్థత్యాగానికి, భ్రాతృభక్తికీ పతాకగా నిలిచిన మలుపు అందరు రాకుమారుల నుండి ఆయనను వేరుచేసిన మలుపు. అందరు భర్తలనుండి ఆయనను ప్రత్యేకించిన మలుపు. అందరు తమ్ముళ్లలో ఆయనను అద్వితీయుణ్ణి చేసిన మలుపు. లోకంలో ఆయన పేరును చిరస్థాయిగా నిలిపిన మలుపు

అది అరణ్యవాసంలో మొదటిరాత్రి. తమసానదీతీరం. లక్ష్మణుడు చెట్ల ఆకులతో సీతారాములకు శయ్యఏర్పాటు చేశాడు. అలసిపోయిన సీతారాములు ఆ శయ్య మీద నిద్రించారు. వారి ననుసరించి అయోధ్యనుండి వచ్చినవారంతా చెట్లక్రింద, గుట్టల మీద గుడ్డలు పరుచుకొని పడుకొన్నారు. గుబ్బుగొట్టి

నిద్రపోయారు. లక్ష్మణుడు మాత్రం నిద్రపోలేదు. అతని పదునాలుగేళ్ళ జాగరణ ఆ నాడే ఆరంభమైంది. సుమంత్రునితో రాముని సుగుణాలను గూర్చి ముచ్చటిస్తూ ఆ రాత్రంతా గడిపాడు. తెల్లవారక మునుపే సీతారామలక్ష్మణులు సుమంత్రుడుసిద్ధం చేసిన రథం ఎక్కి వెళ్ళిపోయారు. తెల్లవారితే అయోధ్య నుండి వచ్చినవారంతా తనవెంట వస్తారని, అడవుల్లో అనేక కష్టాలు పడతారని, అందుచేత వారిని తప్పించి వెళ్ళాలని రాముని ఉద్దేశం. అందుకే అంతముందుగా లేచి ఎంతోదూరం వెళ్ళటం జరిగింది.

అరణ్యవాసం అది రెండవరాత్రి. సీతారామలక్ష్మణులు శృంగిబేరపురం చేరుకొన్నారు, ఊరి ప్రక్కనే ఉన్న ఒక పెద్ద ఇంగుదీవృక్షం క్రింద విడిది చేశారు. గుహుని ఆతిథ్యం స్వీకరించారు. లక్ష్మణుడు దర్భతెచ్చి సీతారాములకు శయ్య ఏర్పాటు చేశాడు. గంగాజలం తెచ్చి సీతారాములకు త్రాగనిచ్చాడు. మిగిలినజలం తాను త్రాగాడు. ఆ గంగాజలంతోనే సీతారాముల పాదాల కంటిన మట్టికడిగాడు. వారి పవిత్రపాదాలు కళ్ళకద్దుకొన్నాడు. సీతారాములు శయ్యపై పవ్వళించిన తరువాత చేత ధనుస్సు ధరించి ఆ రాత్రంతా వారికి రక్షగా అటు తిరిగాడు గుహుడు తానూ రక్షగా ఉంటానని. ఆ ప్రాంతంలో తనకు తెలియకుండ ఏ ప్రమాదము రాదని, వెళ్ళి నీవుగూడ విశ్రాంతి తీసుకొమ్మని ఎంత దూరం చెప్పినా లక్ష్మణుడు వినలేదు. పాపం! గుహుడు నిద్రపోలేదు. గుహునితో రాముని గుణగణాలు, అయోధ్యానగర విశేషాలు ముచ్చటిస్తూ తెల్లవారే వరకు లక్ష్మణుడు అటు ఇటు తిరుగుతూనే ఉన్నాడు. గుహుడు ఆయన అడుగువెంట అడుగు వేసుకొంటూ ఆ విశేషాలు వింటూనే ఉన్నాడు.

సీతారాముల సేవలో మరుసటిరాత్రి లక్ష్మణునికి వత్సదేశంలో ఒకచెట్టు క్రింద గడిచింది- ఆ తరువాత రాత్రి భరద్వాజాశ్రమంలో, ఆ తరువాత రాత్రి యమునకు ఆవలితీరంలో.

మరునాడు ముగ్గురు చిత్రకూటం చేరుకొన్నారు. చిత్రకూటం చాల మనోహరమైన ప్రాంతం. వాసయోగ్యమైన ప్రదేశం. ప్రక్కనే మందాకినీ నది అన్న ఆదేశాన్ని అనుసరించిలక్ష్మణుడు పర్ణశాల ఎంతో అందంగా నిర్మించాడు. ఆ పర్ణశాల అందాన్ని చూచి సీత మురిసిపోయింది. శ్రీరాముడు మెచ్చుకొన్నాడు. రామలక్ష్మణులు ఆ పర్ణశాలలోఅనేకవేదికలు నిర్మించుకొన్నారు. పూజాగృహాలు, అగ్నిహోత్ర గృహాలుసిర్మించుకొన్నారు. శాస్త్రోక్తంగా పర్ణశాలా ప్రవేశం చేశారు.

లక్ష్మణుడు పర్ణశాలా మార్గాన్ని కొంతకొంత సుగమం చేశాడు. అందున్న రాళ్ళేరి వేశాడు. ముళ్ళను తొలగించాడు. గుర్తు తెలియటానికి త్రోవతప్పకుండా రావటానికి ప్రక్కనున్న చెట్లకు నారచీర పేలికలు బంధించాడు. దర్భలను మెలిత్రిప్పిముడి వేశాడు.

ప్రతిరోజూ లక్ష్మణుడు పూటకు పూలుతెచ్చేవాడు. అగ్నిహోత్రానికి కంద మూలాలు, త్రాగటానికి మందాకినీనదుల జలాలు గొనివచ్చేవాడు. విశ్రమించే అన్నావదినెలకు రక్షగా రాత్రులందు ధనుర్ధారియై పర్ణశాలవెలుపల 'పహరా' తిరిగేవాడు.

లక్ష్మణుడు స్వార్థరహితుడైన సేవకుడు భక్తిపూరితుడైన సేవకుడు. సర్వసమర్థుడైన సేవకుడు. లోకంలో ఇలాంటి సేవకుడెవరికి దొరకువాడు !

లక్ష్మణుని సేవలో సీతారాములకు అరణ్యవాసం సుఖవాసమైంది. ప్రశాంతవాసమైంది. ఒక విలాస యాత్ర అయింది. ఒక వింత అనుభవంగా మారింది. ఒక్కమాసం గడిచింది.

అయినా లక్ష్మణునికి కైక మీద కోపం తగ్గలేదు. భరతుని మీద అనుమానం తీరలేదు. అతని ఆవేశం చల్లారలేదు.

ఆనాడు సీతారాములు చిత్రకూట పర్వతంమీద విహరిస్తున్నారు, రాముడు సీతకు రకరకాల చెట్లు చూపాడు. రంగురంగుల పూలు చూపాడు. సెలయేళ్ళ పంపుసొంపులు చూపాడు. వివిధధాతురంగులచే వెలుగుతున్న కొండచరియల శోభ చూపాడు. మందాకినీ సౌందర్యాన్ని మనోహరంగా వర్ణించి చూపాడు. పర్వతం మీద ఒక్క ప్రక్క ఆమెను కూర్చుండబెట్టుకొని ప్రియాతి ప్రియంగా ఎంతో రుచికరమైన ఆహారపదార్థాలు స్వయంగా తినిపిస్తూ చిత్రకూట విశేషాలు ముచ్చటిస్తున్నాడు. ప్రక్కనే ఉన్నాడు లక్ష్మణుడు. ఉన్నట్లుండి పెద్ద దుమారం కన్పించింది ఎన్నడు వినని శబ్దం వినిపించింది. మృగాలన్నీ భయపడి అటు ఇటు పరుగెత్త సాగాయి. ఏమిటో అర్థంకాలేదు. 'లక్ష్మణా ; అదేమిటో చూడు' అన్నాడు రాముడు.

వడివడిగా లక్ష్మణుడు ఒక పెద్ద వృక్షమెక్కాడు. మహా సైన్యం ఒకటి ముందుకు వస్తున్నది. 'అన్నా ! అదుగో ! మహాసైన్యం. మీదికి వస్తున్నది.

వదినెను వెంటనే గుహలోకి పంపు. కవచం ధరించు. ధనస్సు తీసుకో. అని కేక పెట్టాడు.

రాముడు 'నిదానంగా ఆ సేన ఎవ్వరిదో చూడు' అన్నాడు కొంతదూరంలో కాంచన వృక్షధ్వజం కన్పించింది. అది భరతునిది. అసలే లక్ష్మణుడు ఆవేశపరుడు ససైన్యంగా వచ్చే భరతుణ్ణి చూచేసరికి అతని ఆవేశం మిన్నుముట్టింది.

'అన్నా ! భరతుడు నీ రాజ్యాన్ని అపహరించింది చాలక, నిన్ను అడవుల పాలు చేసింది చాలక, ప్రాణాలనే తీయాలని దండెత్తి వస్తున్నాడు. నీవు అనుమతిస్తే చాలు - ససైన్యంగా అతనిని హతమారుస్తాను. వన్యమృగాలకు సంతర్పణ చేస్తాను' అనేసరికి రాముడు చిరునవ్వు నవ్వాడు. చెట్టు దిగి రమ్మన్నాడు. ఏమీ అక్కరలేదన్నాడు. అనునయ పూర్వంగా 'తమ్ముడూ ! భరతుడు తనకుతానై మన దగ్గరకు వస్తుంటే అతనిని చంపటమా ! ఎందుకు ? పితృవాక్యాన్ని పాలిస్తానని ప్రతిజ్ఞచేసి, భరతుని కొరకు రాజ్యాన్నే వదలి అరణ్యవాసం సాగించే నేను భరతుణ్ణి చంపటమా ! అలాంటప్పుడు ఆ ప్రతిజ్ఞ ఎందుకు ? ఈ అరణ్యవాసం ఎందుకు ?

బంధుమిత్రులను పరిమార్చి ఆర్జించే సంపద విషభక్ష్యం లాంటిది. అది ఎన్నడూ నా కక్కరలేదు. నా తమ్ముల సుఖానికి, బంధుమిత్రుల సుఖానికి అందరి సుఖానికి నేను రాజ్యం స్వీకరిస్తానే గాని స్వసుఖానికి మాత్రమే కాదు. అనుకొంటే నేను అఖండ భూమండలాన్ని నా భుజబలంతో అవలీలగా సాధిస్తాను. అయితే అధర్మంగా ఆ ఇంద్రపదవి వచ్చినా నాకక్కరలేదు. మన భరతుడికి, నీకు శత్రుఘ్నుడికి లేని సుఖం నా కెందుకు తమ్ముడూ !

భరతుడు నాకు ప్రాణప్రియుడు. మేనమామ ఇంటి నుండి అయోధ్యకు వచ్చి ఉంటాడు. మనం అడవులకు వెళ్ళామని విని ఉంటాడు అమితదుఃఖంతో అధికప్రేమతో మనల్ని బ్రతిమాలి మరల అయోధ్య గొనిపోవాలని వస్తున్నాడు. అలాంటి భరతుని మీదనా నీ ఆగ్రహం. అలాంటి భరతుడినా నీవు అంత మొందిస్తానంటావు. ఆవేశపడకు. నీవు భరతుణ్ణి అర్థం చేసుకోలేవు. అతనికి రాజ్యకాంక్ష లేదు. కావాలంటే చెప్పు. అతనితో చెప్పి ఒక్కక్షణంలో నీకు రాజ్యాన్నంతా ఇప్పిస్తాను'. అనేసరికి నిప్పు మీద నీళ్ళు చల్లినట్లయింది. లక్ష్మణుడు సిగ్గుతో

తలవంచుకొన్నాడు. రాముడు గూడ ఏదో గండం గడిచినట్లు గాఢంగా ఒక్క నిట్టూర్పు విడిచాడు. తమ్ముణ్ణి దగ్గరకు తీసుకొన్నాడు. లేకుంటే లక్ష్మణుడు భరతుణ్ణి ఏం చేసేవాడో ! ఏమనేవాడో !

ఏమీ చెయ్యనక్కరలేదు. అప్రియంగా ఒక్కమాట అన్నాచాలు. భరతుని హృదయం బ్రద్దలౌతుంది. అసలే అతడు కుమిలిపోతున్నాడు అంతేగాదు, లక్ష్మణుడు ఏది అన్నా భరతుడు అది రాముడన్నట్లే భావిస్తాడు. అనిపించినట్లే భావిస్తాడు. మాటలవల్ల గాని, చేతల వల్ల గాని భరతుని హృదయాన్ని బాధించడం ఏ విధంగా చూచినా న్యాయం కాదు. లక్ష్మణుడు ఆవేశపరుడు. పైగా భరతుని చిత్తశుద్ధి మీద నమ్మకం లేనివాడు. ఆవేశం, అనుమానం ఎంతటి వారిలోనైనా వివేకాన్ని చంపుతాయి. లక్ష్మణుడు వివేకరహితంగా ప్రవర్తించినా, మాటాడినా తాను చేసిన త్యాగమంతా విషపూరిత మౌతుంది. అందుచేతనే రాముడు అంత ఘాటుగ లక్ష్మణుని మందలించాడు.

భరతుడు వచ్చి వెళ్ళిన తరువాత సీతారామలక్ష్మణులు చిత్రకూటాన్ని వదిలారు. దండకారణ్యం ప్రవేశించారు. పెక్కుమంది రాక్షసుల నెదుర్కొన్నారు ఎందరెందరో మహామునులను సందర్శించారు. చివరకు పంచవటిని చేరుకొన్నారు.

పంచవటి అరణ్యప్రాంతం ప్రక్కనే గోదావరీనది. అంతంత దూరంలో అనేక పర్వతాలు. అక్కడ పూలున్నాయి పండ్లున్నాయి. నీళ్ళున్నాయి. పక్షులున్నాయి. మృగాలున్నాయి. ప్రశాంత సుందర వాతావరణం ఉంది. ఇంకేం కావాలి.

రాముడు తమ్ముణ్ణి పిలిచి పర్ణశాల నిర్మించమన్నాడు. లక్ష్మణుడు చెట్లు కొట్టాడు. నేల చదును చేశాడు. మట్టితో గోడలు కట్టాడు వెదుళ్ళను స్తంభాలుగా నాటాడు. జమ్మికొమ్మలు అడ్డంగా అమర్చాడు, రెల్లు గడ్డి, దర్భ కట్టలు, చెట్ల ఆకులు మీద కప్పాడు. పర్ణశాలను సుందరంగా తీర్చిదిద్దాడు. అతి స్వల్ప వ్యవధిలో అంతా పూర్తి చేశాడు. అందమైన ఆ పర్ణశాలను, సమర్థతా సంపన్నమైన తమ్ముని సేవా తత్పరతను చూచి శ్రీరామచంద్రుడు పులకించాడు. గాఢంగా కౌగిలించుకొన్నాడు 'లక్ష్మణా! నా అభిరుచులను అభీష్టాలను గుర్తించి నీవు

అన్నీ నాకు సమకూరుస్తున్నావు. శుశ్రూష చేస్తున్నావు. ధర్మం తప్పక నడచు కొంటున్నావు. తండ్రిలా నన్ను పోషిస్తున్నావు. రక్షిస్తున్నావు. నా తండ్రి నా వెంట ఉన్నట్లే ఉంది' అని ఆనందాశ్రువులు రాల్చాడు.

లక్ష్మణుని మేను గగుర్పొడిచింది. అన్నవెంట తానూ అశ్రువులు రాల్చాడు

అదొక మనోహర దృశ్యం. అన్నదమ్ముల ఆత్మీయతలో అదొక మహోన్నత శిఖరం.

శరదృతువు దాటింది. హేమంత ఋతువు వచ్చింది. ప్రకృతిని గిలిగింతలు పెట్టుతూ ఉంది. గోదావరిలో స్నానంచేసి, పూర్వాహ్ణ క్రియలన్నీ పూర్తిచేసి. సీతారామలక్ష్మణులు పర్ణశాల వాకిట కూర్చున్నారు. కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ ఆ వనశోభను చూస్తున్నారు. అప్పుడు వచ్చింది శూర్పణఖ - ఒక దుస్స్వప్నంలా; ఒక దుశ్శకునంలా ; దురదృష్టం యొక్క తొలిదశలా. ఏవేవో మాట్లాడింది. కోరగూడనివన్నీ కోరింది. ఆ అన్నదమ్ముల మధ్య అనేక పర్యాయాలు అటూ ఇటూ తిరిగింది. చివరకు సీతమ్మను మ్రింగటానికే సిద్ధమైంది. ఆ దశలో అన్న ఆజ్ఞననుసరించి లక్ష్మణుడే శూర్పణఖ ముక్కుచెవులు కోశాడు. దాని పర్యవసానం ఖరదూషణాదులతో యుద్ధం. రావణునితో తీవ్రవైరం సీతాపహరణం.

అది లక్ష్మణుని జీవితంలో చాల చెడ్డరోజు. లక్ష్మణుని జీవితంలోనే గాదు సీతారాముల జీవితంలో గూడ అది చాల చెడ్డరోజే. కాంచనమృగాన్ని చూచి లక్ష్మణుడు సందేహించాడు. అది మారీచుని మాయ అని గూడ అన్నతో చెప్పాడు. అయినా సీత దానిని కోరటము, సీతారక్షణకు లక్ష్మణుని నియోగించి రాముడు దానిని వెంబడించటము జరిగింది. రామ బాణానికి మారీచుడు మృగరూపాన్ని వదలి మృతిపొందుతూ స్వరం మార్చి రాముని లాగే హాసీతా ! హాలక్ష్మణా ! అని అరిచాడు. అప్పుడు రామునికి లక్ష్మణుడు చెప్పిన మాట అనుభవానికి వచ్చింది. అయితే సీతమ్మ మాత్రం అది రాముని కంఠధ్వని గానే నమ్మింది.

ఆపదలో ఉన్న అన్నకు సహాయంగా వెళ్ళమంది సీత. ఆయనకు ఆపద ఏమిటి ? అది రాక్షసమాయ — అన్నాడు లక్ష్మణుడు. కాదు. ప్రాణాపాయ స్థితిలో సహాయం కొరకు వేసే కేక అది. తక్షణం వెళ్ళు - అన్నది సీత.

'ముల్లోకాలు మీదికి వచ్చినా మా అన్నకు ప్రమాదం లేదు. నిశ్చింతగా ఉండు' అన్నాడు లక్ష్మణుడు.

'నీవేదో దురుద్దేశంలో ఉన్నావు. అందుకే ఆపదలో ఉన్న అన్నకు సాయంగా వెళ్ళటం లేదు' అన్నది సీత.

'నీకు రక్షగా అన్న నన్ను నియమించి వెళ్ళాడు. ఆయన ఆజ్ఞ ఎలా దాటేది. నిన్నొంటరిగా విడిచి ఎలా వెళ్ళేది' అన్నాడు లక్ష్మణుడు.

'ఆయన గతిస్తే నేను నీకు దక్కుతానను కొన్నావేమో. అదెన్నటికీ జరుగదు. ఆయనతో పాటు నేనూ ప్రాణాలు విడుస్తాను' అన్నది సీత – చురచుర చూస్తూ, కన్నీళ్ళు కారుస్తూ, పెద్దగా ఏడుస్తూ.

లక్ష్మణుని తలమీద పిడుగుపడ్డట్లయింది. గుండెలో బాకు గ్రుచ్చినట్లయింది.

ఆమె అంతవక్రంగా ఆలోచిస్తుందని, అంత ఘోరంగా మాట్లాడుతుందని లక్ష్మణుడు కలలో గూడ ఊహించలేదు. ఆమెను తాను తల్లిలా భావించాడు. తన సర్వసుఖాల్ని వదలుకొని ఆమె భర్తకు, ఆమెకు సేవచెయ్యాలని అడవికి వచ్చాడు అనేక కష్టాలు అనుభవించాడు. ఇప్పుడు గూడ తానామెకు రాక్షసప్రమాదం రాకుండా నివారించటానికే అక్కడ ఉన్నాడు. అయినా ఆమె అంతమాట అన్నది. అన్యాయంగా తన శీలాన్నే శంకించింది. ఎదుటి పురుషుడు ఎంత ఉత్తముడైనా ఆడమనిషి అతనిని గూర్చి అంత అనుచితంగా ఆలోచించటమూ ! అంత అసందర్భంగా మాట్లాడటమూ ; ఒంటరిగా ఉన్నంతమాత్రాన, వెంట ఉన్నంతమాత్రాన ప్రతి పురుషుడు తన్ను కామదృష్టితోనే చూస్తాడని ఆడమనిషి అనుకోవటమూ ; లక్ష్మణునికి ఆశ్చర్యం కలిగింది ఆవేదన కలిగింది. అతని మనస్సు వికలమై పోయింది. చివరకు స్త్రీజాతి మీదనే ఏవగింపు కలిగింది. అన్నకు ఏ ప్రమాదము రాలేదని అతనికి తెలుసు. ఆ అరుపు రాక్షసమాయ అని గూడ అతనికి తెలుసు. కాని అంతమాట – ఆ మాట – అన్న తరువాత తా నక్కడ ఉండటం ఎలాగ ? సీత ముఖం చూడడం ఎలాగ ?

అతనికి ముళ్ళ మీద ఉన్నట్లుంది. నిప్పుల మీద బడినట్లుంది, చెయ్యిపెట్టి కడుపులో కలబెట్టినట్లుంది,

'అమ్మా ! నీకు శుభమగుగాక ! నేను అన్న దగ్గరకే వెళ్ళుతున్నాను నిన్ను వదలి వెళ్ళుతుంటే ఎందుకో అన్నీ అపశకునాలే. ఇక వనదేవతలే నీకు రక్ష' అని ఆమెకు పాదాభివందనం చేసిబయలుదేరాడు.

సీత అలా చూస్తూ నిలబడింది.

లక్ష్మణుడు మాటిమాటికి వెనుదిరిగి చూస్తూ, కళ్ళ నీళ్ళు తుడుచుకొంటూ వడివడిగా నడిచివెళ్ళాడు.

అనుకొన్నట్లె ఆ కాంచనమృగము, ఆ కేక అంతా మారీచుని మాయ.

అక్కడ రాముడు మారీచుని సంహరించాడు.

ఇక్కడ రావణుడు సీతను అపహరించాడు.

రామలక్ష్మణులు కలుసుకొన్నారు.

'సీతను ఒంటరిగా వదలి వచ్చావా !' అని ఆందోళన వెలిబుచ్చాడు రాముడు

జరిగిందంతా వివరంగా విన్నవించుకొన్నాడు లక్ష్మణుడు.

ఇద్దరు ఎంతో భయపడుతూనే పర్ణశాలకు వచ్చారు.

సీతలేదు.

ఇక రాముని దుఃఖానికి అంతులేదు. 'నా సీతను చూచారా ! అని రాముడు చెట్టుచెట్టును అడిగాడు. గుట్టగుట్టను అడిగాడు. పక్షుల్ని అడిగాడు. మృగాల్ని అడిగాడు. పర్వతాన్ని అడిగాడు. ఆ గోదావరిని అడిగాడు.

అన్నదమ్ములిద్దరు ఆమెకోసం అడవి అంతా గాలించారు. జటాయువు చెప్పింది విన్నారు. అతని అంత్యక్రియలు జరిపారు. కబంధుణ్ణి సంహరించారు. శాపవిముక్తుడై అతడు చెప్పింది విన్నారు. శబరి ఆతిథ్యం స్వీకరించారు. చివరకు పంపాతీరం చేరుకొన్నారు. ఋష్యమూకం మీద సుగ్రీవునితో సఖ్యం చేసుకొన్నారు.

పంపాసరోవర ప్రాంత సౌందర్యాన్ని, వసంత ఋతుశోభను చూడగానే సీతావిరహార్తుడైన శ్రీరాముని శోకం మితిమీరింది. అప్పుడు లక్ష్మణుడు అతి నిపుణంగా ఆయన కామప్రకృతిని నిరసించాడు. శోకాన్ని చూలనాడాడు. ధైర్యోత్సాహాలను పునరుద్ధరించాడు. కర్తవ్యాన్ని గుర్తు చేశాడు. ఆ తరువాత అన్న

ప్రక్కనే నిలిచి చక్కని పరిచయకర్తగా ఆయన గుణవిశేషాలను, అవసరాలను అతిసమర్థంగా ఆంజనేయునికి, సుగ్రీవునికి తెలియజెప్పాడు. రామసుగ్రీవ సఖ్యానికి, సీతాన్వేషణ కార్యక్రమానికి గొప్పగ దోహదం చేశాడు.

రామసుగ్రీవ సఖ్యం కాగానే లక్ష్మణుని శీలం మీద వెలుగును ప్రసరించే ఒక విచిత్ర సంఘటన. సుగ్రీవుడు కొండగుహలోకి వెళ్ళి ఒక అభరణాలమూట తెచ్చాడు రాముని చేత పెట్టాడు. అవి సీతాదేవివేమో చూడమన్నాడు.

రాముని కళ్ళనిండా నీళ్ళు క్రమ్మాయి. ఆయన చూడగలిగిన స్థితిలో లేడు. 'లక్ష్మణా ! ఈ అభరణాలు చూడు' అన్నాడు.

లక్ష్మణుడు మూట విప్పాడు. ఒక్కొక్క ఆభరణమే ఎత్తిచూచాడు.

అది కాంతులు వెదజల్లే కేయూరం అన్నా ఈ కేయూరం సంగతి నాకు తెలిదన్నాడు అవి తళతళలాడ కుండలాలు. వీటి సంగతి నాకు తెలియదన్నాడు. అవి నిగనిగలాడె నూపురాలు. చేతికి తీసుకోగానే - 'అన్నా! ఇవి సీతమ్మవే' అన్నాడు.

రాముడు ప్రశ్నార్థకంగా చూచాడు.

'నిత్యం పాదాభివందనం చేసేటప్పుడు ఇవి నాకు దర్శనమిచ్చేవి. అనుమానం లేదు. ఇవి సీతమ్మవే' - అన్నాడు.

సీతారామపాదాభివందనం లక్ష్మణుని నిత్యకార్యక్రమంలో భాగం. అందుచేత ఆ నూపురాలు ఆయనకు ఎంతో పరిచయాలు. అంతేగాని ఆమె చేతులకు, చెవులకు ఏ అభరణాలు ధరించిందో చూడవలసిన అవసరము, అందులోను గుర్తించగలిగినంతగా చూడవలసిన అవసరం ఆయనకేం ఉంది. ఆ అన్నకు, వదినెకు తలవంచి సేవచేయటమే ఆయన పని.

లక్ష్మణుని జీవితంలో ఒక వింత అనుభవం - తారతో అతని కేర్పడిన సమావేశం.

కిష్కింధలో వాలి వధానంతరం సుగ్రీవుడు పట్టాభిషిక్తుడయ్యాడు. వర్షకాలం వచ్చింది. అతడు కామసుఖాల్లో మునిగిపోయ్యాడు. శరత్తురాగానే సీతాన్వేషణ సాగిస్తానన్నాడు. శరత్తు వచ్చింది. అయినా సుగ్రీవుడు రాలేదు. ప్రస్రవణ పర్వతం మీద రాముడు విరహాబాధ అనుభవిస్తున్నాడు. లక్ష్మణుడు ఆయనన

అనేకవిధాల అనునయించాడు. ధైర్యం చెప్పాడు. అయినా సుగ్రీవుడెంతకూ రాడు. రోజులు గడచిపోతున్నాయి. రామునికి అతని మీద అనుమానం, ఆగ్రహం బలపడుతున్నాయి. లక్ష్మణుడు మహోగ్రుడయ్యాడు. ఎరుపెక్కిన కళ్ళతో, ఎక్కుపెట్టిన ధనుస్సుతో, వేడి నిట్టూర్పుతో, సెగలు గ్రక్కుతూ, పొగలు విడిస్తూ ప్రజ్వరిల్లిన ప్రళయాగ్నిలా కిష్కింధకు బయలుదేరాడు. అడ్డువచ్చిన చెట్లనన్నింటిని విరిచివేశాడు; శిలలన్నింటిని చూర్ణంచేశాడు. సుగ్రీవుని అంతఃపురం ప్రవేశించాడు. ధనుష్టంకారం గావించాడు. ఆ దెబ్బకు అంతఃపురమంతా గడగడలాడిపోయింది. వానరులంతా వణికిపోయారు. సుగ్రీవుడు నిలువెల్ల కంపించిపోయాడు. తన కౌగిట్లో ఉన్న తారను వదిలాడు. లక్ష్మణుని ఎలా ప్రసన్నుని చేస్తావో, ఈ గండం ఎలా గడిపిస్తావో నీ యిష్టం అన్నాడు. అప్పుడు వచ్చింది తార - తొలగిపోయిన చీర సవరించుకొంటూ, పీడిప్రేలాడె మొలత్రాడు మీదిగి లాగుకొంటూ, మత్తెక్కిన కళ్ళతో, సంభోగచిహ్నాలతో, స్తనభారంతో లక్ష్మణుని సమక్షానికి. అంతటి లక్ష్మణుడు పాపం ! తలవంచుకొన్నాడు. ఎంతోనేర్పుగా ఆమె అతని కోపకారణాన్ని అడిగింది. రామకార్యార్థమై వానరులను సమీకరించే సుగ్రీవుని ప్రయత్నాన్ని వివరించింది. అతని కామవశతవల్ల కలిగిన విలంబాన్ని ప్రస్తావించి విచారాన్ని వెలిబుచ్చింది. తగిన కారణాలు చూపి ఆ కామవశతను గూడ సమర్థించింది. లక్ష్మణుని ఆగ్రహావేశాన్ని అతి నిపుణంగా నిరసించింది 'నీకు కామవ్యాపార పరిజ్ఞానమే లేదే' అని ఒక దశలో అతి సున్నితంగా ఆపహాసించింది. సుగ్రీవుని చూచి శాంతంగా అన్ని సంగతులు మాట్లాడమని సలహా ఇచ్చింది. అంతటి లక్ష్మణుని కీలుబొమ్మలా చేసి తన శయ్యా మందిరానికి నడిపించిం, అక్కడ సుగ్రీవుణ్ణి చూచి లక్ష్మణుడు కన్నెత్తి చెయ్యటాన్ని ఘాటుగా విమర్శించింది. అంతఃపురమర్యాదను పాటించడం అవసరమని హెచ్చరించింది.

అంతటి లక్ష్మణుడు ఆమె ఎదుట నిరుత్తరుడయ్యాడు. ఒక పసివాలునిలా నిలబడిపోయాడు. ప్రళయాగ్నిలా విజృంభించి వచ్చిన అతని ఆగ్రహావేశం పొగమంచులా చల్లబడిపోయింది. కాలసర్పంలా నాల్కలు చాచిన అతని ధనుస్సు చొప్పదంటులా మారిపోయింది.

లక్ష్మణుడే గాదు ఎవరైన ఆ మహోదాత్త స్త్రీమూర్తిని మరువలేరు. ఆనాటి అనుభవాన్ని అసలే మరువలేరు.

యుద్ధభూమిలో అన్నకు తోడుగా నిలిచి లక్ష్మణుడు చూపిన ధైర్యసాహసాలు బలపరాక్రమాలు అనుపమానాలు. రణరంగంలో మొదటిసారి రావణుడు అడుగు పెట్టినరోజు అన్న కంటె ముందుగానే అతని నెదుర్కొన్నాడు. తీవ్రాతితీవ్ర బాణాలతో అతనిని తల్లడిల్ల జేశాడు. లక్ష్మణుని శరసంధాన లాఘవాన్ని చూచి ఆ రావణుడే ఆశ్చర్యపడి, దిక్కుతోచక బ్రహ్మదత్తమైన శక్తిని ప్రయోగించాడు. ఆ శక్తి దెబ్బకు మూర్ఛపోయిన లక్ష్మణుని తన బాహువులతో పట్టి ఎత్తుకొనిపోవ ప్రయత్నించి హిమవన్మందర మేరుపర్వతాలనుగాని, దేవతాసహిత త్రిలోకాలను గాని ఒక్కపెట్టున ఎత్తగలిగిన తన బాహువులకు లక్ష్మణుని ఎత్తటం సాధ్యపడటం లేదని, అతడు సామాన్యుడు కాడని, సాక్షాద్విష్ణ్వంశమే అని అనుకొన్నాడు. లక్ష్మణుడు శత్రువుకు అంతభారమయ్యాడు. అలాంటి లక్ష్మణుని ఆ సమయంలో అవలీలగా హనుమంతుడు అవలికి గొనిపోవటం అందరిని ఆశ్చర్యపరిచింది. హనుమంతుడు మిత్రుడు, పరమభక్తుడు. అందుచేతనే లక్ష్మణుడు అతనికి అంత సులభుడయ్యాడు.

లక్ష్మణుడు అతికాయునితో మహోగ్రయుద్ధం చేశాడు. బ్రహ్మాస్త్రంతో అతని శిరస్సు ఖండించాడు.

ఇంద్రజిత్తు వధించింది మాయాసీత అని తెలియక విపరీతంగా దుఃఖించే అన్నను యుద్ధభూమిలో అనేక విధాల ఓదార్చాడు. అనేక ధర్మాలు ప్రస్తావించాడు విభీషణుని సలహా అనుసరించి, శ్రీరాముని అనుజ్ఞ సంపాదించి ఇంద్రజిత్తు చేసే నికుంభిలా హోమాన్ని భంగం చేశాడు. మహోగ్ర యుద్ధంలో ఇంద్రాస్త్రాన్ని ప్రయోగించి అజేయుడనుకొన్న ఆ ఇంద్రజిత్తు తలద్రుంచాడు. శ్రీరామ విజయాన్ని సుగమం చేశాడు.

రావణుడు మహోగ్రుడై విభీషణుని మీద శక్తిని ప్రయోగించగా ఆ మిత్రునికి అడ్డుగా యెదనొడ్డి ఆ దెబ్బతిని తెలివితప్పి మూర్ఛపోయాడు. సంజీవనీ ప్రభావంతో మరల చైతన్యవంతుడై రాక్షసమూకను చీల్చి చెండాడాడు.

అన్న అభిమతానుసారం రావణవధానంతరం లంకారాజ్యానికి విభీషణుణ్ణి అభిషిక్తుణ్ణి చేశాడు.

స్వసుఖాన్ని త్యజించి అన్నవెంట అడవులకు వెళ్ళాలని నిర్ణయించటమే లక్ష్మణుని జీవితంలో ఒక మహోజ్జ్వల ఘట్టం. హఠాత్తుగా అడవుల పాలైన అన్నకు చేదోడు, వాదోడుగా ఆత్మీయుడైన ఒక వ్యక్తి అవసరం ఎంత ఉంటుందో

లక్ష్మణుడు ఊహించాడు, అన్న ఎవ్వరినీ ఆయన వెంటరమ్మని అడగడు. అది ఆయన ఉదాత్తతకు, ధార్మికతకు దూరమైన విషయం. అందుచేతనే లక్ష్మణుడు ఆయన వెంట వెళ్ళాడు. అనేక సేవలు చేశాడు. ఎన్నో కష్టాలు అనుభవించినా చిట్టచివరకు అన్నవదినెలతో కలిసి క్షేమంగా అయోధ్య చేరాడు. తన సేవ సఫలమైందని సంతోషించాడు. అన్న పట్టాభిషేకాన్ని దర్శించి ఆనందించాడు. ఆ దశలో అనుకోకుండా హఠాత్తుగా ఒక కఠోరదౌర్భాగ్యం లక్ష్మణుని మీద పడింది. ఒక పెద్ద బండలా వచ్చిపడింది. ఏ స్త్రీమూర్తిని తన మనస్సులో ఒక మాతృదేవతగా భావించాడో, ఏ స్త్రీమూర్తికి కష్టసమయంలో అనేకసేవలు చేశాడో, ఏ స్త్రీమూర్తి పట్టమహిషిత్వాన్ని చూచి ప్రియమార ఆనందించాడో ఆ స్త్రీమూర్తినే తాను అడవుల్లో విడువ వలసిన అవసరం ఏర్పడింది. అది ఆయన దురదృష్టం.

ఆనాడు అన్న లక్ష్మణుని పిలిపించాడు. ఎందుకో అన్నముఖంలో ఆవేదన కన్పిస్తూ ఉంది. ఆగ్రహమూ కన్పిస్తూ ఉంది. అంతేగాక ఆందోళన గూడ అగుపిస్తూఉంది. భరతశత్రుఘ్నులు గూడవచ్చారు. శ్రీరాముడు సీత విషయంలో ఏర్పడిన జనాపవాదాన్ని తెలియచేసి 'లక్ష్మణా! రేపు ఉదయం సీతను గొనిపోయి గంగ ఆవలిగట్టున విడిచి రమ్మన్నాడు. ఇది నా నిర్ణయమన్నాడు. ఇందులో చర్చకు తావు లేదన్నాడు.

లక్ష్మణుని కంటివెంట బొటబొటనీళ్ళు రాలాయి. అతని పెదవులు కదిలాయి. ఏమో చెప్పబోయాయి. చెప్పలేకపోయాయి.

సుమంత్రుడు రథం సిద్ధం చేశాడు. లక్ష్మణుడు సీతాదేవి అంతఃపురానికి వెళ్ళాడు. ఆమె తన అంతఃపుర గవాక్షం నుండి ప్రక్కనున్న ఉద్యానవనశోభ తిలకిస్తూ చెలికత్తెతో తన వనవాసజీవితానుభవాల గూర్చి ముచ్చటిస్తూ ఉంది. లక్ష్మణుడు రాగానే చెలికత్తె అవలికి తొలగింది.

లక్ష్మణా! అని ఆప్యాయంగా పలుకరించింది సీత. రెప్పల తలుపులు త్రోసుకుని ముందుకు దూకే కన్నీళ్ళను లోలోపలే ప్రక్కు కొంటూ, గాద్గద్యం వహించే కంఠాన్ని బలవంతాన సవరించుకొంటూ, ఆమె వైపు చూడలేక ఒకింత తలవంచుకొని ఎటువైపో చూస్తూ 'అమ్మా! నీవు కోరినట్లే రామనృపాలుడు నిన్నాశ్రమానికి తోడ్కొని పోవ అనుమతిచ్చాడు గంగా తీరాన ఉన్న ఆశ్రమాల్లో నిన్ను వదలి వస్తాను. వెంటనే బయలు దేరు; అన్నాడు.

పాపం! సీత ఆనందానికి అంతులేదు. ఆమె అమాయకతకు వేరు ఆలోచనే లేదు.

లక్ష్మణుని ఆవేదనకు అంతులేదు. రాముని ఆజ్ఞకు తిరుగులేదు,

మరునాడు రథం గంగ ఒడ్డుకు చేరుకొంది. గంగ అవలి ఒడ్డే సీత గమ్యస్థానం. లక్ష్మణుని మనస్సు మనస్సులో లేదు. సీత అమాయికంగా తనవెంట వస్తూ ఉంది అయోధ్యలో ఏం జరిగిందో ఆమెకు తెలీదు. రాముడు ఎందుకు మరల ఆమెను అడవులకు పంపుతున్నదీ ఆమెకు తెలీదు. తానెందుకు ఆమెను పిలుచుకొని వస్తున్నాడో ఆమెకు తెలీదు. గంగదాటితే ఏమవుతుందో ఆమెకు అసలే తెలీదు. ఆమాట అనుకొంటే లక్ష్మణుని గుండె తరుక్కుపోతూ ఉంది. అన్న ఈ కసాయి కృత్యం తనకు అప్పగించాడు. సమయం సమీపిస్తూ ఉంది నిర్వర్తించటం ఎలాగ ?

అందుకే గంగను చూడగానే లక్ష్మణుని గుండె చెరువైంది. గొల్లుమని ఏడ్చాడు.

ఏమిటి లక్ష్మణా! ఏంజరిగింది; అని ఆందోళనగా అడిగింది సీత

పాపం, లక్ష్మణుడు ఏమని చెప్పగలడు

అందుకే మౌనం వహించాడు, అంత దుఃఖాన్ని గొంతులో దిగమ్రింగ కొన్నాడు.

అవునులే. అన్నను చూడనిదే నీవు ఒక్క క్షణమైనా ఉండలేవు' నా స్థితీ అంతే, ఋషిపత్నులకు ఈ వస్త్రాలిచ్చి, ఆభరణాలు ఇచ్చి వెంటనే వెనుదిరిగి వెళ్ళుదాం లక్ష్మణా! విలపించకు' అంది సీత ఆ మరదిని ఓదారుస్తూ,

ఆమె మాటలకు నవ్వాలో, ఏడవాలో లక్ష్మణునికి అర్థం కాలేదు. ఆయన ఎలాగో నావికులను పిలిచాడు. సీతను గంగ దాటించి అవలి ఒడ్డు చేర్చాడు.

ఇక సీతను వదలి వెళ్ళాలి. ఎలా వదలి వెళ్ళాలి ? ఏమని చెప్పివెళ్ళాలి. నిప్పులాంటి నిజాన్ని ఆమె చెవిలో వెయ్యటం ఎలాగ ? అట్లని దాన్ని గుండెలోనే దాచుకోవటం ఎలాగ ?

లక్ష్మణుడు మనస్సు రాయి చేసుకొన్నాడు. చేతులు జోడించి సీత ఎదుట నిలిచాడు. ఆయనకు తెలియకుండానే కన్నీళ్ళు కారిపోతున్నాయి. గొంతు కంపించి పోతున్నది. సీత ఆశ్చర్యపడింది. సాలోచనగా ఆయనవైపు చూచింది.

అప్పుడన్నాడు లక్ష్మణుడు 'అమ్మా ! నీవు అపవాదు కలిగిందని. అందు చేతనే రాముడు నిన్ను అడవుల్లో విడిచి రమ్మన్నాడ'ని.

తెప్పరిల్లుకోలేక, తెప్పరిల్లుకొని ఆ ప్రతివ్రత పరిపరివిధాల దుఃఖించింది.

లక్ష్మణుడు ఆమెకు సాష్టాంగ నమస్కారం చేశాడు. మౌనంగా తలవంచుకొని తాను వచ్చిన నావవైపు నడిచాడు. గంగదాటి రథం ఎక్కాడు. మాటి మాటికి ఆమె వైపు తిరిగి చూస్తూ, కంటికి కడివెడుగ కన్నీళ్ళు కారుస్తూ, చేతులెత్తి నమస్కరిస్తూ సాగి పోయాడు.

సీత అలా చూస్తూ నిలబడిపోయింది.

అయోధ్యకు చేరేదాకా, అన్నపాదాలకు నమస్కరించి, నీ ఆజ్ఞ నిర్వర్తించానని విన్నవించే దాకా లక్ష్మణుని కంటి తడి ఆరనే లేదు. మార్గమధ్యంలో సుమంత్రుడు సీతాపరిత్యాగానికి త్రోవతీసిన భృగుశాపవృత్తాంతం చెప్పినా ఆ సౌమిత్రి కంటితడి అలాగే ఉంది. అలాంటి లక్ష్మణుడు అన్నగారి సీతావియోగశోకాన్ని చూచేసరికి తనకు తాను ఎంతో దిటవుతనం తెచ్చుకొన్నాడు. అనేకవిధాల ఆయనను ఓదార్చాడు. పెరుగుట తరుగుటకే అన్నాడు. కలయిక ఎడబాటుకే అన్నాడు. పుట్టుట గిట్టుటకే అన్నాడు. అందువల్ల పుత్ర మిత్ర కళత్ర ధనాదుల మీద అతికాంక్ష దుఃఖహేతువన్నాడు. నీ వంటి సత్త్వసంపన్నులు శోకించ గూడదన్నాడు. నీ శోకాన్ని చూచి లోకం 'రాముడేదో అపవాదానికి వెఱచి సీతను వదిలాడే గాని నిజానికి ఆమెను వదలటం ఆయన కిష్టంలేదని అనుకొంటుం' దన్నాడు. అపకీర్తి వస్తుందన్నాడు. అనేకవిధాల అనునయించాడు, ఎన్నో హితవాక్యాలు పలికాడు. అన్నగారి మెప్పు పొందాడు. ఆయనవలన నృగ మహారాజు చరిత్రను, నిమి చక్రవర్తి చరిత్రను, వసిష్ఠుని పూర్వవృత్తాంతమును, జనకమహారాజు కథను సవిస్తరంగా విన్నాడు. ఆయనకు అశ్వమేధ యాగాలోచన అందించాడు. అన్ని విధాల ఆయనకు సహకరించాడు. అన్న ఆదేశానుసారం అంగదీయ చంద్రకాంత పురాలను నిర్మించి తనకుమారులైన అంగద చంద్రకేతువులను అభిషిక్తులనుగావించాడు.

అయినా లక్ష్మణుడు శేషజీవితం కుమారులతో గడుపలేదు. ఆయన రామసేవా తత్పరత అద్వితీయం; అద్భుతం. ఒక్కసంవత్సరం మాత్రమే ఆయన అంగదునితో గడిపి మరల అయోధ్యకు వచ్చాడు. రామసేవ స్వీకరించాడు. ఆ ఒక్క సంవత్సరం గూడ ఆయన అంగదునికి రాజ్యపాలనలో అవసరమైన శిక్షణ ఇవ్వటానికే అక్కడ ఉన్నట్లుంది. ఎందుచేతనంటే చంద్రకేతువు వెంట ఆ సంవత్స

రం భరతుడున్నాడు. భరతుడు గూడ రాజ్యపాలన నేర్పటానికే అతని వెంట ఉన్నాడు.

లక్ష్మణునిది అన్నసేవకు అంకితమైన జీవితం. ఏ సుఖాలు కోరుకోని జీవితం. అన్నసేవకై అనేక త్యాగాలు చేసిన జీవితం. అందుచేత లక్ష్మణుడు అన్నను విడిచి ఇంకొక చోట ఉండడు ఉండలేడు. అన్నసేవలోనే ఆయన జీవితం రాలిపోవాలి. వాడిపోవాలి. ఒక సార్థకతను సాధించాలి.

అది లక్ష్మణుని జీవిత చరమదశ. అప్పటికి సీత పుడమిగర్భం ప్రవేశించింది. కుశలవులు రాముని కలుసుకొన్నారు. కౌసల్యాకైకేయీ సుమిత్రలు స్వర్గం చేరుకొన్నారు. రాముడు అయోధ్యను న్యాయ మార్గంలో పాలిస్తున్నాడు. అంతా సుఖంగా ఉన్నారు.

అప్పుడు వచ్చాడు మునిరూపంలో యముడు. వచ్చి లక్ష్మణుని చూచాడు. తానొక మహర్షి దూతనన్నాడు అత్యవసర మైన పనిమీద వచ్చానన్నాడు. వెంటనే రాముని చూడాలన్నాడు. పాపం! లక్షణుడు లోనికి వెళ్ళి ఆ ముని విషయంరామునికి చెప్పాడు. వెంటనే అతనిని లోనికి ప్రవేశపెట్టమన్నాడు రాముడు.

మునీంద్రుడు రామునితో మనమాటలెవ్వరూ వినగూడదన్నాడు. మనం మాట్లాడేటప్పుడెవ్వరూ చూడ గూడదన్నాడు. మన ఏకాంతానికి భంగం కలిగించిన వ్యక్తిని సంహరిస్తానని నీవు ప్రతిజ్ఞ చేస్తే నే తెచ్చిన మహర్షి సందేశం వినిపిస్తానన్నాడు, అలాగే అన్నాడు రాముడు. లక్ష్మణా ! నీవే వాకిట్లో కాపుండ మన్నాడు నా ప్రతిజ్ఞ విన్నావు కదా అన్నాడు.

అన్న ఆజ్ఞ శిరసావహించి లక్ష్మణుడు ద్వారపాలకుడైనాడు.

అదొక దుర్ముహూర్తం. అప్పుడే హడావుడిగా వచ్చాడు దుర్వాసుడు. తక్షణం 'రాముని దర్శనం కావాలన్నాడు. అత్యవసర మైన పని ఉందన్నాడు

రాముడు కార్యాంతర నిమగ్నుడై ఉన్నాడు. ఆ పని ఏదో చెప్పండి. నేనే చేస్తాను. రాముడే కావాలంటే మీరు ఒక్క క్షణం ఆగాలి'అన్నాడు లక్ష్మణుడు.

దుర్వాసుని కన్నులు నిప్పులు కురిశాయి లక్ష్మణా! తక్షణం నేను రాముణ్ణి చూడాలి. వెళ్ళి చెప్పు. లేకుంటే నిన్ను, నీ రాజ్యాన్ని, నీ రాముణ్ణి, భరతుణ్ణితు మీ అందరిని దగ్ధం చేస్తా. నా కోపం ఆపుకోలేను ' అన్నాడు తీవ్రంగా.

లక్ష్మణునికి దిక్కుతోచలేదు. ముందు మహర్షి శాపం. వెనుక శ్రీరాముని ఖడ్గం. లక్ష్మణుని స్థితి ఆ నాటి నారదుని స్థితిలా ఉంది. లక్ష్మణుడు ఒక్కక్షణం ఆలోచించాడు. మహర్షి శాపంతో [illegible]ంచటం కంటే అన్న ఖడ్గంతో తానొక్కడు మరణించటం మేలనుకొన్నాడు. తటాలున లోనికి వెళ్ళాడు. దుర్వాసుని సంగతి అన్నకు విన్నవించాడు.

రాముడు యముని వీడ్కొల్పి వెంటనే వెలుపలికి వచ్చి దుర్వాసుని దర్శించాడు. ఆ మహర్షి కోరినట్లె అమృత తుల్యమైన ఆహారం అర్పించాడు. మునీశ ఆకలి తీర్చాడు. అభినందనలు పొందాడు.

దుర్వాసుడు తృప్తిగా భుజించి తిరిగి వెళ్ళాడు. కాని రాముడు మాత్రం లోలోపల కుమిలిపోతున్నాడు. ఆజ్ఞ తప్పినందుకు తమ్ముణ్ణి సంహరించటమా? లేక తమ్ముడి కొరకు తన ప్రతిజ్ఞను తప్పడమా? ఇప్పుడేం చెయ్యాలి? ఇది పెద్ద సమస్య.

అంతటి రాముడు కంట తడి పెట్టాడు. నిట్టూర్పు విడిచాడు. తల వంచాడు. మౌనం వహించాడు

అన్న ఆవేదనను తమ్ముడు అర్థం చేసుకొన్నాడు. చిరునవ్వుతో అన్నా! ఇది దైవనిర్ణయం. తప్పించటం మన తరం కాదు. నా మీద నీకు ఏ మాత్రం ప్రేమ, దయ ఉన్నా నీ ప్రతిజ్ఞ వెంటనే నెరవేర్చు. ధర్మాన్ని పాలించు అన్నాడు. లక్ష్మణుని మాటలు వింటే ఆ ధర్మ దేవత అయినా కన్నీరు కార్చక మానదు.

రాముడు సభ చేశాడు. తన సమస్యను ఆ సభముందు ఉంచాడు వసిష్ఠుడు లేచి ప్రతిజ్ఞా పాలనం ప్రభువుకు అవశ్యకర్తవ్యమన్నాడు. అందుకొరకు తమ్ముని వదులుకొమ్మన్నాడు. ప్రతిజ్ఞాపాలనకే నీ తండ్రి నిన్ను వదులుకొన్నాడు. ప్రతిజ్ఞాపాలనకే నీవు రాజ్యాన్ని వదలి అడవులకు వెళ్ళావు. ప్రతిజ్ఞాపాలన ప్రభుధర్మం' అన్నాడు వసిష్ఠుడు.

రాముడు లక్ష్మణుని ముఖంలోకి సూటిగా చూచాడు.' వధించటం, పరిత్యజించటం రెండూ సాధువులకు సమానశిక్షలే. నిన్ను పరిత్యజిస్తున్నా.' — అన్నాడు.

అప్పుడు రాముని కంట తడి లేదు గొంతులో గాద్గద్యంలేదు.

లక్ష్మణుడు, రామునివైపు తృప్తిగా చూచి రెండు కన్నీటి బొట్లు

రాల్చి, చేతులు జోడించి నమస్కరించి, శిరస్సువంచి వెనుదిరిగి గంభీరమంత గమనంతో అడుగు ముందుకు వేసుకుంటూ నడచి వెళ్ళుతుంటే ఆ సభ అంతా కొయ్యబారి నిలిచింది. అయోధ్య అంతా అశ్రుజలంతో తడిసింది. ఆకాశం అంతా మూగవోయి చూచింది.

ఆనాడు లక్ష్మణుడు ఊర్మిళ దగ్గరికి వెళ్ళలేదు. కొడుకుల దగ్గరికి పోలేదు. భరతుని వైపు చూడలేదు. సరాసరి సరయూతీరానికి వెళ్ళాడు. ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఏ నిర్ణయానికి వచ్చాడో! ఆచమనం చేశాడు. ఆ నది గట్టున కూర్చున్నాడు. నవరంధ్రాలు బిగించాడు. యోగమార్గాన శ్వాస వదిలాడు. ఒక మహా తేజస్సు ఆయన శరీరం నుండి ఆకాశంలోకి దూసుకు పోయింది. సరయూ నది ఆగి చూచింది గాలి కదలకుండా నిలిచి చూచింది. నేల నిస్తబ్ధమై చూచింది. ఆకాశం ఆశ్చర్యపడి చూచింది. తేజస్సు కళ్ళన్నీ తెరుచుకొని చూచింది.

లక్ష్మణుడు ఏమయ్యాడో ఆ నదికి తెలియాలి. ఆ గాలికి తెలియాలి. ఆ నేలకు తెలియాలి. ఆ ఆకాశానికి తెలియాలి. అన్నింటిని మించి ఆ తేజస్సుకే తెలియాలి.

లక్ష్మణుడు భ్రాతృభక్తికి పర్యాయపదం.<br>
స్వార్థ త్యాగానికి దివ్య పతాకం.<br>
సేవాభక్తికి చరమ శిఖరం.

# భరతుడు

తండ్రి మాటకో, తల్లిమాటకో తలవంచి ఉన్నది వదలుకొన్న వాడెంత ఉదారుడో; ఉత్తముడో - వంశాచారాన్ని, ధర్మతత్త్వాన్ని తర్కించి వచ్చింది వద్దన్నవాడు గూడ అంతే ఉదారుడు ; అంతే ఉత్తముడు.

రామాయణంలో తండ్రి ఆనతిని, సవతితల్లి మాటను తలదాల్చి అయోధ్యామహాసామ్రాజ్యాన్ని వదలుకొని అడవులకు వెళ్ళిన పితృభక్తి పరాయణుడు ఉదారుడు, ధర్మాత్ముడు శ్రీరాముడైతే – వంశాచారాన్ని,ధర్మ తత్త్వాన్ని తర్కించి అనాయాసంగా చేతికందిన ఆ మహాసామ్రాజ్యాన్ని వద్దని త్రోసిపుచ్చిన ఉదారగుణసంపన్నుడు, భ్రాతృభక్తి పరాయణుడు,ధర్మజ్ఞుడు, భరతుడు,

భరతుడు అన్నకు తగ్గ తమ్ముడు.

తల్లితో ఏకీభవించని తనయుడు.

తల్లితత్త్వానికి అతని తత్త్వానికి ఎప్పుడూ చుక్కెదురే. ఆమె అంటే అతనికి కొంత ఏవగింపుకూడా, ఆమెది తీవ్ర స్వభావం, స్వార్థస్వభావం, క్రోధస్వభావం, స్వాతిశయస్వభావం, ఆ సంగతి భరతునికి బాగా తెలుసు. భరతుడు సౌమ్యుడు,సాధుశీలుడు, సమతాస్వభావుడు. అందుచేతనే అతడు తల్లికి దూరంగా మేనమామల యింట్లో అంతకాలం ఉన్నాడేమొ! మాతామహుని ప్రేమానురాగాలు, మేనమామ స్నేహాభిమానాలు గూడ భరతుణ్ణి అక్కడపట్టి నిలిపి ఉండవచ్చు, మొత్తానికి భరతుడు మొదటినుండి మేనమామల యింట్లోనే పెరిగాడు పెళ్ళయిన తరువాత గూడ మిథిలనుండి అయోధ్యవచ్చి వెంటనే కేకయరాజ్యానికి వెళ్ళిపోయాడు. భరతుడు మళ్ళా అయోధ్యవచ్చింది – రాముడు ఆరణ్యం వెళ్ళినతరువాత; దశరథుడు మరణించిన తరువాత.ఈ రాక అతని జీవితంలో ఒక గొప్ప సంఘటన. ఒక మరపురాని సంఘటన, మహా తీవ్రమైన సంఘటన.

ఆనాటి రాత్రి గిరివ్రజంలో భరతునికొక పీడకల. ఆ కలలో దశరథుడు తల విరియబోసుకొని కొండకొన నుండి ఓ పేడగుంటలో పడతాడు వికారంగా నవ్వుతూ దోసిట నూనె తీసుకొని త్రాగుతాడు. నువ్వులు కలిపిన అన్నం తింటాడు. దేహం

అంతా తైలం పూసుకొంటాడు. తలక్రిందులౌతాడు. ఇనుపపీట మీద కూర్చున్న నిగంపుని చూచి నల్లని వస్త్రాలు ధరించిన నల్లని స్త్రీలు నవ్వుతారు. ఆయన నల్లచందనం పూసుకొని, ఎఱ్ఱనిపూలమాల వేసుకొని గార్దభాలు పూన్చిన రథమెక్కి దక్షిణదిశగా వెళ్ళుతాడు. వికృతంగా ఉన్న ఒరాక్షసస్త్రీ వికారంగా నవ్వుతుంది. ఆయనను ఆకర్షిస్తుంది. సముద్రం ఎండినట్లు, చంద్రుడు క్రిందపడి నట్లు, చీకటి క్రమ్మినట్లు, పట్టపుటేనుగు దంతాలు తునకలైనట్లు, అగ్నిహోత్రం ఆరిపోయినట్లు, భూమి బ్రద్దలైనట్లు, చెట్లెండిపోయినట్లు, పర్వతాలు పొగలుగ్రక్కి నట్లు భరతునికి కన్పిస్తుంది.

భరతుడు భయపడుతూ లేచాడు. బాధపడుతూ లేచాడు. మాటి మాటికి ఆ స్వప్నమే గుర్తు వస్తూవుంది. కడుపులో చెయ్యిపెట్టి కలచినట్లుంది. స్నేహితు లంతా అతడు దుఃఖపడటం చూచారు. చుట్టూచేరి సంతోషపెట్టటానికి సంగీతం పాడారు. సరసాలాడారు. వేశ్యలచేత నృత్యం చేయించారు వీణ వాయించారు. ఏవేవో చేశారు. ఏంచేసినా భరతునికి బాధ తగ్గలేదు. దిగులు తీరలేదు. స్నేహితుల అవస్థచూచి తాను స్వప్నవృత్తాంతం చెప్పటం ప్రారం భించాడు. అంతలోనే అయోధ్యనుండి దూతలు వచ్చారు. పురోహితులు వసిష్ఠులవారు వివిధ మంత్రులందరున్ను కుశలమడిగారని చెప్పారు. అతి ముఖ్యమైన పనిమీద వెంటనే మిమ్మల్ని పిలుచుకొని రమ్మన్నారని విన్నవించారు. కేకయరాజుకు, ఆయన కుమారునికి కానుకలుగా తెచ్చిన అనేక వస్త్రాభరణాలను గూడ భరతుని కిచ్చి ఆయన చేతిమీదుగా వారికిప్పించారు.

రాత్రి ఆ దుస్స్వప్నం. ఉదయం అయోధ్యనుండి ఈ దూతలు భరతుడు వారిని చూడగానే ఒకింత కలవరపడ్డాడు. తండ్రికి కుశలమా! అని తొలుత అడిగాడు తరువాత రామలక్ష్మణుల సంగతి అడిగాడు. తరువాత తల్లులంతా ఆరోగ్యంగా ఉన్నారా అని అడిగాడు ఎందుకో కైకను గూర్చి ప్రస్తావిస్తూ 'స్వప్రయోజన పరురాలు, చండ స్వభావురాలు, క్రోధగుణపూరితురాలు, స్వాతిశయ పరాయణు అయిన మా తల్లి ఏమి చెప్పిందని అడిగాడు. ఆయనకు ఏ అనుమానం వచ్చిందో!

అన్నింటికి తల ఊపారు ఆ దూతలు. అయోధ్యకు వెంటనే బయలు దేర మన్నారు. సంపదగూడ నిన్ను వరించటానికి సిద్ధంగా ఉందన్నారు.

భరతుడు మాతామహుని దగ్గర, మేనమామ యుధాజిత్తు దగ్గర సెలవు తీసుకొన్నాడు. శత్రుఘ్నునితో కలిసి అయోధ్యకు బయలు దేరాడు. సుదామానది దాటాడు. హ్లాది, శతద్రూ నదులను దాటాడు. ఏలధాన గ్రామాన్ని ప్రవేశించాడు. చైత్రరథ వనాన్ని అతిక్రమించాడు. కళింగాయమునా నదుల సంగమంలో కొంచెంసేపు విశ్రమించాడు. ప్రాగ్వటప్పుర సమీపంలో గంగానదిని దాటి తరువాత కుటికోష్ఠికానదిని, ధర్మవర్ధన, జంబూప్రస్థ, వరూథగ్రామాలను, అయోధ్యా రాజ్య సమీపంలో ఉన్న ఉజ్జిహానా నగరాన్ని, ఇంకా అనేక నదులను, అనేక గ్రామాలను దాటి ఎనిమిదవనాటి ఉదయం అయోధ్యకు చేరుకున్నాడు. అయోధ్యలో ఎందుకో ప్రభాతమంగళవాద్యాలు మ్రోగటం లేదు. వేదధ్వనులు వినిపించటం లేదు. అలంకారాలు అగుపించటం లేదు. అంతా చీకటి అలముకొన్నట్లుంది. విషాదం వ్యాపించినట్లుంది. వదలివేసిన ఇల్లులా ఉంది. ఎవరి ముఖాల్లోనూ కళలేదు. కాంతిలేదు. చిరునవ్వు బొత్తుగా లేదు. ఏదో పోగొట్టుకొన్నట్లు అంతా బాధపడుతున్నారు.

పైగా భరతునికి అన్నీ అపశకునాలే అతని మనస్సు ఆందోళనగా ఉంది. ఏ అశుభం జరిగిందో! ఎవ్వరికి జరిగిందో!

రథం దిగి వెంటనే భరతుడు దశరథుని అంతఃపురానికి వెళ్ళాడు. దశరథుడు లేడు. ఆ పైయెక్కి కైక దగ్గరకు వెళ్ళాడు. కైక కొండంత సంతోషంతో ఉంది. అయోధ్యలోఎక్కడా అగుపించని సంతోషం అంతా ఒక్క చోటికి చేరి కైకముఖంలో కొట్టవచ్చినట్టు కన్పిస్తూ ఉంది.

అయినా అక్కడ దశరథుడు లేడు.

కైక ఆప్యాయంగా కొడుకును కౌగలించుకొంది. పేరుపేరునా తన పుట్టింటి వారి నడిగింది. ఆనందంలో తేలిపోతూ ఉంది భరతునికి ఆశ్చర్యం వేసింది. అయినా ఆమె ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పాడు. ఆమె ఇంకా ఏవేవో అడగబోయింది.

'అమ్మా! నాన్న ఏదీ!' అన్నాడు - ఆమె మాటకు అడ్డుతగులుతూ 'అన్నిప్రాణుల్లాగా ఆయనా గతించా'డంది - ఏ మాత్రం కదలిక లేకుండా.

భరతునికి నడినెత్తిన పిడుగుపడట్లయింది.

పాపం ! అతడు మూర్ఛపోయాడు.

ఎంతసేపటికో తెప్పరిల్లుకొన్నాడు. అంతులేని దుఃఖం అను భవించాడు.

కైకకొడుకును ఓదార్చింది. ఇలా చతికిల పడ్డావెందుకని ఓదార్చింది. మానవులకు మరణం తప్పదని వేదాంతం బోధించింది. 'అమ్మా ! నాన్నగారు రామాభిషేకం జరిపించాలను కొన్నారా ? లేదా ఏదైనా మహాయాగం చెయ్యాలను కొన్నారా ? నన్ను రమ్మని కబురు పంపారు. ఆఖరు క్షణంలో ఆయనతో మాట్లాడే అవకాశం గూడ లేక పోయింది' ఎంతో దురదృష్టవంతుణ్ణి, ఆయన ఏం చెప్పి మరణించాడమ్మా !' అని అడిగాడు భరతుడు కళ్ళనీళ్ళు కారుస్తూ - గద్గద స్వరంతో.

'హా రామా ! హా సీతా ! హా లక్ష్మణా ! అని పలవరిస్తూ - తిరిగి వచ్చిన మిమ్మల్ని చూడగల వారే ధన్యులంటూ' ప్రాణాలు వదిలాడంది కైక.

'అయితే అన్నగారు గూడ అయోధ్యలో లేరా' అన్నాడు ఆశ్చర్యంగా భరతుడు.

లేడు. సీతాలక్ష్మణులతో కలిసి నారచీరలు ధరించి దండకారణ్యం వెళ్ళాడు' అంది కైక మాట దాచినట్లు.

'అయితే అన్నగారు ఏ అపరాధం చేశారు. ఎందుచేత నాన్నగారు వారిని అడవులకు పంపారు' అని అడిగాడు భరతుడు.

కైక కొంత విసుక్కొంది. వెంటనే కొడుకుని కౌగిలించుకొని 'భరతా ! ఈ లోకంలో నీ కంటె నాకెవరున్నారు. ఎప్పుడో దశరథుడు నాకు రెండు వరాలి చ్చాడు. వాటిని నీ కొరకు దాచి ఉంచాను. ఇప్పుడవి అడిగాను - రాముని అడ వికి పంపమని, నిన్ను యువరాజుగా చెయ్యమని. మాట తప్పలేక రాముని అడ వికి పంపారు. ఆ రాముని వదలి ఉండలేక ప్రాణాలు విడిచాడు. జరిగినదేదో జరిగింది. దానికి బాధపడకు, పట్టాభిషిక్తుడవై రాజ్యాన్ని పాలించు. అంతకంటె నాకీ జీవితంలో ఏం కావాలి. నా ఆశలకు, ఆశయాలకు అన్నింటికి అదే పరమా వధి' అంది కైక కొడుకు వీపు నిమురుతూ.

భరతుడు అగ్నిపర్వతంలా బ్రద్దలయ్యాడు.

'నీవు తల్లివా । రాక్షసివా !' అన్నాడు.

'నీవు నా తండ్రిని చంపావు. అన్నను అడవుల పాలు చేశావు. పరమ దుర్మార్గంగా ప్రవర్తించావు. నీకు ఎవ్వరే అపకారం చేశారు. రాముడు నిన్ను తల్లి కంటె ఎక్కువగా గౌరవిస్తున్నాడు. కౌసల్య నిన్ను సొంత చెల్లెలి కంటె ఎక్కువగా చూచుకొంటున్నది. వాళ్ళకి అపకారం ఎందుకు చేశావు. రాముని మించిన ధార్మికుడెవరు ! ఆయనను మించిన సమర్థుడెవరు ! దశరథ మహారాజు వహించిన ఈ రాజ్యభారాన్ని ఎవ్వరు వహించగలరు ! ఆయనలా ఎవరు పాలించ గలరు. ఒక్క రాముడే గదా. అంతే గాదు - రాముడు జ్యేష్ఠుడు. వంశాచారాన్ని బట్టి ఆయనే ఈ రాజ్యానికి వారసుడు. ఏ విధంగా చూచినా ఆయన రాజు కావ టమే ధర్మం.

వంశమర్యాదను మంటగలిపావు. ధర్మాన్ని కాలదన్నావు. మితిమీరిన స్వార్థబుద్ధితో వ్యవహరించావు.

నీ కోరిక నెరవేర్చను. నేనీ రాజ్యం స్వీకరించను. ఇది రామునిది. దీన్ని ఆయనే పాలించాలి. అని తల్లి దుర్బుద్ధిని దారుణంగా నిందించాడు.

ఒక్కఊపున శత్రుఘ్నునితో కలిసి కౌసల్యమందిరానికి వెళ్ళాడు. కౌసల్య నేల మీద బడి ఏడ్వుస్తూ ఉంది.

అన్నదమ్ములిద్దరు ఆ అమ్మను కౌగలించుకొన్నారు. అమితంగా దుఃఖిం చారు.

'నాయనా నీవు కోరిన రాజ్యం నీకు లభించింది. నన్ను నా రాముని దగ్గ రకు చేర్చి పుణ్యం కట్టుకో' అని కౌసల్య పలికే సరికి పచ్చిపుండు మీద సూది గ్రుచ్చినట్లు భరతుడు బాధపడ్డాడు.

'అమ్మా ! నా కేమీ తెలీదు. కలలో గూడ నేను రాజ్యం కోరలేదు. నేనే పాపం ఎరుగను. శ్రీరామవనవాసాన్నే నేను సంకల్పించి ఉంటే గురుముఖతః నేర్చిన నా విద్య అంతా వ్యర్థమగుగాక! గోమాతను పాదాన దన్నిన పాపానపోదును గాక. ప్రభుద్రోహం చేసిన పాపమనుభవింతును గాక. వేదవిప్రులకు యాగదక్షిణలు ఎగవేసిన పాపం కలుగునుగాక; గురుద్రోహి, పరమ భ్రష్టుడు పొందు దుస్థితిని పొందుదును గాక-' అని ఎన్నో ఒట్లు పెట్టుకొని భరతుడు ఆమె పాదాలమీద

ప్రాలిపోయాడు.

కౌసల్య భరతుని ఓదార్చింది

అయినా ఆ రాత్రి భరతునికి దుఃఖంతోనే గడిచింది; నిట్టూర్పులతోనే తెల్లవారింది.

మరునాటి ఉదయం వసిష్ఠమహర్షి వచ్చాడు. భరతుణ్ణి ఓదార్చాడు. దశరథునికి చేయవలసిన ఉత్తరక్రియలు గుర్తు చేశాడు.

ఉత్తరక్రియలు సశాస్త్రీయంగా జరిగాయి.

పంద్రెండు రోజులు పూర్తి అయ్యాయి. ఇక భరతుని రాజ్యాభిషేకమే అటో ఇటో తేలాలి.

ఈ లోగా ఒక చిత్రమైన సంఘటన.

మంథర అందంగా అలంకరించుకొని ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ బయటికి వచ్చింది. శత్రుఘ్నుని కంటబడింది. ఒక్క క్షణం ఆలస్యమయితే ఆ మంథర ముక్కచెక్కలయ్యేదే. అప్పటికే శత్రుఘ్నుడామెను నేలమీద పడవేసి ఈడ్చాడు.భరతుడు వచ్చి వారించాడు.

'శత్రుఘ్నా ! స్త్రీహత్య మహాపాతకం. ధర్మాత్ముడైన రాముడది సహించడు. అది మనచేతిమీదుగా జరిగిందని తెలిస్తే ఆయన మన ముఖం చూడడు. మనతో మాట్లాడడు. అందుచేతనే నేనూ ఊరుకొన్నాను. లేకుంటే ఈ పాటికి కైకేయినే కడతేర్చి ఉండేవాణ్ణి' అని శత్రుఘ్నుణ్ణి చల్లబరచాడు. ఆ స్త్రీ హత్యను ఆపాడు. అన్న ధార్మికత మీద తన కెంత గౌరవమో తెలియబలికాడు.

మొత్తానికి మంథర బ్రదికింది.

పదునాల్గవరోజు ప్రాతఃకాలాన్నే మంత్రి పురోహిత సామంత దండనాథ పౌరజానపద ప్రముఖులంతా భరతుని దర్శించారు. పట్టాభిషిక్తుడవు కమ్మని ప్రార్థించారు. అందుకవసరమైన సంభారాలన్నీ సిద్ధంచేశారు.

ఒకవైపు మహాసామ్రాజ్య వైభవం.

మరోవైపు కన్నతల్లి కాంక్ష.

ఇంకోవైపు ధర్మ విదృష.

భరతుని కది పెద్ద పరీక్ష.

సామ్రాజ్యవైభవాన్ని, తల్లికాంక్షను భరతుడు తృణీకరించాడు. అభిషేక జలభాండానికి ప్రదక్షిణం చేశాడు. అందరిని ఉద్దేశించి 'ఇక్ష్వాకువంశంలో జ్యేష్ఠుడే రాజు. రాముడు అయోధ్యకు రాజు. అభిషేక ద్రవ్యాలతో, చతురంగ బలాలతో అరణ్యానికి బయలుదేరుతున్నాను. అక్కడే రాముణ్ణి అభిషిక్తుణ్ణి చేసి, యాగశాల నుండి అగ్నిహోత్రుణ్ణి ఇంటికి గొనివచ్చినట్లు ఆయనను అయోధ్యకు తోడ్కొని వస్తాను. ఆయన బదులు నేనే పదునాలుగేళ్ళు అరణ్యవాసం చేస్తాను. కైక కోర్కె ఈ జన్మలో సఫలం గాదు. నా నిర్ణయానికి తిరుగులేదు'— అని నిర్ధరించి పలికాడు. పరివారాన్ని ప్రయాణానికి సిద్ధం చెయ్యమన్నాడు.

వసిష్ఠమహర్షి మరునాడు మరల సభచేశాడు. ఆ మహాసభలో 'భరతా! నీ పితృదేవుడు నీకు రాజ్యమిచ్చి పరమపదించాడు. నీ జ్యేష్ఠభ్రాత తండ్రి ఆజ్ఞను తలదాల్చి అడవికి వెళ్ళాడు. అయోధ్యకిప్పుడు రాజు లేడు. ఈ స్థితి ఎక్కువకాలం కొనసాగరాదు. శీఘ్రమే నీవు అభిషిక్తుడవై రాజ్యభారం స్వీకరించు' అని అందరిముందు మరల అడిగాడు పాపం! భరతుడు సిగ్గుపడ్డాడు. దుఃఖపడ్డాడు.

గద్గదస్వరంతో 'మహామునీ! ఇదా నీవుపదేశించే ధర్మం. సదాచారాన్ని, ధర్మాన్ని మంటగలపమంటావా! రాముడు జ్యేష్ఠుడు: శ్రేష్ఠుడు. ఈ రాజ్యం రామునిది. నేను రాముని వాడను. నా తల్లి చేసిన అధర్మాన్ని నేను అంగీకరిస్తానా అడవులకు వెళ్తాను. ఆ రాముణ్ణి ప్రార్థించి అయోధ్యకు పిలుచుకొని వస్తాను. ఆయన రాకుంటే నేనూ అక్కడే ఉండిపోతాను. అంతేగాని అయోధ్యకు నే నభిషిక్తుణ్ణి కావటం అసంభవం. అయోధ్యకు రాజు రాముడు అయోధ్యకే గాదు. అన్నిలోకాలకు, నాకు ఆయనే రాజు' అని అరణ్యంలో ఉన్న రాముని స్మరించి అంజలి ఘటించేసరికి అంత సభ ఆనందబాష్పాలు రాల్చింది. హర్షధ్వానాలు చేసింది. భరతుని ధర్మరక్తిని వేనోళ్ళ ప్రశంసించింది

వసిష్ఠుడు లేచివచ్చి భరతుని ఆశీర్వదించాడు భరతుడు 'సుమంత్రా ! సైన్యాన్ని సిద్ధం చెయ్యి. ఉదయాన్నే మన ప్రయాణం' అనే సరికి ఆ మహాసభే గాదు - అయోధ్యామహానగరమే అంతకంత ఉప్పొంగింది.

మరునాటి ఉదయం అదొక మహాజన ప్రవాహం. అయోధ్య నుండి అర ణ్యంవైపు సాగే ప్రవాహం. భరతుని భ్రాతృభక్తి, ప్రజల రామభక్తి ఏకమై సాగిన మహాప్రవాహం. ముందు రథాల్లో మంత్రులు, పురోహితులు, తరువాత భరతుడు ఆ తరువాత అరువది వేల రథికులు. అశ్వికులు లక్షమంది. మధ్య కైకేయి, సుమిత్ర, కౌసల్య.

గుట్టలు, చెట్లు నరికి, గుంటలు, మిట్టలు చదునుచేసి, వంతెనలు, విశ్రాంతి గృహాలు నిర్మించి మార్గాన్ని ప్రయాణయోగ్యంగా మలచటానికి అశేషపరిచారికా జనం ముందే వెళ్ళింది.

అంతా శృంగిబేరపురం చేరుకొన్నారు. గంగ గట్టున గుడారాల్లో విడిది చేశారు. గుహుని అతిధ్యం స్వీకరించారు.

గుహుడు చూపగా భరతుడు ఇంగుదీవృక్షం క్రింద సీతారాములు పవ్వళించిన దర్భశయ్య చూచాడు. దానికి తగులుకొన్న సీతాదేవి ఉత్తరీయపు పోగులను గూడ చూచాడు. తన కారణంగా వారికి తటస్థించిన దుస్థితిని తలచుకొని పెద్దగా దుఃఖించాడు. అది మొదలు తానుగూడ కందమూలాదులే తినాలని, నారచీరలే కట్టాలని జటలు ధరించి నేలమీదనే పరుండాలని నిర్ణయించాడు. భరతుని ఆవేదనకు అంతులేదు. అన్నను చూచేదాకా అతని మనస్సుకు నిలకడలేదు.

గుహుని సాయంతో భరతుడు ససైన్యంగా గంగానదిని దాటాడు. భరద్వా జాశ్రమంలో ఒక్క రాత్రి గడిపాడు మరునాడు చిత్రకూటం చేరుకొన్నాడు.

అన్నగారి ఆశ్రమానికి ఏ అననుకూలత ఏర్పడకుండ సైన్యాన్ని చిత్ర కూటం చుట్టూ నిలిపి, పరమభక్తితో పాదచారియై శత్రుఘ్న సుమంత్రులను వెంటతీసుకొని బయలుదేరాడు. అక్కడక్కడ చెట్లకు కట్టి ఉన్న నారచీరపేలికలు చూచాడు. అవి లక్ష్మణుడు సాయం వేళ ఫలజలాదులు సేకరించి తెస్తూ త్రోవ తెలియటానికి కట్టిన గుర్తులని గ్రహించాడు. అగ్నిహోత్రధూమం చూచాడు, అది రామాశ్రమమే అని ఊహించాడు. ఇంకా ముందుకు నడిచాడు. మనోహర మైన పర్ణశాల చూచాడు. వచ్చిన వారితో ముచ్చటించటానికి ముందుభాగంలో నిర్మి తమైన ఒక మంటపాన్ని గూడ చూచాడు. పూజాద్రవ్యాలు చూచాడు. పర్ణశాల అంతర్భాగంలో ఉన్న అగ్నివేదిక చూచాడు. జడలు దాల్చి, నారచీరలు ధరించి

కుప్ప వోసిన ధర్మంలా కూర్చున్న అన్నగారిని చూచాడు. ఒక్కపరుగున వెళ్ళి పాదాలమీద వ్రాలాడు.

'అన్నా!' అన్నాడు. అంతే. ఆవల మాటరాలేదు. పాదాలు చేతికి దొరికాయి. అంతే. అశ్రుధారల అడ్డువల్ల రాముని రూపు సరిగ కంటికి కన్పించ లేదు.

శత్రుఘ్నుడు గూడ సాగిలపడ్డాడు. అతనికసలే మాట లేదు.

పాపం! సుమంత్రుడు చూస్తూ అలా కొయ్యబారి నిలబడిపోయాడు.

భరతశత్రుఘ్నులు అన్న పాదాలమీద అలాగే వ్రాలి ఉన్నారు. వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. సీతాలక్ష్మణులకు దిక్కుతోచలేదు. అలా చూస్తూ ఉండి పొయ్యారు.

రాముడు తమ్ములిద్దరిని కౌగలించి లేవనెత్తాడు. కన్నీళ్ళు తుడిచాడు. భర తుడు మరీ కుమిలిపోతున్నాడు. రాముడతనిని ఆప్యాయంగా తొడమీద కూర్చో బెట్టుకొన్నాడు. ఏవేవో కుశల ప్రశ్నలడిగాడు. తండ్రిని గూర్చి అడిగాడు. తల్లు లను గూర్చి అడిగాడు. వసిష్ఠుని గూర్చి అడిగాడు. ఆయన కొడుకు సుయజ్ఞుని గూర్చి అడిగాడు. ప్రజా క్షేమాన్ని గూర్చి అడిగాడు. ప్రభుత్వ విధానాన్ని గూర్చి అడిగాడు. పాలనాపద్ధతిని గూర్చి అడిగాడు. అన్నీ ధర్మబద్ధంగా సాగుతున్నా యా అని అడిగాడు.

భరతుని కళ్ళనీళ్ళు కారిపోతున్నాయి.

అన్న అయోధ్యలో అంతా బాగున్నారనే అనుకొంటున్నాడు. అన్నీ సవ్యంగా జరిగిపోతున్నాయనే అనుకొంటున్నాడు. తమ్ముడు భరతుడు రాజ్యాధికా రం స్వీకరించాడనే అనుకొంటున్నాడు. రాజ్యాన్ని ధర్మబద్ధంగా, పాలిస్తున్నా డనే అనుకొంటున్నాడు.

అన్నకు చెప్పవలసింది ఎంతో ఉంది. అయినా ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? భరతునికి ఏమీ తోచలేదు.

అయినా చెప్పక తప్పదు. అంతదూరం అన్నను వెతుక్కుంటూ వచ్చింది అన్నీ చెప్పటానికే

భరతుడు కన్నీళ్ళు కుడుచుకొన్నాడు. తండ్రి మరణవార్త చెప్పాడు. మళ్ళా కన్నీళ్ళు కురుసుకొన్నాడు. కన్నతల్లి దుశ్చేష్టను దూషించాడు. సిగ్గుతో కలపించుకొన్నాడు. తన నిర్దోషిత్వాన్ని తెలుపుకొన్నాడు. భారంగా నిట్టూర్పు విడిచాడు. అయోధ్య పరిస్థితులు వివరించాడు. పాదాలు రెండూ పట్టుకొన్నాడు. పట్టాభిషిక్తుడవై మమ్మందరిని పాలించమని ప్రార్థించాడు. తండ్రి మృతికి రాముని ముఖంలో దుఃఖం తాండవించింది. భరతుని స్థితికి రాముని మాటల్లో సానుభూతి వెల్లివిరిసింది.

కాని ఆ ప్రార్థనకు మాత్రం అంగీకారం అటు ముఖంలోగాని, ఇటు మాటలోగాని రేఖామాత్రంగా గూడ లేదు. భరతునికి ఆయన అంగీకారమే కావాలి. అందుకే అతడు అంతదూరం వచ్చాడు. అందుకే అతడు అంతులేని తపన అనుభవిస్తున్నాడు. అది లభిస్తే గాని అతనికి మనశ్శాంతి ఉండదు.

తండ్రి ఆనతి తలదాల్చి పదునాలుగేళ్ళు అరణ్యవాసం చేస్తానన్నాడు రాముడు.

వంశాచారాన్ని, మా అభీష్టాన్ని మన్నించి అభిషిక్తుడవై అయోధ్యను పాలించమన్నాడు భరతుడు.

పితృవాక్యపాలన మన కర్తవ్యమన్నాడు రాముడు.

నీ బదులు నే వనవాసం చేస్తానన్నాడు భరతుడు.

రాజ్యాన్ని తండ్రి నీకిచ్చాడన్నాడు రాముడు.

రాజ్యం నీది, నాకక్కర లేదన్నాడు భరతుడు.

నా వనవాసనిర్ణయం మారదన్నాడు రాముడు.

నీవు అయోధ్యకు వస్తేగాని నే నిక్కడి నుండి వెళ్ళనన్నాడు భరతుడు.

పాపం! భరతుడు ఎంతవరకని వాదించగలడు - అందులో రామునితో, అటు ఇటు చూచాడు 'సుమంత్రా! దర్భలు శీఘ్రంగా తీసుకురా. పర్ణశాల వాకిట పరుపు' అన్నాడు.

సుమంత్రుడు తటపటాయించాడు. రామునివైపు చూచాడు. భరతుడది గమనించాడు. తక్షణమే లేచి తానే పరచుకొని పర్ణశాల వాకిటికి అడ్డంగా పడుకొన్నాడు. గుడ్డ ముఖానికి కప్పుకొన్నాడు. ప్రాయోపవేశానికి పూనుకొన్నాడు

'రామా ! నీవు అయోధ్యకు రావటమో నేను ప్రాణాలు వదలటమో తేలిపోవా లన్నాడు.

శ్రీరాముడు సంభ్రమపడి లేచాడు. తమ్ముడూ ! అంటూ దగ్గరికు వచ్చాడు.

అన్నగారి వాకిటికి అడ్డంగా పడుకొన్నాడు ఆ తమ్ముడు. తమ్ముడి ప్రక్క నే పర్వతశిఖరంలా నిలబడ్డాడు ఆ అన్న.

అదొక అద్భుత దృశ్యం.

మహర్షులు చూస్తూ నిలబడ్డారు. మాతృమూర్తులు చూస్తూ నిలబడ్డారు. బంధువులు చూస్తూ నిలబడ్డారు. పౌరజానపద ప్రముఖులంతా చూస్తూ నిలబడ్డారు.

అంతా మౌనం.

రాముడు ఆప్యాయతీవ్రంగా 'తమ్ముడూ ! ఇది తగదన్నాడు'. అన్న పాదాలు పట్టుకోబోయాడు తమ్ముడు. ప్రక్కనే ఉన్న పాదుకలందాయి అతని చేతులకు.

'తమ్ముడూ ! ఇలా వాకిటికి అడ్డంగా పడుకోవటం క్షత్రియధర్మవిరుద్ధం. లే వెంటనే లే. నన్ను, నీళ్ళను స్పృశించు. ఆ దోషాన్ని పరిహరించు' - అని గంభీరంగా రాముడు అనే సరికి అందరు భరతుని లెమ్మన్నారు.

భరతుడు లేచాడు.

శ్రీరాముని, జలాన్ని స్పృశించాడు. చేతులు జోడించి - 'రాజ్యం కావాలని నేను తండ్రిని కోరలేదు. నాకు రాజ్యం ఇచ్చేలా ప్రయత్నించమని తల్లిని ప్రేరేపించలేదు. పరమధర్మజ్ఞుడైన రాముడు అరణ్యవాసం చెయ్యటం నే నంగీకరించను. పితృవాక్యం తప్పక పాటించాలంటే ఆయన బదులు నేనే అరణ్య వాసం చేస్తాను. రాముడు అయోధ్యారాజ్య పాలించాలి. అప్పుడుగాని నాకు మనశ్శాంతి లేదు మనశ్శాంతి లేదు' - అని కన్నీరు విడుస్తూ భరతుడు అందరిసమక్షంలో పలికాడు.

రాముడు ప్రియమార తమ్ముని దగ్గరకు తీసుకొన్నాడు.
కన్నీరు తుడిచాడు.

భరతా! వెన్నెల చంద్రుణ్ణి వదిలితే వదులుగాక. మంచు హిమ గిరిని వదిలితే వదులుగాక సముద్రం చెలియలికట్టను దాటితే దాటుగాక. నేను మాత్రం తండ్రికి చేసిన ప్రతిజ్ఞ అతిక్రమించను. అయోధ్యకురాను. ఈ పద్నాలుగేళ్ళు దాటిన తరువాత వస్తాను. రాజ్యాన్ని స్వీకరిస్తాను. అంతవరకు అయోధ్యపాలన నీకు తప్పదు'_ అని ఖండిత నాదముగంట మ్రోగించినట్లు చెప్పి, సూర్యతేజస్సుతో సూటిగా చూచే సరికి అతడు రాముని వైపు చూడలేక పోయాడు. దీనంగా తలవంచుకొన్నాడు. దగ్గరున్న రామపాదుకలు దర్శనమిచ్చాయి.

భరతుని ముఖంలో మెరుపులా ఏదో భావం వెల్లివిరిసింది. వెంటనే ఆ పాదుకలు చేతపట్టుకొన్నాడు.

'రామా! నీ పాదుకలు నాకు, అయోధ్యకు, సమస్త ప్రపంచానికి రక్ష. నీ పాదాలతో ఈ పాదుకల నలకరించి నాకు ప్రసాదించు. ఈ పదునాలుగేళ్ళు రాజ్యాన్ని నీ పాదుకలకు అప్పగించి, జడలుదాల్చి, నారచీరలు గట్టుకొని, ఫలమూలాదులు భుజిస్తూ అయోధ్యకు వెలుపల నివసిస్తూ నీ ప్రతినిధిగా రాజ్యపాలన సాగిస్తా. పదునాలుగేళ్ళు దాటిన మరునాడు నీవు అగుపించకుంటే అగ్నిప్రవేశం చేస్తా' అని గద్గదకంఠంతో భరతుడు పలికాడు. పాదుకలు రాముని పాదాల ముందు ఉంచాడు.

రాముడు భరతుని గాఢంగా కౌగలించుకొన్నాడు. ఆ పాదుకల మీద తన పాదాలు నిలిపాడు.

భరతుడు రామపాదుకలు తీసుకొన్నాడు. కళ్ళకద్దుకొన్నాడు. తలపై ఉంచుకొన్నాడు తిరిగి వెళ్ళటానికి సెలవు తీసుకొన్నాడు.

సాగనంపుతూ శ్రీరాముడు 'కైకమ్మ మీద ఇక కోపపడవద్దు తమ్ముడూ! ఆ తల్లి మీద కోపపడితే నామీద ఒట్టు, మీ వదినె మీద ఒట్టు' అనే సరికి భరతుని కళ్ళనుండి కట్టలు త్రెంచుకొని నీళ్ళు క్రిందికి దూకాయి.

రాముడు వసిష్ఠ వామదేవాదులను సాగనంపాడు. తల్లులను సాగనంపాడు. సుమంత్రుని సాగనంపాడు. తక్కిన మంత్రిసామంతులను సాగనంపాడు. పౌర జానపదులను సాగనంపాడు.

అందరు రాముని దగ్గర సెలవు తీసుకొన్నారు.

భారంగా ఊర్పు వదలుతూ బయలుదేరారు.

ఆ అన్న పాదుకలు శిరస్సున ధరించి ఆ తమ్ముడు భరతుడు చిత్రకూట శిఖరం మీది నుండి క్రిందికి దిగివస్తుంటే, ఆయనవెంట పురోహితులు, మంత్రులు, సామంతులు, పౌరజానపద ప్రముఖులు నడచి వెళ్ళుతుంటే. చతురంగబలాలు ప్రయాణానికి సిద్ధమై సాగిపోతుంటే కొండమీది సెలయేళ్ళన్నీ గలగల కదలివచ్చి చూచాయి. అడవిలోని చెట్లన్నీ ఉత్కంఠతో ఊగిఊగి చూచాయి. చుట్టుప్రక్కల తీవలన్నీ కొమ్మలెక్కి తొంగి చూచాయి. పక్షులన్నీ ఒక్కసారి పైకెగిరి చూచాయి. మృగాలన్నీ నేలమీద పరుగులు తీసి చూచాయి.

మానవ చరిత్రలో అదొక అపూర్వదృశ్యం.

ధర్మరక్తికి, భ్రాతృభక్తికి, త్యాగశక్తికి అదొక అద్భుతతార్కాణం.

అయోధ్యకు అనతిదూరంలోనే ఉంది నంది గ్రామం. అ గ్రామంలోనే జరిగింది. రామపాదుకాపట్టాభిషేకం. అదృష్టమంటే ఆ గ్రామానిదే. అనుకోకుండా దానికి పట్టింది రాజధానీ మహాయోగం.

రామపాదుకలు పదునాలుగేళ్ళు రాజ్యం చేశాయి. అనాయాసంగా చేతికందిన అయోధ్యా మహారాజ్యాన్ని, అనుభవిస్తూ ఉన్న అఖండ భోగభాగ్యాలను అలవోకగా త్రోసిపుచ్చి జడలుదాల్చి, నారచీరలు ధరించి, ఫలమూలాదులు భుజించి, నేలమీద పవ్వళించి పదునాలుగేళ్ళు ఆ పాదుకా సేవకుడుగా పాలనావ్యవహారాలు చూస్తూ జీవితం గడిపాడు భరతుడు. ఏమిత్యాగం ! ఎంత ఆత్మనిగ్రహం !

అది పదునాలుగేళ్ళు పూర్తి అయిన తరువాతిరోజు, రాముడు రావలసిన రోజు. అపరాహ్ణమయ్యింది. ఇంకా రాముడు రాలేదు. అప్పటికే మంత్రులతో, పురోహితులతో, దండనాధులతో, భరతుడు కొలువు దీరాడు. అన్న రాలేదే అని దిగులుపడుతూ అందరితో అదే విషయం మాట్లాడుతున్నాడు. అంతలోనే హనుమంతుడు వచ్చాడు. రామాగమన వార్త తెచ్చాడు.

చల్లగాలిపీచినట్లుంది. వెన్నెల కురిసినట్లుంది. కమ్మని పరిమళం వలయ ప్రాకినట్లుంది. ఎంతో భారం తలమీది నుంచి దించి నట్లుంది. భరతుని ఆనందానికి అవధి లేదు అతడు హనుమంతుని కౌగలించుకొన్నాడు. నీవు దేవతవో మనుష్యుడవో తెలియటం లేదు. ఇంత ప్రియవార్త తెచ్చిన నీకు శతసహస్ర

గోదానాలిస్తానన్నాడు. నంద గ్రామాల దానం చేస్తానన్నాడు. సౌందర్యవతులు, విద్యావతులు, వివాహయోగ్యలు అయిన షోడశకన్యల నిస్తానన్నాడు.

ఇదంతా భరతుని ఆనందంగాని - అవన్నీ ఆంజనేయస్వామి కెందుకు ?

భరతుడు ఆయనచేత అరణ్యంలో జరిగిన రామకథ అంతా వివరంగా చెప్పించుకొని విన్నాడు, శత్రుఘ్నుని పిలిచి పెద్దయెత్తున స్వాగత సత్కారాలకు ఏర్పాట్లు చేయించాడు రామపాదుకలు స్వయంగా శిరస్సున ధరించి, శ్వేతఛత్ర చామరాదులతో. మంత్రిపురోహితసామంత దండనాథులతో, సమలంకృత చతురంగబలాలతో, ఆనందోత్సాహాలతో అన్నకెదురోక్కటానికి బయలుదేరాడు. రాముడు రావటం ఒక్క క్షణం ఆలస్యమైందో లేదో భరతుని మనస్సు బాధపడి పోయింది.

'హనుమంతా ! చాపలంతో ఏదో నీవు చెప్పలేదు గదా. అన్న ఇంకా రాలేదే' అన్నాడు - అప్పటికే ఆందోళనగా హనుమవైపు తిరిగి అంతలోనే ఆకాశంలో మెరుపులా పుష్పకవిమానం. అదుగో రాముడు అన్న ఆబాలగోపాల కోలాహలం. ఆనందనృత్యం. జయజయధ్వాన జంఝూమారుతం.

పుష్పకం నేలకు దిగింది. రాముడు తమ్ముణ్ణి చూచి చిరునవ్వు నవ్వాడు. భరతుడు అన్నకు శిరస్సువంచి నమస్కరించాడు. రాముడు తమ్మునికి చెయ్యి అందించాడు. భరతుడు పులకించి పుష్పకంలో అడుగుబెట్టాడు. రాముడు తమ్ముని తన తొడమీద కూర్చోబెట్టుకున్నాడు. భరతుడు జన్మ తరించినట్టు ఆనందానుభూతి పొందాడు. అన్నకు నమస్కరించాడు. వదినెకు నమస్కరించాడు. లక్ష్మణుని సంభావించాడు. సుగ్రీవ జాంబవదంగదమైంద సుషేణ గవాక్షాదులందరిని గాఢంగా కౌగలించుకొన్నాడు మరొకసారి సుగ్రీవుని కౌగలించుకొన్నాడు. నీవు మాకు ఐదవ తోబుట్టువన్నాడు. విభీషణుని కుశల మడిగాడు.

కొలనులోని తామరమొగ్గల్లా పౌరులంతా చేతులు జోడించి చుట్టూ నిలబడ్డారు.

భరతుడు పాదుకలు తీసుకొని స్వహస్తాలతో రాముని పాదాల కలంకరించాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. చేతులు జోడించి నిలిచి 'నీ రాజ్యం నీకు అప్పగించా'నన్నాడు. ఒక్క నిట్టూర్పు విడిచాడు.

అందరు ఒక్కసారిగా ఆ భరతునివైపు చూచారు.

ఆనందాశ్రువులు రాల్చారు.

ఆ భరతుడు వెయ్యి విద్యుద్దీపాల కాంతితో వెలిగాడు.

ఆనందపారావార తరంగాల్లో తేలియాడాడు.

రామాయణంలో భరతుడు అన్నకు తగ్గ తమ్ముడు.

తల్లితో ఏకీభవించని తనయుడు.

భ్రాతృభక్తి, ధర్మరక్తి మూర్తీభవించిన పురుషుడు.

# శత్రుఘ్నుడు

కారణం ఏం చెప్పినా రామాయణంలో మొదటి నుంచీ రాముని అనుసరి
తమ్ముడు లక్ష్మణుడు; భరతుని అనుసరించిన తమ్ముడు శత్రుఘ్నుడు.

శత్రుఘ్నుడు మితభాషి, తేజస్వి, మహాపరాక్రమశాలి. వైరము
దుర్మార్గమున్నా ఆయనకు ఎక్కడలేని ఆవేశం. వాటిని అంతంచేస్తేగాని ఆయ
నిద్రపట్టదు. భరతుడంటే మొదటినుండి శత్రుఘ్నునికి ఒక అతిప్రియత. ఆ అన్న
తోకలసి భుజిస్తేగాని ఆయనకు ఆహారం రుచించేదిగాదు. కలిసి తిరిగితే
యనకు తృప్తి ఉండేది కాదు. అన్నగారి మనస్సును, మాటను గ్రహి
ఆ శత్రుఘ్నుడు మసలుకొనేవాడు.

అట్లని రాముడంటే శత్రుఘ్నునికి ఇష్టం లేదని గాదు. రాము
ఆయనకు ఎంతో గౌరవం. అంతేగాదు, ఆ అన్నగారి ఎదుటికి రావాలంటేనే ఎం
ఒక విధమైన జంకు. రాముడు ఎప్పుడు ఎదురుపడినా శత్రుఘ్నుడు శిరస్సు
నిలిచేవాడు. నిలువెల్ల భక్తిగా చేతిలెత్తి మ్రొక్కేవాడు.

సోదరుడు లక్ష్మణుడంటే శత్రుఘ్నునికి చెప్పలేనంత స్నేహభావం. ఎప్ప
కలిసినా హార్దికంగా ఇద్దరూ కౌగిలించుకొనేవారు. అన్నగారల గుణగణ
హాయిగా ముచ్చటించుకొనేవారు. అటు కేకయరాజ్యవిశేషాలను, ఇటు అయో
రాజ్య విశేషాలను ఆసక్తితో చెప్పుకొనేవారు.

బాల్యంలోనే శత్రుఘ్నుడు భరతుని వెంట కేకయదేశం వెళ్ళాడు. అక్కడే పెరిగాడు. పెళ్ళికి గూడ అక్కడినుండే భరతుని వెంట మిధిలకు వచ్చాడు. శ్రుతకీర్తిని వివాహమాడాడు.అన్నవెంట మరల ఆ దేశమే వెళ్ళాడు. అయోధ్యలో రామాభిషేకభంగం గాని, రామ వనగమనం గాని శత్రుఘ్ననికి తెలిలీదు. అయోధ్య నుంచి అనుకోకుండా ఒకనాడు ఆ దూతలు వచ్చారు. అతి ముఖ్యమైన పనిమీద పెద్దలు అక్కడికి రమ్మన్నారని భరతుని పిలిచారు. భరతుని వెంట తానూ బయలుదేరాడు. తీరా అయోధ్యకు వచ్చి చూస్తే అంతా అశుభం ; తీవ్ర విషాదం. తండ్రి మరణించాడు, అన్న అడవులకు వెళ్ళాడు. అంతటికీ కారణం ఆ కైకమ్మ.

పాపం! శత్రుఘ్నుడు ఎంతో బాధపడ్డాడు. అయినా ఎవరిని ఏమని అనగలడు? అన్న భరతుడే అమ్మ కైకను అమితంగా నిందిస్తున్నాడు. అదిచూస్తూ తానూ తలవంచుకొని నిలుచున్నాడు. తండ్రిమరణానికి తీవ్రంగా దుఃఖించి అన్నగారితో కలిసి ఆయన అంత్య క్రియలు పూర్తి చేశాడు.

అది పదమూడవరోజు. దశరథుని అస్థి సంచయనం జరగాలి. ఆ తరువాత భరతుని రాజ్యాభిషేకం! శత్రుఘ్నుడు భరతుని మందిరానికి వెళ్ళాడు. 'అన్నా! రాముడు సర్వసమర్థుడే! కేవలం ఒక స్త్రీ వల్ల అడవుల పాలయ్యాడే! అపకీర్తి భయంతో ఆయన తండ్రి మాటకు తలవంచి వెళ్ళి ఉండవచ్చు. మహావీరుడైన మన లక్ష్మణుడున్నాడే. అతడైనా తండ్రి నెదిరించి ఆ కైకేయి దుర్నీతి ప్రవర్తిల్లకుండా అడ్డు పడగూడదా? అన్యాయాన్ని ఎదిరించకూడదా?' అని ఆవేశంగా అన్నతో అంటూ ఉండగానే మంథర అద్భుతంగా అలంకరించుకొని, ఆనందంగా చేతులు ఊపుకొంటూ అంతఃపురం తూర్పు ద్వారాన ప్రవేశించింది. వెంటనే ద్వారపాలకులు మంథరను పట్టుకొన్నారు. శత్రుఘ్నుని అవలికి పిలిచి 'ప్రభూ! రాముని అరణ్యవాసానికి, దశరథుని మరణానికి ఈ పాపిష్ఠురాలు, క్రూరురాలు మంథరే కారణం' అని అప్పగించారు.

శత్రుఘ్నుని కోపావేశం అగ్నిపర్వతంలా బ్రద్దలైంది. అన్ని అనర్థాలకు ఈ గూనిదే కారణమని — దాని జుట్టుపట్టుకొని క్రింద పడవేసి బటబట ఈడ్చుకొంటూ పోయాడు. ఆ దెబ్బకు మంథర ఆభరణాలన్నీ ముక్కలు ముక్కలై నేలరాలి ఆ ప్రదేశమంతా నక్షత్ర ఖచితమైన ఆకాశంలా అగుపించిందట.

శత్రుఘ్నుని కోపసంరంభాన్ని చెలికత్తెలు చూచి 'అమ్మా ! మంథర చస్తున్న దని అరుస్తూ కౌసల్య కొరకు కొందరు పరుగెత్తారు. కైక కొరకు కొందరు పరుగెత్తారు. అంతలో 'అమ్మా ! కైకా ! ' అని మంథర చావు కేక పెట్టింది. ఆ కేక విని కైక పరుగెత్తుకుంటూ వచ్చింది. 'నాయనా ! శత్రుఘ్నా ! మన మంథర చస్తుందిరా ! అంటూ అడ్డం వచ్చి నిలిచింది. అయినా శత్రుఘ్నుడు ఆగలేదు. ఆ కైక నొకసారి కళ్ళురిమి చూచాడు. పిడుగు పడ్డట్లు పరుషంగా హుంకరించి అవలికి నెట్టాడు.

మంథర క్రిందపడి కాళ్ళుచేతులు గిలగిల తన్నుకొంటూ ఉంది. నోరు లబలబ కొట్టుకొంటూ ఉంది. పెద్దగా ఏడుస్తూ ఉంది.

భరతుడు పరుగెత్తు కొంటూ వచ్చాడు. 'తమ్ముడూ ! స్త్రీ హత్య మహా పాతకం' అని గట్టిగా చెయ్యి పట్టుకొన్నాడు. అప్పుడు శత్రుఘ్నుడు పట్టు విడిచాడు. మంథర అటు ఇటు పొరలి ఎలాగో పైకి లేచి బ్రదుకు జీవుడా అని పరుగెత్తింది. గూని పీపతో మంథర గోడుగోడున ఏడుస్తూ, గునగున పరుగెత్తి పోతుంటే ద్వారపాలకు లంతా పకపక నవ్వారు. 'పట్టుకోండి మరలా' అని పరిహాస మాడారు.

అప్పుడు భరతుడే అడ్డుపడకుంటే శత్రుఘ్నుని చేతులో మంథర చచ్చిపోయేదే. ఆ దుర్మార్గురాలికి ఇంకా ఆయుష్యముంది. అందుకే భరతుడు అడ్డుపడ్డాడు.

దశరథుని అంత్యక్రియలు ముగిశాయి. ఇక భరతుని పట్టాభిషేకం జరగాలి. అయితే భరతుడు తనకు రాజ్యం అక్కరలేదన్నాడు. అన్న రాముడే అయోధ్యకు అభిషిక్తుడు కావాలన్నాడు. అన్ని విధాల అదే ధర్మమన్నాడు అడవులకు వెళ్ళి అన్నను ప్రార్థించి అయోధ్యకు పిలుచుకు వస్తానని బయలు దేరాడు.

భరతుని భ్రాతృభక్తికి, ధర్మరక్తికి శత్రుఘ్నుడు పులకించాడు . ఆయన వెంట తానూ అడవులకు వెళ్ళాడు. ఆ రామపాదాలకు ప్రణమిల్లాడు. అయోధ్యకు రమ్మని ప్రార్థించాడు. ఆయన పాదుకలు తలదాల్చి తిరిగి వచ్చే భరతుని వెంట తానూ వచ్చాడు.

పద్నాలు గేళ్ళు గడిచాయి.

భరతశత్రుఘ్నుల జీవితంలో అది పండుగరోజు. పద్నాలుగేళ్ళ తరువాతి రోజు. రాముడు రావలసిన రోజు . హనుమ ముందుగా వచ్చాడు. సతీసమేతంగా రాముడు వస్తున్నాడని చెప్పాడు. భరత శత్రుఘ్నుల ఆనందానికి అంతులేదు. భరతుని ఆజ్ఞ మేరకు శ్రీరాముని స్వాగత సన్నాహాలన్నీ స్వయంగా శత్రుఘ్నుడే చేశాడు నందిగ్రామంనుంచి అయోధ్యదాకా మార్గాన్ని చదును చేయించాడు. నీళ్ళు చల్లించాడు. పూలు పరిపించాడు. పందిళ్ళువేయించాడు. స్వాగతతోరణాలు కట్టించాడు. అయోధ్యామహానగరాన్ని అందంగా అలంకరించాడు. అన్నగారి రాజ్యాభిషేకానికి అన్ని ఏర్పాట్లుచేశాడు.

రామాభిషేకం జరిగింది. రామరాజ్యం వెలసింది. ధర్మం నాలుగు పాదాలు వర్ధిల్లింది. అందరు సుఖసంతోషాలతో, భోగభాగ్యాలతో హాయిగా జీవిస్తున్నారు.

ఆ సమయంలో సీతా పరిత్యాగం. అది అందరిని కంట తడిపెట్టించిన ఘట్టం. శ్రీరాముని అంత రంగంలో ఆ బాధ ఇంకా పచ్చిగానే ఉంది. ఆనాడాయన కొలువుదీరాడు. భరతలక్ష్మణ శత్రుఘ్నులు ప్రక్కనే ఉన్నారు. యమునా తీరం నుండి వందమంది మహర్షులు వచ్చారు. వారందరికి పెద్ద భార్గవచ్యవనుడు. ఆయన శ్రీరామునికి లవణాసుర వృత్తాంతం చెప్పాడు. రావణాసురుని సంహరించినట్లు ఈ లవణాసురుని గూడ సంహరించి తమ బాధలు తీర్చమని ప్రార్థించాడు రాముడు మహర్షీ ! మీ ఆజ్ఞ శిరసా వహిస్తా' నన్నాడు. ఈ లవణాసుర సంహార బాధ్యతను ఎవరు స్వీకరిస్తారన్నట్లు తమ్ముళ్లవైపు చూచి 'భరతా !' అనగానే భరతుడు తప్పక అంటూ అన్నకు చేతులు జోడించాడు. అంతలోనే శత్రుఘ్నుడు చివాలునలేచి 'ప్రభూ ! భరతుడిప్పటికే అనేక ఘనకార్యాలు చేశాడు. చాల కష్టాల నెదుర్కొన్నాడు. కఠోర నియమాల పాటించాడు. ఈ అవకాశం నా కిప్పించండి' అని అర్థించాడు.

శ్రీరామచంద్రుడు చిరునవ్వు నవ్వాడు. 'శత్రుఘ్నా ! అలాగే కానీ. నీవు శూరుడివి. యుద్ధతంత్ర విశారదుడివి. లవణాసురుని జయించు. ఆ రాజ్యానికి నిన్నే అభిషిక్తుణ్ణి చేస్తాను' అన్నాడు.

అందుకు శత్రుఘ్నుడు సిగ్గుతో శిరస్సు వంచుకొన్నాడు. శత్రుఘ్నుడు లవణాసురుని సంహరిస్తానన్నది స్వార్థబుద్ధితోగాదు. తమ్ముడు తానుండగ ఆ పనికి అన్నగారలు వెళ్ళవలసిన అవసరమేమని. అందుకు రాముడు ఆ మాట

అన్నాడు. శత్రుఘ్నుడు మనస్సు చిన్న బుచ్చుకొని చేతులు జోడించి 'మహారాజా పెద్దలు మీరు ముగ్గురుండగా నాకు రాజ్యాభిషేకమా ! అది న్యాయమా ? భరతుని మాటకు నేనడ్డువచ్చాను. అధిక ప్రసంగం చేశాను. పెద్దల సంభాషణకు పిన్నలు అడ్డు తగుల కూడదు. అది పెద్ద తప్పు. క్షమించండి. ఇంకెన్నడు ఈ లాంటి పనిచేయను. ఇప్పుడు మీ యిష్టం వచ్చినట్లు చేయండి' అన్నాడు ఎంతో ఆవేదనగా.

తమ్ముని వినయానికి, హృదయనైర్మల్యానికి రాముడు ఎంతో సంతోషించాడు. వెంటనే భరత లక్ష్మణులను పంపి, వలసిన ద్రవ్యాలన్నీ తెప్పించి, వసిష్ఠుని పిలిపించి, సర్వజన సమక్షంలో శత్రుఘ్నుని మధు నగరాధిపతిగా అభిషేకించాడు. అందరు శత్రుఘ్నుని చేతులో లవణాసురుడు హతమైనట్లే భావించాడు.

శ్రీరాముడు తమ్ముణ్ణి ప్రియమార తన తొడమీద కూర్చుండ బెట్టుకొన్నాడు. అతని ప్రతాపాన్ని ప్రశంసించి ప్రోత్సహించాడు. లవణాసుర సంహారానికి అవసరమైన ఉపాయాలన్నీ ఉపదేశించాడు అంతటి అన్నగారు తొడమీద కూర్చుండబెట్టుకొని, తన్నుగూర్చి కొన్ని ప్రశంసా వాక్యాలు పలుకుతుంటే శత్రుఘ్నుడు చెప్పలేని ఆనందం అనుభవించాడు. జన్మతరించినట్లు భావించాడు.

లవణాసురయుద్ధం శత్రుఘ్నుని జీవితంలో ఒక ప్రసిద్ధ సంఘటన. లవణాసురుడు సామాన్యుడు కాడు మహాబలుడు. పైగా అతనికి మహాశివుడిచ్చిన శూలం ఉంది. అందుచేత అతనిని సంహరించటం ఎంతో కష్టమైన పని. అందుకు శక్తి మాత్రమే గాదు. యుక్తి గూడ కావాలి.

శత్రుఘ్నుడు సైన్యాన్నంతా సమాయత్తం చేశాడు. ముందుగా పంపాడు. నెల తరువాత తాను తల్లులకు, అన్నలకు, వసిష్ఠునకు నమస్కరించి బయలు దేరాడు. వాల్మీక్యాశ్రమంలో ఒకరాత్రి విశ్రమించాడు. ఆ మహర్షి ఆతిథ్యం స్వీకరించాడు. ఆ రాత్రే సీతాదేవి కుశలవులను కన్నది. శత్రుఘ్నుడు మహానందంతో వదినె గారిని దర్శించి, కుశలమడిగి, మరునాటి ఉదయమే బయలుదేరి భార్గవచ్యవనుని ఆశ్రమం చేరుకొన్నాడు. ఆ మహర్షి చెప్పగా లవణాసురుని శక్తి సామర్థ్యాలు, అతని శూలం వల్ల మాంధాత మహారాజు మరణించిన విధం అంతా విన్నాడు. మహర్షుల సలహా మేరకే మరునాడు ఆ రాక్షసుడు ఆహారానికి అరణ్యాలకు వెళ్ళిన సమయంలో అతని మధుపుర ద్వారాన్ని ముట్టడించాడు. లవణుడు

వివిధమృగాల మాంసాలు మోసుకొంటూ ఇంటికి వచ్చి వాకిటికి అడ్డంగా ఉన్న ఆ శత్రుఘ్నుని చూచాడు. అతని మాటలను ఆ రాక్షసుడు మండి పడ్డాడు. 'మూర్ఖా! మీ అన్న మా పిన తల్లి కొడుకు రావణుని సంహరించి అతని వంశం నాశనం చేశాడు. అయినా నేను సహించి ఊరకొన్నాను. ఇప్పుడు నీ అంతట నీవే నా మీదికి వచ్చావు. నీ అంతం చూస్తాను' అని ఆ మాంసపదార్థాలన్నీ అవలపెట్టి అతని మీదికి విజృంభించాడు.

లవణశత్రుఘ్నుల ద్వంద్వయుద్ధం భయంకరంగా సాగింది. లవణుడు ఒక మహావృక్షాన్ని పెరికి శత్రుఘ్నుని మీద వేశాడు. శత్రుఘ్నుడు బాణ పరంపరతో దాన్ని ముక్కలు చేశాడు. శత్రుఘ్నుడు లవణుని మీద శరవర్షం కురిపించాడు. లవణుడు చెట్టు పెరికి శత్రుఘ్నుని శిరస్సు మీద కొట్టాడు. ఆ దెబ్బతో శత్రుఘ్నుడు మూర్ఛపోయాడు.

మూర్ఖుడైన లవణుడు శత్రువు మృతిచెందాడని ఎంచాడు. సౌధంలో ప్రవేశించి శీఘ్రమే తన శూలాయుధం తెచ్చుకోకుండా ప్రక్కనపెట్టిన మాంసపదార్థాలు మోసుకు వెళ్ళాలని ప్రయత్నించాడు

అంతలోనే శత్రుఘ్నుడు మూర్ఛ దేరాడు. ద్వారానికి అడ్డంగా నిలిచాడు అగ్నిమయమైన దివ్యబాణాన్ని వింట సంధించి విడిచాడు. అది లవణాసురుని హృదయాన్ని ఛేదించి వేగమే శత్రుఘ్నుని వచ్చిచేరింది.

లవణాసురుడు మరణించాడు. అతని శూలాయుధం రుద్రుని చేరింది.

మహర్షులంతా శత్రుఘ్నుని శ్లాఘించారు. దేవతలు హర్షించారు. అందరు ఆ మహావీరుని ఆశీర్వదించారు.

శత్రుఘ్నుడు తన సైన్యాన్నంతా పిలిచాడు. మధుపురం ఆక్రమించాడు. మహాసౌధాలు నిర్మించమని, అందంగా నగరాన్ని తీర్చి దిద్దమని పరివారాన్ని ఆదేశించాడు. ఆ నగర పునర్నిర్మాణానికి పన్నెండేళ్ళు పట్టింది. ఉద్యానవనాలతో, సరోవరాలతో, క్రీడాస్థలాలతో, మహాసౌధాలతో; రాజమార్గాలతో, సర్వ సంపదలతో మధుపురం దేవేంద్ర నగరంలా రూపొందింది. శత్రుఘ్నుడు మహారాజుగా వివిధ భోగాలతో తులతూగుతున్నాడు.

అయినా ఆయన అయోధ్యను మరువలేదు.

అన్నలను మరువలేదు. తల్లులను మరువలేదు. అందరిని చూడాలని, ఆ రాఘ

పాదాలకు ప్రణమిల్లాలని శత్రుఘ్నుడు పంద్రెండేళ్ళ తరువాత అయోధ్యకు బయలు దేరాడు.

మార్గమధ్యంలో వాల్మీక్యాశ్రమం. అక్కడ ఆయనకు ఆశ్చర్యకరమైన అనుభవం. అపూర్వమైన అనుభవం. మనోహరమైన అనుభవం. మరపురాని

అనుభవం, ఆశ్రమంలో మధురాతి మధురంగా రామ కథాగానం వినిపిస్తూ ఉంది. రామకథ కన్నులకు కట్టినట్లు కన్పిస్తూ ఉంది. శత్రుఘ్నుడే గాదు ఆయన వెంట వచ్చిన సైనికులు గూడ ఆ రామకథా గానామృతంలో తేలియాడారు. శత్రుఘ్నుని చుట్టూచేరి 'ఆ గాన వృత్తాంతం వాల్మీకి మహర్షిని అడగం'డని అర్థించారు,

'ఆశ్రమాల్లో ఏన్నో ఆశ్చర్యకరవృత్తాంతాలు ఉంటాయి. వాటి నన్నింటిని మనం మహర్షులను అడుగ కూడదు' అని శత్రుఘ్నుడు చుట్టూ చేరిన సైనికులను సాగనంపాడు. తన శిబిరానికి వెళ్ళాడు. అయినా ఆ రాత్రి ఆయనకు నిద్ర పట్టలేదు. కన్నుమూసినా, కన్ను తెరిచినా ఆయనకు రామకథ వినిపిస్తూనే ఉంది. కనిపిస్తూనే ఉంది, ఆ అనుభూతి అంత మనోహరంగా ఉంది

ఆ కథను ఎవరు కూర్చారో ! ఎవరు గానం చేస్తున్నారో ।

శత్రుఘ్నుడు వాల్మీకి నడుగలేదు. ఆ మహర్షి ఆయనకు చెప్పలేదు.

మరునాటి ఉదయం శత్రుఘ్నుడు వాల్మీకి మహర్షికి నమస్కరించి అయోధ్యకు బయలుదేరాడు. ఎందుచేతనో ఆయన సీతాదేవిని అప్పుడు చూడలేదు. అయోధ్యలో ఆ రామచంద్రుని చూడగానే శత్రుఘ్నుని హృదయం పరవశత నొందింది. అది పంద్రెండేళ్ళ ఎడబాటు. ఒక్క పరుగున వెళ్ళి అన్నగారి పాదాల మీద వ్రాలాడు.

రాముడు తమ్ముని లేవనెత్తి గాఢంగా కౌగిలించు కొన్నాడు. శత్రుఘ్నుడు సవినయంగా నమస్కరించి 'అన్నా ! నీ ఆజ్ఞ ప్రకారం అంతా జరిపించాను. లవణాసురుడు హతుడయ్యాడు. అతని మధుపురం సురక్షితంగా ఉంది. అయితే మిమ్మల్ని ఎడబాసి పంద్రెండేళ్ళు అయింది. ఇక ఎడబాటు సహించలేను. ఇక్కడే ఉంటాను అన్నాడు. కళ్ళ నిండా నీళ్ళు నింపుకొని.

'తమ్ముడూ ! ప్రజాపాలన క్షత్రియ ధర్మం. ఎడబాటు అనివార్యం. రాజైన వాడు రాజ్యాన్ని వదలి దూరంగా ఎక్కువ రోజులు ఉండగూడదు. ఏడురాత్రు

ఉండటానికి నీకు అనుమతిస్తున్నాను. ఆ తరువాత నీవు అయోధ్య వదలి మధు పురం వెళ్ళాలి. తప్పదు. అయితే అప్పుడప్పుడు నీవు అయోధ్యకు రావచ్చు. అభ్యంతరంలేదు' అన్నాడు ఆ రాముడు.

శత్రుఘ్నుడు ఏడురాత్రులు అయోధ్యలో గడిపాడు. ఆవల అన్నలందరికి మ్రొక్కి, వారి అనుమతి పొంది మధుపురానికి బయలుదేరాడు.

మరల శత్రుఘ్నుడు అన్నలను చూచింది. అశ్వమేధయాగ సమయంలోనే అది నైమిశారణ్యంలో గోమతీనదీ తీరాన జరిగింది. ఆ యాగ సమయంలోనే సీతాదేవి భూప్రవేశం చేసింది. ఆ సంఘటన అందరిని ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఆవేదనా భరితుల్ని చేసింది.

తరువాత జరిగిన లక్ష్మణ దేశబహిష్కారం చాలాకాలం శత్రుఘ్నునికి తెలీదు.

ఒకనాడు అనుకోకుండా అయోధ్య నుండి దూతలు వచ్చారు. శత్రుఘ్నుని దర్శించారు. లక్ష్మణ దేశబహిష్కారాన్ని గూర్చి చెప్పారు. కుశలవుల పట్టాభిషే కాన్ని పేర్కొన్నారు. రాముని సరయూ ప్రవేశ ప్రయత్నాన్ని ప్రస్తావించారు.

కులక్షయానికి శత్రుఘ్నుడు కుమిలిపోయాడు. తలపంకించి తానూ సరయూ ప్రవేశానికి నిర్ణయించుకొన్నాడు. వెంటనే మంత్రులను, పురోహితుడు కాంచనుని పౌరులను పిలిపించాడు. అయోధ్యలో జరిగిన దంతా వివరించాడు. తన కుమారు లిద్దరిని పట్టాభిషిక్తులను గావించాడు. మధుపురికి అభిషిక్తుడైన సుబాహునికి, వైదిశాపాలకుడైన శత్రుఘాతికి సమానంగా తన సైన్యాన్ని' సంపదను పంచి ఇచ్చాడు. అందరి దగ్గర సెలవు తీసుకొని, ఒంటరిగ రథమెక్కి హుటాహుటిగ అయోధ్య చేరాడు.

అప్పటికే రాముడు తెల్లని పట్టు బట్టలు కట్టుకొన్నాడు. చేత దర్భలు పట్టు కొన్నాడు. సరయూ ప్రవేశానికి బయలు దేరబోతున్నాడు. శత్రుఘ్నుడు సత్వరం రథం దిగి 'అన్నా ! నా సహోదరులకు పట్టంగట్టాను. నిన్ను అనుసరించాలని ఆశతో వచ్చాను. అనుమతించు' అన్నాడు ఆవేశంగా. అలాగే అన్నట్లు తల ఆడించి ముందుకు నడిచాడు. ఆ రామచంద్రుడు.

అన్నతో పాటు శత్రుఘ్నుడూ సరయూ ప్రవేశం చేశాడు. స్వర్గం చేరు కొన్నాడు.

# రావణుడు

బొద్దుగా బలిసి, బాగా ముగ్గి, పండు పక్వానికి వచ్చి పళపళలాడుతూ గాలికి కదలాడే పండు ఎంతో నిండుగా ఉంటుంది. కాని ఆ పండు ఎల్లకాలం అలాగే ఉంటుందని కాదు. కొంతకాలానికి అది కుళ్ళి రాలి పోవటం సహజం దాని అవశ్య పరిణామం. కాని కొన్ని పండ్లు ముగ్గుతుండగానే అక్కడక్కడ మెత్తక ఏర్పడుతుంది. ఆ మెత్తక మీద అప్పుడప్పుడు దోమలు గ్రాలి కాటు వేస్తాయి. దోమకాటుతో పండు కుళ్ళటం ప్రారంభమౌతుంది. అంత పెద్దపండు కంపు గొట్టి అసలి కాలంలోనే పాడైపోతుంది. పండు మీద మెత్తక లేకుంటే దోమ కాటు త్వరగా పడదు. దోమకాటే లేకుంటే పండు త్వరగా కుళ్ళి పాడవదు. కుళ్ళిపోయిన పండు చిన్నదైతే పోనీలే అంటాం. పెద్దదైతే అయ్యో అంటాం.

రామాయణంలో రావణుని జీవితం కుళ్ళిపాడైపోయిన ఒక పెద్ద పండు లాంటిది. రావణుడు పులస్త్య బ్రహ్మపౌత్రుడు. విశ్రవస్బ్రహ్మ పుత్రుడు. వేద వేదాంగ పారంగతుడు. శివపూజా తత్పరుడు. వరదాన బలాన్వితుడు. మహా బలసంపన్నుడు. దుర్నిరీక్ష్యతేజో విరాజితుడు. శత్రుజన భయంకరుడు. మిత్ర జనరక్షకుడు. పరిపాలనాదక్షుడు. రాజనీతి విశారదుడు. యుద్ధతంత్రకోవిదుడు. పరమనైష్ఠికుడు.

మంత్రి సుపార్శ్వుడు రావణుని 'వేదవిద్యావ్రతస్నాత! స్వకర్మనిరత!' అని సంబోధించగా, తమ్ముడు విభీషణుడు అన్నను వదలి వెళ్ళినా 'నీవు ఆహితాగ్నివి. మహాతపస్సంపన్నుడివి. వేదాధ్యయన తత్పరుడివి. దానగుణశోభితుడివి. భృత్యులను పోషకుడివి. మిత్రులను రక్షకుడివి. శత్రువుల శిక్షకుడివి' అని శ్లాఘించాడు. రావణుని చూడ వచ్చిన శ్రీరామదూత ఆంజనేయుడు 'అహో రూపమహో ధైర్య మహో సత్త్వమహో ద్యుతిః' అని ఆశ్చర్యచకితుడై ఆయన గుణగణాలను కొనియాడాడు. ఆ రామచంద్రుడే సమరభూమిలో రావణుని తేజస్సు చూచి 'అహో దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః, ఆదిత్య ఇవ

దుష్కృత్యః' అని ప్రశంసించాడు. అంతేగాక అతని మీదికి హడావుడిగా వెళ్ళే లక్ష్మణునితో 'రావణుడు మహావీరుడు. అద్భుత పరాక్రముడు. అతడు కోపో ద్రిక్తుడైతే ముల్లోకాలు గూడ ఎదిరించ లేవు' అని హెచ్చరించాడు.

ఈ విధంగా రావణుడు ఎన్నో మేలిమి గుణాలు గల మహావ్యక్తి. అయితే అతని వ్యక్తిత్వంలో రెండె రెండు బలహీనతలు - స్వాతిశయ కాముకతలు. రజ స్తమోగుణాలు వాటి మూలకందాలు. అయితే స్వాతిశయం రావణునిలో మొదటి నుండి పెరుగుతూ వచ్చింది. మధ్యలో మొలకెత్తింది, ముదిరింది కాముకత. మొత్తానికి రెండూ విషదంష్ట్రలతో రావణుని కాటు వేశాయి. అతని దారుణ మర ణానికి దారితీశాయి. దుష్టుల కోవలో అతనిని చేర్చివేశాయి.

అయితే ఈ బలహీనతలు, మేలిమిగుణాలు పుట్టుకనుంచే రావణునికి తల్లి దండ్రుల స్వభావం వల్ల సంక్రమించాయి. రావణుని పుట్టుకే ఒక విచిత్ర సంఘ టన. ఆయన తండ్రి విశ్రవసుడు బ్రహ్మర్షి. సత్త్వగుణ సంపన్నుడు. తల్లి కైకసి దానవప్రముఖుడు సుమాలి పుత్రిక. రజస్తమోగుణాల రాశి. ఒకసారి సుమాలి కైకసితో పాతాళం నుండి భూలోక సంచారం బయలుదేరాడు. పుష్పక విమానంలో వైభవోపేతంగా వైశ్రవణుడు తండ్రి విశ్రవసునికి దగ్గరకు రావటం చూశాడు. విశ్రవసునికి భరద్వాజపుత్రి దేవవర్ణియందు జన్మించి ధనాధ్యక్షుడుగా కుబేరుడుగా పేరు పొందినవాడు వైశ్రవణుడు. అలాంటి వైశ్రవణుని చూడగానే సుమాలి స్వాతిశయ స్వభావం పెల్లుబికింది. అతని కంటె అధికులు తన రాక్షస వంశంలో ఉండాలని అనుకొన్నాడు. కూతురు కైకసితో 'నీవు గూడ విశ్రవ సుని వరించు. వైశ్రవణుని కంటె గొప్ప కొడుకులను కను' అన్నాడు. కైకసి లో గూడ అ స్వాతిశయ స్వభావం చోటు చేసుకుంది. దానితో పాటు కాముకత గూడ పెల్లుబికింది. ఆమె వెంటనే విశ్రవసుని ఆశ్రమానికి వెళ్ళింది. అప్పుడా బ్రహ్మర్షి ధ్యాన నిమగ్నుడై అగ్నిహోత్రుని ముందు నిలబడి ఉన్నాడు. దేదీప్య మానంగా వెలుగుతున్నాడు. కైకసి ఆయన పాదాల ముందు తలవంచి నిలబడింది కాలి బొటనవ్రేలితో భూమిని గోకుతూ కాముకతా విలాసాలు క్రుమ్మరించింది ఆ మహర్షి రజోగుణాన్ని రెచ్చగొట్టింది. ఆయన కళ్ళు తెరచి నివ్వెవ్వరన్నాడు.

ఆమె తానెవ్వరో తెలియజెప్పింది.

'అయితే ఎందుకు వచ్చా'వన్నాడు ఆయన.

'అంతటి మహర్షివి ఆమాత్రం అర్థంచేసుకోలేవా' అంది ఆమె విశ్రవసుడు ఆమెహృదయం గ్రహించాడు. కైకసిని భార్యగా స్వీకరించాడు. ఆమె కోర్కెలన్నీ తీర్చాడు.

అయితే అది సంధ్యాసమయం. సంగమనిషిద్ధసమయం. అలాంటి సమయంలో కాముకత పెల్లుబికి కైకసీవిశ్రవసులు కలశారు. అందుచేతనే విశ్రవసుడు'కైకసీ! నీకు భయంకర రూపులు, క్రూరకర్ములు అయిన కొడుకులు పుట్టుతా'రన్నాడు.

ఆమె చేతులు జోడించి అలాంటి పుత్రులు నాకక్కరలేదని మొరపెట్టుకొంది.

'అయితే నీ కడగొట్టు కొడుకుమాత్రం సజ్జనుడౌతాడు' అన్నాడు విశ్రవసుడు.

కొంతకాలానికి కైకసి మొదటికొడుకును గన్నది, అతనికి పదితలలు, ఇరువదిచేతులు, ఎఱ్ఱనిపెదవులు. పెద్దకోరలు. పొడవైన వెంట్రుకలు. కాటుకకొండలాంటిదేహం. అంతేగాదు. అతడు పుట్టగానే అనేక అపశకునాలు.

తండ్రి ఆతనికి దశగ్రీవుడని పేరుపెట్టాడు. దశగ్రీవుడు అపరసంధ్యాసమయంలో, సత్త్వగుణాన్ని అతిక్రమించి ప్రవహించిన విశ్రవసుని రజోగుణప్రవాహంలో, తల్లి కైకసి యొక్క స్వాతిశయకాముకతా గుణాల బలం పుంజుకొని జన్మించాడు. అందుచేతనే అతని వ్యక్తిత్వంలో స్వాతిశయ కాముకతలు ప్రబలంగా చోటుచేసుకొన్నాయి. పెద్దబలహీనతలుగా రూపొందాయి.

స్వాతిశయంచాలా చిత్రమైనగుణం. అది అహంకారానికి ఇంకోరూపం. ఇతరుల అధికారాన్ని ఈ గుణం ఏమాత్రం సహించదు. అందరికంటే తానే అధికంగా ఉండాలని కోరుకొంటుంది. ఆధిక్యం సాధించేదాకా అదినిద్రపోదు. నిలకడగా ఉండదు. కామక్రోధమదమాత్సర్యాలు స్వాతిశయానికి బలమైనవ్రేళ్ళు.

ఇక కాముకత. ఇదొక పెద్దవ్యసనం. హద్దులేనివ్యసనం దీనికి ఉచితానుచితాలుండవు. వావివరుసలు తెలియవు. ఇదొక చిత్రమైన దప్పిక. త్రాగేకొందీ

ఎక్కువయ్యే దప్పిక. అది నిప్పులోనైనా ఉండాలేగాని ఏర్పడితే ఇదివ్యక్తి మరణంలో గాని తీరదు. వృద్ధాప్యం వల్ల దీని శక్తి తగ్గినా రక్తి మాత్రం పోవదు.

దశగ్రీవుని స్వాతిశయవర్తిత్వాన్ని బాల్యదశలోనే తల్లి రెచ్చగొట్టింది. ఒక నాడు పుష్పకవిమానం మీద విశ్రవసుని చూడవచ్చిన కుబేరుణ్ణి కైకసి కొడుకుకు చూపింది. 'దశగ్రీవా ! నీ అన్న ఏ స్థితిలో ఉన్నాడో చూడు. నీవే స్థితిలో ఉన్నావో ఆలోచించు. నీకు బలం లేదా ? పరాక్రమం లేదా ? ఏ విధంగానైనా అనతి కాలంలోనే నీవు అన్నతో సరితూగాలి' అని అతని రోషాన్ని రగుల్కొలిపింది.

అందుకు దశగ్రీవుడు 'అమ్మా ! విచారించకు. అనతికాలంలోనే అన్న కంటె అధికుడనౌతాను లేదా అతనితో దీటౌతాను. ఇది సత్యం' అన్నాడు. ఒక్కడూ పుణ్య గోకర్ణం వెళ్ళాడు. బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేశాడు. తన తొమ్మిది తలలు వరికి ఆహుతులుగా ప్రేల్చాడు. పదవ తలను గూడ తెగవేసే సమయంలో బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు ఏ వరం కావాలో కోరుకో మన్నాడు.

'స్వామీ ! మరణమే ప్రాణికి పెద్ద శత్రువు. అందుచేత మరణం లేకుండ వరం కావాలి' అన్నాడు.

'దశగ్రీవా ! అది సాధ్యం కాదు. ఏ ప్రాణి అయినా ఎవరివల్లా మరణం లేకుండ ఉండలేదు. మరో వరం కోరుకో' అన్నాడు బ్రహ్మదేవుడు.

దశగ్రీవుడు ఒక్కక్షణం ఆలోచించాడు. 'అయితే దేవదానవగరుడ గంధర్వయక్షపన్నగుల వల్ల మరణం లేకుండా చెయ్యి' అన్నాడు. తక్కిన ప్రాణులు మానవులు తృణప్రాయులు అనుకున్నాడు.

అలాగే అన్నాడు బ్రహ్మదేవుడు.

అంతేకాక అతని తెగిన తలలు తొమ్మిదింటిని మొలిపించాడు. విశేషించి కామరూపాన్ని గూడ అనుగ్రహించాడు.

ఇప్పుడు దశగ్రీవుడు వరదాన బలాన్వితుడు. ఇక అతని దెబ్బకు తిరుగు లేదు.

తరువాత దశగ్రీవుని స్వాతిశయవర్తిత్వాన్ని అతని తాత గూడ రెచ్చగొట్టాడు వరాలు పొంది తిరిగి వచ్చిన మనుమని సుమాలి కౌగిలించుకొన్నాడు. సుదూరం

మొక్కుకొన్నాడు. విష్ణువు కారణంగా తాము లంక వదలి పాతాళం వెళ్ళిన విషయం, లంకను కుబేరుడు వశం చేసుకొన్న వైనం, దేవతలతో దానవుల కేర్పడిన వైరం వివరంగా చెప్పాడు. పోయిన లంకను పట్టుబట్టి మనం సాధించాలన్నాడు. కుబేరుణ్ణి తరుమగొట్టి నీవు లంకాధిపతివి కావాలన్నాడు. కష్టాల్లో ఉన్న రాక్షసవంశాన్ని ఉద్ధరించటానికి నీవొక్కడివే సమర్థుడివన్నాడు.

అయినా దశగ్రీవుడు త్వరపడి కుబేరుని మీదికి దండెత్తలేదు.

కొంతకాలానికి మేనమామ ప్రహస్తుడు దశగ్రీవుని ప్రక్కన చేరాడు. అతని స్వాతిశయాన్ని మరల కవ్వించాడు. శూరుల మధ్య సౌభ్రాత్రానికి చోటు లేదన్నాడు. అదితి పుత్రులైన దేవతలంతా విష్ణుమూర్తి సాహాయ్యంతో దైత్యులను పారద్రోలి లంకాపురం ఆక్రమించలేదా అన్నాడు. ప్రస్తుత పరిస్థితిని తారుమారు చేయగలవాడివి, దైత్యుల గత వైభవాన్ని పునరుద్ధరించ గలవాడివి నీ వొక్కడివే అన్నాడు.

ఆ మాటలకు దశగ్రీవుడు కదిలాడు. రాక్షసు లందరితో కలిసి త్రికూట పర్వతం చేరి, అక్కడి నుంచి ప్రహస్తుణ్ణే కుబేరుని దగ్గరికి రాయబారిగా పంపాడు. 'లంక మాది. రాక్షసులది. అక్రమంగా దాన్ని నీవు అనుభవించటం అన్యాయం. మర్యాదగా మా లంకను మాకు ఇవ్వు. మా రాక్షస ప్రేమాభిమానాలు మిగులుతాయి. న్యాయము తప్పనివాడవన్న పేరూ నీకు మిగులుతుంది. లేకుంటే నీ మీద దండయాత్ర తప్పదు. ఆలోచించుకో' అని సందేశం పంపాడు.

అందుకు కుబేరుడు కోపపడకుండా 'విష్ణుమూర్తి దెబ్బకు దైత్యులంతా వెళ్ళిన తర్వాత ఖాళీగా ఉన్న లంకా పట్టణాన్ని నా తండ్రి నాకు ఇచ్చాడు. దానమానాది గుణ సంపన్నులైన యక్షులతో నేనిక్కడ ఉన్నాను. తమ్ముడు దశగ్రీవుని గూడ రమ్మను. నాతో కలసి ఈ లంకా నగరాన్ని అనుభవించమను' అని సమాధానం చెప్పి పంపాడు.

అది స్వాతిశయం తలకెక్కిన దశగ్రీవునికి రుచిస్తుందా. తండ్రి సలహా మేరకు కుబేరుడు లంకను వదలి కైలాసం వెళ్ళాడు. రావణుడు రాక్షసులతో కలిసి లంకను ఆక్రమించాడు. పట్టాభిషిక్తుడయ్యాడు. తన పట్టాభిషేక మహోత్సవంతో పాటే చెల్లెలు శూర్పణఖను విద్యుజ్జిహ్వునికిచ్చి వివాహం చేశాడు. తరువాత తాను మయుని కూతురు మండోదరిని వివాహమాడాడు. వైరోచనుని దౌహిత్రి

వస్త్రజ్వాలను కుంభకర్ణుని కిచ్చి వివాహం చేశాడు. గంధర్వ రాజు శైలూషుని పుత్రిక సరమతో విభీషణుని వివాహం జరిపించాడు. మహావీరుడు మేఘనాథుని పుత్రునిగా పొందాడు. కుంభకర్ణుని కోరిక మేరకు మహామనోహర నిద్రాగృహం నిర్మించాడు. మూడు పువ్వులారు కాయలుగా లంకామహానగరాన్ని పాలిస్తున్నాడు.

అయితే దశగ్రీవుని స్వాతిశయతత్త్వం అంతతో ఆగలేదు. అది పెడ తలలు పట్టింది. దేవతలను బాధించింది. నందనవనాన్ని ధ్వంసం చేసింది. మహర్షులను పీడించింది.

ఆ దశలో కుబేరుడొక దూతను పంపాడు. 'తమ్ముడూ! అధర్మకార్యాల నుండి మనస్సును మరలించు. దేవతలు ఋషులు ఇప్పటికే నీ వధోపాయం ఆలోచిస్తున్నారు' అని హితబోధ చేశాడు. స్వాతిశయం హితబోధను సహించ లేదు.

హితబోధ వినేసరికి తోకత్రొక్కిన త్రాచులా దశగ్రీవుడు విజృంభించాడు. వెంటనే దూతశిరస్సు ఖండించాడు. కుబేరుని మీద పటపట పండ్లుకొరికాడు. నిన్నేగాదు నీతో పాటు తక్కిన దిక్పాలురను గూడ యమలోకానికి పంపుతున్నానన్నాడు మారీచమహోదరప్రహస్త శుకసారణ ధూమ్రాక్షులను పిలిచాడు. మనం ముల్లోకాలను జయించాలన్నాడు. ఒక ఊపున ఉత్తర దిక్కుకు దండెత్తి వెళ్ళాడు. కుబేరుని జయించాడు. అతని పుష్పకాన్ని స్వాధీనం చేసుకొన్నాడు.

దశగ్రీవుని స్వాతిశయం విజయగర్వంతో విఱ్ఱవీగింది. అతడు పుష్పకాన్ని అధిరోహించి అతిరమణీయ వనప్రదేశాలతో కూడిన ఒక పర్వతం మీదికి వెళ్ళాడు. హఠాత్తుగా ఆవిమానం ఆగిపోయింది. అంతలోనే నందీశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు. 'దశగ్రీవా! ఈ పర్వతంమీద పరమేశ్వరుడు పార్వతితో గూడి విహరిస్తున్నాడు. దేవదానవయక్షగంధర్వాదులెవ్వరికి ఇందు ప్రవేశంలేదు. వెనుదిరిగివెళ్ళు' అన్నాడు.

ఆ మాటవినేసరికి దశగ్రీవుడు ఉగ్రుడయ్యాడు. అతని స్వాతిశయం తలకెక్కి తకతకలాడింది. కిరీటకాంతులతో, కుండలాల కదలికతో కళ్ళెఱ్ఱజేసి దిగాడు గంభీరధీరమందగమనంతో ముందుకునడచి, నందీశ్వరుని ముఖంలోకి చూచి

పకపకనవ్వాడు. 'ఒరే కోతిమూతివాడా! ఎవడురా ఆ పరమేశ్వరుడు? అని ఎగతాళి చేశాడు.

నందీశ్వరుడు మండిపడ్డాడు. అయినా నిగ్రహం పాటించాడు. 'దశగ్రీవా! నీ విప్పుడే నా చేత వధముట్టేవాడివి, నీ పాపం పండుతున్నది, నీకై నీవే నాశనమౌతావు, నన్ను కోతిమూతివాడివని ఎగతాళి చేశావు, కోతులే నీ పొగరణుస్తాయి, కోతులే నీ అనుచరుల అంతం చూస్తాయి. కోతులే నీ కులనాశనం చేస్తాయి, అవి అనతికాలంలోనే జన్మిస్తున్నాయి' అని శపించి ఊరుకున్నాడు.

దశగ్రీవుడు అతని శాపాన్ని తృణీకరించాడు. అహంకారంతో 'ఒరే పశుపతీ! నీపర్వతం నావిమానాన్ని ఆపింది. దాన్ని పెకలించివేస్తా' అని ఆపర్వతాన్ని పట్టి పెకలించసాగాడు. పర్వతం కదిలింది, పార్వతి భయపడింది, పరమేశ్వరుని మెడ కౌగిలించుకొంది. పరమేశ్వరుడు అట్టహాసంతో విదిలేపర్వతాన్ని కాలిబొటనవ్రేలితో గట్టిగా అదిమాడు. దశగ్రీవుని చేతులు పర్వతంక్రిందబడి నలిగాయి. ఆ దెబ్బకతడు భయంకరంగా కేకపెట్టాడు. ఆ అరుపుకు ముల్లోకాలు అదరిపడ్డాయి. ప్రక్కనున్న ప్రహస్తాదులు అతనిబాధ చూచారు. ఆబాధానివృత్తికి పరమేశ్వర ప్రార్థనతప్ప మార్గాంతరం లేదని సలహాయిచ్చారు. దశగ్రీవుని స్వాతిశయం జీవితంలో మొదటిసారి తలవంచుకొని పరమేశ్వరుని ప్రార్థించింది.

పరమేశ్వరుడు ప్రసన్నుడయ్యాడు, 'రావణా!' అని పిలిచాడు. 'స్వామీ' అని రావణుడు చేతులు జోడించాడు. 'నీ కంఠరవం ముల్లోకాలనే కంపింపజేసింది. ఇది మొదలు నీవు రావణనామధేయుడివై లోకంలో ప్రసిద్ధికెక్కుతావు. నీ బలపరాక్రమాలకు సంతోషించాను, ఇక నీ యిచ్చవచ్చిన చోటికి వెళ్ళు' అన్నాడు పరమేశ్వరుడు.

రావణుడు బ్రహ్మవలన తాను పొందిన వరాల సంగతి చెప్పాడు. ఆయుశ్శేషాన్ని, అద్భుతమైన ఒక ఆయుధాన్ని అనుగ్రహించమని అర్థించాడు. పరమేశ్వరుడు ఆయుశ్శేషాన్ని ఇచ్చాడు. అతిభయంకర చంద్రహాసాన్నిగూడ అందించాడు. అయితే వాటిని అలక్ష్యం చేస్తే ఆ మరుక్షణమే అవి నన్నుచేరుతాయని ఆంక్షగూడ విధించాడు.

అదిమొదలు దశగ్రీవుడు రావణుడయ్యాడు. పరమేశ్వరభక్తుడయ్యాడు.

వస్తూ త్రోవలో ఎక్కడెక్కడ అందమైన కాంతలు అగుపిస్తే ఆ కాంతలందరిని బలాత్కరించి విమానంలో ఎక్కించాడు. అడ్డుపడ్డ వాళ్ళ భర్తల్ని, బంధువుల్ని హతమార్చాడు. దేవ గంధర్వ తాపస కాంతల కన్నీళ్ళతో పుష్పకం నిండి పోయింది. ఆ పతివ్రత లందరు పెద్దగా దుఃఖిస్తూ 'పాపాత్మా! పర స్త్రీమూలం గానే నీవు ప్రాణాలు కోల్పోతావు' అని శపించారు.

రావణుడు కలకల నవ్వాడు గాని కలత నొందలేదు. అతని కాముకత ను కాటువేసిన మొదటిశాపం వేదవతిది. రెండవ శాపం ఈ ప్రతివ్రతలది.

శాపాలవల్ల రావణుని తేజస్సు కొంతతరిగింది. సురలోకవిజయగర్వం తో, మహాప్రతివ్రతల శాపంతో రావణుడు పుష్పకం దిగాడు. అంతఃపురం ప్రవేశించాడు. మండోదరి ఎదురు వచ్చింది. ఆమెకు ఒక కంట ఆనందం. మరో కంటవిచారం. భర్త విజయపరంపరకు ఆనందం. ప్రతివతాశాపపరంపరకు విచారం. ఎంతదూరమో ఆమె ప్రతివ్రతలను బాధించవద్దని భర్తను బ్రతిమాలు కొంది. సగౌరవంగా వారిని స్వగృహాలకు సాగనంపమని హితం చెప్పింది. విభీషణుడు గూడ అన్నకు హితం చెప్పాడు. ఈ పరకాంతాపహరణం వల్ల మన కీర్తి, వంశం, ఐశ్వర్యం సర్వనాశనమౌతాయని చాలా దూరం చెప్పాడు. రావణుడు ససేమిరా వినలేదు. అప్పటికే అతని కాముకత గ్రుడ్డిదైంది. చెవిటి దైంది ఇంక ఎవరు చెప్పినా ప్రయోజనంలేదు. ఏమి చెప్పినా ప్రయోజనంలేదు.

ఇంతలో చెల్లెలు శూర్పణఖ గూడ వచ్చింది. భర్త మరణాన్ని గూర్చివిని బావురుమంటూ ఏడ్చింది. చెల్లెల్ని చూడగానే రావణుని కళ్ళుగూడ చెమ్మగిల్లాయి. ఎంతో సానుభూతితో ఆమెను చెంతకు తీసుకొన్నాడు. కన్నీరు తుడిచాడు. 'శూర్పణఖా! అనుకోకుండా నీకు తీరని అపకారం చేశాను. వీరావేశంలో - విజయ విజిగీషతో మత్తెక్కి యుద్ధం చేస్తూ, మనయింటి అల్లుడన్న మాట గూడ మరచి విద్యుజ్జిహ్వుణ్ణి సంహరించాను. నిన్ను విగతభర్తృకను చేశాను. ఇక విచారించి ప్రయోజనం లేదు. నీ సోదరుడు ఖరుణ్ణి పద్నాలుగు వేల మూలబలంతో దండకారణ్య ప్రభువుగా నియమిస్తున్నాను. దూషణుణ్ణి అతని సేనాధిపతిగా పంపుతున్నాను. ఖరుడు నీ నోటి నాలుకలా మెలగుతాడు. నీకు ఏ లోటు లేకుండ చూస్తాడు. నీవు రాజసోదరివై జనస్థానంలో సుఖంగా జీవించు' అని ఆమెను ఖరదూషణుల వెంట పంపాడు. శూర్పణఖ జీవితానికి ఒక మార్గం

చూశాడు. ఉత్తర దిక్కునుంచి లంకకు ఏ ప్రమాదం రాకుండా ఖరుణ్ణి జన స్థానంలో ఉంచి మంచి కట్టుదిట్టం చేశాడు. తక్కిన మూడు దిక్కుల సముద్రమే గనుక లంకకు ప్రమాదం లేదు రావణుడు మహామేధావి. రణతంత్ర కోవిదుడు

ఇంతలో విభీషణుడు లంకలో జరిగిన ఒక దుర్ఘటనను రావణుని దృష్టికి తెచ్చాడు. తమ పిన తల్లి కూతురు కుంభీనసిని మధువు అపహరించిన వృత్తాంతం వివరించాడు. అది నీవు గావించిన పరకాంతాపహరణ పాపఫలమే అన్నాడు.

కుంభీనసి అపహరణ వృత్తాంతం వినగానే రావణుడు మహోగ్రుడయ్యాడు రాక్షసవీరులందరిని యుద్ధానికి సిద్ధం కమ్మన్నాడు. ఒక్క ఊపున మధురాపురికి దండెత్తి వెళ్ళాడు. కుంభీనసి అతని పాదాల మీద వ్రాలింది. పతిభిక్ష పెట్టమని ప్రార్థించింది. రావణుడు ఆర్ద్రహృదయంతో ఆమె కోరికను మన్నించాడు. మధువును క్షమించాడు. ఆ రాత్రి అతని ఆతిథ్యం గూడ స్వీకరించి విశ్రమించాడు మరునాడు మహేంద్రుని మీదికి దండయాత్ర.

మార్గమధ్యంలో కైలాసం. అది కుబేరుని ఉనికి పట్టు. అప్పుడే చంద్రోదయమైంది. పండువెన్నెల్లో కైలాస పర్వతం మహామనోహరంగా ఉంది. సైన్యం మైమరచి నిద్ర పోయింది. రావణునికి నిద్ర పట్టలేదు. అతడు సౌందర్య పిపాసి. విహారార్థం గిరి శిఖరాన్ని అధిరోహించాడు. పండు వెన్నెల్లో ఆ పర్వత శోభ చూచి ఆనందిస్తూ నిలిచాడు. సౌందర్యాన్నంతా పరచు కొన్నట్లున్న వృక్షాలు చూచాడు. మదన పారవశ్యంతో గానంచేసే కిన్నెర దంపతుల సంగీతాలు విన్నాడు మద్యపాన మదాతిరేకంతో మన్మథక్రీడ సలిపే విద్యాధర దంపతుల విహారాలు తిలకించాడు. ఆ రాత్రివేళ కుబేర నగరంలో నాట్యం చేసే అప్సరసల అందెల సవ్వడి ఆలకించాడు.

చల్లగాలి. పూల పరిమళం. నాట్యగానం. ప్రేమికుల విహారం. పండు వెన్నెల. రావణునికి పిచ్చి పట్టి నట్లయింది. చంద్రుని వైపు అట్టె చూస్తూ ఒక రాతి మీద కూర్చున్నాడు. అందెల రవళి అనతిదూరంలో వినిపించింది. గాజుల గలగల గాలి తరంగాల్లో చెవిసోకింది. రావణుడు తలత్రిప్పి చూచాడు. చంద్ర బింబంలాంటి ముఖం. క్రొక్కారు మేఘం లాటి మేలి ముసుగు. మన్మధుని దేవేరిలాంటి మదవతి — మందంమందంగా నడచి వస్తూ ఉంది. తన వైపే నడచి

వస్తూ ఉంది. ఆమెను చూస్తే రాతికే మనస్సు చలిస్తుంది. ఇక రావణుని సంగతి చెప్పాలా !

రావణుడు పులకించాడు. కైచినిలిచాడు ఆమె వంపుసొంపులన్నీ వెన్నెల్లో ఒక్కసారిచూచాడు నిండుగా ఒక్క ఊపిరి విడిచాడు. ముందుకు నడిచాడు. ఆమెముఖం మీది మేలి ముసుగు తొలగించాడు. రంభ! సౌందర్యరాశి! శృంగారరసరాజ్ఞి ! అంత కంటె అప్పు డతనికేం కావాలి! నిలువెల్లచేతులుగా ఆమెను గాఢంగా కౌగిలించాడు.

రంభగడగడలాడింది. నలకూబరునికి నైవేద్యంగా నాసొగసు అర్పించాలన్నది. నలకూబరుడు నీ కొడుకన్నది. నేను నీ కోడలినన్నది. కూతురివంటి దానసన్నది. అధర్మమన్నది. అన్యాయమన్నది. దారుణ మన్నది. దయజూప మన్నది.వదలమన్నది.

రావణునికి రంభగోడు వినే ఓపిక అప్పుడు లేదు. ఆమె వాదాలకు సమాధానాలు చెప్పే ఓపిక అంతకంటే లేదు. రంభా నీవు అప్సరసవన్నాడు. అందరికీ అనుభవయోగ్య వన్నాడు,అంతే.

రంభ యౌవన సౌందర్యాన్ని రసాభాసచేశాడు. నలిపి వేసిన పువ్వులా ఆమెను వదలివేశాడు.

రంభ బోరున ఏడుస్తూ నలకూబరుని కడకు వెళ్ళింది. నలకూబరుడు నిప్పులా మండిపడ్డాడు. 'రావణా! పరకాంతను బలాత్కరిస్తే ఇక నీ శిరస్సు వెయ్యి వ్రయ్యలౌతుందని శపించాడు. రావణుని కాముకత రంభతో తాత్కాలికంగా తృప్తినొందింది. అతనిజీవితం నలకూబరునితో శాశ్వతంగా శాపగ్రస్తమైంది.

అలాగే రావణుడు మరొకసారి బ్రహ్మసమ్ముఖానికి వేళ్ళే పుంజికస్థలను చూచాడు. పులకించాడు, బలవంతంగా ఆమెను వివస్త్రచేసి అనుభవించాడు. అందుకు బ్రహ్మదేవుడే ఆగ్రహోదగ్రుడై రావణుని శపించాడు. పరస్త్రీని బలాత్కరిస్తే శిరస్సు వెయ్యివ్రయ్యలౌతుందన్నాడు

రావణుని స్వాతిశయానికి కొన్నిశాపాలు. అతని కాముకతకు మరికొన్ని శాపాలు, అన్నీకలిసిఎన్నోశాపాలు. అయినా శాపాలను లెక్కచేయలేదు.

రావణుడు దేవేంద్రుని మీదికి దండయాత్ర వెళ్ళాడు. కొడుకు మేఘనాథుడు

మహేంద్రుని జయించాడు. ఇంద్రజిత్తుగా పేరు పొందాడు. అందుకు రావణుడెంతో మురిసిపోయాడు.

రావణుని దృష్టి భూలోకరాజులమీద మరలింది. ఒక్క ఊపున మాహిష్మతీపురం మీద దండెత్తాడు. అప్పుడు కార్తవీర్యుడు అంతఃపురంలో లేడు. ప్రియకాంతా పరివృతుడై నర్మదలో జలక్రీడలాడుతున్నాడు. అయినా అక్కడికే వెళ్ళాడు రావణుడు. తానూ స్నానం చేశాడు. తడి బట్టవిడిచి మడిబట్ట కట్టుకొన్నాడు. మంత్రులు తెచ్చిన పుష్పాలందుకొన్నాడు. పంచామృతాలు స్వీకరించాడు. తాను వెంట తెచ్చుకొన్న బంగారు శివలింగాన్ని ఒక ఇసుకతిన్నెమీద ప్రతిష్ఠించాడు. పలువిధ పూజలు చేశాడు భక్తి పారవశ్యంతో నృత్యం చేశాడు. శివుని ప్రసాదం కళ్ళకద్దుకొని స్వీకరిస్తూ ఉండగానే నర్మదపొంగి పూజా పుష్పాల నన్నిటిని కొట్టుకు పోయింది. రావణుడు కోపోద్రిక్తుడయ్యాడు. కన్నెఱ్ఱచేసి నర్మదను చూచాడు. ఆ నది నిలువెల్ల కపించింది. అలల అడుగులు వెనుకకు వేసుకొంటూ వడివడిగా నడిచి వెళ్ళింది. ప్రియకాంతాపరివృతుడై జలక్రీడలాడే కార్తవీర్యుడు విలాసంగా తన వెయ్యిచేతులతో నర్మదా ప్రవాహాన్ని అడ్డుకొన్నందు వల్లనే గత్యంతరం లేక ఆ నది పొంగిందని, మీపూజా పుష్పాలు కొట్టుకు పోవటం జరిగిందని శుకసారణులు రావణునికి చెప్పారు. రావణుడు ఒక్కసారి హుంకరించి కార్తవీర్యార్జునుని అంతు తేలుస్తానని మంత్రులతో కలసి అతని మీదికి వెళ్ళాడు. ఎన్నో అపశకునాలు. అయినా రావణుడు ఆగలేదు. కార్తవీర్యుని మంత్రులు కయ్యానికి ఇది అసమయమని రావణునికి తెలియచేశారు. అయినా రావణుడు ఆగలేదు.

కడకు కార్తవీర్యునితో రావణుడు ద్వంద్వయుద్ధానికి దిగాడు. ఆ ద్వంద్వయుద్ధంలో కార్తవీర్యుడు తనవెయ్యిచేతులతో రావణుని బంధించి మాహిష్మతీపురం తీసుకువెళ్ళాడు. మహర్షులు, దేవతలు, మానవులు అంతా సంతోషించారు. మనుమనిపాటు చూచి పులస్త్యమహర్షి స్వయంగా వచ్చి కార్తవీర్యుని అర్థించి రావణుని కట్లు విడిపించాడు. బ్రతుకు జీవుడా అని రావణుడు బయట పడ్డాడు.

రావణుని స్వాతిశయం జీవితంలో ఎదుర్కొన్న మొట్టమొదటి పరాజయం ఇదే. అయినా దానికి బుద్ధి రాలేదు. ఎక్కడ బలవంతుడున్నా అక్కడికి వెళ్ళి యుద్ధం చేసేదాకా దానికి నిద్రపట్టదు. నిలకడ ఉండదు.

ఒక సారి రావణుడు వాలి మీదికి వెళ్ళాడు. వాలి దక్షిణ సముద్రంలో నీట నిలిచి సంధ్యావందనం చేసుకొంటున్నాడు. రావణుడు 'ఒరే వానరా! నాతో యుద్ధానికిరమ్మ'న్నాడు. వాలి పట్టించుకోలేదు. రావణుడు అతని సంధ్యా వందనం అయ్యేదాకా కూడా ఆగలేదు. మెల్లగా అడుగులు వేసుకొంటూ వెనుక ప్రక్కగా వెళ్ళి వాలిని బంధించాలని ప్రయత్నించాడు. దోసిట నీరు బట్టి సూర్యు నికి ఎదురుగా నిలిచిన వాలి మాత్రం చలించలేదు. ఏవో మంత్రాలు జపిస్తూనే ఉన్నాడు. అయితే రావణుని రాక మాత్రం అతడు గమనించాడు. ఏమీ ఎరుగ నట్లె ఊరుకున్నాడు. రావణుడు బాగా దగ్గరకు వచ్చిన తరువాత తటాలున ఆ తుంటరిని చంకలో ఇరికించుకొని ఆకాశానికెగిరాడు. పశ్చిమసముద్రంలో దిగాడు. అక్కడ సంధ్యావందనం చేశాడు. మరల ఆకాశాని కెగిరాడు. ఉత్తర సముద్రంలో దిగాడు. సంధ్యావందనం చేశాడు. మరల ఆకాశాని కెగిరాడు. తూర్పు సముద్రంలో దిగాడు. సంధ్యావందనం చేశాడు. మరల ఆకాశాని కెగిరాడు. కిష్కింధలోని ఒక తోటలో దిగాడు. పాపం అంతదాకా రావణుడు చంకలోనే నలుగు తున్నాడు. అప్పుడు వాలి చంక సడలించాడు. రావణుడు చతికిల బడ్డాడు. ఏమీ యెరగనట్లు వాలి 'రావణా! ఎటనుండి! ఎటనుండి!' అని యెగతాళిగా అడిగాడు.

పాపం! రావణుడు వంచిన తల యెత్తనేలేదు. వాలి అతని దగ్గరకు వచ్చి ఆప్యాయంగా వీపు నిమిరాడు.

అప్పుడన్నాడు రావణుడు 'చంకన ఇరికించుకొని నన్ను నాలుగు సముద్రా ల్లో ముంచావుగదా' అని.

అంతేగాక వాలి బల పరాక్రమాలను గూడ ప్రశంసించాడు. అగ్ని సాక్షిగా అతనితో సఖ్యం చేశాడు. సోదరునిలా అతని వెంట వెళ్ళి, సుఖంగా ఒక నెల ఉండి' తరువాత లంక చేరాడు.

ఇది రావణుని స్వాతిశయం జీవితంలో ఎదుర్కొన్న రెండవ పరాజయం. అయితే ఇది సఖ్యతరూపంలో సుఖాంతమైంది. మొదలోతు అవమాన దుఃఖంలో మోకాటిలోతు సఖ్యతాసుఖం.

మొత్తం మీద దండయాత్రలు ముగించుకొని రావణుడు లంక చేరాడు.

ఎంత కాలమో రాజ్యపాలన సాగించాడు. లంక చుట్టు దుర్భేద్యప్రాకారాలు నిర్మించాడు. లోతైన అగడితలు త్రవ్వించాడు. సుశిక్షిత రాక్షససైన్యాన్ని పెంపొందించాడు సమర్థులైన సేనాధిపతుల నియమించాడు. సూక్ష్మగ్రాహులైన చారులను చేరదీశాడు. మతిమంతులైన మంత్రులను స్వీకరించాడు. మహాసౌధాలు నిర్మించాడు. ఉద్యానవనాలు వేయించాడు. విశాల రాజమార్గాలు రూపొందించాడు. లంకా మహానగరాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దాడు.

అంతే గాక బంధుమిత్రుల నాదరించాడు. శత్రువీరుల శిక్షించాడు. లంకా ప్రజలను కన్న బిడ్డల్లా పరి పాలించాడు. దేశాన్ని సంపన్నం చేశాడు. కళలను లెస్సగా పోషించాడు.

రావణుని అంతఃపురమే ఒక గొప్పకళానిలయం. రాక్షసులంతా రావణుని పట్ల అనురక్తులు: విపరీత భోగాసక్తులు.

అనాడు రావణపాలనలో రాక్షసజాతికి అమేయబలం ఉంది. అభేద్యరక్షణ ఉంది అపారసంపద ఉంది. వాళ్ళకు లేని దొక్కటే - అధ్యాత్మికదృష్టి, అందుచేతనే వాళ్ళు విపరీతభోగాసక్తులయ్యారు, మితి మీరిన దుర్మార్గులయ్యారు.

రావణుని అండచూచుకొని దండకారణ్యంలో ఎందరో రాక్షసులు మహర్షులను బాధించారు. వారి పత్నులను అవమానించారు. యజ్ఞయాగాదులను భగ్నం చేశారు మానవజాతికే మహాప్రమాదంగా పరిణమించారు.

అది రావణుని ఏకాంతమందిరం. వృషభేంద్రునిలా రావణుడు ఉన్నతాసనంమీద కొలువుతీరాడు.ఎదుట అకంపనుడు, అకంపనుడు ఎందుకో జంపిస్తున్నాడు.

రావణుడు సూటిగా అతని ముఖంలోకి చూచాడు. అకంపనుని కంపం ఆగిపోయింది, ప్రభూ! ప్రమాదం అన్నాడు. రావణుడు రెప్పలెగురవేశాడు ఏదో చెప్పమన్నట్లు. అకంపనుడు రామలక్ష్మణుల బలపరాక్రమాలు వర్ణించాడు. రామబాణాల తీవ్రత వివరించాడు. ఖరదూషణాల మరణం వినిపించాడు.

రావణుడు కన్నుల నిప్పులు కురిశాడు. ఇప్పుడే రామలక్ష్మణుల వధిస్తానని పైకిలేచాడు. అకంపనుడు 'ప్రభూ !వారు అసాధారణ శక్తిసంపన్నులు. వారిని జయించటం సులభసాధ్యంగాదు. అందుకుఒకఉపాయముంది' అని సీతాసౌందర్యాన్ని వర్ణించాడు. రావణుని కాముకతకు చవులూరించాడు. ఆమె పట్ల ఆ రాముని కున్న

ప్రేమాతిశయాన్ని వివరించాడు. సీతను అపహరిస్తే రాముడు మరణిస్తాడని సూచించాడు.

సీతాపహరణబుద్ధిని రావణుని వృద్ధిలో మొదట పుట్టించినవాడు అకంపనుడే. అతడొక దోమ లాంటి వాడు. రావణుని బలహీనత అతనికి బాగా తెలుసు. అందుకనే అతని కాముకతను కాటువేసి కవ్వించాడు.

అయినా రావణుడు త్వరపడలేదు. అకంపనుడు చెప్పగానే సీతాపహరణానికి సిద్ధంకాలేదు.

రావణుడు వెంటనే మారీచుని దగ్గరకు వెళ్ళాడు. అతని సలహా అడిగాడు. రామలక్ష్మణుల ప్రతాపాన్ని సీతాపహరణంవల్ల రానున్న ప్రమాదాన్ని మారీచుని వల్ల విని వెనుదిరిగి వచ్చాడు.

మరునాడు మంత్రులతో గూడి రావణుడు పుష్పకంలో కొలువు దీరాడు. మంత్రులంతా లంకారాజ్యవైభవాన్ని గూర్చి, రావణుని ప్రతాపాన్నిగూర్చి ప్రశంసిస్తున్నారు. ఆ రాక్షసేశ్వరుడు తల ఆడిస్తూ ఆనందంగా ఆలకిస్తున్నాడు. ఆ సీతారామలక్ష్మణుల విషయం గూడ ఆలోచిస్తున్నాడు.

అంతలోనే శూర్పణఖ వచ్చింది. ముక్కుచెవులు తెగిరక్తసిక్తశరీరంతో వచ్చింది ఎంతో వికృతంగా వచ్చింది. విపరీతదుఃఖంతో వచ్చింది. అంతులేని ఆవేశంతో వచ్చింది. తనకు జరిగిన అవమానాని చెప్పింది. ఖరదూషణాదుల మరణాన్ని వివరించింది. రాముని ప్రతాపాన్ని శ్లాఘించింది. రావణుని స్త్రీవ్యామోహాన్ని రెచ్చగొట్టింది సీతా సౌందర్యాన్ని వర్ణించింది. అతని కాముకతను కవ్వించింది.

అంత మంది యెదుట ఆ చెల్లెలిని చూడగానే రావణుని కడుపు మండిపోయింది. ఆమె మాటలు వినగానే అతని స్త్రీవ్యామోహకాముకతలు తోక త్రొక్కిన త్రాచుల్లా పైకి లేచి బుసలు కొట్టాయి ఆ సీతారాములను కాటు వేయాలని సంకల్పించాయి.

రావణుడు సభ నుండి వెంటనే లేచాడు. సీతాపహరణానికి వ్యూహం సిద్ధం చేశాడు. మరల మారీచుని దగ్గరకు వెళ్ళాడు. మాయామృగరూపం ధరించి సీతాపహరణంలో తనకు సాయం చేయమన్నాడు.

మారీచుడు పరల సీతం చెప్పాడు. పరదారాపహరణం మహాపాప మన్నాడు. సీతాపహరణం ప్రాణాంతక మన్నాడు. రాక్షస వంశ నాశక మన్నాడు. రాముడు అద్వితీయ పరాక్రము డన్నాడు. అతని పరాక్రమం తాను అనుభవించి చూచానన్నాడు.

అయినా రావణుడు వినలేదు. తన నిర్ణయానికి తిరుగులేదన్నాడు. తాను చెప్పినట్లు చెయ్యమన్నాడు. లేకుంటే తల నరికి వేస్తా నన్నాడు.

పాపం ! మారీచునికి మార్గాంతరం లేకపోయింది. అతడు మాయా మృగరూపం ధరించాడు. సీతామహాదేవి నాకర్షించాడు. రామలక్ష్మణులను ఆమెకు దూరం చేశాడు.

రావణుడు సన్యాసివేషం ధరించాడు. కాషాయవస్త్రాలు - కమండలం - యోగదండం - జడలు గట్టిన జుట్టు - చేత ఛత్రం - పాదుకలు - అన్నీ అద్భుతంగా అమరాయి. కామరూపులకు రాని రూపం ఏముంది !

ఇప్పుడు రావణుడు నివురు గప్పిన నిప్పు. గడ్డి కప్పిన కూపం. అతని క్రౌర్యానికి జనస్థాన వృక్షాలే కంపించి పోయాయట. గోదావరీనది గుట్టు చప్పుడు కాకుండ సాగిపోయిందట.

రావణుడు పర్ణశాల వాకిట నిలిచాడు. సీతను చూచాడు. కామపరవశు డయ్యాడు. వేదమంత్రాలతో సీతదృష్టి నాకర్షించాడు. ఆమె ఆతిథ్యాన్ని అంగీకరించాడు. అపురూప సౌందర్యవతివి నీ వెవ్వరన్నాడు ? ఈ అడవిలో ఎందుకున్నా వన్నాడు ? క్రూరమృగాల వల్ల, కామరూపులైన రాక్షసుల వల్ల నీకు ప్రమాదం కలుగదా ? అన్నాడు.

సీత అమాయకంగా రావణుని సన్న్యాసాన్ని నమ్మింది. అతిథి సత్కారాలన్నీ చేసింది. అడిగిన విషయాలన్నీ చెప్పింది. ఆ తరువాత అతని సంగతి గూడ అడిగింది.

రావణుడు చిటుపుగ నవ్వాడు. వెగటుగా చూచాడు. 'సీతా ! నేను రాక్షస రాజును, రావణుడను. నిన్ను చూచింది మొదలు నా భార్యల మీద మనస్సు పోవటం లేదు. నిన్ను ప్రియాతి ప్రియమైన భార్యగా స్వీకరిస్తాను. సంపద లన్నీ నీకు సమర్పిస్తాను. తనివిదీర అనుభవించు. నన్ను తృప్తి నొందించు.

ఈ అరణ్యవాసం నీ కేల' — అన్నాడు.

సీతకు సలసలక్రాగే నూనె చెవిలో పోసినట్లుంది. పురుగులతో లుకలుక లాడే పండును చూచి నట్లుంది. అతని నీచతను ఆమె నిందించింది. రాముని ప్రతాపాన్ని వర్ణించింది. తన పాతివ్రత్యాన్ని ప్రకటించింది. రానున్న ప్రమాదాన్ని హెచ్చరించింది.

రావణుడు వికటాట్టహాసం చేశాడు. స్వబల పరాక్రమాలను, విజయవైభవాలను ప్రస్తుతించాడు. నిజరూపం ధరించాడు. ఎడమచేత ఆమె జుట్టు ఒడిసి పట్టుకొని, కుడిచేత తొడలు పట్టి యెత్తిరథంలో కూర్చుండ బెట్టుకొన్నాడు. ఒక్క ఊపున ఆకాశాని కెగిరాడు.

సీత ఏడ్చింది. అరచింది. ఎంతగానో పెనగు లాడింది. అయినా ప్రయోజనం లేకపోయింది. పర్ణశాల పలుకలేదు. పక్షులు పలుకలేదు. వృక్షాలు పలుకలేదు. మృగాలు పలుకలేదు, పర్వతాలు పలుకలేదు. కడకు గోదావరి గూడ పలుకలేదు. అటు వింగిగాని ఇటు నేలగాని నోరు విప్పలేదు.

జటాయువు మాత్రం ఆమె శోకం ఆలకించాడు. ఆ రావణుని ఎదిరించాడు. ఎంతోసేపు పోరాడాడు. కడకాతని కత్తిదెబ్బకు రెక్కలుతెగి, కాళ్ళువిరిగి క్రిందబడ్డాడు.

రావణుని కిక అడ్డులేదు. అతడు సీతతో లంక ప్రవేశించాడు.

అతని జీవితంలో అదొక పెద్దదుర్దినం. సీతను మొదట అంతఃపురంలో ఉంచాడు. పెక్కుమంది రాక్షస స్త్రీలను ఆమెకు కాపుగా నియమించాడు. ఆమె మనస్సును వశం చేసుకోవటానికి అనేక విధాల ప్రయత్నించాడు. ప్రలోభాలు కల్పించాడు. ప్రక్కవారిచేత చెప్పించాడు. ఆదరించాడు. బెదిరించాడు అయినా ఆమె లొంగలేదు.

ఆ తరువాత సీతను అశోకవనానికి తరలించాడు. అక్కడ గూడ ఆమెను వశంచేసుకోవటానికి అనేక విధాల ప్రయత్నించాడు. అయినా లాభంలేకపోయింది

పతివ్రతా హృదయాలు ప్రలోభాలకు లొంగవని, బెదిరింపులకు భయపడవని పాపం! రావణునికి తెలీదు. ఎందరో అందగత్తెలతో, అనురక్తలతో అంతులేని భోగాలనుభవిస్తూ, మందోదరి వంటి కాంతామణిని అర్ధాంగిగా గలిగి ఆనందంగా జీవిస్తూ రావణుని కామతృష్ణ సీతామహాసాధ్విని కోరిందంటే, ఆమె నపహరించి

తెచ్చిందంటే, అది ఒక విధివైపరీత్యం. వినాశకాలే విపరీతబుద్ధిః.

మొత్తానికి సీతాపహరణం జరిగింది.

పండు వంటి రావణుని జీవితం పాడవటం ప్రారంభమైంది. ఆమెను తెచ్చిందిమొదలు లంకలో అన్నీ అశుభాలే. హనుమంతుడు అంతటి సముద్రాన్ని దాటాడు. అశోకవనాన్ని ధ్వంసంచేశాడు. జంబుమాలి, విరూపాక్ష యూపాక్షాది మహావీరులను చంపాడు. కడకు అక్షకుమారుని గూడ అంత మొందించాడు. సమస్త సంపదలతో శోభాయమానంగా వెలిగే లంకనే కాల్చి వేశాడు. రాముడు సేతువు నిర్మించాడు. సముద్రం దాటాడు. వానర సేనతో యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడు.

అయినా రావణుని మనస్సు మారలేదు. అతని సీతావ్యామోహం తగ్గలేదు.

రావణునికి ఎందరోరెందరో హితంచెప్పారు. ఇప్పటికైనా మించిపోయింది లేదని, సీత నప్పగించి శ్రీరాముని శరణువేడుమని, అదే అన్నివిధాల శ్రేయస్కర మని, లేకుంటే సర్వనాశనం తప్పదని చాల దూరం విభీషణుడు చెప్పాడు. శుకసారణశార్దూలాదు చారులైనా శక్తి వంచన లేకుండ శ్రీరాముని పరాక్రమాన్ని, వానరసేనాబలాన్ని వివరించిచెప్పారు. కయ్యంకంటె నెయ్యమే మేలని నొక్కి వక్కాణించారు. తల్లికైకసిగూడ తన చేతనైనంత వరకు హితం చెప్పింది. అవిద్ధుడనే వృద్ధమంత్రిగూడ పెద్దదూరం హితంచెప్పాడు. పినతండ్రి మాల్యవంతుడు గూడ మంచిచెడ్డలు వివరించి సీతను రాముని కప్పగించటమే సర్వవిధాల శ్రేయస్కర మన్నాడు. ఇక మండోదరి హితబోధసంగతి చెప్పనే అక్కరలేదు. అవకాశం ఉన్నప్పుడంతా ఆమె అనేక విధాల చెప్తూనే ఉంది.

అయినా రావణుడు వినలేదు. ఎవరు చెప్పినా వినలేదు. ఏమి చెప్పినా వినలేదు.

చివరకు విభీషణుడు వెళ్ళి రాముని చేరినా రావణుడు చలించలేదు. శార్దూలుడనే చారుణ్ణి పంపాడు. వానరసేనా పరిమాణాన్ని చూచి రమ్మన్నాడు. ఆ తరువాత శుకుణ్ణి పంపాడు. సుగ్రీవుని మీద భేదోపాయం ప్రయోగించాడు. 'నీ అన్న నేను ఇష్ట మిత్రులం. నీవు నాకు భ్రాతృ సమానుడవు. నాతో అకారణ వైరం నీ కెందుకు. నే నపహరించింది రాముని భార్యను. అందుకు నీ వేల యుద్ధానికి వచ్చావు. సఖ్యతను పాటించి, సంగ్రామం చాలించి, కిష్కింధకు అని వెళ్ళు'

శ్వరమానం పంపాడు. మరొకసారి శుకసారణుల పంపాడు. వానరసేనలో ప్రవేశించి దాని పరిమాణ ప్రమాణాలను వివిధ వానరవీరుల బలపరాక్రమాలను, వారి వివరాలను తెలుసుకొని రమ్మన్నాడు. శుకసారణులు శత్రుసైన్య వివరాలు సేకరించి తెచ్చారు. సీత నిచ్చి రామునితో సంఖ్యం చేసుకొమ్మని సలహా ఇచ్చారు.

రావణుడు సనేమిరా కాదన్నాడు తన బలాన్నితాను ప్రశంసించుకొన్నాడు. ఒక ఎత్తైన భవనాన్నెక్కి శత్రు సైన్యాన్ని చూచాడు. ఆ శుకసారణుల సాయంతో వివిధ వీరుల ఉనికిని, వారి శక్తిసామర్థ్యాలను గుర్తించాడు. ఆ శుక సారణులు వివిధవీరులను వర్ణించి పరిచయం చేస్తుంటే రావణుడు సహించలేక 'ఛీ! శత్రుప్రశంస చేస్తారా?' అని ఆ చారుల మీదనే మండిపడ్డాడు. అందుకు ప్రతిగా ఆత్మ ప్రశంసచేసుకొన్నాడు. మహోదరుణ్ణి పిలిచి 'ఈ శుకసారణులు వానరులచే దెబ్బలు తిన్నారు. అందుచే భయభ్రాంతులై శత్రువుల ప్రశంసిస్తున్నారు. వారి అభిప్రాయాలు తప్పుగా ఉన్నాయి. మేధావులైన మరొక చారుల బృందాన్ని శత్రుసైన్యంలోకి పంపు అని ఆదేశించాడు, శార్దూలుని నాయకత్వంలో మరొక చారులబృందం వెళ్ళింది. వారు గూడ తిరిగివచ్చి తాము పడిన పాట్లు తెలిపారు. శత్రువీరుల బలాధిక్యాన్ని ప్రస్ఫుటం చేశారు. సీత నప్పగించి సంధిచేసుకొమ్మని సలహాయిచ్చారు.

రామలక్ష్మణులను గూర్చి, వివిధవానరవీరులను గూర్చి శార్దూలుడు చెప్పిన విషయాలు విని రావణుడు కొంత కంపించాడు. అయినా అతని మనస్సు మారలేదు. ఆత్మస్తుతిచేసుకొన్నాడు. దేవదానవ గంధర్వులొక్కటిగ దండెత్తి వచ్చినా సీతనిచ్చే ప్రసక్తి లేదన్నాడు. మంత్రుల వైపు తిరిగి మనం ఆలోచించవలసిన సమయం ఆసన్నమైన దన్నాడు. మాయోపాయ విశారదుడైన విద్యుజ్జిహ్వుణ్ణి పిలిచి మనం సీతను మోసగించాలన్నాడు. శ్రీరాముని శిరస్సు నొకదాన్ని సృజించమన్నాడు. మహాధనుస్సు నొకదాన్ని బాణయుక్తంగా కల్పించమన్నాడు. ఆయన చెప్పిన వన్నీ సిద్ధం చేశాడు విద్యుజ్జిహ్వుడు.

రావణుడు అతని వెంట బెట్టుకొని అశోకవనానికి వెళ్ళాడు. 'సీతా! యుద్ధంలో రాముడు హతుడయ్యాడు. చచ్చిన వానితో ఇక ఏమిపని? నన్ను

వైపు తిరిగి ఆ రాముని శిరస్సు, ధనుస్సు సీతకు చూపమన్నాడు.

సీత వాటిని చూచి పెద్దగా విలపించింది. అంతలోనే ప్రహస్తుడు పరుగెత్తు కొంటూ వచ్చాడు, ప్రభూ ! మంత్రాలోచనకు మీరు వెంటనే రావాలన్నాడు. బహుశః రామదండు లంకను ముంచుకువస్తున్నదన్న వార్త తెచ్చాడేమో.

రావణుడు వెంటనే వెళ్ళాడు. అతని వెంట ఆరామ శిరస్సు, ధనుస్సు రెండూ మాయమై పోయాయి.

రామదండు శంఖ భేరీ ఝాంకారధ్వనులతో లంకమీదికి వచ్చింది. రావణుడు మంత్రులతో సంప్రదించాడు. రణభేరి ప్రయోగించాడు. సేనాపతుల హెచ్చరించాడు, సర్వసైన్యాన్ని సమాయత్త పరిచాడు. సమరవ్యూహం నిర్ణయించాడు.

పెద్ద సైన్యంతో ప్రహస్తుడు లంక ప్రాగ్ద్వారంలో నిలిచాడు. సముద్ర మంత సైన్యంతో మహోదర మహాపార్శ్వులు దక్షిణద్వారంలో నిలిచారు. సుశిక్షిత సైన్యంతో ఇంద్రజిత్తు పశ్చిమద్వారంలో నిలిచాడు. శుకసారణులు అపారసేనాసమేతులై ఉత్తరద్వారంలో నిలిచారు. విశేషసైన్యంతో విరూపాక్షుడు లంకానగరమధ్యంలో నిలిచాడు.

అంతా క్షణాల మీద జరిగింది. రావణుడు గొప్ప పాలనాదక్షుడు, యుద్ధతంత్ర నిపుణుడు. తాను శుకసారణులతో కలిసి ఉత్తరద్వారంలోనే నిలిచాడు.

వానరాసేనలు వారింపసాధ్యంగాని ఉత్సాహంతో వివిధాయుధాలు ధరించి లంకానగరప్రాకారాలు ముట్టడించాయి.

వానరసేనలను ప్రతిఘటించవలసినదిగా రావణుడు రాక్షససైన్యాల నాదేశించాడు. రణోన్మత్త రాక్షససైన్యాలు ఒక్కసారిగా విజృంభించాయి. వానర సేనలను ఎదుర్కొన్నాయి.

అది వానర రాక్షస మహాయుద్ధం. లంక అంతా పెను తుపాను వీచినట్లుంది. పెద్ద దుమారం రేగినట్లుంది. పిడుగుల వర్షం కురిసి నట్లుంది — సింహనాదాలు ; భేరీ పటహ నినాదాలు ; వివిధాయుధ ప్రహారాలు ; భూమ్యాకాశాల భయంకర వాతావరణాలు.

పెద్ద వృక్షాలతో, పర్వత శిఖరాలతో, వాడైన దంతాలతో వాడైన నఖాల తో వానరులు రాక్షసులను నొప్పించారు గుంపులు గుంపులుగా లంకా ప్రాకారాలు

అధిరోహించారు.

రాక్షసులు భిండివాల గదా ఖడ్గ తోమరాది వివిధా యుధాలతో వానరుల గాయ పరిచారు. వారిని క్రింద పడగొట్టారు.

ఇంద్రజిత్తు అంగదుని ఎదుర్కొన్నాడు. ఆంజనేయుడు జంబుమాలితో తలపడ్డాడు. నీలుడు నికుంభునితో యుద్ధం చేశాడు. విభీషణుడు మిత్రఘ్నుని మీదికి వెళ్ళాడు. సుషేణుడు విద్యున్మాలి నెదిరించాడు. సుగ్రీవుడు ప్రఘసుని పని బట్టాడు. లక్ష్మణుడు విరూపాక్షుని మీద విజృంభించాడు. అగ్నికేతు రశ్మికేతు సుప్తఘ్న యజ్ఞకోపులు రాముని మీద విరుచుకు పడ్డారు. ఎక్కడ చూచినా రక్త ప్రవాహాలే. మాంస ఖండాలే. విరిగిన ఆయుధాలే.

పగలేగాదు రాత్రులు గూడ ఆ రణ యజ్ఞం సాగింది.

ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నాగపాశబద్ధుల గావించాడు. నేల పడవేశాడు. ఆ అన్నదమ్ము లిద్దరు అసువులు విడిచారని భ్రమించాడు. తండ్రికా శుభవార్త వినిపించాడు.

రావణుని ఆనందానికి అంతులేదు. అతడు కొడుకును కౌగిలించుకొన్నాడు. శిరస్సు మూర్కొన్నాడు. అతని శక్తి సామర్థ్యాలు ప్రశంసించాడు. లంక అంతా రామలక్ష్మణుల మరణవార్త చాటించాడు. యుద్ధం ముగిసిందను కొన్నాడు. విజయం వచ్చిందను కొన్నాడు. సీతదక్కిందను కొన్నాడు. సంతోషంలో మునిగి తేలాడు.

అయితే ఆ సంతోషం రావణునికి ఎంతోసేపు నిలువలేదు.

రామలక్ష్మణులు మూర్ఛిల్లారే గాని మరణించలేదు. వారి నాగపాశాలను గరుత్మంతుడు తొలగించాడు. వారి శరీరాలను స్పృశించి గాయాలను మాన్పించాడు. అర్ధ రాత్రి కంతా ఆనందోత్సాహాలతో వానరసైన్యం విజృభించింది. ఆ కోలా హలం రావణుని చెవిసోకింది. అతడు ఆశ్చర్యపోయాడు. ఆందోళన చెందాడు. ఏదో గొప్ప సంతోషహేతువు లేనిదే శత్రుసైన్యం ఇంత పెద్దగా విజృంభించ లేదన్నాడు. చారులను పంపి జరిగినదేదో తెలుసుకు రమ్మన్నాడు.

రామలక్ష్మణులు నాగపాశవిముక్తులై నూతనోత్సాహంతో వెలుగుతున్నారని వినగానే రావణుడు మొదటిసారిగా జీవితంలో బెదిరిపోయాడు. వేడి నిట్టూర్పు విడి

చాడు. వెంటనే ధూమ్రాక్షుని పిలిచాడు. సైన్యాన్ని వెంటగొని యుద్ధానికి వెళ్ళమన్నాడు. రాముణ్ణి, వానరసైన్యాన్ని ఒక్క దెబ్బతో మట్టు పెట్టమన్నాడు.

పాపం ! అంతటి ధూమ్రాక్షుడు హనుమంతుని చేతులో హతమైపోయాడు.

రావణునికి ఒక చెయ్యి విరిగి నట్లయింది.

అయినా అతడు వెనుకంజ వెయ్యలేదు. వెంటనే వజ్రదంష్ట్రుని పిలిచాడు. సైన్యంతో యుద్ధానికి వెళ్ళమన్నాడు.

వజ్రదంష్ట్రుడు వానరసేన మీద ప్రళయాగ్నిలా విజృంభించాడు. అంగదుని చేత హతమైపోయాడు.

రావణునికి మరో చెయ్యి విరిగి నట్లయింది. అయినా అతడు నిరుత్సాహ పడలేదు. వెంటనే అకంపనుని పిలిచాడు. సేనాధిపతిగా నియమించాడు. ఆలస్యం కాకుండ ఆహవభూమికి వెళ్ళమన్నాడు.

అకంపనుడు గూడ హనుమంతుని చేతులో హతమై పోయాడు.

రావణునికి ఇంకో చెయ్యి విరిగి నట్లయింది. ఈ సారి అతని ముఖంలో విషాదరేఖ పొడసూపింది.

మరునాడు ఉదయం రావణుడు మంత్రులతో ఆలోచించాడు. లంక అంతా తిరిగి సేనావ్యూహాలను స్వయంగా సమీక్షించాడు. సభామండపంలో కొలువు దీరి ప్రహస్తుని వైపు తిరిగి 'ఉత్సాహాతిరేకంతో చొచ్చుకు వచ్చే వానరసైన్యాన్ని ఆపటం అంతంత వారికి సాధ్యంగాదు. ఇప్పుడు నేనుగానీ, కుంభకర్ణుడుగానీ నీవుగానీ, ఇంద్రజిత్తుగానీ, నికుంభుడుగాని నడుంగట్టాలి. అదేదో సైన్యంతో నీవు యుద్ధానికి వెళ్ళు. శత్రువుల అంతంచేసి సంతోషాన్ని కలిగించు' అన్నాడు. అతడు యుద్ధానికి బయలు దేరాడు. అద్భుతంగా పోరాడాడు. నీలుని చేతులో నేలపాలయ్యాడు.

ప్రహస్తుని మరణానికి రావణుడు నిలువెల్ల కంపించాడు. తానే స్వయంగా సమరానికి బయలుదేరాడు. అశేష రాక్షసైన్యాన్ని స్వీకరించాడు. అగ్నిహోత్రం లాంటి రథాన్ని అధిరోహించాడు. అపరరుద్రునిలా యుద్ధభూమికి వచ్చాడు. అతని సువిశాలఫాలభాగాన ప్రకాశించే విభూతిరేఖలను చెవుల ఊగిసలాడే మణికుండలాలను, శిరస్సుమీద శోభిల్లే రత్నకిరీట కాంతి పుంజాలను, దుర్నిరీక్ష్యతేజస్సును, దేదీప్యమానబలపరాక్రమాలను చూచేసరికి అంతటి రాముడే 'అహో ! దీవో మహా

తేజోరావణో రాక్షసేశ్వరః' అని ఆశ్చర్యపోయాడు.

అటు జీవితంలోను, ఇటు యుద్ధంలోను అది రామరావణుల తొలి సమావేశం.

రావణుడు తన మీదికి వచ్చిన సుగ్రీవుణ్ణి మూర్ఛ పడగొట్టాడు. గవయ గవాక్షఋషభాది వానర వీరులను వాడి బాణాలతో నొప్పించాడు. వానర సేనంతా చీల్చి చెండాడాడు. పిడికిటి పోటుతో తన్ను నొప్పించి నెత్తురు గ్రక్కించిన శత్రు వీరుని ఆంజనేయుని మనసార మెచ్చుకొన్నాడు. బ్రహ్మదత్తమైన శక్తిని ప్రయోగించి లక్ష్మణుని మూర్ఛపడగొట్టాడు. మూర్ఛపడిన లక్ష్మణుని బాహువులతో పట్టియెత్తి వెంటగొని పోవాలని ప్రయత్నించాడు. హిమవన్మేరు మందర నగాలను, దేవతలతో గూడ స్వర్లోకాలను అవలీలగా ఎత్తగలిగిన తన బాహువులు ఆ లక్ష్మణుని ఎత్తలేక విఫలమైనందుకు ఎంతో ఆశ్చర్యపడ్డాడు.

ఎట్టకేలకు రాముడే రావణుని మీదికిరాక తప్పలేదు. రాముడు హనుమనారోహించి రథస్థుడైన రావణుని ఎదుర్కొన్నాడు. రావణుడు తీవ్రబాణాలతో హనుమను గాయపరిచాడు. అందుకు రాముడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. రావణుని రథ చక్రాలు ముక్కలు చేశాడు. అతని అశ్వాలను హతమార్చాడు. ధ్వజాన్ని విరుగ గొట్టాడు. సారథిని చంపివేశాడు. తీవ్రాతి తీవ్రబాణం ఒకటి అతని వక్షంమీద ప్రయోగించాడు. ఆ దెబ్బకు రావణుడు సొమ్మసిల్లాడు, చేతి ధనస్సును గూడ విడిచాడు. చెమటలో మునిగి నేలమీద చతికిలబడ్డాడు. అప్పుడు అర్ధచంద్రాకారబాణంతో రాముడు అతని కిరీటాన్ని గూడ అవల పడగొట్టి 'రాక్షసేశ్వరా ! చాల అలసిపోయి నట్లున్నావు. అనుమతిస్తున్నాను. లంకకు వెళ్ళి విశ్రాంతి తీసుకో. ఇంకొక రథాన్ని అధిరోహించు. మరొక ధనుస్సును స్వీకరించు. మరల యుద్ధానికి రా. అప్పుడు నా బలం చూపిస్తా' అనేసరికి అంతటి రావణుడు అటు ఇటు పొరలి, ఎలాగో పైకి లేచి, వాడిపోయిన తోటకూరకాడలా తల వంచుకొని లంకకు వెళ్ళాడు. జీవితంలో రావణుడు మొట్టమొదటిసారి రామునికి తలవంచ వలసి వచ్చింది. గట్టి దెబ్బతిని కదనభూమి నుండి వెనుదిరిగి వెళ్ళ వలసి వచ్చింది. లంకేశుని మనస్సు ఎంత బాధ పడిందో ! అనుక్షణం రావణునికి రాముని రూపే అగుపిస్తూ ఉందట. ఏనుగు సింహాన్ని చూచినట్లు సర్పం గరుడుని చూచినట్లు అతని మనస్సు భయపడుతూనే ఉందట. రామబాణం వేడిని, వాడిని అతని శరీరంలోని అణువణువు అనుభవిస్తూనే ఉందట.

రావణుడు తిన్నది సామాన్యమైన దెబ్బగాదు. అతడు పొందినది విస్మరింపదగిన అవమానం కాదు. దిమ్మ తిరిగే దెబ్బ తగిలే సరికి గత విషయాలు ఎవరికైనా గుర్తు కొస్తాయి. రావణుడు బ్రహ్మవాక్యాన్ని గుర్తుకుచేసుకొన్నాడు. మానవుని వల్లనే ఇప్పుడు భయంకలిగింది గదా అని అనుకొన్నాడు. అయ్యో ! మానవుని వల్లగూడ చావులేకుండవరం అడుగనైతినే అని విచారించాడు, అనరణ్యుని శాపాన్ని స్మృతికి తెచ్చుకొన్నాడు. ఆ ఇక్ష్వాకువంశవ్యక్తి చేతనే గదా ఇప్పుడు దెబ్బ తిన్నానని అనుకొన్నాడు. వేదవతి నందీశ్వర రంభాదుల శాపాలు గుర్తు చేసుకొన్నాడు. మనస్సులో కలవర పడ్డాడు.

అయితే త్రిజగద్విజేత, ఇంద్రజిత్పిత. రాక్షస రాజ్యాధినేత కుంభకర్ణభ్రాత, అయిన తాను ఒక మానవమాత్రునికి లొంగి పోవటమా ! అసంబద్ధం ! అవివేకం ! మహాయుద్ధాల్లో తాత్కాలిక పరాజయాలు, అవమానాలు అప్పుడప్పుడు తప్పవు. అట్లని మహావీరులు శత్రువులకు లొంగిపోరాదు. మానసికంగా క్రుంగి పోరాదు, అవమానం సహించి ఊరకుండరాదు. రావణుడు రాక్షసవీరులందరిని హెచ్చరించాడు.కుంభకర్ణుని కదనభూమికి పంపాలని నిర్ణయించాడు. అతనిని నిద్రలే పండని అనుచరులను ఆదేశించాడు.

కుంభకర్ణుడు నిద్రలేచాడు. రావణుని దర్శించి నమస్కరించాడు, అనేక విధాల హితబోధ గూడ చేశాడు, అందుకురావణుడు 'కుంభకర్ణా ! భ్రాంతివల్లనో, మోహం వల్లనో, బలపరాక్రమ గర్వం వల్లనో మనం చేసింది చేశాము. ఇప్పుడు దాన్ని గూర్చి విచారించటం వ్యర్థం, గతం గతః. ప్రస్తుతం నీ కర్తవ్యం యుద్ధానికి వెళ్ళటం. శత్రువులను చీల్చి చెండాడటం. రాక్షసజాతిప్రతిష్ఠ నిలపడం. అని వాదానికి తావులేకుండ తెగచెప్పాడు, కుంభకర్ణుడు రావణుకు నమస్కరించి, ఒంటరిగానే వెళ్ళి ఆ రామలక్ష్మణులను, సమస్త వానరసైన్యాన్ని వధించి వస్తానని బయలుదేరగానే పరమానందభరితుడై తమ్మునికి రత్నాలహారాన్ని బహూకరించాడు అనేకానేక ఆభరణాలను అందించాడు.

రామబాణంతో కుంభకర్ణుడు నేల కూలటానికి అతనిని నిద్రలేపి నంతసేపు పట్టలేదు.

కుంభకర్ణ మరణంతో రావణుడు క్రుంగిపోయ్యాడు. అప్పుడు విభీషణుని హితబోధ గుర్తు చేసుకొని పరితపించాడు. అయినా అతడు పట్టిన పట్టు వీడలేదు.

పుత్రుల ప్రోత్సాహంతో, కొమ్ములధ్వనులతో మళ్ళీ రావణుడు ప్రజ్వరిల్లాడు. ప్ర
అతికాయుడ్ని, దేవాంతక నరాంతకులను, మహోదర మహాపార్శ్వులను ప్రో
చేసి పోరాటానికి పంపాడు.

అంగదుని చేతిలో నరాంతకుడు హతుడయ్యాడు. హనుమంతుని చేతి
లో త్రిశిరుడు మరణించాడు. ఋషభుని చేతిలో మహాపార్శ్వుడు మట్టికరిచాడు.
నీలుని చేతిలో మహోదరుడు మృతిచెందాడు. హనుమంతుడు ఆ దేవాంతకుణ్ణి
గూడ అంతంచేశాడు. అతికాయుడు లక్ష్మణుని చేతిలో అంతమయ్యాడు.

రావణుడు మానసికంగా కృంగిపోయాడు. ఇంద్రజిత్తు వచ్చి ఉత్సాహ
ప్రోత్సాహం చేయగా, ఎన్నో సార్లు గెలిచి యుద్ధ శూరుడని ఉద్బోధించే దాకా రావ
ణునికి ఊరట కలుగలేదు.

ఇంద్రజిత్తు విజృంభించాడు. వానరసైన్యాన్ని పీనుగు పెంట చేశాడు.
వానర వీరులను గాయపరిచాడు. రామ లక్ష్మణులను మూర్ఛ పడగొట్టాడు. అయితే
వారు మరణించారని భ్రమించాడు. విజయం వచ్చిందని ఎంచాడు. రావణుడు
కొండనెక్కినట్లు, సముద్రాన్ని దాటినట్లు సంతోషించాడు.

అయితే ఈసారి గూడ అతని సంతోషం ఎక్కువసేపు నిలువలేదు. హను
మంతుడు తెచ్చిన ఓషధుల వల్ల వానరులంతా బ్రతికారు. రామలక్ష్మణులు మూర్ఛ
దేరారు. హఠాత్తుగా అందరు వానరులు అర్ధరాత్రివేళ లంకను దహించారు.
ఆయుధాలు, దివిటీలు చేతబట్టుకొని రావణుని అంతఃపుర ద్వారాన్ని గూడ ఆక్ర
మించారు. అనేకానేక రాక్షసులను సంహరించారు.

అంతఃపురంలో రావణు డప్పుడు గాఢనిద్రలో ఉన్నాడు. ఆ కోలాహలం
విని కలతపడి లేచాడు. అతనికి ఏమీ తోచలేదు. ఎక్కడ చూచినా వానరులే.
అప్పటికీ అత్యవసరప్రాతిపదిక మీద కుంభకర్ణుని పుత్రులైన కుంభనికుంభులను,
వారికి తోడుగా యూపాక్ష శోణితాక్ష ప్రఘస కంపనులను తక్షణం యుద్ధానికి పంపిం
చాడు.

అంగదుడు ఆ ప్రఘసకంపనుల ప్రాణాలు తీశాడు. మైందుడు యూపాక్షుని
వధించాడు. ద్వివిదుడు శోణితాక్షుని చంపాడు. సుగ్రీవుడు కుంభుని కడతేర్చాడు.
హనుమంతుడు నికుంభుని నేల పడగొట్టాడు.

రావణుని గుండె లదిరాయి. వెంటనే మకరాక్షుని పిలిచాడు. రామలక్ష్మణులను, వానరులను వధించి రమ్మన్నాడు. అది అంత సులభమా ?

మకరాక్షుడు మహావీరుడు. ఖరుని కొడుకు. అతడు వానరసేననంతా వెనుకంజ వేయించాడు. సరాసరి రాముని మీదికే విజృంభించాడు. తండ్రిని చంపాడన్న కోపంతో దాశరథిని దూషించాడు. దారుణంగా పోరాడాడు. తుదకు రామబాణాగ్నిలో దగ్ధమై పోయాడు.

మకరాక్షుడు గూడ మరణించటంతో రావణుని మనస్సు మరీ కలత నొందింది. అయితే అతని క్రోధం మాత్రం అంతకంత అధికమైంది. రావణునికి ఇక మిగిలింది ఒక్క ఇంద్రజిత్తే. ఆ పరిస్థితిల్లో ప్రియపుత్రుణ్ణి పిలవటానికీ, యుద్ధానికి పంపటానికి ఆ తండ్రి హృదయం ఎంత కటకట లాడిందో ! కాని గత్యంతరం లేదు. ప్రమాదం ముంచు కొస్తున్నది. ముందు వెనుకలు ఆలోచించే వ్యవధి గూడ లేదు. మొత్తానికి రావణుడు ఇంద్రజిత్తును పిలిచాడు. రామలక్ష్మణులను, వానరసైన్యాన్ని వధించాలన్నాడు. నీవు ఇట్టె వెంటనే యుద్ధానికి వెళ్ళమన్నాడు. వేడి నిట్టూర్పు విడిచాడు.

అది రావణుని ఏకాంతమందిరం. ఇంద్రజిత్తును యుద్ధానికి పంపింది మొదలు అతని మనస్సు మనసులో లేదు. ఏవేవో అపశకునాలు. ఎందుకో అనేక భయాలు ఎంత వద్దనుకొన్నా సీతాపహరణం మొదలు జరిగిన సంఘటనలన్నీ గుర్తు వస్తున్నాయి. తనను కలవర పరుస్తున్నాయి. అయినా ఇంత ముందుకు వెళ్ళాక వెనుకంజ వెయ్యటం ఎలాగ ? అది తన జీవితంలో జరగని పని. ఏకాంత మందిరంలో పీఠ ఉంది. పానపాత్రలున్నాయి. రకరకాల పానీయాలున్నాయి. అద్భుత కళాఖండాలు ఉన్నాయి. అయినా రావణునికి వేటిమీదా మనసు పోవటం లేదు. మణిరత్నదీపాలు మహోజ్జ్వలంగా వెలుగుతూనే ఉన్నాయి అయినా అతనికి అంతా చీకటి మయంగానే ఉంది. సీతను విడువక పోతే మన జీవితాలు చీకటి మయాలు అవుతాయంది మందోదరి. మాటిమాటికి ఆ మాటే గుర్తు వస్తూ ఉంది. అన్నట్లు మందోదరితో మనసార మాట్లాడి ఎన్ని రోజులైందో. ఆమెను పలుకరించటానికి గూడ ఇప్పుడు వ్యవధి లేదు. 'ఇంద్రజిత్తు విజయవార్త అందితే అప్పుడామె మందిరానికి వెళ్ళాలి' – అని ద్వారం దగ్గరకు రాగానే వార్తాహరుడు వచ్చాడు. 'ప్రభూ ! మన ఇంద్రజిత్తు ......' అని ఉసూరు మన్నాడు.

రావణునికి నడినెత్తిన గొడ్డట కొట్టినట్లయింది. అతడు పట్టుతప్పిన పందిరిలా కూలబడ్డాడు. మూర్ఛ పోయాడు. ఎంతసేపటికో తేరుకొన్నాడు.

ఎదుట దివిటీ మండుతూ ఉంది. అది రావణుని గుండెలోనే మండుతున్నట్లుంది.

ఆ దివిటీ నుండి సల సల క్రాగుతూ, కన కన మండుతూ తైల బిందువులు రాలుతున్నాయి. రావణుని నేత్రాల నుండి నెత్తుటి బిందువుల్లా నీటి బొట్లు జారి పడుతున్నాయి.

ఆ దివిటీలో మండేది ఒకే ఒక మంట. కాని రావణుని గుండెలో మండేది రెండు మంటలు — బాధ, పగ.

రావణుని నోట మాట రాలేదు. అతడొక పెద్ద వేడి నిటూర్పు మాత్రం విడిచాడు. దాని తాపానికి మందిరమంతా మసి బొగ్గులా మారిపోయింది. చుట్టు ప్రక్కల మొక్కలన్నీ వాడి పోయాయి. పక్షులన్నీ పారిపోయాయి.

అక్కడి నుండి ఒక్క ఊపున అశోకవనం వెళ్ళాడు. చంద్రహాసం చేతబట్టి సీతను నరుకబోయాడు.

సీత అదృష్టం బాగుంది. సుపార్శ్వుడు అడ్డు పడ్డాడు. 'స్వామీ! నీవు సాక్షాత్తు కుబేరుని తమ్ముడువి. మహాకుల ప్రసూతుడివి. వేదవేదాంగ పారంగతుడివి. సాటిలేని మేటివీరుడువి. స్త్రీవధకు పాల్పడతావా? అందగత్తె సీతను అనుభవించాలి గాని హతమారిస్తే ఏం లాభం? నీ కోపం మాతో కలిసి ఆ రాముని మీద చూపు' అనే సరికి అతడు శాంతించాడు.

అది కృష్ణ పక్ష చతుర్దశి మిగిలిన సైన్యాలన్నింటిని రావణుడు సమాయత్తం చేశాడు. వివిధాయుధాలను సమీకరించాడు. ఉన్న సేనాపతులందరిని సమావేశపరిచాడు. పరిస్థితులను తీక్ష్ణంగా పరిశీలించాడు. స్వయంగా యుద్ధానికి వెళ్ళాలని నిశ్చయించాడు. అది అతని జీవితంలో అంతిమయుద్ధం; మహాయుద్ధం.

లంకలో ఏ యింట చూచినా రోదనలే. ఏ ముఖంలో చూచినా భయాందోళనలే. ఏ నోట విన్నా రామలక్ష్మణుల పరాక్రమ ప్రస్తావనలే. ఎటువైపు చూచినా అపశకునాలే.

అయినా రావణుడు జంకలేదు,

మేరుశైలశృంగంలాంటి కిరీటంతో, నొసట మెరిసే విభూతి రేఖలతో, చల త్కుండలాలతో, జ్వలన్నేత్రాలతో, అనేకానేక ఆభరణాలతో, కాటుక కొండలాంటి ఆ రావణుడు—అభేద్యకవచం దాల్చి, అతిభయంకర శస్త్రాస్త్రాలు ధరించి, అగ్ని గోళంలాంటి అష్టాశ్వరథమారోహించి, సముద్రగ్రసేనాపతులు పొదివిరా, మహా సముద్ర సదృశసేనాపరివృతుడై, భూమి గ్రక్కదల, పెంధూళి మింటికెగయ, భేరీ పటహధ్వానాలు దిక్కులు పిక్కటిల్ల, లంకానగర ఉత్తరద్వారాన్ని నిష్క్రమించి, మహోగ్రంగా యుద్ధభూమి ప్రవేశించి ఒక్కసారి హుంకరించి, నారి సారించి, శరవర్షం కురిపించే సరికి వానరసైన్యానికి అగ్నిపర్వతం బ్రద్దలైనట్లుంది. మధ్యం దినమార్తాండుడు మీదికి దూకినట్లుంది. ప్రళయరుద్రుడు విజృంభించినట్లుంది. వానర వీరులకు దిక్కు తోచలేదు. పెక్కుమంది వానరులకు ప్రాణాలు దక్కలేదు.

రావణునితో పాటు విరూపాక్ష మహోదరులు గూడ విజృంభించారు. అయితే వారు సుగ్రీవుని చేత మరణించారు.

మహాపార్శ్వుడు విలయతాండవం చేశాడు. అయితే అతడు అంగదుని చేతులో అంత మొందాడు.

అది చూచి రావణుడు మరీ రెచ్చి పోయాడు. తామసాస్త్రం ప్రయోగించాడు. వానరులను పలక్రిందు చేశాడు. రామలక్ష్మణుల నెదుర్కొన్నాడు. తీవ్రాతి తీవ్ర బాణాలు కురిపించాడు.

రాముడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. రావణుడు కనుగంద లేదు.

రావణుడు అసురాస్త్రం ప్రయోగించాడు. రాముడు ఆగ్నేయాస్త్రంతో దాన్ని ప్రతిహతం చేశాడు.

రావణుడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. రాముడు గంధర్వాస్త్రంతో దాన్ని త్రిప్పికొట్టాడు.

రామునితో యుద్ధం చేస్తూనే విభీషణుని మీద విపరీత కోపంతో రావణుడు శక్తిని ప్రయోగించాడు. లక్ష్మణుడు దాన్ని భస్మము చెయ్యగా, ఆ రామానుజుని మీద తీవ్రాతితీవ్రమైన శక్తిని ప్రయోగించి అతనికి ప్రాణాపాయస్థితి కల్పించాడు. రాముని మీద విజృంభించాడు మహావృక్షాన్ని విసిరాడు. అది వ్యర్థం కావటంతో విశేషబాణవర్షం కురిపించాడు. రాముని బాణతీవ్రతకు తాను తగ్గటం చూచి, తన

శ్రేయస్సు గోరి రథాన్ని ప్రక్కకు మరలించిన సారథి మీద గూడ మండి పడ్డాడు. ద్విగుణకృతోత్సాహంతో ఆ రాముని మరల ఎదుర్కొన్నాడు.

అది రామ రావణుల ద్వంద్వ యుద్ధం.

మానవ చరిత్రలోనే మరపురాని మహాయుద్ధం. ధర్మాధర్మాలకు తీవ్రయుద్ధం. పాతివ్రత్యరక్షణకు, పరదారావ్యామోహానికి ప్రవర్తిల్లిన యుద్ధం. దేవదానవవానర మహర్షులందరినీ ఆశ్చర్యంలో ముంచితేల్చిన ముగింపు యుద్ధం.

రాముడు రావణుని శిరస్సు ఖండించాడు. అది మరల మొలిచింది. ఆయన నూటొక్కమార్లు ఖండించాడు. అది నూటొక్కమార్లు మొలిచింది

రాముడు వివిధాస్త్రాలతో రావణుని వక్షస్థలం మీద కొట్టాడు. రావణుడు అనేకానేక ఆయుధాలు రాముని మీద ప్రయోగించాడు.

ఆ రామరావణయుద్ధంలో పగటికి రాత్రికి భేదంలేదు. ఏ మాత్రం వ్యవధిలేదు. ఎవ్వరికీ విశ్రాంతి లేదు.

ఎట్టకేలకు అగస్త్యప్రోక్త ఆదిత్యహృదయాన్ని జపించి, బ్రహ్మాస్త్రాన్ని అభిమంత్రించి, వింట సంధించి, మాతలి సూచించిన సమయంలో శ్రీరామచంద్రుడు రావణుని మీద ప్రయోగించాడు. ఆ దెబ్బతో అతడు నేలగూలాడు. ప్రాణాలు వదిలాడు.

రావణుని వ్యక్తిత్వంలో రెంపే రెండు బలహీనతలు — స్వాతిశయ, కాము కతలు. అతని జీవితంలో రెండే రెండు తప్పులు — సాధుహింసా సీతాపహరణాలు. ఆతని స్వాతిశయాన్ని రాజలక్షణంగా, సాధుహింసను జాతివైరంలో భాగంగా లెక్కగట్టి ఏదో విధంగా సరిపెట్టుకొన్నా — అతి కాముకుడై అతడు భారతీయులు పరమ పవిత్రంగా భావించే దాంపత్యజీవితాన్ని, పాతివ్రత్యధర్మాన్ని భగ్నం చెయ్యటానికి పూనుకొన్నాడు. అదే రావణుడు చేసిన మహాపాపం. అందుకే అంతటి రావణుడు అలాంటి పతనాన్ని పొందాడు. ఎంతో అపకీర్తి పాలయ్యాడు.

రావణుని పతనం ఒక వ్యక్తి పతనం గాదు. ఒక జాతి పతనం. ఒక జీవిత విధాన పతనం.

ఎన్ని ప్రజ్ఞలున్నా, ఎంత పదవి ఉన్నా, ఎంత అంగబలమున్నా, ఎంత అర్థబలమున్నా ఒక వ్యక్తి వ్యసన పరుడైతే, అధర్మమార్గాన ప్రవర్తిస్తే ఎట్టకేలకు అతడు ఏలాంటి పతనం పొందుతాడో, ఎంతటి అపకీర్తి పాలౌతాడో వాల్మీకి మహర్షి రావణపాత్రమూలంగా మానవ లోకానికి మహత్తర సందేశమిచ్చాడు

# శ్రీరామచంద్రుడు

మానవుడు–దేవుడు ఇద్దరిది మహావిచిత్రమైన సంబంధం. దేవుడు మానవుణ్ణి సృష్టించాడంటారు కొందరు. కాదు. మానవుడె దేవుణ్ణి కల్పించాడంటారు మరి కొందరు.

దేవుడు ఉన్నాడో లేడో తెలీదు. ఉంటే ఎక్కడున్నాడో తెలీదు. ఎలా ఉన్నాడో తెలీదు. మానవలోకంలో ఆయనను గూర్చి అన్నీ అభిప్రాయభేదాలే. ఆయినా మానవుడు నేల మీద పుట్టింది మొదలు ఆయనను గూర్చి ఆలోచిస్తూనే ఉన్నాడు. ఆయన కొరకు అన్వేషిస్తూనే ఉన్నాడు.

లోకంలో కొందరు మహాత్ములు తాము దేవుణ్ణి దర్శించామన్నారు. తరించామన్నారు. తక్కినవారిని గూడ దర్శించమన్నారు. తరించమన్నారు. అందుకు అనేక మార్గాలను గూడ ఉపదేశించారు.

అయితే మీరు దర్శించిన దేవుణ్ణి తెచ్చి మాకు చూపండని అడిగితే ఆ మహాత్ములు మౌనం వహిస్తారు. లేదా మందహాసం చేస్తారు. బహుశః అది అర్థంలేని ప్రశ్న అని వారి అభిప్రాయమేమొ. లేదా దైవదర్శనం ఎవరికి వారు సాధన చేసి పొందవలసిన దివ్యఫలమని వారి ఉద్దేశమేమొ. మొత్తం మీద ఏ మహాత్ముడూ తాను దర్శించిన దేవుణ్ణి తెచ్చి నడిబజారులో నిలపలేడు. నలుగురితో మాట్లాడించలేడు.

అందుచేత అగుపించని దేవుణ్ణి గూర్చి మనకెందుకు, అగుపించే మానవుణ్ణి గూర్చే ఆలోచించమంటారు మరికొందరు. అతని బాగోగులు విచారించమంటారు. అతనినే దేవునిగా ఆరాధించమంటారు. అంతేగాదు, ఒక అడుగు ముందుకు వేసి దేవుడన్నది కేవలం మానవుని కల్పన అంటారు. అది అతని బలహీనతకు సంకేతమంటారు. అతని భయానికి ప్రతిబింబమంటారు. అద్భుతమైన ఒక అబద్ధమంటారు.

అయితే ఏది నిజం ? కలదు కలదన్నవాడు కలడో ! లేడో !

కాని ఒక్కటి మాత్రం నిజం. ఈ లోకంలో అన్నిటికి మానవుడే కర్తగాదు. అతని బాగోగులు గూడ అన్నీ అతని చేతుల్లోనే లేవు. మానవాతీతమైన మహిత శక్తి ఏదో ఒకటి ఉంది. అది మానవునికి అంతు పట్టకుండా ఉంది. ఆ మానవాతీతశక్తినే మన తత్వవేత్తలు ఆత్మశక్తి అన్నారు. బ్రహ్మపదార్థమన్నారు. అది నిత్యమన్నారు. సత్యమన్నారు. ఆనందమన్నారు, బ్రహ్మాండమంతా ఆవరించి ఉందన్నారు. అదే దైవమన్నారు. అనేక రూపాలతో, అనేక గుణాలతో అనేక నామాలతో, అనేక విధాలుగా ప్రవర్తిల్లే ఈ సృష్టిసర్వం అదే అన్నారు వేపచెట్టు క్రింద రాతి బొమ్మ మొదలు కైలాసశిఖరంమీది ఆత్మలింగందాకా, పెంటిలోని తులసి మొక్క మొదలు స్వర్గలోకంలోని కల్పవృక్షం దాకా, చిన్న కన్నంలోని చిరు కప్పమొదలు అయోధ్యామహారాజ్యంలోని శ్రీరామ చంద్రుని దాకా అంతా ఆత్మమయమే అన్నారు. అన్నింటను దేవుడున్నాడన్నారు. ఇందుగల డందు లేడనిసందేహం వలదన్నారు. సర్వసృష్టిలో అంతర్లీనంగా ఉన్న ఈ ఆత్మ దర్శనమే దైవదర్శనమన్నారు. ఈ దర్శనం పొందిన మానవుడే మహాత్ము డన్నారు. ఆయనే దేవుడన్నారు. అంతేగాదు. అప్పుడప్పుడు దేవుడు మానవుడుగా గూడ అవతరిస్తాడని అన్నారు.

మానవుడే దేవుడైతే ! దేవుడే మానవుడైతే ! ఇవి చాల చిత్రమైన ప్రశ్నలు. చిక్కుప్రశ్నలు గూడ. మానవుడు ఎలా దేవుడౌతాడు ? ఎప్పుడౌతాడు ! దేవుడు ఎప్పుడు మానవుడౌతాడు ? ఎందుకౌతాడు ? బహుశః మానవుడే దేవుడైతే త్రేతాయుగం నాటి శ్రీరామచంద్రునిలా ఉంటాడేమొ ! దేవుడే మానవుడైతే ద్వాపరయుగంనాటి శ్రీకృష్ణునిలా దర్శనమిస్తాడేమొ ! త్రేతాయుగ ధర్మాన్ని బట్టి మానవుడు దేవుడైతే, ద్వాపరయుగ ధర్మాన్ని బట్టి దేవుడేమానవుడుగా అవతరించా డేమొ !

ఏది ఏమైనా మొత్తానికి మానవుడుమాత్రం మహాచిత్రమైన ప్రాణి. అతడు ఆత్మస్వరూపుడే కావచ్చు. అయినా అతనికి ఇంద్రియాలు, మనస్సు ఉన్నాయి. అవి బలంగా అతని ఆత్మను ఆవరించి ఉన్నాయి. అంతేగాదు. అవి అతనితోనే పుట్టుతాయి. అతనితోనే పెరుగుతాయి. స్వసుఖ స్వాతిశయ రూపమైన అతని స్వార్థాన్ని పెంచుతాయి.

అందులోను మానవుని మనస్సు మహా చిత్రమైంది. ఇంద్రియాల ద్వారా ప్రాపంచిక సుఖాలు అనుభవించటం అంటే దానికి ఎంతో యిష్టం. పరనిందకు గూడ పాల్పడే అంత ఇష్టం. అయితే సభ్యసమాజంలో మానవుడు పుట్టగానే అతని మీద కొన్ని బాధ్యతలు పడతాయి. అతడు పెరిగే కొందీ అవీ పెరుగుతాయి. ఒక పుత్రుడుగా, సోదరుడుగా, మిత్రుడుగా, భర్తగా, ప్రభువుగా లేదా భృత్యుడుగా సమాజంలో అతని కెన్నో బాధ్యతలు. ప్రతి బాధ్యతా ఒక ధర్మమే. ప్రతి ధర్మమూ ఒక పరీక్షే. మానవ జీవితమే ఒక పెద్ద పరీక్ష.

అందులో స్వార్థానికి ధర్మానికి ఎప్పుడూ చుక్కెదురే. స్వార్థం మనస్సును ఇంద్రియసుఖం చేస్తుంది. ధర్మం మనస్సును ఇంద్రియదూరం చేస్తుంది. స్వార్థం స్వసుఖాన్ని కోరుకొంటుంది. ధర్మం పరహితాన్ని కాంక్షిస్తుంది. స్వార్థం భోగాన్ని అభిలషిస్తుంది. ధర్మం త్యాగాన్ని ప్రబోధిస్తుంది. ఒక విధంగా స్వార్థ ధర్మాల సంఘర్షణమే మానవజీవితం.

జీవితంలో స్వార్థాన్ని త్యాగంచేసి, ధర్మాన్ని అవలంబించి పురోగమించే మానవుడే మీది కెదుగుతాడు. మహాత్ముడౌతాడు. మన్ననలందుకొంటాడు. అలాకాక స్వార్థంకొరకు ధర్మాన్ని కాలదన్ని, అర్థకామాలతో గూడిన ఐహిక భోగాల కొరకు ప్రాకులాడే మానవుడు పతనమౌతాడు. పాపాత్ముడౌతాడు. ప్రపంచదూషణకు గురి అవుతాడు.

మానవ జీవితం ఒక క్షీరసాగర మథనం. స్వార్థమయమైన మనస్సును ధర్మంతో మథిస్తే హాలహాలం వంటి ఎన్నోచేదు అనుభవాలు మొదటఏర్పడుతాయి ఆ తరువాతే అమృతం. హాలాహలానికి భయపడి ఆగిపోకుండా అమృతాన్ని సాధించడమే మానవ జీవితాదర్శం.

శ్రీమద్రామాయణంలో శ్రీరాముని జీవితం ఒక క్షీరసాగరమథనం. స్వార్థధర్మాల సంఘర్షణ, ఆయన హాలాహలం లాంటి చేదుఅనుభవాలను ఎన్నిటినో ఎదుర్కొన్నాడు. ముందుకు అడుగువేశాడు. చివరకు అమృతత్వాన్ని సాధించాడు. లోకంలో ఆయన అన్నికష్టాలను అనుభవించింది భోగాలు అనుభవించే అవకాశాలు లేనందువల్లగాదు. అసమర్థుడు అయినందువల్లగాదు. అవినీతి పరుడు అయినందువల్ల గాదు. లోకకల్యాణార్థమై స్వార్థాన్ని వదలి ధర్మాన్ని అవలంబించి సందు

ఆనాటి కౌసల్యా దశరథుల హృదయాలనేగాదు, అయోధ్యా మహారాజ్యంలోని ఆబాలగోపాలాన్నీ ఆకర్షించి ఉంటాయి; అలరించి ఉంటాయి. అందరి మనసుల్లో నూ ఎన్నో ఆశలు పెంచి ఉంటాయి.

ఆ రాముని గుణగణాల్లో వాల్మీకి హృదయాన్ని విశేషంగా ఆకర్షించిన గుణం ఆయన ధార్మికత. స్వసుఖాన్ని స్వార్థాన్ని జయించి లోకకల్యాణానికి దోహదం చేసిన ధార్మికత. అందు చేతనే ఆమహాకవి మాటిమాటికి 'రామో విగ్రహవాన్ ధర్మః - రాముడు రూపు దాల్చిన ధర్మము' అని అంటాడు. రాముని జీవితంలో ఏర్పడిన ప్రతి సంఘర్షణలో ఆయన ధార్మికతను ఆవిష్కరిస్తాడు. రస మయంగా చిత్రిస్తాడు.

వ్యక్తిలో ఎంత బాహుబలమున్నా, ఎంత బుద్ధిబలమున్నా, ధర్మబలం లేకుంటే అవి సమాజానికి ప్రమాదకరాలుగానే పరిణమిస్తాయి. ధర్మబలం ఉంటే అవి శ్రేయోదాయకమై సమాజానికి ఉపకరిస్తాయి. త్రేతా యుగంలో స్వార్థాన్ని జయించిన ధర్మమే శ్రీరాముడు. ధనుస్సును చేపట్టిన ధర్మమే ఆ కోదండ రాముడు ప్రజాహితాన్ని పరమార్థంగా భావించిన ధర్మమే ఆ పట్టాభిరాముడు.

రాముడు బాల్యంలో తన కులగురువు వసిష్ఠుని దగ్గర సకలవిద్యలు నేర్చు కొన్నాడు. క్షత్రియోచితమైన అస్త్రవిద్యలో అపారసామర్థ్యం ఆర్జించాడు.

శస్త్రాస్త్రవిద్య చాల ప్రమాదకర విద్య. మనోనిగ్రహం లేకుంటే, ధర్మ బద్ధం కాకుంటే, అది అనేక ప్రమాదాలకు దారి తీస్తుంది. ఒక్కోసారి పెద్ద ప్రళ యాన్నే సృష్టిస్తుంది. శస్త్రాస్త్రవిద్యేకాదు - నిజానికి ఏ విద్య అయినా అంతే. కాకుంటే అన్నింటి కంటే ఆ విద్యకు మనోనిగ్రహం, ధార్మికత్వం ఎక్కువ అవసరం.

శ్రీరాముడు సహజంగా సత్త్వగుణ శోభితుడు. అందుకు తోడు ఆయనకు శస్త్రాస్త్ర విద్యనేర్పిన గురువు పరమసాత్త్వికమూర్తి, బ్రహ్మర్షి, వసిష్ఠుడు. అందు చేత శ్రీరాముని శస్త్రాస్త్రసామర్థ్యం ధర్మబద్ధమైంది. మహాకార్యాలు సాధించింది. మానవకల్యాణానికి దోహదం చేసింది.

అయితే ఒక మహాకార్యసాధనకు కేవల సాంకేతిక నైపుణ్యమే చాలదు. అందుకు తగిన సాధన సామగ్రి కూడ ఉండాలి. ప్రయోగానుభవం దానికి తోడు

కావాలి. ఒక మహదవకాశం కలిసి రావాలి. అప్పుడుగాని ఆ సాంకేతిక నైపుణ్యం ఒక మహాకార్యాన్ని సాధించలేదు.

కాగా సత్త్వగుణం మనోనిగ్రహానికి, ధర్మతత్త్వానికి మూలకందంగా నిలువగలదేగాని, శస్త్రాస్త్ర సామర్థ్యాన్ని సద్వినియోగం చెయ్యగలదేగాని, శస్త్రాస్త్ర ప్రయోగానికి మాత్రం ప్రధిప్రేరక గుణం కాదు. రజస్తమోగుణాలే అందుకు బలమైన ప్రేరకాలు.

శ్రీరాముని జీవితంలో శస్త్రాస్త్ర విద్యను బోధించిన గురువు పరమ సాత్త్వికుడైన వసిష్ఠుడైతే - దుష్ట శిక్షణకు, శిష్టరక్షణకు అవసరమైన శస్త్రాస్త్రసామగ్రినంతా అందించిన గురువు ఒకనాటి రజస్తమోగుణాలరాశి - విశ్వామిత్ర మహర్షి.

విశ్వామిత్ర మహర్షి వెంట వెళ్ళటమే శ్రీరాముని జీవితంలో ఒక పెద్ద మలుపు.

ముందు విశ్వామిత్రమహర్షి, ఆయన వెంట కోదండ మండిత బాహుదండ కోమలధీర గంభీరమూర్తి, పదునారేళ్ళవ్యక్తి, శ్రీరామచంద్రమూర్తి. అన్న అడుగు జాడల్లో తమ్ముడు సౌమిత్రి. ఆనాడు ఆ ముగ్గురు అయోధ్యాపుర వీధుల్లో నడచి వెళ్ళుతుంటే - అచింత్యుడైన పరమేశ్వరుని వెంట అగ్నిసంభవులైన స్కందవిశాఖులు వెళ్ళుతున్నట్లుందట.

ఆనాడు అయోధ్యలో అదొక మనోహర దృశ్యం. అద్భుత సంఘటన. మహోజ్జ్వల ధర్మ పురోగమనం.

అయోధ్య దాటగానే సరయూనది. సరయూ తీరానికి చేరగానే విశ్వామిత్ర మహర్షి వెంట వచ్చే శిష్యుణ్ణి చూచి 'రామా !' అని పిలిచాడు. ఆ పిలుపులో ఎంతో ప్రేమ ఉంది. అంతులేని మాధుర్యం ఉంది. 'ఏటినీరు దోసిటి నిండా తీసుకో. నీకు నిద్ర రాకుండా, శ్రమ తెలియకుండా, ఆకలికాకుండా, దప్పిక లేకుండా సమస్త మంత్ర స్వరూపాలైన బలాతిబల విద్యలు ఉపదేశిస్తాను' అన్నాడు.

రాముడు నీరు తీసుకొన్నాడు. ఆ మహర్షి ఆ మంత్రాలన్నీ ఉపదేశించాడు.

సహజంగానే రాముడు పరాక్రమశాలి. ఆ విద్యలు గ్రహించేసరికి ఆయన శరత్కాల సూర్యభగవానునిలా ప్రకాశించాడట.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట ఎన్నో కొండలు, నదులు, అడవులు ఆశ్రమాలు, పేరుగాంచిన వెళ్ళారు. ఆ మహర్షి వారికి శ్రమ తెలియకుండా, విసుగురాకుండా, ఆయా ఆశ్రమాల చరిత్రలు, దేశచరిత్రలు, నదుల చరిత్రలు, నవరస భరితంగా చెప్తూ నడిపించాడు. మందకరూశ దేశాలకథ చెప్పాడు. మారీచ జన్మవృత్తాంతం చెప్పాడు. తాటక చరిత్ర చెప్తూ ఉండగానే మహాభయంకర శబ్దం ఒకటి వినిపించింది. ఒక బీభత్స భయానక రూపం కన్పించింది. కొండగుహలా నోరు తెరిచింది. రామలక్ష్మణులను మ్రింగటానికి ప్రయత్నించింది.

రాముని జీవితంలో తారసిల్లిన మొట్టమొదటి రాక్షసి తాటకి. విశ్వామిత్రుడు వెంటనే దానిని సంహరించమన్నాడు. అయినా రాముడు వెనుకాడాడు. ఆ రాక్షసికి భయపడికాదు. స్త్రీహత్య మహాపాతకమన్న ధర్మసందేహంతో. విశ్వామిత్రుడు అది గ్రహించి 'రామా! దుర్మార్గమైనా, సన్మార్గమైనా, పాతకమైనా, దోషమైనా ప్రజారక్షణకై కర్తవ్యాన్ని నిర్వర్తించటం ప్రభు ధర్మ' మన్నాడు.

రాముడు వెంటనే వింట బాణాన్ని సంధించి తాటకను సంహరించాడు.

తాటక సంహారానికి విశ్వామిత్రుడే గాదు - దేవతలు దేవేంద్రుడు అంతా హర్షించారు. సమర్థుడైన శిష్యుణ్ణి చేపట్టినందుకు, అతని చేత తాటక సంహారం జరిపించినందుకు అందరు విశ్వామిత్ర మహర్షిని గూడ అభినందించారు. 'ఇక నీ శస్త్రాస్త్ర సంపదనంతా శ్రీరామునికి అందజేయు'మని సలహాగూడ ఇచ్చారు.

విశ్వామిత్రుని ఆనందానికి అంతులేదు. తాటకవధలో ఆ రాముడు ప్రదర్శించిన ధార్మికతకు, ధనుర్విద్యాపారీణతకు, వినయవిధేయతలకు, దేవతల ప్రశంసలకు పొంగిపోయిన ఆ మహర్షి - జీవితంలో తానెంతో తపస్సు చేసి ఆర్జించిన శస్త్రాస్త్ర సంపదనంతా ఆ మహావీరునికి ధారపోయాలని నిర్ణయించాడు. మరునాటి వేకువనే ఆ రాముని మేల్కొల్పాడు. వరుసగా ధర్మచక్ర, కాలచక్ర, ఐంద్రాస్త్ర, వజ్రాస్త్ర, బ్రహ్మాస్త్ర, కాలపాశ, ధర్మపాశ, శుష్కాశని, ఆర్ద్రాశని, గదా, శిఖరి. మోదక్యాది నానావిధ శస్త్రాస్త్ర సంపద నంతా ధారపోశాడు. తృప్తిగా ఒక్క నిట్టూర్పు విడిచాడు.

జీవితంలో దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు అవసరమైన ఆయుధసామగ్రి శ్రీరామునికి సంక్రమించింది.

శ్రీరాముని బలపరాక్రమాలకు ఆ తరువాత ఎదురైన పరీక్ష విశ్వామిత్ర

యాగరక్షణ. అందుకే ఆ మహర్షి ఆయనను గొని వచ్చాడు. వసిష్ఠుని కడ అభ్యసించిన ధనుర్విద్యాకౌశలంతో, విశామిత్రుని కడ ఆర్జించిన శస్త్రాస్త్ర సహాయంతో ఆగ్నేయాస్త్రం ప్రయోగించి రాముడు అవలీలగా సుబాహుణ్ణి సంహరించాడు. మానవాస్త్రం ప్రయోగించి మారీచుణ్ణి సముద్రంలో పడగొట్టాడు. బహుశః మారీచుని పాత్ర ఇంకా మిగిలి ఉందని కాబోలు వాణ్ణి ప్రాణాలతో వదిలాడు.

రామాయణంలో రాముని గౌతమాశ్రమ ప్రవేశం ఒక అద్భుతఘట్టం. భర్త శాపానికి గురి అయి అహల్య ఆశ్రమంలో అదృశ్యగా పడిఉంది. ఆమె శాపవిమోచనం శ్రీరాముని రాకతో ముడిపడి ఉంది. ఆశ్రమంలో రాముడు అడుగు పెట్టగానే ఆమెశాపం తీరిపోయింది. ఏదో శిలాప్రతిమకు ప్రాణం వచ్చినట్లు ఆమె పైకి లేచింది. అహల్య గొంతు పలికింది. ఆమె జీవితం చిగురించింది. శ్రీరాముడు తమ్మునితో గూడ ఆ గౌతమపత్ని పాదాలకు ప్రణమిల్లాడు. ఆ గౌతమపత్ని కొండంత ఆనందంలో ఆ శ్రీరామచంద్రునకు ఆతిథ్యమిచ్చింది. అర్చనలు చేసింది. అదొక అద్భుత దృశ్యం.

ఎవరి జీవితంలోనైనా వివాహం ఒక పెద్ద మలుపు. వివాహంతో వ్యక్తి బాల్యదశ తీరిపోతుంది. యౌవన భోగానుభవం ఆరంభమౌతుంది. భర్తగా ఒకపెద్ద బాధ్యత పైన బడుతుంది ధర్మకార్యాచరణకు ఒకయోగ్యత ఏర్పడుతుంది. వివాహం లేనంటే ఐహికంగా వ్యక్తి జీవితానికొక విస్తృతిలేదు. ఔన్నత్యంగూడ లేదు.

యాగరక్షణతోనే విశ్వామిత్రునికి రామునితో పని తీరిపోయింది. అయినా ఆ మహర్షి రామలక్ష్మణులను అయోధ్యకు త్రిప్పి పంపలేదు. అయోధ్యకు మిథిలకు వియ్యాన్ని కూర్చాలని, రావణసంహారానికి పునాది వెయ్యాలని, లోక శ్రేయస్సుకు సీతారామకల్యాణం జరిపించాలని ఆ మహర్షి రామలక్ష్మణులను మిథిలకు నడిపించాడు.

అది జనకమహారాజసభ. సీతాస్వయంవర మహోత్సవం. ఎందరెందరో రాకుమారులు. ముందుకు శివధనుస్సు. అంతవరకు దాన్ని ఎక్కుపెట్టిన వారేలేరు. ఆత్మ విశ్వాసం రాముని కళ్ళల్లో తొణికిసలాడింది. సవినయంగా విశ్వామిత్రునివైపు చూసింది. ఆ మహర్షి అల్లన తల ఊపాడు.

ఆమోదముద్ర వేశాడు. నూనూగు మీసాల నూత్నయౌవనుడు. కొనవ్రేళ్ళ ముంగురులు సవరించుకుంటూ, కొండంత ధైర్యంతో ముందుకు నడిచాడు. ధనుస్సు ఎక్కుపెట్టాడు. అదిముక్కలైంది. తక్కిన రాకుమారుల అహంకారం ముక్కలైపోయింది. సీతమ్మ బుగ్గ సిగ్గుతో మొగ్గ తొడిగింది. జనకరాజు హృదయం పున్నమినాటి పారావారంలా పొంగిపోయింది. విశ్వామిత్రుని మనస్సు హిమాలయం మీద నిలిచింది.

సీతారాముల వివాహం జరిగింది.

రామాయణం రసవత్తరమైన మలుపు తిరిగింది.

వైభవోపేతంగా వివాహం చేసుకొని, బంధుమిత్ర పరివారంతో మిధిలనుండి అయోధ్యకు తిరిగి వచ్చే మార్గంలో శ్రీరాముని బలపరాక్రమాలకు మరో పరీక్ష. పరశురాముడు ఎక్కడినుండో పిడుగులా ఊడిపడ్డాడు. క్రోధకద్దుపద్దాడు. తన చేతి వైష్ణవచాపం చూపాడు. 'రామా! దీన్ని ఎక్కుపెట్టి ఒక్కబాణం వదలు' అన్నాడు. 'అది చూచి నీతో ద్వంద్వ యుద్ధాన్నో లేక మహేంద్రగిరి మీద తపస్సు చేయటాన్నో నిర్ణయిస్తా'నన్నాడు.

శ్రీరాముడు శివధనుస్సు విరిచి సీతను సహధర్మచారిణిగా స్వీకరించాడు. దుష్టశిక్షణకు ఆ మహాసాధ్వి కారణభూతురాలు కాబోతున్నది. రాముడిప్పుడు మొక్కవోని వైష్ణవచాపాన్ని ఎక్కుపెట్టాలి. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు ధర్మసంస్థాపనకు అవసరమైన వైష్ణవ తేజాన్ని పుంజుకోవాలి.

కాగా ఇంతవరకు పరశురాముడు చేసింది దుష్టరాజ సంహారం మాత్రమే. ఇకముందు రాముడు చేయవలసింది ఇంతకంటే ఎంతో క్లిష్టమైన దుష్టరాక్షస సంహారం. అందుకే కాబోలు ఆయనకు ఈ పరీక్ష. శ్రీరాముడు చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులోనే పరశురాముడు సగం కృంగిపోయ్యాడు. ఉదాత్తరమణీయంగా ఆయనచేతి వైష్ణవచాపం అందుకొన్నాడు. అవలీలగా ఎక్కుపెట్టాడు. కోటి సూర్యుల కుప్పపోసినట్లు వెలిగాడు.

జామదగ్న్యుడు జడీకృతుడయ్యాడు. 'రామా! ఎక్కుపెట్టిన ఆ వైష్ణవ బాణంతో నా పాదగతిని భంగం చెయ్యవద్దు' అన్నాడు పరశురాముడు.

'మరి వైష్ణవబాణం వ్యర్థం కాకూడదు గదా!' అన్నాడు ఆ కోదండరాముడు.

'తపస్సువల్ల నేనార్జించిన లోకాలు నాకు లేకుండా కొట్టు' అన్నాడు పరశురాముడు.

అలాగే అన్నట్లు తల ఆడించాడు ఆ కోదండరాముడు. పరశురాముడు అవతారం చాలించాడు. రామునికి ప్రదక్షిణ నమస్కారం చేశాడు. మహేంద్ర పర్వతానికి వెళ్ళి పోయాడు. మౌని అయ్యాడు.

అందరు ఒక్క నిట్టూర్పు విడిచారు. అయోధ్యకు ప్రయాణం సాగించారు.

శ్రీరాముని జీవితంలో ఇంతవరకు ఆయన ధనుర్బలం వ్యక్తమయ్యే ఘట్టా లేగాని, ధర్మబలం వ్యక్తమయ్యే సంఘర్షణ లేవీ ఏర్పడలేదు. అయోధ్యకు తిరిగి వచ్చిన తరువాత అలాంటిది ఏర్పడింది.

వ్యక్తి భోగానుభవానికి వివాహం ఒక్కటేచాలదు. అందుకు తగిన పదవి, సంపదగూడ సమకూరాలి. సీతావివాహం తరువాత శ్రీరాముని గుణగణాలను దశరథుడు నెమరు వేసుకొన్నాడు. తన వార్ధక్యాన్ని గూర్చి ఒకసారి ఆలోచించు కొన్నాడు. మంత్రి పురోహిత పౌరజానపదులతో సంప్రతించాడు. శ్రీరాముని యౌవరాజ్యాభిషేకానికి ముహూర్తం నిర్ణయించాడు.

రాముని యౌవరాజ్యాభిషేకవార్త అయోధ్యలో గాలిలా వీచింది. నీరులా పారింది. పరిమళంలా వ్యాపించింది. శబ్దంలా ప్రతిధ్వనించింది. కాంతిలా ప్రసరించింది. అయోధ్యలోని ఇండ్లన్నీ అందంగా అలంకరించు కొన్నాయి. ఆనందంలో తేలాడే పూల పడవల్లా నిలుచున్నాయి.

అన్ని వీధుల్లో అరటి స్తంభాలు. మామిడాకుల తోరణాలు. రకరకాల పూల సరాలు. రంగురంగుల దీపాలు. అన్ని దేవాలయాల్లో రాముని పేర అర్చనలు, ఘంటానినాదాలు; వేదపారాయణాలు. మారుమూల గ్రామాల నుండి గూడ అబాలగోపాలం అయోధ్య చేరుకొంది. ఎక్కడ చూచినా ప్రజలే. ఎటు చూచినా ఆనంద కోలాహలాలే.

ఇక రాజభవనం సంగతి చెప్పనే అక్కరలేదు. మంగళ వాద్యాలు మ్రోగు తున్నాయి. వేదవిప్రులు పుణ్యతీర్థజలాలు కలశాల్లోనింపి మోసితెస్తున్నారు. మంత్రి సామంత దండనాథ పౌరజానపద ప్రముఖులతో ఆస్థానం కిటకిట లాడు తున్నది వసిష్ఠమహర్షి ఆయన శిష్యులు ఒకవైపు ఆసీను లయ్యారు. సశాస్త్రీ

యంగా అభిషేకం జరిపించటానికి అన్నీ సిద్ధం చేస్తున్నారు. మంగళ పీఠం నవధాన్యాలు, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, చెరుకు, దర్భలు, పూలు పేలాలు ఒకచోట సిద్ధంగా ఉన్నాయి. భద్రగజం, శ్వేతాశ్వం, మహారధం వృషభరాజం ఒకో వైపు నిలిచి ఉన్నాయి. శ్వేతచ్ఛత్ర, శ్వేతచామర ఖడ్గ కోదండాది రాజలాంఛనాలు, సమలంకృత సింహాసనం చక్కగా అమర్చబడి ఉన్నాయి. అగ్నిహోత్రం అహూతి ద్రవ్యాలు అన్నీ సిద్ధమే.

పుష్యమినక్షత్రం, కర్కాటకలగ్నం సమీపిస్తున్నాయి. ఇక దశరధుడు రాముడు, అంతఃపురరాణులు రావటమే ఆలస్యం.

రాముడు ఉషఃకాలాన్నే లేచాడు. మంగళస్నానం చేశాడు. సంధ్యా వందనం ఆచరించాడు. గాయత్రీజపం పూర్తి చేశాడు. తెల్లని పట్టు ధోవతులు ధరించి పుణ్యాహవచనం గూడ ముగించి పిలుపుకోసం ఎదురు చూస్తున్నాడు.

ఇక దశరధుని పిలుపురావాలి. సుమంత్రుడు రధం తేవాలి.

సుమంత్రుడు రానే వచ్చాడు. కైకేయీ దశరధులు నిన్ను రమ్మన్నారని ఆ రామునితో చెప్పాడు.

రాముని ఆనందానికి అంతులేదు. 'సీతా ! కైకేయి సదా మన హితం కోరుతుంది. మన క్షేమాన్ని గూర్చి, లోక క్షేమాన్ని గూర్చి అనుక్షణం ఆలో చిస్తూ ఉంటుంది. అందు చేతనే దశరధుని ప్రక్కన ఉండి ఆమె నాకొరకు సుమంత్రుని పంపింది'. అని వెంటనే రాముడు రధం ఎక్కాడు. కైకేయీ మంది రానికి వెళ్ళాడు.

రాముడు ఆశించిన దొకటి అయిన దింకొకటి అమృతాన్ని ఆశిస్తే హాలా హలం పైకి పొంగింది.

ఒక వ్యక్తి మనోస్థైర్యం, గాంభీర్యం, ఔదార్యం మొదలైన గుణాలు బయటపడేది ఇటువంటి పట్టులోనే

కైకేయి రామునితో 'తండ్రి మాట తప్పక పాటిస్తావా' అంది.

అది రామునికి పిడుగుపాటులా ఉంది. తనకేదో ప్రమాదం కలుగుతుందని గాదు. తల్లి తన పితృభక్తిని, చిత్తశుద్ధిని శంకిస్తూ ఉందే అని.

రాముడు మనస్సు నొచ్చుకొంటూ అమ్మా ! నన్ను శంకిస్తున్నావా ! అన్నాడు. నేనిక బ్రతికి ప్రయోజనమేమి ? అన్నాడు. తండ్రి ఆజ్ఞాపిస్తే

అగ్నిలో దూకుతానన్నాడు. విషాన్ని మింగుతా నన్నాడు. సముద్రంలో మునుగుతానన్నాడు. రాముడు రెండు మాటలవాడు కాదన్నాడు. ఏమైనా సహిస్తానన్నాడు.

కైకేయి తాను దశరథుని కోరిన రెండు పూర్వవరాలనూ వినిపించింది. అవి ఆయన జీవితాన్ని తలక్రిందులు చేసేవి. భోగాన్ని ధనాన్ని ముక్కలు ముక్కలుగా కత్తిరించేవి.

అయినా రాముడు అణుమాత్రం చలించలేదు. పైగా కైకేయితో 'తల్లీ! నీవన్నట్లు భరతుడే రాజౌతాడు. తండ్రిగారు చెప్పిన నేను మునివృత్తి స్వీకరిస్తాను. అడవులకు వెళ్తాను. కాని తండ్రి ఎందుకో తాను స్వయంగా నాకీ సంగతి చెప్పలేదన్నదే నా బాధ' అన్నాడు. అందుకు కైకేయి మనస్సు కరిగిపోక సరిగదా అడవులకు వెళ్ళమని ఆయనను త్వరపెట్టింది.

అయినా రాముడు ఏమాత్రం తన సమతను కోల్పోలేదు. పైగా కైకేయితో 'అమ్మా! నాకు ధనంమీద ఆశలేదు. రాజ్యంమీద కాంక్షలేదు. నన్ను ఋషితుల్యునిగా భావించు. అన్నివేళలా నేను ధర్మాన్నే ఆశ్రయిస్తాను.

అయితే అందరికన్న ఎక్కువగా నీవు నన్నాజ్ఞాపించదగినదానివే— ఇవి దశరథుని ఆజ్ఞలని నాతో చెప్పాలా! నీవు చెపితే నేను కాదంటానా! నా హృదయం ఆ మాత్రం అర్థంచేసుకోలేక పోయావా! అన్నాడు.

దశరథునికి, కైకేయికి ప్రదక్షిణం చేశాడు. సభామంటపానికి వెళ్ళి అభిషేకజల పూర్ణకుంభాలకు, ఇతర ద్రవ్యాలకు ప్రదక్షిణం చేశాడు. అయోధ్యను వదలి అడవులకు వెళ్ళాలని నిశ్చయించాడు.

ఒక వ్యక్తి జీవితంలో ఇది సామాన్యమైన మలుపుగాదు. సాధారణమైన దెబ్బగాదు. పట్టాభిషేకానికి కట్టుకొన్న పట్టుబట్టలు విడిచి అరణ్యవాసానికి నారచీరలు కట్టుకోవటం. అభిషేకార్థం తెచ్చిన తీర్థ జలాలతో అరణ్యవాసానికి స్నానం చెయ్యటం. మహారాజుగా సాగించ వలసిన జీవితం మునివృత్తి నవలంబించటం.

అయినా రాముడు చలించలేదు.

అయోధ్యను వదలి అరణ్యానికి వెళ్ళే ఆయన మనస్సు ప్రశాంతమైన సుఖా

లను, అన్నిలోకాలను అధిగమించి బ్రహ్మపదార్థంలో లీనమయ్యే పరమయో గీంద్రుని మనస్సులా నిర్వికారస్థితిలో ఉందట.

రాముడు కౌసల్య అంతఃపురానికి వెళ్ళాడు. ఆమె కొడుకు యౌవరాజ్యాభిషేకానికి సిద్ధమౌతూ ఉంది. శ్రీరామునికి సర్వసుఖాలు కలగాలని బ్రాహ్మణుల చేత హోమాలు చేయిస్తూ ఉంది. పూజలు చేస్తూ ఉంది. రాముడు రాగానే పారవశ్యంతో ఆమె కొడుకును కౌగలించుకొంది. అభిషేక మహోత్సవాన్ని గూర్చి ఏమేమో మాట్లాడుతూ ఉంది.

రాముడా స్థితిలో ఆమెకు అరణ్యవాసవార్త ఎలా చెప్పాలో! చెపితే ఆమె ఏమౌతుందో!

అయినా రాముడు చెప్పక తప్పలేదు. కొడుకు అరణ్యవాసవార్త వినగానే కౌసల్య మొదలు నరికిన చెట్టులా మూర్ఛ బడిపోయింది.

రాముడు తల్లిని మెల్లగా లేవనెత్తాడు. అనేక విధాల ఓదార్చాడు. ఆశీర్వదించి అరణ్యాలకు పంపమని అర్థించాడు.

ఆమె తానూ అరణ్యాలకు వస్తానంది. అందుకు రాముడు 'అమ్మా! భర్తను విడిచి భార్య కొడుకు వెంట ఎక్కడికి రాకూడదు. బ్రతికిఉన్నంతకాలం పతియే సతికి దైవం దశరథుని ఆజ్ఞ అందరికి శిరోధార్యం. వృద్ధుడు దుఃఖమగ్నుడు అయిన దశరథ మహీపతికి నీవు సేవ చేస్తూ ఉండు. పదునాలుగేళ్ళు పూర్తికాగానే నేను తిరిగి వస్తాను' అన్నాడు ఎలాగో ఆమె అనుమతి సాధించాడు.

రాముడు తల్లితో మాట్లాడుతున్నంత సేపూ తమ్ముడు లక్ష్మణుడు ప్రక్కనే ఉన్నాడు. ఉన్నంతసేపూ ఆ లక్ష్మణుడు దశరథుని మీద, కైకేయి మీద సెగలు పొగలు గ్రక్కుతునే ఉన్నాడు. కదప దైవాన్ని పట్టి కొట్టే అంతకోపంగా ఉన్నాడు. కోపాన్ని ఆపుకోలేక దశరథుని కాముకతను, కైకేయి కుటిలతను దుయ్యబట్టాడు. ఈ రెండింటి కారణంగా ప్రాప్తించిన అరణ్యవాసాన్ని అంగీకరించ నక్కరలేదన్నాడు. తన బాహుబలంతో అన్నగారి యౌవరాజ్యాభిషేకాన్ని జరిపిస్తా నన్నాడు. ఎవరైనా ఎదిరిస్తేవారి అంతుతేలుస్తానన్నాడు. తుదకు దైవాన్ని గూడ తనపౌరుషంతో త్రిప్పికొట్టగలనన్నాడు.

అగ్నిగుండంలా మండిపడే ఆ తమ్ముణ్ణి రాముడు ఆప్యాయంగా చూదాడు.

అతని భుజం నిమురుతూ 'లక్ష్మణా ! నా పట్ల నీకున్న స్నేహాతిశయం, అసదృశాలైన నీ బలపరాక్రమాలు కూడనాకు తెలుసు.లోకంలో సర్వశ్రేష్ఠం ధర్మం. సత్యం ధర్మప్రతిష్ఠితం. పితృవాక్యం అవశ్యకర్తవ్యం. క్రోధాన్ని అవలంబించి ధర్మాన్ని కాలదన్నగూడదు. నన్ను అనుసరించు. ధర్మాన్ని ఆశ్రయించు. పట్టాభిషేక సంభారాలు సిద్ధం చేయటానికి నిన్న చూపిన ఉత్సాహం ఈనాడు వల్కలాలు నారు సమకూర్చటంలో ప్రదర్శించు. ఏర్పడిన ఈ వైపరీత్యానికి మన తండ్రి కారణం గాదు. కైకేయిగూడ కారణంగాదు. కేవలం దైవమే ఇందుకు కారణం. కైకేయి ఇంతకాలం ఎంతో పతిభక్తురాలు గదా. పైగా నాపట్ల ఆమె కెంతో పుత్రవాత్సల్యం ఉంది గదా. ఆమె భరతుని కంటే నన్నెప్పుడు వేరుగా చూడలేదు గదా. అలాంటి కైకేయి ఈలాంటి వరాలు కోరిందంటే దైవమహిమ కాక మరేమిటి ?

తమ్ముడూ ! దైవమహిమ తెలియసాధ్యంకానిది. దానికి ఎదురులేదు. అయితే దైవం ఉందని ఋజువేమిటి ? పురుష ప్రయత్నంతో దాన్ని త్రిప్పి కొట్టగూడదా ? అని అంటావేమో.

దైవం మనకు కన్పించకున్నా దాని ప్రభావం మాత్రం మనము అనుభవిస్తున్నాము. ఒక్కోసారి మానవుడు ఎంత ప్రయత్నించినా కొన్ని పనులు కావు. ఒక్కోసారి అల్పప్రయత్నంతోనే ఎంతో అద్భుత ఫలితాలు సాధిస్తాడు. అన్నింటికి మనమే కర్తలమైతే అలా ఎందుకు జరుగుతుంది. సుఖదుఃఖాలు, శాంత క్రోధాలు, లాభనష్టాలు, జననమరణాలు అన్నీ దైవనిర్ణయాలు. పట్టాభిషేకానికి తెచ్చిన పుణ్యతీర్థజలం అందుకు ఉపయోగపడకపోతే నా తాపస ప్రస్థానానికి ఉపయోగపడుతుంది. అది రాజద్రవ్యం కదా అని ఎవరైన అభ్యంతరం తెలిపితే, నేనే నీళ్ళు చేదుకొని స్నానంచేసి తాపసవ్రత దీక్ష వహిస్తాను. అడవులకు వెళ్ళతాను.

ఈ తారుమారును చూచినీవు దుఃఖించవద్దు. ఈలాంటి వైపరీత్యాలు జీవితంలో సహజభాగాలు. శాంతంగా ఉండు' అని ఎంతో సమాహిత చిత్తంతో తమ్ముణ్ణి అనునయించాడు. దైవతత్త్వాన్ని తెలియ చెప్పాడు. తన వనవాస నిర్ణయాన్ని పునరుద్ఘాటించాడు. సీతామందిరానికి వెళ్ళాడు.

సీత అభిషేకానికి సిద్ధంగా ఉంది. కొద్ది క్షణాల్లో జరుగనున్న భర్త యౌవరాజ్యాభిషేకాన్ని, తనకు రానున్న పట్టమహిషిత్వాన్ని భావించుకొని కొత్తగా

కొష్ఠలానికి వచ్చిన ఆ సుద్ధురాలు ఎంతగానో మురిసిపోతూ ఉందో!

భర్తను చూడగానే ఆమె పరుగెత్తుకుంటూ వచ్చింది. రాముడు నిట్టూర్పు విడిచాడు.

సీత ఆశ్చర్యంగా ఆయనవైపు చూచింది. రాముడు జరిగిందంతా చెప్పాడు.

అంతేగాదు. ప్రభువుల స్వభావాన్ని. పరిస్థితుల ప్రభావాన్ని, స్త్రీల మన స్తత్వాన్ని దృష్టిలో ఉంచుకొని 'సీతా! ప్రభుత్వం పరపురుష ప్రశంస సహించదు. అందుచేత భరతుని ఎదుట ఎన్నడూ నన్ను ప్రశంసించకు, పైగా ప్రత్యేకించి నిన్ను గౌరవించవలసిన అవసరం ఆయనకు లేదు. ఆయన యువరాజు. ఆయనతో అనుకూలంగా వ్యవహరించటం ఎంతో అవసరం.

మాతండ్రి మనస్సుగూడ నొచ్చుకోకుండా నీవు ప్రవర్తించు. ఉషఃకాలా న్నలేచి పూజాదికాలు పూర్తిచేసుకో. మా తండ్రిగారికి నమస్కరించు. మా తల్లిగారిని గౌరవించు. తల్లులందరు నాకు సమానమే. అందుచేత కైకేయీ సుమిత్రలను గూడ సమ్మానించు. తమ్ములంటే నాకు ప్రాణం. వాళ్ళను నీ తోబుట్టువుల్లా చూచుకో. ప్రియపుత్రుల్లా ప్రేమించు.

ప్రభుత్వం అలక్ష్యాన్ని సహించదు. విరోధాన్ని వెంటనే అణచివేస్తుంది. సేవాభావాన్ని ఆమోదిస్తుంది. సద్గుణను, హితులను చేరదీస్తుంది ఈ విషయం గమనించి ఆయన పట్ల ప్రవర్తించు.

స్త్రీలు అడవులకు రాకూడదు. అందులోను సుకుమారులు అసలే రాకూడదు. నీవు అంతఃపురంలోనే ఉండి అందరితో అనుకూలంగా మసలుకో' — అని వాత్సల్యము, ఉదాత్తమనోహరము అయిన ఉపదేశం చేశాడు. ఈర్ష్యాద్వేషాది అల్పస్వభావాలకు అతీతమైన మనస్తత్వం వ్యక్తం చేశాడు. అంతేగాక అరణ్యంలో అనుకూలమైన ఆహారం దొరకదన్నాడు. క్రూరమృగాలు మీదికి వస్తాయన్నాడు. చన్నీళ్ళస్నాన మన్నాడు. భూశయన మన్నాడు. ఈగలన్నాడు దోమలన్నాడు. ముళ్ళన్నాడు. తేళ్ళన్నాడు. ఆమె తనవెంట రాకుండా ఉండటానికి ఎన్ని చెప్పాలో అన్నీ చెప్పాడు. ఎంత నేర్పుగా చెప్పాలో అంత నేర్పుగా చెప్పాడు.

అయినా ప్రయోజనం లేకపోయింది. చెలియలి కట్ట సముద్రుని ఆటకట్టిం

చినట్లు సీత పాతివ్రత్య ధర్మప్రతిపాదనతో శ్రీరాముని మాట కట్టించింది. కన్నీటితో ఆయన మనస్సును కరగించింది.

రాముడు ఆర్ద్రహృదయంతో ఆమె హృదయాన్ని అర్థం చేసుకొన్నాడు. ఆత్మవంతుడు కీర్తిని విడువలేనట్లే నేను నిన్ను విడిచి ఉండలేనన్నాడు. నీవు లేకుండే సాక్షాత్తు స్వర్గమైనా నాకు రుచించదన్నాడు. అనేక విధాల ఆమె నోదార్చాడు. అరణ్యవాసానికి అనుమతించాడు.

ఇదే సమయమని లక్ష్మణుడు గూడ తన అభ్యర్థన బయట పెట్టాడు అరణ్యవాసానికి తనకూ అనుమతి నిమ్మని అన్నగారి నడిగాడు.

రాముడు తమ్ముని ప్రార్థనను గూడ మన్నింపక తప్పలేదు.

ఒక వ్యక్తి అందులోను ఒక ప్రముఖ వ్యక్తి ఊరు వదలి పరదేశం వెళ్ళేటప్పుడు తన శ్రేయోభిలాషులను, మిత్రులను, భృత్యులను సత్కరించటం, తన స్మృతి చిహ్నంగా కొన్ని కానుకలివ్వటం లోక సహజం.

ఆనాడు సంస్కృతియే సంపదగా జీవించే బ్రాహ్మణులు, సేవనే జీవనాధారంగా చేసుకొని బ్రతికే రాజభృత్యులు శ్రీరాముని యువరాజ్యాభిషేకం మీద ఎన్ని ఆశలు పెట్టు కొన్నారో ! ఏయే సమ్మానాలు పొందాలని కోరుకొన్నారో ! ఏయే ప్రయోజనాలు పొందాలని ఆశించారో !

అందుకే రాముడు తన శ్రేయోభిలాషులైన బ్రాహ్మణోత్తములనంతా పిలిపించాడు. పెక్కు దానాలు చేశాడు అంతఃపుర భృత్యులందరికి ధనకనక వస్తువాహనాలిచ్చి తృప్తి పరిచాడు. ఆనాడు రాముని చేత దానం తీసుకొనని బ్రాహ్మణుడుగాని, భృత్యుడుగాని, బిచ్చగాడుగాని అయోధ్యలో లేడు.

రాముడు తల్లి దగ్గర సెలవు తీసుకొన్నాడు. లక్ష్మణుని పంపి వసిష్ఠుని యింట దాచుంగిన ధనుస్సును, కవచ తూణీరాలను, ఖడ్గాల జంటను తెప్పించుకొన్నాడు. వీటిని వరుణ దేవుడు యాగసమయంలో జనకరాజుకు ఇచ్చాడట. వివాహ సమయంలో జనకరాజు రామునికిచ్చాడు. అర్ధాంగి సీతతో, అనుగు తమ్ముడు లక్ష్మణునితో దశరథుని దర్శించటానికి బయలు దేరాడు. పాదచారి అయి రాజ మార్గాన ఆయన వెళ్ళుతుంటే మేడల మీద, దేవాలయాల దగ్గర, రాజమార్గాల కిరు ప్రక్కల, ఇళ్ళవాకిళ్ళ ముందు దేశ ప్రజలంతా గుమిగూడారట. ఏ ముఖంలో చూచిన ఆశ్చర్య

విషాదాలే, ఏనోట విన్నా ఆ రాముని గుణగణాల ప్రశంసలే, కైకేయీ దశరథుల క్రూర నిర్ణయాల నిరసనలే.

రాముడు ప్రజనంతా చూస్తూనే నడిచాడు అయినా ఆయన ఎవ్వరినీ చూడలేదు,

రాముడు అందరిమాటలూ వింటూనే ముందుకు సాగాడు. అయినా ఆయన ఎవరి మాటలూ వినలేదు.

మదగజేంద్రునిలా గంభీరమందగమనంతో ముందుకు నడిచాడు. నిర్వికార హృదయంతో కైలాస శిఖరంలా కన్పించే పితృగృహానికి ప్రదక్షిణం చేశాడు. లోనికి ప్రవేశించాడు. సుమంత్రుని ద్వారా తనరాక తండ్రికి తెలిపి, తల్లులందరి సమక్షంలో ఆయనను దర్శించి, చేతులు జోడించి 'మహారాజా! నీవు మాఅందరికి ప్రభువువు. దండకారణ్యం వెళ్ళటానికి అనుజ్ఞ ఇవ్వు. ఎంత వద్దంటున్నా ఈ సీతా లక్ష్మణులు వెంట వస్తానంటున్నారు' అని వినయంగా అనుమతి అర్థించాడు. తండ్రి నిస్సహాయతను, హృదయ వేదనను అర్థంచేసుకొని తన అరణ్యవాస నిర్ణయాన్ని పునరుద్ఘాటించి — రాజ్య సుఖాలకంటె, భార్య పొందుకంటె, కామ్యపదార్థాల కంటే, స్వర్గభోగాలకంటె, ప్రాణాల తీపి కంటె — పితృవాక్యపరిపాలన, సత్యవ్రత దీక్ష నాకు ప్రియతరాలన్నాడు. దుఃఖంతో కుమిలిపోయే పితృదేవుని పరిపరివిధాల ఓదార్చాడు

దశరథుడు పుత్రప్రేమతో రాముని వెంట రత్నరాసులు, చతురంగబలాలను పంపమని సుమంత్రునితో చెప్పాడు. అందుకు కైక ప్రతిఘటించింది. అప్పుడు రాముడు 'మహారాజా' సమస్త భోగాలు వదలి' సర్వసంగాలు పరిత్యజించి అడవుల్లో జీవించాలను కొన్న నాకు ఈ రత్నరాసులెందుకు? ఈ సేనాసమూహాలెందుకు? భద్రగజాన్నే వదులుకొనే వ్యక్తికి దాని నడుముకు గట్టే త్రాటిమీద మనస్సు ఉంటుందా? మహారాజా! ఇప్పుడు నాకు అవసరమైనవి నారచీరలు అంతేగాని రత్నాలతో చతురంగబలాలతో నాకేమీపని' — అని మహోదాత్తంగా అన్నాడు

కైకేయి వెంటనే వెళ్ళి వల్కలాలు తెచ్చియిచ్చింది. రాముడు శిరస్సు వంచి సవినయంగా వాటిని స్వీకరించాడు. పట్టాభిషేకానికి కట్టుకొన్న పట్టుధోవతులు విడిచి ఆ నారబట్టలు కట్టుకొన్నాడు,

లక్ష్మణుడు గూడ అన్ననుసరించి నారబట్టలు ధరించాడు.

పాపం ! సీతమ్మకు ఆ నారచీరలు ఎలా కట్టుకోవాలో తెలీలేదు.

అప్పుడు రాముడు ఆమె పట్టుచీరమీదనే ఆ నారబట్టలు చుట్టుతుంటే అక్కడున్న వాళ్ళంతా బొట బొట కన్నీళ్ళు కార్చారట.

రాముడు తండ్రికి నమస్కరించాడు. తల్లి కౌసల్యను పినతల్లులు శ్రద్ధతో ఆదరించండని అర్థించాడు. దశరథపత్నులందరికీ — మూడువందల యాభైమందికి మ్రొక్కాడు. 'చిరపరిచయంవల్లగాని, అజ్ఞానంవల్లగాని, ఏదైన అపచారం చేసి ఉంటే ఔదార్యంతో క్షమించండ'ని అర్థించాడు. సీతాలక్ష్మణులతో గలసి తల్లిదండ్రులకు ప్రదక్షిణ నమస్కారలు చేసి, సుమంత్రుడు సిద్ధం చేసిన రథాన్ని అధిరోహించి అరణ్యవాసానికి బయలుదేరాడు.

రథం కదిలింది. అంతఃపురంలో, అయోధ్యానగరంలో ఎటుచూచిన దుఃఖమే. కైకేయి తప్ప కడకు అంతఃపురం గోడలాళ్ళు గూడ ఆ రథం కదిలేటప్పటికి కన్నీళ్ళు కార్చాయి. రథం కదిలిందేగాని అది అయోధ్యాపురవీధుల్లో వేగంగా సాగిపోతేగదా అడుగడుగునా దాన్ని ఆపేవాళ్ళే. మెల్ల మెల్లగా పోనిమ్మని సుమంత్రుని అర్థించే వాళ్ళే.

రథానికి ముందుజనం వెనుకజనం. ప్రక్కల జనం. ఎక్కడ చూచినా జనమే. జనప్రవాహంలో తేలాడుతున్న తెప్పలా ఉంది ఆ రథం.

సీతారాములను వెళ్ళ వద్దంటారు కొందరు. మేమూ వస్తామంటారు మరికొందరు. కైకేయీ దశరథులను దూషిస్తారు ఇంక కొందరు. సీతారాముల గుణగణాలను ప్రశంసిస్తారు అందరు.

ఎంతో విశాలమైన ఆ రాజమార్గం ఎక్కడికక్కడ కుంచించుకు పోతూ ఉంది. ఆనాడు సుమంత్రునికి గుర్రాల తోలటం చేతగాలేదు. ఆ గుర్రాలకు రథాన్ని లాగటం అంత కంటె చేతగాలేదు.

ప్రొద్దు పోతూఉంది. దుఃఖవాతావరణం దట్టమౌతూ ఉంది.

ఆ మందగమనం ఎంతసేపో !

ఈ జన ప్రవాహం ఎంతవరకో !

రాముడు సుమంత్రుని వైపు చూచాడు. రథాన్ని వేగంగా పోనిమ్మన్నాడు.

ప్రజలు సుమంత్రుని చుట్టు ముట్టారు. రథాన్ని నిదానంగా నడపమని ఆర్థించారు. పరుగు పరుగున దశరథుడు వచ్చాడు. నిలునిలు మని సుమంత్రుని ఆదేశించాడు. రాముడు సూటిగా సుమంత్రుని చూచాడు. పద పదమని త్వరపెట్టాడు. పాపం! సుమంత్రునిమనస్సు రథచక్రాల మధ్య చిక్కుకొన్నది.

అతడు భయపడుతూ దశరథునివైపు తిరిగాడు. దీనంగా రాముని వైపు చూచాడు. ఎవరిమాట వినాలి ? ఏం చెయ్యాలి ?

'దశరథుడు తిరస్కారదేరానికి నిన్ను దండిస్తానంటే ఈ జనసమ్మర్దంలో ఆయన ఆజ్ఞావాక్యాలు వినపడలేదని చెప్పు. వీళ్ళ దుఃఖాన్ని నేనిక సహించలేను. సుమంత్రా! వేగంగా పోనీ' అన్నాడు రాముడు.

రథం వేగంగా అయోధ్య దాటింది.

అయోధ్య ఒక శిథిలాలయంలా వెనుక నిలబడి పోయింది.

రథం అయోధ్య దాటినా 'రామా' 'రామా' అంటూ కొందరు వస్తూనే ఉన్నారు. రాముడు ఎంత చెప్పినా వారు ఆగటం లేదు. వృద్ధబ్రాహ్మణులు అగ్ని హోత్రాలు మోసుకొంటూ, యజ్ఞోపవీతాలు సవరించుకొంటూ, పిలకలు ముడివేసు కొంటూ, ఉత్తరీయాలు నడుములకు బిగించుకొంటూ నడువలేక నడువలేక పడిపడిగా నడిచివస్తున్నారు. 'ఓ అశ్వశ్రేష్ఠాలారా! ఆగండి. అన్ని ప్రాణులకంటె మీకు వినికిడి శక్తి ఎక్కువ. మా ప్రార్థన ఆలకించండి. మా రాముని అయోధ్యకు మర లించండి' అని గట్టిగా అరుస్తున్నారు.

గుఱ్ఱాలు ఆగుతాయా! వారి విజ్ఞప్తిని విని వెనుదిరుగుతాయా!

రాముడు ఆ బ్రాహ్మణోత్తముల ప్రయాస చూచాడు. రథం దిగాడు. వాళ్ళతో మాట్లాడాలంటే తాను వెనుకకు నడవాలి. అది వ్రతభంగం. వాళ్ళను ఉపేక్షించి ముందుకు వెళ్ళితే అది అవినయం అందుచేత మెల్లగా కాలినడక సాగించాడు.

ఆ బ్రాహ్మణులు అది చూచారు. 'వత్సా! నీకు ఎండ తగులకుండ మాకు వాజపేయంలో వచ్చిన శ్వేతచ్ఛత్రాలు తెస్తున్నాము. మహాధనరూపాలైన వేదాలు మా మనస్సుల్లోనే ఉన్నాయి. అరణ్యంలో మాకు వేరే ధనం అక్కరలేదు. అయోధ్యలో మా పత్నుల పాతివ్రత్యమే వాళ్ళను రక్షిస్తుంది. వేరే రక్షణలు వారి కక్కరలేదు. మా అగ్నిహోత్రాలను గూడ అరణ్యారోపితాలను గావించుము

వెంట తెచ్చుకొంటున్నాము. ఈ పవిత్రాగ్నిహోత్రాలు నీ వెంట ఉంటాయి. తరువాత నిన్ను అయోధ్యకు గొనిపోతాము. నీవు ధర్మాత్ముడివి. ఈ వృద్ధుల విజ్ఞప్తి కాదన కూడదు' అని వెంట వచ్చారు.

రామునికి ఏం చెయ్యాలో తోచలేదు.

ఆ బ్రాహ్మణులను మరలించటం బ్రహ్మతరం గూడ గాదు. అందుకే ఆయన మౌనంగా నడచాడు.

ఈ పౌరులను, బ్రాహ్మణులను ఎంతదూరం నడిపిస్తున్నట్లు త్రోవలో తమసా నది అడ్డువచ్చింది. ప్రొద్దు గ్రుంకింది.

అంతా అలసిపోయారు. విశ్రమించారు. అందరికంటే రాముడు ముందు లేచాడు.. ఒక్కసారి నిద్రించే ఆ జనాన్నంతా చూచాడు.

ఇంక ఎంతదూరం వీళ్ళను నడిపించటం !

ఎంత దాకా వీళ్ళ దుఃఖం సహించటం !

మాటలతో వీళ్ళను అయోధ్యకు మరలించటం అసాధ్యం. అందుచేత మైమరపించి వెళ్ళటమే అప్పటికి ఉచితం.

రాముడు సుమంత్రుని పిలిచాడు. రథం సిద్ధం చేయించాడు. తెల్లవారక ముందే తమసానదిని దాటి దూరంగా వెళ్ళిపోయాడు.

రథం ఉత్తరకోసల దక్షిణ సరిహద్దులు దాటింది. వేదశ్రుతీ నదిని దాటింది గోమతీనదిని దాటింది స్యందికానదిని దాటింది. గంగాతీరం చేరింది. ప్రొద్దుగ్రుంకింది.

గంగ ఒడ్డున్న శృంగిబేరపురం. ఆ ఊరి బయట ఓ పెద్దగారచెట్టు. ఆ చెట్టు క్రిందికి చేరింది రాముని రథం.

ఆ రాత్రికి అక్కడే విశ్రాంతి. గుహుని ఆతిథ్యం గూడ అక్కడే.

మరునాడు మఱ్ఱిపాలతో రామలక్ష్మణులు జడలు దాల్చారు. సహోదరుడైన ఆ గుహుడు కూర్చిన ఓడ ఎక్కి గంగ దాటారు.

గంగ దాటి అడవి మార్గంలో అడుగు పెట్టగానే ఒక విధమైన ఒంటరితనం రాముని ఆవరించింది. జాగరూకతాస్ఫూర్తి ఆయన హృదయంలో చోటు చేసుకొంది.

దుఃఖరేఖలు ఆయన ముఖంలో తొంగి చూచాయి. 'లక్ష్మణా ! మనం మానవసంచారంలేని మహారణ్యంలో ఉన్నాము. ఇప్పుడు మనకు రక్షణ అవసరం. అందుచేత జాగ్రత్తగా ఉండాలి. నీవు ముందు నడువు. నీవెంట సీత వస్తుంది. వెనుక నేను ఉంటా. ఏమరుపాటు ఏమాత్రం పనికిరాదు. చెడిన దానిని చక్కదిద్దటం చాల కష్టం. అందుచేత ముందుగానే జాగ్రత్తపడాలి అని తమ్ముని హెచ్చరించాడు. రాత్రి వేళకు సీతాలక్ష్మణులతో కలిసి వత్సదేశ సమీపంలో ఒక మఱ్ఱిచెట్టు క్రిందికి చేరాడు.

అరణ్యవాసంలో రామునికి అది మొదటి రాత్రి. జీవితంలో ఒక వింత అనుభవం.

ఎక్కడి అయోధ్య! ఎక్కడి అరణ్యం !

ఎక్కడి అంతఃపురం ! ఎక్కడి మఱ్ఱిచెట్టు ! లక్ష్మణుడు ఎండుటాకులతో ఒక పడక సిద్ధంచేశాడు. సీతారాములు ఆ పడకపై పవ్వళించారు. పాపం ! సీతమ్మ పడుకోగానే నిద్రపోయింది. ఎంత అలసిపోయిందో !

ఆ రామయ్యకు ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు. లక్ష్మణుడు నిద్రపోడు.

'లక్ష్మణా ! అరణ్యంలో సీత యోగక్షేమాలు మనం జాగ్రత్తగా చూచుకోవాలి. ఇది మొదలు మనం రాత్రులు మేలుకోవాలి అన్నాడు రాముడు. అంతేగాదు. ఆ రాత్రంతా ఆయనకు అయోధ్యను గూర్చిన ఆలోచనలే. తండ్రి దైన్యస్థితి కైకేయి క్రూరత్వ, భరతుని అదృష్టం, తన దురదృష్టం, కౌసల్య దుస్థితి ఆయన కళ్ళముందు కన్పించాయి. కంట తడిపెట్టించాయి. కోపం తెప్పించాయి.

కష్టాలకు దుఃఖించటం, సుఖాలకు సంతోషించటం మానవస్వభావ సహజం. కష్టాలకు దుఃఖించకుండా, సుఖాలకు సంతోషించకుండా, ఏమాత్రం చలనం లేకుండా ఉండాలంటే అతడు రాయిగా మారిన దేవుడైనా కావాలి. దేవుడుగా మారిన మానవుడైనా కావాలి.

సాక్షాత్తు దేవుడే మానవుడైనా—మానవుడు మానవుడుగా లోకంలో మసలినంతకాలం సుఖదుఃఖానుభవం ఆయనకు తప్పదు. అయితే ఎంత దుఃఖాన్ని అనుభవించినా, ఎంత సుఖాన్ని అనుభవించినా మహాత్ములు తమ సమతను గోల్పోరు. ధర్మాన్ని తప్పరు. సుఖదుఃఖాలు వారి మనస్సముద్రంలో తరంగాలు మాత్రమే వాటి ఉనికి ఎంత సహజమో, అవి హద్దు దాటటం అంత అసాధ్యం కాకపోతే ఒక్కొక్కప్పుడు ఉవ్వెత్తుగ పైకి లేస్తాయి. పెద్దశబ్దంచేస్తాయి. గట్టును ఢీకొని మరలా వెనుదిరుగుతాయి.

ఇప్పుడు రాముని స్థితిగూడ అలాంటిదే. లక్ష్మణుడు అన్న స్థితిని గమనించాడు. అనేక విధాల ఆయనను ఓదార్చాడు. అన్న ఆవేదనతో తమ్ముని ఓదార్పుతో ఆ రాత్రి తెల్లవారి పోయింది.

ఉదయాన్నే మరల ప్రయాణం.

అది భరద్వాజాశ్రమం. అరణ్యవాసంలో రామచంద్రుడు అడుగు పెట్టిన మొదటి ఆశ్రమం. భరద్వాజమహర్షి తపోదీక్షితుడై, హోమపిష్టుడై, శిష్యపరివేష్టితుడై అగ్నిహోత్రునిలా వెలుగుతున్నాడు. హోమం ముగిసేదాకా రాముడు గూడ చేతులు జోడించుకొని దూరంగా వేచి నిలిచాడు. హోమం పూర్తి కాగానే భరద్వాజమహర్షి ప్రియమార రాముని వైపు చూచాడు. శ్రీరాముడు సీతా లక్ష్మణులతో కలిసి భక్తి పూర్వకంగా ఆ మహర్షికి నమస్కరించాడు. భరద్వాజుడు ఆశ్రమమృగపక్షి శిష్యగణ పరివేష్టితుడై వచ్చి ఆర్ద్ర హృదయంతో ఆ రామునికి స్వాగతం చెప్పాడు.

'రామా! చిరకాలానికి నిన్ను చూడగలిగాను. నీ ఆరణ్యవాస విషయాన్ని గూర్చి ఇంతకు ముందే విన్నాను. ఈ గంగా యమునా సంగమ స్థలం పుణ్యం, రమ్యం, వివిక్తం నీ విచ్చట సుఖంగా ఉండవచ్చు' అన్నాడు.

రాముడు 'స్వామీ! ఈస్థలం పౌరజానపద ప్రవేశానికి అందుబాటులో ఉంది. మమ్మల్ని చూడాలని వారంతా వస్తారు. అది మీకు, మాకు ఉభయులకు ఇబ్బంది. అందుచేత దూరంగా ఈ సీతాదేవికి సుఖార్హంగా ఉండే ఆశ్రమాన్ని సెలవివ్వండి. అక్కడ ఉంటాము, అన్నాడు కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించి.

భరద్వాజ మహర్షి ఒక క్షణం నిమీలిత నేత్రుడయ్యాడు. 'రామా! ఇక్కడికి పదిక్రోసుల దూరంలో చిత్రకూటం ఉంది. అది అన్ని విధాల అనుకూలంగా ఉంటుంది' అన్నాడు.

సీతా రామలక్ష్మణులు మార్గ మధ్యంలో వాల్మీకి మహర్షిని దర్శించి చిత్రకూటం చేరుకొన్నారు. పర్ణశాలను నిర్మించుకొన్నారు. ప్రశాంతంగా కాలం గడుపుతున్నారు.

ఆ రోజు చాల చిత్రమైనరోజు. చిత్రకూట ప్రకృతి సౌందర్యం శ్రీరాముని హృదయానికి గిలిగింతలు పెట్టింది, ఆయన పర్ణశాల వాకిట్లో నిలబడి 'సీతా! అని

పిలిచాడు. ఆమె వెంటనే వచ్చి భర్త ప్రక్కన నిలుచుంది. 'ప్రకృతి ఎంత అందంగా ఉందో చూడు' అన్నాడు రాముడు.

ఆమె తల ఊపింది. 'చిత్రకూట పర్వత విశేషాలు చూపిస్తాను వస్తావా' అన్నాడు రాముడు సాభిప్రాయంగా చూస్తూ.

ఆమె ఆయన వెంట నడిచింది. రాముడు నానావిధధాతు మిశ్రితాలైన పర్వత ప్రదేశాలు చూపించాడు. రకరకాల చెట్లు చూపించాడు. అల్లిబిల్లిగా అల్లుకొన్న లతలన్నీ చూపించాడు. సెలయేళ్ళు చూపించాడు. అనేక మృగాలు చూపించాడు. ప్రక్కనే మలుపు తిరిగి పారుతున్న మందాకినీ నదిని చూపించాడు. ఆ నదిలో మృగాలు నీళ్ళు త్రాగే రేవులుగూడ చూపించాడు. మునులు స్నానాలు చేసే ఘట్టాలు చూపించాడు.

సామాన్యంగా సుందరప్రకృతి శృంగారభావోద్దీపకం. అందులోను ప్రేయసి సాహచర్యం అందుకు బలమైన ఆలంబనం. మందాకినీ శోభ చూచేసరికి మానవ సహజంగా శ్రీరాముని హృదయం స్పందించింది.

'సీతా ! గాలికి రాలిన పూలతో సగంమాత్రమే కప్పబడి మెలికలు తిరుగుతూ ముందుకు సాగే ఆ మందాకినీ నదిని చూడు. ప్రియుడు తన వస్త్రాన్ని సగం తొలగిస్తే సిగ్గుపడుతూ అవలికి తిరిగే అందమైన అంగనామణిలా లేదూ !' అన్నాడు. 'ఆ చక్రవాకాల జంటలు చేసే రతిధ్వనాలు మనోహరంగా లేవూ' ! అన్నాడు.

'మందాకినిలో మనం జలక్రీడలాడుదామా ?' అన్నాడు.

సీత తన పైట కొంగు మూతికి అడ్డంగా ఉంచుకొని ముసిముసి నవ్వులు నవ్వింది.

రాముడు ఎందుకో సిగ్గు పడ్డాడు. బహుశః తన తప్పు తాను తెలుసుకొన్నాడేమో. జడలు గట్టిన జుట్టును ఒక్కసారి సవరించుకొన్నాడు.

అంతలో సూర్యుడు నడినెత్తికెక్కాడు. రాముడు ఆమె చెయ్యిపట్టుకొని చల్లని కొండ చరియను నడిపించాడు.

ఇద్దరూ కలిసి కూర్చొన్నారు. ఎంతో ఆప్యాయంగా రాముడు ఆమె చేతికి ఆహారం అందిస్తున్నాడు.

అంతలోనే ఒక పెద్దశబ్దం వినిపించింది. సీత ఉలిక్కి పడింది. వెంటనే ఒక పెను దుమారం కనిపించింది. రాముడు తలయెత్తి చూచాడు.

అడవి యేనుగులు, సింహాలు, ఎనుబోతులు అన్నీ భయపడి పరుగెత్తుతున్నాయి.

రామునికి ఏమీ తోచలేదు. తమ్ముని పిలిచాడు. 'లక్ష్మణా! ఏమిటి ఈ విపరీతం? ఎదైన క్రూర జంతువు వచ్చిందా? లేక ఏ రాకుమారుడైన వేట కొరకు వచ్చాడా? వెళ్ళిచూడు' అన్నారు.

లక్ష్మణుడు హడావిడిగా ఒక చెట్టెక్కి చూచాడు అదొక పెద్దసేన. చతురంగబల సమృద్ధమైన సేన. మీదికి పొంగే మహాసముద్రం లాంటి సేన

ససంభ్రమంగా లక్ష్మణుడు 'అన్నా! వెంటనే వదినెను ఆ కొండ గుహలోకి పంపు. ధనుస్సు తీసుకో. కవచం ధరించు వ్యవధి లేదు' అన్నాడు.

అందుకు రాముడు చిరునవ్వునవ్వి 'తమ్ముడూ! ఆ సైన్యం ఎవ్వరిదో నిదానించి చూడు' అన్నాడు.

'అన్నా! అదుగో కోవిదారధ్వజం. అది మన భరతునిది. నీవు రాజ్యాన్ని వదలినా అతడు నిన్ను వదిలేటట్లులేడు. నిన్ను సంహరించి శాశ్వతంగా రాజ్యం హరించాలన్న దురుద్దేశంతో దండెత్తి వస్తున్నాడు. నీవు అనుమతిస్తే చాలు. ఆ భరతుణ్ణి వధిస్తాను. అప్పుడు కైకకుగూడ బుద్ధివస్తుంది' అన్నాడు లక్ష్మణుడు ఆవేశంగా.

ఇలాంటి సమయాల్లోనే వ్యక్తి గొప్పతనం, ఆలోచనాస్థాయి, మాటనేర్పు, మంచిప్రవర్తన వ్యక్తమౌతాయి. మానవతా పక్వతకు మనోనిగ్రహమే మంచి కొలబద్ద.

లక్ష్మణా! భరతుడు మహావీరుడు, అంతేగాదు. అతడు గొప్ప వివేకి. తనకు తానై మన దగ్గరకు వస్తుంటే కత్తు లెందుకు? ధనుస్సు లెందుకు? పితృవాక్య పరిపాలనార్థం అయోధ్యవదలి అరణ్యాలకు వచ్చిననేను భరతుణ్ణి పరిమార్చి మళ్లల రాజ్యాన్ని పరిగ్రహిస్తానా? అధర్మంగా ప్రాప్తించే అమరేంద్ర పదవి అయినా నాకక్కరలేదు. భరతునికి, నీకు, శత్రుఘ్నునికి దక్కని ఏ సుఖంగూడ నాకక్కరలేదు భరతుడు భ్రాతృవత్సలుడు. నాకు ప్రాణప్రియుడు మనకు

అపకారం చెయ్యాలన్న సంకల్పం అతనికి ఏ మాత్రం ఉండదు. ఎప్పుడూ మేన మామ యింట్లోనే ఉండటం ఉచితంగాదని, తండ్రిసేవ చెయ్యాలని అయోధ్యకు వచ్చి ఉంటాడు. నా అరణ్యవాసాన్ని గూర్చి వినిఉంటాడు. తల్లిని నిందించి. తండ్రిని ప్రార్థించి రాజ్యాన్ని నాకు మరల అప్పగించాలని వస్తున్నాడు. అలాంటి భరతుని మీదనా నీ ఆగ్రహం! కావాలంటే చెప్పు, భరతునితో చెప్పి రాజ్యాన్నంతా నీకు ధారపోయిస్తాను' అనేసరికి అన్నగారి సమ్యగ్దర్శనం, సదాలోచనం. సద్భా షణం చూచి లక్ష్మణుడు చల్ల పడ్డాడు. తన తొందరపాటుకు తాను సిగ్గు పడ్డాడు.

అసలే భరతుడు అనేకవిధాల కుమిలిపోతూ వస్తున్నాడు. ఆవేశపరుడైన లక్ష్మణుడు ఏమాత్రం అప్రియంగా మాట్లాడినా అతని హృదయం బ్రద్దలౌతుంది. అది నివారించటానికే రాముడు కఠినంగా 'కావాలంటే చెప్పు - భరతునితో చెప్పి రాజ్యాన్నంతా నీకు ధారపోయిస్తా' అన్నాడు.

అంతలోనే సేన సమీపించింది. 'లక్ష్మణా! ముందువచ్చే ఆ మేలిమి గుర్రాలజంట చూడు. ఎంత మనోహరంగా ఉందో. అదుగో! నాన్నగారి పట్టపు ఏనుగు శత్రుంజయం కాని ఆయన శ్వేతఛత్రం కన్పించటం లేదే! నా మనస్సెం దుకో ఆందోళనగా ఉంది. చెట్టు దిగు' అన్నాడు రాముడు.

అన్న దమ్ములిద్దరు సీతతోకలిసి పర్ణశాలకు వెళ్ళారు. సైన్యానికి ఆశ్రమ ప్రవేశయోగ్యత లేదు. అందుచేత అది చిత్రకూటం చుట్టూ నిలిచింది.

భరతుడు వినీతవేషుడై తమ్ముడు శత్రుఘ్నునితో, తల్లులు ముగ్గురితో, పురోహితుడు వసిష్ఠునితో, కొంతమంది పరిచారకులతో రామదర్శనార్థం పాదచారి యై పర్ణశాల దగ్గరకు వచ్చాడు. యువరాజవేషంలో చూడవలసిన శ్రీరాముని మునివేషంలో చూచాడు, సింహాసనం మీద చూడవలసిన శ్రీరాముని దర్భాసనం మీద చూచాడు. అతని గుండె చెరువైంది. కన్నీటి ముసురులో భరతునికి రామపాదాలే కన్పించలేదు. చేతులుచాచి రాముని ముందు సాగిల పడ్డాడు. 'ఆర్యా!' అని సంబోధించాడు. అంతే. అవల మాటరాలేదు, శత్రుఘ్నుడూ అదస్థితిలో ఉన్నాడు.

రాముడు భరతశత్రుఘ్నుల్ని లేవనెత్తాడు. ప్రియమూర కౌగిలించుకొన్నాడు కన్నీళ్ళు తుడిచాడు. తన తొడమీద కూర్చోబెట్టుకొన్నాడు. ఎన్నెన్నో కుశల ప్రశ్నలు వేశాడు. ఆ కుశల ప్రశ్నల రూపంలోనే ఉత్తమోత్తమ ప్రభుధర్మాలు'

రాజనీతి విశేషాలు పరోక్షంగా బోధించాడు.

భరతుడు తనకంటె చిన్నవాడు. ప్రత్యక్షంగానే అతనికి ప్రభుధర్మాలు, రాజ నీతి విశేషాలు బోధించవచ్చు. అయితే ఇప్పుడతడు యువరాజు. తానొక సామా న్యవ్యక్తి. అందుచేత తానెంత పెద్ద అయినా తగుదునమ్మా అని ప్రభుధర్మాలు, రాజనీతి విశేషాలు ప్రభుస్థానంలో ఉన్న ఆ వ్యక్తికి ప్రత్యక్షంగా చెప్పటం ఉచితం గాదు. ధర్మంగాదు. అట్లని రాజ్యక్షేమం దృష్ట్యా, వంశగౌరవం దృష్ట్యా ఊరు కోవటం గూడ శ్రేయస్కరం గాదు. అందుచేతనే రాముని ఉచితజ్ఞత, ధర్మజ్ఞత, వచోనిపుణత కుశలప్రశ్నల రూపంలోనే పరోక్షంగా భరతునికి అవన్నీ బోధించ వటం జరిగింది. రాముడు'తమ్ముడూ ! తండ్రికి శుశ్రూష చేస్తున్నావా ? తల్లులం దరు సుఖంగా ఉన్నారా ? కులగురువు వసిష్ఠుని, ఆయన కొడుకు సుయజ్ఞుని, ధను ర్వేదాచార్యుడు సుధన్వుని పూజిస్తున్నావా ? శూరులు, పండితులు, పరేంగితజ్ఞులు, జితేంద్రియులు, సద్వంశభూతులు అయిన వారినే మంత్రులుగా నియమించు కొన్నావా ? మంత్రాలోచనాలు బహిర్గతాలు కాకుండ రహస్యంగా సాగిస్తున్నావా ? సుకృతాలు, సఫలీకృతాలు అయిన కార్యాలను మాత్రమే సామంతులకు తెలియ చేస్తున్నావా ?' అన్నాడు

అంతేగాదు వెయ్యిమంది మూర్ఖుల కంటె ఒక్క విజ్ఞుడు మేలు. ప్రమాద సమయంలో ప్రభువుకు ఉపకరించేవాడు విజ్ఞుడే. అందుచేత విజ్ఞులను వదలు కోకుండ చూచుకొంటున్నావు గదా ! ప్రతిభను, ప్రభుభక్తిని పరీక్షించకుండా వ్యక్తు లకు పనులు అప్పగించటం లేదు గదా ? అతిగా పన్నులు విధించి ప్రజలను బాధిం చటం లేదు గదా ? ప్రభుత్వపతనానికి కుట్రలు పన్నే సమర్థశత్రువులను శోధించి సంహరిస్తున్నావు గదా ? చారచక్ర సక్రమంగా సాగుతున్నది గదా ? సర్వసమర్థు ణ్ణి సైన్యాధ్యక్షునిగ నియమించావు గదా ? ప్రజల దృష్టిలో నీ ప్రవర్తన ప్రశంసా ర్హంగా ఉందా ? మనవంశాచారాలను, ధర్మాలను తప్పకుండా అనుసరిస్తున్నావు గదా ?'అన్నాడు.

అన్నీ విన్నభరతునికి అన్నగారికి ఏం చెప్పాలో అర్థంగాలేదు. తండ్రి సుఖంగా ఉన్నట్లే ఆయన ఊహిస్తున్నాడు. తన్ను యువరాజుగానే భావిస్తున్నాడు తాను పాలన సాగిస్తున్నట్లే మాట్లాడు తున్నాడు.

భరతుడు ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఆయన కళ్ళ వెంట నీళ్ళు కారు

తూనే ఉన్నాయి. గొంతు గద్గదకంగానే ఉంది. అన్నగారి ముఖంలోకి దీనంగా చూచి 'ధర్మనిరసుడనైన నాకు రాజధర్మ మెందు'కన్నాడు. 'అన్నా! మన వంశం ధర్మబద్ధం గదా. ఎన్నడైన జ్యేష్ఠుని వదలి కనిష్ఠునికి రాజ్యాభిషేకం జరిగిందా? నా ప్రార్థన మన్నించి అయోధ్యకు వచ్చి అభిషేకం జరిపించుకో. నీ యెడబాటు సహించలేక మన పితృదేవుడు పరమపదించాడు. నీవు పితృ తర్పణం గూడ చెయ్యాలి' అని ప్రాధేయ పూర్వకంగా అడిగాడు.

శ్రీరాముని శీలానికి ఇదొక పెద్ద పరీక్ష. తమ్ముడు అరణ్యందాకా వెతుక్కుంటూ వచ్చి అయోధ్యారాజ్యం తీసుకోమ్మంటున్నాడు. తాను అరణ్యవాసం చేస్తానని తండ్రికి, తల్లికి ఇచ్చిన మాట ఇంకా తీరలేదు. ఒక వైపు మహా సామ్రాజ్య భోగాలు. మరో వైపు సత్యపాలన, ఎటు మొగ్గాలి? ఏం చెయ్యాలి.

శ్రీరాముని ధర్మనిష్ఠ సత్యపాలన వైపే మొగ్గింది.

ఆయన తండ్రి మరణానికి తీవ్రంగా దుఃఖించాడు. సీతాలక్ష్మణులతో కలిసి మందాకినీ నదికి వెళ్ళి స్నానంచేసి పితృతర్పణం పూర్తి చేశాడు. పర్ణశాలకు తిరిగి వచ్చాడు. భరతుని వెంట వచ్చిన ప్రజలు, సైనికులు రాముని చూడటానికి సామూహికంగా వచ్చారు. అందరిని రాముడు ప్రియమార పలుకరించాడు. తల్లులను ప్రణామ పూర్వకంగా గౌరవించాడు. వసిష్ఠ మహర్షికి సవినయంగా నమస్కరించాడు. పర్ణశాల వాకిట కొలువుదీరాడు.

ఆనాడు దేవసభ క్రిందికి దిగి వచ్చినట్లుంది. అప్పుడు లేచాడు భరతుడు. అన్నను అయోధ్యకు రమ్మని తన ప్రార్థన పునరుద్ఘాటించాడు. 'భరతుని ప్రార్థనే మా ప్రార్థన' అన్నట్లు అందరు ప్రజలు, ఆ సైనికులు చేతులెత్తి ఒక్కసారిగా ఆయనకు నమస్కరించారు. తల్లులందరు చెమ్మగిల్లిన కళ్ళతో శ్రీరామునివైపు చూచారు. వసిష్ఠమహర్షి అల్లన తల ఆడించాడు.

రామునికి ఏం చెప్పాలో తోచలేదు. ఏం చెయ్యాలో అంతకంటె తోచలేదు, ధారంగా నీరు కన్నీరు వచ్చింది. భరతుని కౌగిలించుకొని 'తమ్ముడూ! నీవల్ల తప్పేమి లేదు. తల్లి కైకమ్మనుగూడ నీవు నిందించవద్దు. ఇందులో ఆమెదోషం గూడ ఏమీలేదు. ఇది దైవనిర్ణయం. నీవు రాజ్యం చెయ్యాలని, నేను అడవులకు వెళ్ళాలని తండ్రి ఆజ్ఞ. అది మనకు శిరోధార్యం. దానికి తిరుగు లేదు'— అన్నాడు రాముడు.

మరునాటి ఉదయం మరల అంతా సమావేశ మయ్యారు. కథ మామూలే. భరతుడు రమ్మంటాడు. రాముడు రానంటాడు.

కడకు భరతుడు 'అన్నా ! నీవెంట నేనుగూడ అడవుల్లోనే ఉంటా' వన్నాడు.

ఆ మాట వినేసరికి రాముడేగాదు అక్కడ ఉన్నవారంతా ఒక్కసారిగా పులకించారు.

జాబాలి చార్వాక మతం చెప్పి, అయోధ్యవచ్చి భోగభాగ్యాలు అనుభవించ మని రామునికి సలహా యిచ్చాడు. రాముడు జాబాలి వాదాన్ని తృటిలో ఖండించాడు. తన ధర్మనిష్ఠను తెలియజేశాడు. వసిష్ఠ మహర్షి గూడ భరతుని ప్రార్థన మన్నించ మని రామునికి సుదూరం చెప్పాడు. అయినా ప్రయోజనం లేకపోయింది.

ఇక లాభంలేదని భరతుడు దర్భలు పరచుకొని పర్ణశాల వాకిటికి అడ్డంగా పడుకొన్నాడు. 'అన్నా ! నీవు అయోధ్య వస్తే గాని నేను కదలను. అంతవరకు అన్నం, నీళ్ళు నాకక్కరలేదు' - అన్నాడు.

రాముడు ససంభ్రమంగా లేచాడు. తమ్ముని దగ్గరకు వెళ్ళాడు. 'భరతా ! నేను నీకు ఏ అపకారం చేశానని నా వాకిటికి అడ్డంగా పడుకొన్నావు. బ్రాహ్మణుడు మాత్రమే అప్పు రాబట్టుకోటానికి ఎగవేసే వానియింటి ముందు ఇలా పడుకోవచ్చు. ఉత్తమక్షత్రియుల కిది ఉచితం గాదు' అన్నాడు.

భరతుడు కదలలేదు.

అప్పుడు రాముడు గంభీర ధీర స్వరంతో 'తమ్ముడూ ! కాంతి చంద్రుని విడిచిన విడుచుగాక. మంచు హిమవత్పర్వతాన్ని విడిచిన విడుచుగాక, సముద్రం చెలియలి కట్టను దాటిన దాటుగాక. నేను మాత్రం తండ్రి కిచ్చిన మాట దాటను.' అనగానే అందరు ఒక్కసారి ఆ రామునికి నమస్కరించారు.

భరతుడు తనపట్టు కొంత సడలించాడు. ఆయన పాదుకలిమ్మని ప్రార్థించాడు. ఆ పాదుకలకే పట్టంగట్టి రాముని ప్రతినిధిగా తాను రాజ్యం చేస్తానన్నాడు. గడువు దాటిన మరునాడు రాముడు రాకపోతే తన అగ్ని ప్రవేశం తప్పదన్నాడు.

అందుకు రాముడు మాత్రం ఏమనగలడు ! తమ్ముణ్ణి అనునయిస్తూ, తన పాదుకలిచ్చాడు. ఇక కైకమ్మపై కోపం వద్దన్నాడు. అలా కోపపడితే తన

మీద, పీఠమీద ఒట్టన్నాడు.

రామాయణంలో ఈ రామభరత సమావేశం ఒక అద్భుతఘట్టం. ఇరువురి చిత్తశుద్ధికి ఇదొక గీటురాయి. ఇరువురి మహనీయతకు ఇదొక మెరుగుటద్దం. అనాయాసంగా చేతికందిన మహాసామ్రాజ్యాన్ని అన్నకిస్తానంటాడు తమ్ముడు. చేజారిపోయిన సామ్రాజ్యం చేతికి వస్తున్నా వద్దంటాడు అన్న. ఆ అన్నదమ్ముల సంభాషణ విని అంతా ఆశ్చర్యపోయారు. రాముని పితృభక్తిని, ధర్మరక్తిని - భరతుని భ్రాతృభక్తిని నిర్మల దృష్టిని మహర్షులంతా మెచ్చుకొన్నారు.

భరతుడు పాదుకలతో అయోధ్యకు వెళ్ళాడు. భారంగా నిట్టూర్చి రాముడు పర్ణశాలలో ప్రవేశించాడు.

చిత్రకూటానికే అదొక చిత్రమైన అనుభవం.

ఒక రోజు ఉదయం రాముడేదో ఆలోచిస్తూ పర్ణశాల వాకిట నిలబడ్డాడు. ఎందుకో చిత్రకూటం మీది మహర్షులంతా ఏదో ప్రమాదం ముంచుకొచ్చినట్లు కృష్ణాజినాలు, యోగదండాలు, కమండలాలు, అగ్నిహోత్రాలు సర్దుకొని ప్రయాణానికి సిద్ధమౌతున్నారు. రాముడు [illegible] వెళ్ళి కులపతిని కారణమడిగాడు. 'రామా! నీవు వచ్చింది మొదలు మాకు రాక్షసుల బాధ ఎక్కువైంది. రావణుని తమ్ముడు ఖరుడు పరమ క్రూరుడు. అతడు అతని అనుచరులు జనస్థానంలో మునులనంతా పారద్రోలి, నిన్ను జూచి ఓర్వలేక ఇక్కడి మునులకంతా ఎక్కువ బాధ కలిగిస్తున్నారు. అందుచేత ఇంతకుముందున్న ఆశ్రమాలకు వెళ్ళామని బయలుదేరుతున్నాము. అభ్యంతరం లేకుంటే నీవూ మావెంటరా. ఖరుడు నీవంటి యుద్ధ సమర్థుణ్ణి ఓర్తునా [illegible]. పైగా నీవు భార్యతో గూడి ఉన్నావు' అన్నాడు ఆ వృద్ధ తపస్వి

రాముడు రాక్షస సంహారం చేస్తానన్నాడు. రాముని ప్రమాదాలను నివారిస్తానన్నాడు. నిశ్చింతగా మీరుండండన్నాడు. అయినా ప్రయోజనం లేకపోయింది.

మునుల [illegible] వారినంతా సాగనంపి శ్రీరాముడు తిరిగి వచ్చాడు.

ఆ రోజు మొదలు ఆయన మనస్సులో ఏవేవో ఆలోచనలు. చిత్రకూటం అన్న [illegible] మనుగానివస్తే, తనరాక మునిజనుల శోకకు కారణమైంది.

అది మనస్సును బాధిస్తూ ఉంది. అంతేగాదు. అయోధ్యా వాసులకు అందుబాటులో ఉండగూడదని ఇంతదూరంవస్తే, రావలసినవారు చిత్రకూటం రానేవచ్చారు కూడదనుకొన్న కన్నీటి వర్షం కురియనే కురిసింది పర్ణశాల వాకిట అడుగు పెట్టితే చాలు - దర్భలు పరచి పడుకొన్న భరతుడు కళ్ళముందు కన్పిస్తున్నాడు. ఇష్టం లేని ఎన్నో విషయాలు గుర్తు వస్తున్నాయి,

బహుశః స్థలం మార్పు మనశ్శాంతికి కొంత దోహదం చెయ్యవచ్చు. అందు చేతనే కాబోలు రాముడు చిత్రకూటం వదలాలని నిర్ణయించాడు.

సీతా లక్ష్మణులతో కలసి మార్గమధ్యంలో అత్రిమహాముని ఆతిధ్యం స్వీక కరించి, దండకారణ్యం ప్రవేశించాడు.

దండకారణ్య ప్రవేశం శ్రీరాముని జీవితంలో చాల ప్రాధాన్యమున్న ఘట్టం పట్టాభిషేక భంగం రాముని ధార్మిక ప్రకృతిని ఆవిష్కరిస్తే, దండకారణ్యప్రవేశం ఆయన దుష్టశిక్షణ, శిష్టరక్షణ సామర్థ్యాన్ని చాటింది. ఆయన అరణ్యవాసాన్ని లోకోపకారకం గావించింది.

దండకారణ్య ప్రవేశమే లేకుంటే సీతాపహరణమే జరిగేది కాదేమొ ! రావణసంహారం మిగిలిపోయేదేమొ ! రాముని వ్యక్తిత్వానికొక పరిపూర్ణత, ఆయన జన్మకొక సార్ధకత సిద్ధించేది కాదేమొ.

దండకారణ్యంలో రాముడెదుర్కొన్న మొట్టమొదటి రాక్షసుడు విరాధుడు, మహాక్రూరుడు, పర్వతాకారుడు. రాముడు చూస్తూ ఉండగానే వాడు సీతను చంక కెత్తుకొన్నాడు. దూరంగా ఎగిరిపోకి, రామలక్ష్మణులవైపు తిరిగి మీ మునివేషాలు చేతుల్లో మారణాయుధాలు పరస్పర విరుద్ధాలన్నాడు. మీరు మునులైతే ఈ మచ్చె కంటి మీకెందు కన్నాడు. ఎదిరిస్తే మీ ఎదలు చీల్చి రక్తం త్రాగుతానన్నాడు.

అది పరపురుషుని అంకంలో బలవంతంగా నలిగే తన భార్యను చూడటం. సర్వ సమర్థుడైన సత్పురుషుడు ఒక దుర్మార్గుని దూషణకు గురికావటం. ఏ భర్త అయినా ఆ స్థితిని సహించగలదా ? ఏ పురుషుడైన ఆ దూషణను భరించ గలడా ? మానవ స్వభావ సహజంగా ఆ రాముని హృదయం మండిపోయింది. ఆయన తన దుస్థితికి త్రోవ తీసిన కైకేయి క్రూరవరాలు గుర్తు చేసుకొన్నాడు. ప్రక్కనున్న తమ్మునితో

పన బడవనంతా వెళ్ళబోసు కొన్నాడు. అతని ఓదార్పుతో, వీరావేశంతో ఒకింత ఓదటబడ్డాడు. విరాధవధకు సిద్ధమయ్యాడు. ఒక్కపెట్టున ఏడుబాణాలు అతని మీద ప్రయోగించాడు. విరాధుడికి ఊపిరాడలేదు. సీతను క్రిందికి దింపి సింహనాదం చేశాడు. శూలం చేత పట్టుకొని రాముని మీదికి విజృంభించాడు. రామ బాణాలతో ఆ శూలం ముక్కలు ముక్కలుగ విరిగిపోయింది. విరాధుడు ఇంకా ఉగ్రుడయ్యాడు. రామ లక్ష్మణుల మీద ఎగిరి దూకాడు. ఇద్దరిని ఎత్తుకొని అరణ్యం లోకి దూసుకు పోయాడు.

పాపం ! సీతమ్మ పెద్దగా ఏడుస్తూ నిలబడింది. ఆమె ఏడ్పు రామలక్ష్మణులు విన్నారు. వెంటనే విరాధుని భుజాలు ఖండించారు. విరాధుడు శాపవిముక్తుడయ్యాడు శ్రీరాముని మహత్తు తెలుసుకొన్నాడు. చేతులెత్తి నమస్కరించాడు. శరభంగ మహాముని ఆశ్రమానికి వెళ్ళండని సలహాచెప్పాడు.

శరభంగమహాముని ఆశ్రమంలో అడుగుపెట్టగానే సూర్యాగ్ని సదృశుడైన ఒక తేజోమూర్తి ఆ మహామునితో మాట్లాడటం రామునికి అగుపించింది. ఆయన దేవేంద్రుడని తెలుసు కొన్నాడు. దేవేంద్రుడు వెళ్ళిన తరువాత రాముడు శరభంగ మహామునిని కలుసుకొన్నాడు ఆ మహాముని 'రామా ! దేవేంద్రుడు నాతపస్సుకు మెచ్చి బ్రహ్మపదం ఇచ్చాడు నీవు వస్తున్నావని గూడ చెప్పాడు. నేను సాధించిన ఆ బ్రహ్మపదం నీకు ధారపోస్తాను. స్వీకరించు' అన్నాడు.

అందుకు రాముడు 'మహామునీ ! ఒకరి తపఃఫలం నాకక్కర లేదు. నేనేస్వయంగా సకల లోకాలు సాధించగలను. అరణ్యంలో వాసయోగ్యమైన ఒక ప్రదేశం చెప్పండి. అంతమాత్రంచాలు' అన్నాడు ఎంతో ఆత్మవిశ్వాసంతో.

ఇక్కడికి సమీపంలోనే సుతీక్ష మహాముని ఆశ్రమం ఉంది. అన్ని విధాల అది వాసయోగ్యం. ఆ మహర్షి మహాతేజుడు. మీకు మేలు చేస్తాడు' అని, ఆ ఆశ్రమానికి వెళ్ళే మార్గం చెప్పి, అగ్నిహోత్రాన్ని రగిల్చి తన శిధిల దేహాన్ని ఆహుతి చేసుకొన్నాడు ఆ శరభంగ మహాముని.

శరభంగమహాముని స్వర్గానికి వెళ్ళగానే మిగతా మునులంతా రాముని చుట్టూ చేరారు. ఆయన ధార్మికతను, రక్షణదక్షతను కొనియాడారు. రాక్షసులవల్ల తాము పడేబాధలన్నీ చెప్పారు. తమకు రక్షనిమ్మని అర్థించారు.

రాముని హృదయం ద్రవించింది. ఆయన ధర్మవీరం పొంగి పొరలింది. రాక్షసుల శిక్షిస్తానన్నాడు. మునుల రక్షిస్తానన్నాడు అది తన కర్తవ్యమన్నాడు. అందరితో కలసి ఆ సుతీక్ష్ణమహాముని ఆశ్రమానికి వెళ్ళాడు.

సుతీక్ష మహాముని గూడ శ్రీరామునికి స్వాగతం చెప్పాడు. తాను సాధించిన దివ్యలోకాలు ధారవోస్తానన్నాడు. అందుకు గూడ రాముడు అంగీకరించలేదు. 'అరణ్యవాసంలో మాకు అనుకూలమైన ప్రదేశం చెప్పండి' అని మాత్రం అడిగాడు.

సుతీక్ష మహాముని ఎంతో ప్రేమగా తన ఆశ్రమంలోనే ఉండమన్నాడు. అయితే అప్పుడప్పుడు మృగబాధ తప్ప దన్నాడు. అందుకు రాముడు 'మహర్షీ ! ఆ మృగాలను వధిస్తే మీకు బాధ కలుగుతుంది. అందుచేత ఇక్కడ ఉండటం నా కిష్టంలేదు' అని ఆరాత్రి గడిపి ఉదయాన్నే సీతాలక్ష్మణులతో' మునులతో కలసి బయలు దేరాడు.

ఇప్పుడు అరణ్యంలో రామునికి సీతారక్షణ బాధ్యత మాత్రమేగాదు. మునిజన రక్షణ బాధ్యత గూడ పైన బడింది. రాక్షస శిక్షణ ఆయన కర్తవ్యమైంది. ఆమేరకు మునులందరికి మాట ఇవ్వటం గూడ జరిగింది.

మాట ఇవ్వటం మహాసులభం. ఇచ్చిన మాటను నిలబెట్టుకోవటం మహాకష్టం. అందులోను అసాధారణ పరిస్థిల్లో, ప్రలోభాలకు లొంగకుండ, ప్రమాదాలకు భయపడకుండ సత్యపాలన సాగించటం చాలకష్టం.

రాముని జీవితం సత్యపాలనకు ఒక చక్కని తార్కాణం. ఒక రమణీయ వ్యాఖ్యానం. అయోధ్య రాజ్యాన్ని వదలి అడవులకు వెళ్ళతానని ఆనాడు తండ్రికి మాట ఇచ్చాడు. భరతుడు చిత్రకూటం దాకా వచ్చి వాకిటికి అడ్డంగా పడుకొని అయోధ్య రాజ్యాన్ని స్వీకరించమని అర్థించినా అడినమాట తప్పనన్నాడు. అపార భోగ భాగ్యాలు వదలుకొన్నాడు. ఈనాడు అరణ్యంలో రాక్షస సంహారం చేస్తానని, మునిజన రక్షణ కల్పిస్తానని శరభంగ మహాముని ఆశ్రమంలో మునులందరికి మాట ఇచ్చాడు.

ఈప్రతిజ్ఞలో ఎంత ప్రమాదం ఇమిడి ఉందో సీతాదేవి గుర్తించింది. అందుకే ఆమే అకారణవైరం అభిలషణీయం కాదన్నది. అందులోను రాక్షసులతో అకారణ వైరం అనేక ప్రమాదాలకు దారి తీస్తుందన్నది. పతికి సుదూరం హితబోధ చేసింది

రాముడు 'సీతా ! హితబోధ నీ అభిజాత్యానికి, పతిభక్తికి తగినట్లుంది. పరమానందంగా ఉంది. కాని సత్యమే నాకు సదా ఇష్టం. అవసరమైతే నా ప్రాణాన్ని గాని, నిన్నుగాని, లక్ష్మణుణ్ణిగాని పరిత్యజిస్తాను. కాని సత్యాన్ని మాత్రం విడువను. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ క్షత్రియధర్మం. ఆత్మధర్మం. అది నేను విడవను' అన్నాడు.

రాముడు అగస్త్యాశ్రమానికి వెళ్ళాడు. ఆయన ఆతిథ్యం స్వీకరించాడు. ఆయన అనుగ్రహించిన ధనుర్బాణాలు, అక్షయ తూణీరాలు, మహాఖడ్గం దుష్ట శిక్షణార్థం, శిష్టరక్షణార్థం స్వీకరించాడు. అరణ్యవాసశేషం గడపటానికి అనువైన ప్రదేశం సెలవిమ్మని అర్థించాడు.

అగస్త్యుని సూచనమేరకే రాముడు పంచవటికి వెళ్ళడం జరిగింది.

పంచవటి గోదావరీ తీరప్రాంతం. అందమైన అరణ్య ప్రదేశం. అక్కడే రాముని పర్ణశాల.

అది హేమంత ఋతువు హేమంత మంటే రామునికి ఎంతో ఇష్టం. ఆ రోజు ఉదయిం రాముడు గోదావరిలో స్నానం చేశాడు పూర్వాహ్నికాలు పూర్తి చేసుకొన్నాడు. ప్రశాంతంగా పర్ణశాల వాకిట కూర్చున్నాడు సీతా లక్ష్మణులతో సంతోషంగా మాట్లాడుతున్నాడు. ఎందుకో ఆరోజు రాముడు మరీ అందంగా అగుపిస్తున్నాడు. ఆయన మనస్సు ఒక ప్రశాంత గంభీర సరోవరంలా ఉంది.

ఎక్కడి నుండో శూర్పణఖ ఒక పెద్ద బండలా వచ్చి పడింది. అది రాక్షసి అయినా అప్పుడు అందంగానే ఉంది అయితే ఆ ఆకారం వెనుక ఒక వికారత, భీకరత మసక మసకగా అగుపిస్తూనే ఉంది.

శూర్పణఖ రాముని వైపు సాభిప్రాయంగా చూచింది శృంగారం ఒలకపోస్తూ ఏవేవో ప్రశ్నలడిగింది. అన్నిప్రశ్నలకు ఆ రాముడు సమాధానం చెప్పాడు. తన సంగతి చెప్పాడు. తమ్ముని సంగతి చెప్పాడు. తన భార్య సంగతి చెప్పాడు. పంచవటికి అందరు ఎందుకు వచ్చింది గూడ చెప్పాడు ఆ తరువాత నీవెవ్వరు అని అడిగాడు.

శూర్పణఖ తన సంగతి చెప్పింది. రావణుని సంగతి చెప్పింది, కుంభకర్ణ విభీషణ ఖర దూషణాదుల సంగతి చెప్పింది. ఆ వీరులందరు

తన సోదరులన్నది. చిట్ట చివరకు తన కోరిక బయట పెట్టింది. రామా! సీత నీకు తగిన భార్య కాదన్నది. తన్ను భార్యగా స్వీకరించమని సూటిగా అడిగింది

రాముడు చిరునవ్వు నవ్వాడు. ఆ చిరునవ్వులో ఆశ్చర్యం ఉంది. అసహ్యం ఉంది. ఆగ్రహం ఉంది. అపహాస్యం గూడ ఉంది.

'శూర్పణఖా ! నిన్ను పెళ్ళాడితే ఈ సీత నీకు సవతి అవుతుంది. నీ వంటి ఉత్తమస్త్రీలు సవతిపోరు సహించగలరా ! అందుచేత అడుగో, మా తమ్ముడు. లక్ష్మణుడు. బుద్ధిమంతుడు. యౌవనవంతుడు. అందమైనవాడు. ఒంటరివాడు. ఆయనను చేపట్టు సుఖపడతావు' అన్నాడు రాముడు పరిహాసంగా.

శూర్పణఖ అలాగే అని లక్ష్మణుని ఆశ్రయించింది ఆయన సమాధానం ఆయన చెప్పాడు. 'శూర్పణఖా ! నేను రామ సేవకుణ్ణి. నన్ను కట్టుకుంటే నీవు దాసివౌతావు. అందుచేత అన్నగారినే ఆశ్రయించు. నీ అందం ముందు ఆ సీతమ్మ అందమెంత ? ఆయన నిన్నే వరిస్తాడు' అన్నాడు అన్న కంటె హాస్య గర్భితంగా.

ఆ అన్నదమ్ముల పరిహాసం పాపం! ఆ రాక్షసికి అర్థంగాలేదు. సీతను లేకుండా చేస్తే రాముడు తన్ను వరిస్తాడనుకొన్నది. సవతి పోరు శాశ్వతంగా తొలగిపోతుందనుకొన్నది. ఆమెను భక్షించటమే మార్గమనుకొని మీదకు దూకింది.

రాముడు ససంభ్రమంగా 'లక్ష్మణా ! సంస్కార హీనులతో, క్రూరులతో పరిహాసం ప్రమాదకరం. శూర్పణఖ శ్రుతి తప్పింది. వెంటనే ఆమెను విరూపను చెయ్యి' అన్నాడు.

ఒక్క క్షణంలో ఆ రక్కసి ముక్కు చెవులు తెగాయి దాని పర్యవసానం ఖరదూషణాదులతో యుద్ధం. రావణునితో శాశ్వతవైరం. అంతా పరిస్థితుల ప్రభావం.

రాముడు ఖరదూషణాదుల సంహరించాడు. ఆ రాక్షస సంహారం. రామ విజయం, తాపసులకు, దేవతలకు తొలకరి వానలా ఉంది. ఆనందరసావధి అయిన ఆత్మవిజయంలా ఉంది.

హతశేషుడైన అకంపనుడు లంకకు చేరాడు. రామపరాక్రమాన్ని, సీతా సౌందర్యాన్ని, ఖరదూషణాదుల మరణాన్ని రావణునకు విన్నవించాడు. శ్రీరామ

హింసకు సీతాపహరణమే చక్కని మార్గమన్నాడు. అకంపనుని తరువాత శూర్ప ణఖ లంక చేరింది. తనకు జరిగిన అవమానాన్ని, ఖరదూషణ సంహారాన్ని, రామ లక్ష్మణుల పరాక్రమాన్ని సీతాదేవి సౌందర్యాన్ని కన్నులకు కట్టినట్లు అన్నకు వర్ణించి చెప్పింది.

ఫలితం సీతాపహరణం. సీతాపహరణం శ్రీరామునికి పెద్దదెబ్బ. పట్టాభి షేక భంగం కంటె, అరణ్యవాసంకంటె బలమైన దెబ్బ. దుఃఖాతిశయంతో, కోపా తిరేకంలో ఆయన సమతను గూడ కోల్పోయాడు. ఒంటరిగా సీతను వదలి వచ్చి నందుకు కొంతసేపు లక్ష్మణుని మీద తప్పుపట్టాడు. మరికొంతసేపు అన్ని కష్టా లకు కారకురాలైన ఆ కైకమ్మ మీద మండి పడ్డాడు. ఇంక కొంతసేపు పరమ దుర్మార్గులైన ఆ రాక్షసుల మీద పళ్ళుగొరికాడు. కంటికి మంటికి ఏకధారగా ఏడ్చా డు. గొంతెత్తి 'సీతా! సీతా!' అని అరుస్తూ పంచవటి ప్రాంతమంతా తిరిగాడు. సీత ఏమైందో చెప్పమని చెట్టు చెట్టును అడిగాడు. గుట్టగుట్టను అడిగాడు. అగు పించిన ప్రతి మృగాన్ని అడిగాడు. పంచభూతాలనడిగాడు. ప్రస్రవణ పర్వాతాన్ని అడిగాడు. కడకు గోదావరిని గూడ గట్టిగా అడిగాడు.

అయినా ఎవ్వరూ పెదవి కదపలేదు. రావణుడంటే అందరికి అంత భయమేమొ!

సీత ఏమైందో తెలీదు. ఎటుపోయిందో తెలీదు. రామలక్ష్మణులకు దిక్కు తోచలేదు.

అంతలోనే మృగాలు కొన్ని అరుస్తూ, ఆ రాముని వంక, ఆకాశం వంక చూస్తూ దక్షిణ దిక్కుగా పరుగులు తీశాయి. 'అన్నా! ఈ మార్గంలో పోదాం పద' అన్నాడు లక్ష్మణుడు. కొంత దూరం వెళ్ళేసరికి నేల మీద పూలు రాలి ఉన్నాయి. అవి సీతాదేవి ఉదయం సిగలో ధరించినవి. ఆ పూలు అక్కడ ఎందుకు రాలాయో? ఆమె ఎక్కడికి వెళ్ళిందో?

అంతా అయోమయం. అయినా ఆపూలు కన్పించిన మార్గాన్నే రామలక్ష్మ ణులు కొంత దూరం వెళ్ళాక, అక్కడ అడుగుల ముద్రలు కొన్ని అగుపించాయి. అవి సీతాదేవివే. అయితే అవి చెదరి ఉన్నాయి. ఆమె భయపడి పరుగెత్తినట్లుంది. ప్రక్కనే పెద్ద అడుగులున్నాయి. అవి మానవ మాత్రునివి గాదు. ఏదో పెద్ద రాక్షసుడివి

ఎవడా రాక్షసుడు ? ఏమో ! రామలక్ష్మణులు ఇంకా ముందుకు నడిచారు. ఒక విరిగిన ధనుస్సు కన్పించింది ; ప్రక్కనే పగిలిన అమ్ములపొది ; చిరిగిన కవచం; ముక్కలైన రథం; మరణించిన గార్దభాలు. నేల అంతా నెత్తుటి మయం. ఏదో పెద్ద యుద్ధం జరిగినట్లుంది.
ఎవరెవరికో ! ఎందుకో ! రాక్షసుడెవడో సీతను అపహరించి తీసుకుపోగా ఆమె కొరకే ఇరువురు రాక్షసులు యుద్ధం చేసి ఉంటారని, ఇరువురూ కలిసి ఆమెను భక్షించి ఉంటారని రాముడు ఊహించాడు. ఎంతో దుఃఖపడ్డాడు. ఇంత జరుగుతూ ఉంటే ఏ ధర్మమూ అడ్డు పడలేదే ! ఏ దేవతలూ ఆపుకోలేదే ! ఎందుకీ ధర్మం ? ఎందుకీ దేవతలు ? ఎందుకీ మంచి తనం ? ఎందుకీ మృదుత్వం ? అని ఆవేశపడ్డాడు. మంచి తనం వంచనచేత కబళింప బడుతుంటే, మృదుత్వం క్రూరత్వం కాళ్ళ క్రిందబడి నలిగిపోతుంటే–అలా కళ్ళ ప్పగించి చూస్తూ ఉండటమేనా ? ఎందుకీ దేవతలు ? ఎందుకీ పంచభూతాలు ? ఎందుకీలోకాలు ? నా పరాక్రమం చూపిస్తాను. ముల్లోకాలను నా అస్త్రబలంతో నాశనం చేస్తాను. నా సీతకు క్షేమం లేనప్పుడు నాకు సుఖం లేనప్పుడు ఈ లోకం శ్రేయస్సుతో నాకేమి పని ? అని ప్రళయాగ్నిలా విజృంభించాడు. విల్లెక్కుపెట్టి బాణాన్ని సంధించాడు.

మానవస్వభావం మహా విచిత్రమైంది. పట్టాభిషేకం భంగమైనప్పుడు తమ్ముడు విజృంభించి అందుకు కారకులైన వారిని హతమారుస్తానని, అనుకొన్న ముహూర్తా నికే అభిషేకం జరిపిస్తానని అంటే అన్న ఎన్నో ధర్మపన్నాలు వల్లించాడు. అంతా దైవ నిర్ణయం అన్నాడు ఇప్పుడా అన్నే సీతాపహరణానికి అన్ని లోకాలను నిందిస్తున్నాడు. అందరు దేవతలను హతమారుస్తా నంటున్నాడు. ఆవేశపడుతు న్నాడు. సాక్షాత్తు దేవుడే మానవుడైనా–ఆయన మానవుడుగా ఉన్నకాలం లో ఈ మార్పులు, మలుపులు తప్పవేమో !

ఇప్పుడు తమ్ముడే అన్నను అనునయించవలసిన అవసరం ఏర్పడింది. లక్ష్మణుడు 'అన్నా ! కర్మానుభవం తప్ప'దన్నాడు 'కష్టాలు లోకసహజా'లన్నాడు. దైవనిర్ణయందురతి క్రమమన్నాడు. ఇవన్నీ నీవేగదా చెప్పా'వన్నాడు. 'దుఃఖాన్ని త్యజించ'మన్నాడు. 'కర్తవ్యాన్ని ఆలోచించ' మన్నాడు. ఒకరివల్ల జరిగిన అపకారానికి అన్నిలోకాలను నాశనం చెయ్యటం అనుచిత'మన్నాడు. 'అపకారిని

అన్వేషించి వధించటమే అవశ్యకర్తవ్య'మన్నాడు.

జీవితంలో అంత దారుణంగా దెబ్బతగిలినప్పుడు సమతను గోల్పోవటం అసహజంగాదు. అయితే ప్రక్కవారు పరిస్థితులను తెలియచెప్పినప్పుడు, కర్తవ్యాన్ని గుర్తుచేసినప్పుడు కలతదేరి సమతను చక్కదిద్దుకోవటమే గొప్పతనం

రాముడు కలతదేరాడు. ఏమీ తోచక ఆ ధనుస్సును ఆనుకొని నిలబడ్డాడు 'లక్ష్మణా! అయితే ఏం చేద్దాం? ఎటువెళ్ళుదాం?' అన్నాడు ఎంతో నీరసంగా.

దుఃఖం ఎంతశక్తిమంతుణ్ణి అయినా అంతగా పీల్చి వేస్తుందేమో!

'అన్నా! జనస్థానం అంతా వెదుకుదాం' అన్నాడు లక్ష్మణుడు. అన్నదమ్ములిద్దరూ బయలుదేరారు. ఎదురుగా ఒక పర్వతమంతటి పెద్ద ప్రాణి నెత్తుటితో ఉంది. 'అడుగో! రాక్షసు'డన్నాడు రాముడు. అతడే సీతను భక్షించి ఉంటాడన్నాడు. ఆవేశంతో అర్ధచంద్రాకారబాణం వింట సంధించాడు. మహోగ్రంగా అటు వైపు వెళ్ళాడు.

తీరా దగ్గరకు వెళ్ళేసరికి అతడు జటాయువు. 'రామా! ఇంతకు మున్నే నన్ను రాక్షసుడు హతమార్చాడు. శ్రమపడి నీవు మరల చంప నక్కరలేదులే' అని జటాయువు జరిగిన దంతా చెప్పాడు. ప్రాణాలు వదిలాడు.

రాముడు జటాయువును కౌగిలించుకొని పెద్దగా దుఃఖించాడు. స్వహస్తాలతో అతని అంత్యక్రియలు జరిపాడు. జల తర్పణం వదిలాడు. చక్రవర్తి దశరథునికి దక్కని ఆ భాగ్యం పక్షి జటాయువుకు దక్కింది. ఎంత అదృష్టం వానిది.

రామలక్ష్మణులు దండకారణ్యం దాటారు. క్రౌంచారణ్యం ప్రవేశించారు. కబంధుని కౌగిట్లో చిక్కుకొన్నారు. కష్టాలన్నీ కలిసికట్టుగా వస్తాయేమో!

కబంధుడు బాహువులు బిగిస్తున్నాడు. పాపం! లక్ష్మణుడు నలిగి పోతున్నాడు. అన్నను అవలకి పొమ్మంటాడు తమ్ముడు. నీవే అవలికి వెళ్ళు — నేనే ఆహారమౌతా నంటాడు అన్న. కబంధుడు నోరుకూడ తెరిచాడు. అన్నదమ్ములు ఎలాగో బలంపుంజుకొని కబంధుని హస్తాలు ఖడ్గాలతో ఖండించారు.

'రామా! శాపంచేత నా దివ్యజ్ఞానం నశించింది. సూర్యాస్తమయంలోగా నాకు దహన సంస్కారం జరిపించు. సీతాన్వేషణకు ఉపయోగపడే వ్యక్తి సంగతి

చెపుతా' అన్నాడు కబంధుడు.

రాముడు అలాగే అతని దహనసంస్కారం జరిపించాడు. కబంధుడు దివ్య విమానారూఢుడై, దేదీప్యమానంగా ప్రకాశిస్తూ సుగ్రీవుని వృత్తాంతం చెప్పాడు. అతనితో స్నేహం చెయ్యమన్నాడు. ఆ స్నేహం సీతాన్వేషణకు ఎంతో ఉపకరిస్తుందన్నాడు.

రామలక్ష్మణులు కబంధుడు చెప్పినమార్గంలో పడమటి దిక్కుగా వెళ్ళారు. మతంగాశ్రమం దర్శించారు. శబరి ఆతిథ్యం స్వీకరించారు. పంపాతీరం చేరుకున్నారు. తరువాత శ్రీరామ సుగ్రీవ సఖ్యం.

శ్రీరామ సుగ్రీవ సఖ్యం రామాయణంలో ఒక ముఖ్యఘట్టం. ఇరువురు రాజ్యం పోగొట్టుకొన్నవారే. ఇరువురు భార్యా విరహంతో బాధపడేవారే ఇరువురు ఇబ్బందుల్లో ఉన్నవారే ఇరువురు సాయం కొరకు ఎదురు చూచే వారే. ఇరువురు శక్తిసామర్థ్యాలున్నవారే. ఇరువురు కలిస్తే ఎన్నో ఘనకార్యాలు సాధించవచ్చు. అయితే అటు కొండకొన మీద సుగ్రీవుడు ఇటు కొలను గట్టున శ్రీరాముడు. ఇద్దరికి సఖ్యం ఏర్పడటం ఎలాగ?

అందుకే హనుమ దూత్యం. రాముని గుణగణాలు చూచి హనుమ పరవశించాడు. హనుమ శక్తిసామర్థ్యాలు చూచి రాముడు పులకించాడు.

హనుమ దూత్యంతో రామసుగ్రీవులు మిత్రులయ్యారు. ఎక్కడున్నా, సీతను వెదకి తెస్తానన్నాడు సుగ్రీవుడు. వాలిని చంపి వానరరాజ్యానికి నిన్ను రాజును చేస్తానన్నాడు రాముడు.

అయితే వాలిని చంపటం అంత సులభంగాదు. అదే సుగ్రీవుని అనుమానం అందుచేతనే కాలిబొటన వ్రేలితో దుందుభి కళేబరాన్ని దూరంగా తన్ని, ఒకే బాణంతో ఏడు సాలవృక్షాలను ఏకంగా పడగొట్టి - శ్రీరాముడు తనశక్తి సామర్థ్యాలను సుగ్రీవునికి చూపెట్టాడు. అతని హృదయాన్నిపూర్తిగా వశం చేసుకొన్నాడు. అగ్నిసాక్షిగా అతనితో మైత్రి కుదుర్చుకొన్నాడుచేసిన ప్రతిజ్ఞ మేరకు ఎలాగో వాలిని సంహరించాడు. సుగ్రీవుణ్ణి కిష్కింధకురాజుగా చేశాడు. అంగదుణ్ణి ఆ రాజ్యానికి యువరాజుగా నియమించాడు.

అంతలోనే వర్షాకాలం వచ్చింది.

వర్షాకాలం సీతాన్వేషణకు, యుద్ధనిర్వహణకు అననుకూలం. అందుచేత

శరత్కాలం రాగానే సీతాన్వేషణ సాగించాలని, యుద్ధ ప్రయత్నం చెయ్యాలని రామసుగ్రీవులు అనుకొన్నారు. అంత దాకా కిష్కింధలోనే ఉండమన్నాడు సుగ్రీవుడు. అరణ్యవాసం అయి పోయేదాకా అటు పల్లెలోగాని, ఇటు పట్నంలోగాని అడుగు పెట్టనన్నాడు రాముడు.

రామలక్ష్మణులు ప్రస్రవణ పర్వతం మీదికి వెళ్ళారు. తారారుమలతో కలిసి సుగ్రీవుడు కిష్కింధలో కామభోగాలనుభవించాడు. ఆ వర్షరుతువులో సీతా విరహంతో శ్రీరాముడు చాల బాధపడ్డాడు. తమ్ముని ఓదార్పుతో ఒకింత కలత దేరాడు.

శరత్కాలం వచ్చింది. అయినా సుగ్రీవుడు రాలేదు. మిత్రకార్యం మరచాడో! లేక అహంకారంతో అలక్ష్యంచేశాడో! లేక కృతఘ్నుడుగా మారి పోయాడో! కాలం గడిచిపోతూ ఉంది. కావలసిన పని ఎంతో ఉంది. ఊరకుంటే ఎలాగు?

సుగ్రీవుని సంగతి మొదట తేల్చుకోవాలి. అందుకే రాముడు లక్ష్మణుని పంపాడు. 'చెప్పిన ప్రకారం చేస్తావా? చచ్చి వాలిని కలుసు కుంటావా? ఏ సంగతి తేల్చిచెప్పు' అని సుగ్రీవుణ్ణి అడగమన్నాడు.

ఆగ్రహావేశ పరుడైన లక్ష్మణుడు సుగ్రీవుని అంతుతేలుస్తానంటూ కిష్కింధ వెళ్ళాడు. అతని ఆగ్రహావేశం చూచి ఆనాడు సుగ్రీవుడే కాదు కిష్కింధమొత్తం గడగడలాడిపోయింది. తారే అడ్డు పడకుంటే ఆనాడు లక్ష్మణుడు ఏం చేసే వాడో!

సుగ్రీవుడు వెంటనే వానరులంతా సమీకరించాడు. చేతులు మోడ్చి శ్రీరాముని యెదుట నిలిచాడు. శ్రీరాముడా స్నేహితుని గాఢంగా కౌగిలించుకొన్నాడు అతని కృతజ్ఞతను, కార్యనిష్ఠతను కొనియాడాడు. సుగ్రీవ లక్ష్మణులతో గుహ లోపలినుండి వెలుపలికి వచ్చేసరికి ఎదుట వానరసేన - ఒక మహా సముద్రంలా ఉన్న వానరసేన.

రాముడు ఆశ్చర్యంగా చూచాడు. ఆనందంగా తల ఆడించాడు. మరోసారి గాఢంగా సుగ్రీవుణ్ణి కౌగిలించు కొన్నాడు.

శిరస్సు వంచి సుగ్రీవుడు 'స్వామీ! ఆజ్ఞాపించండి' అన్నాడు.

'సుగ్రీవా ! నీవు కార్యనిపుణుడవు. వానరవీరుల శక్తిసామర్థ్యాలు తెలిసిన వాడవు. సీతాన్వేషణకు ఎవరిని ఎటు పంపాలో నీవే నిర్ణయించు. ఆమె ఉనికి తెలిస్తే ఆపై కార్యం ఇరువురము నిర్ణయిద్దాము' అన్నాడు శ్రీరాముడు

వినతుని నాయకత్వంలో ఏకపెద్దసేన తూర్పుదిశగా బయలు దేరింది.

అంగదుని నాయకత్వంలో మరోసేన దక్షిణ దిశగా బయలు దేరింది.

సుషేణుని నాయకత్వంలో ఇంకోసేన పశ్చిమ దిశగా బయలుదేరింది.

శతవలి నాయకత్వంలో వేరొకసేన ఉత్తర దిశగా బయలు దేరింది.

సీతాన్వేషణ పూర్తిచేసుకొని అంతా ఒక మాసం దాటకుండా మరలి రావాలని ఆజ్ఞాపించాడు సుగ్రీవుడు. ఆ గడువు దాటితే మరణదండన తప్పదన్నాడు.

అంగదుని నాయకత్వంలో హనుమ ఉన్నాడు. అందరి యెదుట సుగ్రీవుడు ఆ హనుమను కొనియాడాడు. 'హనుమా ! సీతాన్వేషణ నీ వల్లనే సఫలం కావా లన్నాడు. శ్రీరామచంద్రుడు దివ్యమందహాసంతో ముందుకు అడుగువేశాడు. హనుమ దగ్గరికివచ్చి అంగుళీయకం తీసి ఆయన చేతికిచ్చాడు. ఆనవాలుగా సీత కిమ్మన్నాడు. హనుమ ఆ అంగుళీయకాన్ని కళ్ళ కద్దుకొన్నాడు. రామపాదాలకు ప్రణమిల్లాడు. అందరితో కలిసి ఆకాశాని కెగిరాడు.

మాసం ఒరిగే లోగానే వానరులంతా వచ్చారు. సీత అగుపించలేదని చెప్పారు. అయితే అంగద హనుమాదులు మాత్రం ఇంకా రాలేదు. ఎందుచేతనో ఏమో ! చివరకు సీతను చూచానని హనుమ శుభవార్త తెచ్చాడు. ఆమె ఇచ్చిన చూడామణిని రామునిచేతి కందించాడు.

రామునికి అందని ఆకాశం అందినట్లుంది. పోయిన సంపదను పొందిన ట్లుంది. చూడని వెలుగును చూచి నట్లుంది. ఆయన చూడామణిని హృదయానికి హత్తుకొన్నాడు. దాని చరిత్రను గుర్తు చేసుకొన్నాడు. పెళ్ళినాటి ముచ్చట్లు తల పోసుకొన్నాడు. సీత ఎలా ఉందని, ఏమందని పదేపదే అడిగి చెప్పించుకొన్నాడు హనుమను కౌగిలించుకొన్నాడు.

సముద్రాన్ని దాటటమే పెద్ద సమస్య. తపస్సు చేసి లేదా సేతువును నిర్మించి లేదా నీటిని ఇంకించి సముద్రాన్ని దాటాలని రాముడు నిర్ణయించాడు. లంకాపుర నిర్మాణాన్ని గూర్చి, అందలి దుర్గప్రాకారాది విశేషాలను గుర్చి వివరంగా హను

మను అడిగి తెలుసుకొన్నాడు. తక్షణం యుద్ధానికి బయలు దేరాలని నిర్ణయించాడు.

అది ఉత్తర ఫల్గునీ నక్షత్రం. సాధనకార అభిజిన్ముహూర్తం. అందుకుదోడు అనేక శుభశకునాలు.

వానరసేన సాగిపోవలసిన విధానం గూడ రాముడు నిర్ణయించాడు. సేనా నాయకుడు నీలుడు లక్షసేనతో ముందు బయలు దేరాలి. రాక్షసులు మార్గమధ్యంలో ఫలవృక్షాలను, జలాశయాలను చెడగొట్టకుండా చూడాలి. చాటుమాటున దాగి వానర సేనకు చెరుపు చేయకుండా చూడాలి, తరువాత వానరసేన ఆ వానరసేనకు రక్షగా కుడి ప్రక్కన ఋషభుడు. ఎడమ ప్రక్కన గంధమాదనుడు. సైన్యం మధ్యంలో హనుమ నారోహించి శ్రీరాముడు. అంగదుని అధిరోహించి లక్ష్మణుడు. సైన్యానికి వెనుక భాగంలో జాంబవంతుడు; సుషేణుడు, వేగదర్శి ఇది వ్యూహం. ఏ వైపు నుండీ వానరసేనకు ప్రమాదం రాకూడదు. అందరు అప్రమత్తంగా ఉండాలి. అతివేగంగా ముందుకు సాగాలి.

సుగ్రీవుడు వానరసైన్యాన్నంతా ఒకసారి కలయ జూచాడు. కదలండని ఆజ్ఞాపించాడు

ఉత్సాహ తరంగాలతో ఒక మహాసముద్రంలా వానరసేన ముందుకు సాగింది. వాయువు హాయిగా వీచింది. మృగాలు, పక్షులు మనోహరంగా అరిచాయి.

అన్నీ శుభశకునాలే. వానరసేన సముద్ర తీరాన్ని చేరింది. సముద్రం ప్రక్క మరో సముద్రంలా నిలిచింది.

నీలుడు సేననంతా శాస్త్రోక్తంగా స్కంధావారాలుగా తీర్చాడు.

ఇక సముద్రం దాటటమే సమస్య.

ఆ సమయంలో ఆయుధగుప్త రాక్షసులు ఆకాశంలో అగుపించారు— విభీషణుడు. అతని అనుచరులు. వెంటనే సుగ్రీవుడు రాముని దగ్గరకి వెళ్ళాడు. విభీష ణుని వృత్తాంతం విని రామునితో చెప్పాడు అతనికి ఆశ్రయం ఇవ్వవద్దని గూడ సలహా ఇచ్చాడు.

అయినా రాముడు తనకు తానై ఏదీ నిర్ణయించలేదు. ఆయన ప్రముఖ వానల నందరా పిలిచాడు. ఒక్కొక్కరి అభిప్రాయం అడిగాడు. అందరూ విభీషణుని వద్దన్న వారే. కొందరితనిని కొట్టిచంపమన్నారు గూడ. అయితే ఆంజనేయుడు మాత్రం

అందరికంటె భిన్నంగా మాట్లాడాడు. ముందు మాట్లాడిన వారి అభిప్రాయాలను మృదువుగా త్రోసిపుచ్చాడు. సహేతుకంగా విభీషణుని చేర్చుకొమ్మని సలహా ఇచ్చాడు.

ఆంజనేయుని అభిప్రాయం ఆ రామచంద్రుని ఆకర్షించింది. ఆయన వానర ప్రముఖులనంతా ఒక్కసారి కలయచూచాడు. 'సాక్షాత్తు శత్రువేవచ్చి శరణు వేడినా అభయ మివ్వటం నా ఆదర్శం. విభీషణుడగాదు — రావణుడు వచ్చినా తోడ్కొని రండి' అన్నాడు.

ఆ మాటకు వానరులంతా ఆశ్చర్య పోయారు. సుగ్రీవుడు వెళ్ళి విభీషణుని తోడ్తెచ్చాడు విభీషణుడు రామపాదాల మీద వ్రాలాడు. రాముడు సాదరంగా చేర దీసి అభయ హస్తమిచ్చాడు.

రావణుని ఆయుష్షుపట్టు రాముని చేతికి చిక్కినట్లయింది.

రాముడు విభీషణుని అడిగి వివిధ రాక్షసుల బలాబలాలు తెలుసుకొన్నాడు. రావణుని వధించి అతనిని లంకారాజ్యానికి అభిషిక్తుణ్ణి చేస్తానన్నాడు. ఆశాపాశంతో ఆ శత్రుభ్రాత మనస్సును గట్టిగా తన పక్షానికి కట్టివేసుకొన్నాడు.

అయితే సముద్రం దాటే సమస్య అలాగే ఉంది.

విభీషణుని సలహా మేరకు రాముడు సముద్రతీరంలో దర్భలు పరచుకొని సముద్రు నారాధించాడు. మూడు రోజులు గడచినా సముద్రుడు సాక్షాత్కరించలేదు. రాముడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. మంచితనాన్ని లోకులు అసమర్థతగానే ఎంచు తారన్నాడు. దండించే వానినే లోకం గౌరవిస్తుందన్నాడు. కోదండాన్ని చేత బట్టి కొన్ని బాణాలు ప్రయోగించాడు. అయినా సముద్రుడు సాక్షాత్కరించలేదు.

కడకు బ్రహ్మాస్త్రాన్ని అభిమంత్రించి వింట సంధించేసరికి సముద్రుడు చేతులు కట్టుకొని రాముని సమక్షాన నిలిచాడు. సేతుబంధనానికి, వానరసేన దాటడా నికి తగువిధంగా తోడ్పడతానన్నాడు.

మరి ఎక్కుపెట్టిన బ్రహ్మాస్త్రం ఏం కావాలి ?

'రామా! ద్రుమకుల్య ప్రాంతంలో దొంగలున్నారు. వాళ్ళ మీద ప్రయో గించు' అని ప్రార్థించాడు సముద్రుడు.

రామ బాణంతో ఆ ద్రుమకుల్యమంతా మరుకాంతారంగా మారిపోయింది.

సముద్రుడే సేతునిర్మాణానికి నలుని పేరు సూచించాడు.

సముద్రంలో రాళ్ళు పడ్డాయి.

లంకలో రాక్షసుల గుండెల్లో గూడ రాళ్ళు పడ్డాయి. వానరసేన సముద్రం దాటింది సింహనాదం చేసింది.

రాముడు ఒక్కసారి లంకాపురిసంతా చూచాడు. వానరసైన్యాన్నంతా వ్యూహాలుగా తీర్చాడు.

ఆ సమయంలో రహస్యాలు సేకరించటానికి వానర సైన్యంలో ప్రవేశించిన శుకసారణులను విభీషణుడు పట్టి తెచ్చాడు. 'రామా! వీరు రావణచారులు. వానర రూపంలో వచ్చారు. హతమార్చం'డని అన్నాడు.

అందుకు రాముడు చిరునవ్వు నవ్వి శుకసారణులవైపు చూచి 'విభీషణుడు మీకు మా సైన్యాన్నంతా చూపిస్తాడు. తొందరలేదు. నిదానంగా చూడండి. స్వేచ్ఛగా లంకకు వెళ్ళండి రేపు ప్రాతఃకాలాన్నే లంకను ముట్టడిస్తామని మీ రావణునికి చెప్పండి' అన్నాడు.

శుకసారణులు ఇంకా వణుకుతూనే ఉన్నారు. 'భయపడకండి. నిరాయుధులను, దూతలను మేము వధించం' అనగానే ఆ రాముని ఆత్మవిశ్వాసానికి, ఆయన ధార్మిక తత్వానికి ఆ రాక్షసులు అంజలి ఘటించారు. బ్రతుకు జీవుడా అని పరుగెత్తి పోయారు.

శార్దూలుని నాయకత్వంలో మరొకచారుల బృందం వచ్చింది. వాళ్ళను గూడ విభీషణుడు పట్టి యిచ్చాడు. అప్పుడు గూడ ఆ శ్రీరాముడు అదే వైఖరిని ప్రదర్శించాడు మీదబడి వాళ్ళను చంపబోయే వానరులను గూడ వారించాడు మహోదాత్తంగా వ్యవహరించాడు.

ఇంతలో విభీషణుని అనుచరులు లంకలో ప్రవేశించి, రావణుని సేనా వ్యూహరహస్యాలన్నీ సేకరించారు. ఆ సమాచారాన్ని బట్టి రాముడు వానరసేనను విభజించాడు నీలుని నాయకత్వంలో ఒక పెద్దసేన లంక ప్రాగ్ద్వారంలో ప్రహస్తుని తాకాలన్నాడు. అంగదుని నాయకత్వంలో ఒక గొప్పసేన దక్షిణద్వారంలో మహోదర మహాపార్శ్వులను ఎదుర్కొవాలన్నాడు వాయుపుత్రుని నాయకత్వంలో ఒకసేన పశ్చిమ ద్వారంలో ఇంద్రజిత్తు మీద విజృంభించాలన్నాడు తాను, లక్ష్మ

ణుడు రావణుడున్న ఉత్తరద్వారం ముట్టడిస్తామన్నాడు. సుగ్రీవ జాంబవద్విభీష ణులు లంకమధ్యలో విరూపాక్షుని మీద విజృంభించాలన్నాడు. అంత వానరసేన లో నీలాంగద హనుమ విభీషణులు, రామలక్ష్మణులు తప్ప తక్కిన వాళ్ళంతా వానర రూపంలోనే ఉండాలన్నాడు.

ఆ దశలోగూడ శ్రీరాముడు సంధి ప్రయత్నం మానలేదు. అంగదుని రాయబారిగా పంపాడు. సీత నిచ్చి శరణువేడమని, లేకుంటే సర్వనాశనం తప్ప దని రావణుని హెచ్చరించాడు.

అంగద రాయబారం విఫలమైంది. యుద్ధం ఆరంభమైంది. వృక్షాలతో, పర్వతశిఖరాలతో, దంతాలతో, నఖాలతో, వానరులు రాక్షసులను బాధించారు. భిండివాల ఖడ్గశూల తోమరాద్యాయుధాలతో రాక్షసులు వానరుల మీదికి విజృంభిం చారు.

అది మహా యుద్ధం. మానవజాతి మరువలేని యుద్ధం.

ఇంద్రజిత్తు మాయాయుద్ధంలో ప్రయోగించిన బాణాలు రామలక్ష్మణులు నాగపాశబద్ధుల గావించాయి. నేలమీద బడి మూర్ఛిల్లేటట్లు చేశాయి. రామునికి ముందుగా స్పృహ వచ్చింది. ఆయన తమ్ముని స్థితికి అమితంగా దుఃఖించాడు. అతడు చేసిన సేవలను స్మరించాడు. అతని గుణగణాలను ప్రస్తావించాడు. ఎంతో విషాదాన్ని అనుభవించాడు. తరువాత తన్ను, తమ్ముని నాగపాశ విముక్తుల గావించిన అగరుత్మంతుని కృతజ్ఞతా పూర్వకంగా ప్రశంసించాడు. వానర వీరుల ఉత్సాహాన్ని ఒక్కసారిగ పునరుద్ధరించాడు.

అది రాక్షసేశ్వరుడు రావణుడు స్వయంగా యుద్ధానికి వచ్చినరోజు. ధూమ్రాక్ష వజ్రదంష్ట్ర అకంపన ప్రముఖులు హతులుకాగా, ఆగ్రహోదగ్రుడై అగ్నిహోత్రంలాంటి రథాన్ని అధిరోహించి, కళ్ళు మిరుమిట్లుగొలిపే కిరీట కాంతులతో, విశాల ఫాలభాగాన విరాజిల్లే విభూతిరేఖలతో, మహోజ్వల కాంతులు వెదజల్లే మణికుండలాలతో, దేదీప్యమానంగా ప్రకాశించే దానవేంద్రుడు తొలిసారి యుద్ధానికి వచ్చినరోజు. చూచీ చూడగానే 'అహో ! దీప్తో మహారాజా రావణో రాక్షసేశ్వరః' అని ఆ రాముని సహృదయత రావణుని దీప్తిని మనసార మెచ్చు కొనింది. ఆయన దార్శనికత ఆ శత్రుపరాక్రమాన్ని దర్శించింది. త్రిలోకపతి

రావణుని మీదికి వెళ్ళే తమ్ముని హెచ్చరించింది.

రావణుని వీర విజృంభణానికి వానరసేన అంతా చెల్లా చెదరై పోయింది. అది చూచి రాముడే అతనితో యుద్ధానికి పూనుకొన్నాడు వెంటనే హనుమ ముందుకు వచ్చి 'స్వామీ ! రథస్థుడైన రావణునితో నన్నధిరోహించి యుద్ధం చెయ్యండని మూపు వంచాడు.

రథం మీద రావణుడు. హనుమ మీద రాముడు. అది రామరావణ ద్వంద్వయుద్ధం. రావణుడు తీవ్ర బాణాలతో హనుమ శరీరం తూట్లు పడేటట్లు గొట్టాడు. అది చూచి రాముడు ఆగ్రహోదగ్రుడై అంతకంత విజృంభించాడు. రాక్షససేన మీద శరవర్షం కురిపించాడు రావణుని రథచక్రాలు ముక్కలు చేశాడు. అశ్వాలను హతమార్చాడు. సారథిని చంపివేశాడు. ధనుస్సును త్రుంచివేశాడు. ఆ రాక్షస రాజు వక్షస్థలంలో వజ్రాయుధం లాంటి బాణం నాటాడు ఆ దెబ్బతో రావణుడు చతికిలబడ్డాడు అర్ధచంద్రాకార బాణంతో అతని కిరీటాన్ని గూడ రాముడు అవల పడగొట్టాడు.

రావణుడు అలసిపోయాడు. చెమటతో తడిసి పోయాడు. దుసలు కొడుతూ కదలలేనిస్థితిలో పడిపోయాడు.

అప్పుడు రాముడు రావణుని సమీపించి, సూటిగా అతని ముఖంలోకి చూచి 'రావణా ! మహాభయంకరంగా యుద్ధం చేశావు. మేటివీరులనంతా ముప్పు తిప్పలుపెట్టి మూడు చెరువుల నీరు త్రావించావు. పాపం ! అలసినట్లున్నావు. ఇప్పుడు నిన్ను చంపను. రాక్షసరాజా ! లంకకు వెళ్ళు, విశ్రాంతితీసుకో. ఇంకో రథం అధిరోహించు. సర్వసన్నద్ధుడవై రేపు యుద్ధానికి రా అప్పుడు నా బలం చూపిస్తా' అనేసరికి ఆ రాముని ఔదార్యాన్ని, ధార్మిక స్వభావాన్ని, తనకు కలిగిన పరాభవాన్ని చూచి దశగ్రీవుడు తలవంచుకొన్నాడు ఎలాగో పొందలేచి యుద్ధభూమినుంచి లంకకి వెళ్ళాడు. లంకచేరి కుంభకర్ణుని నిద్రలేపి యుద్ధానికి పంపాడు.

శ్రీరాముడు కుంభకర్ణుని శిరస్సు ఖండించాడు.

శ్రీరాముడు నరాంతకుని వక్షస్థలం చీల్చాడు

మరలి ఇంద్రజిత్తు మాయాతిమిరాన్ని కల్పించి, వానరసైన్యాన్ని, రామ లక్ష్మణులను క్షతగాత్రులను గావించాడు. అప్పుడు లక్ష్మణుడు ఆగ్రహావేశపరుడై

వింట బ్రహ్మాస్త్రాన్ని సంధించి సమస్త రాక్షసలోకాన్ని సంహరిస్తానని విజృంభించాడు. సమయోచితంగా రాముడు అతని ప్రయత్నాన్ని వారించాడు. ఒకవ్యక్తికారణంగా జాతినంతా నాశం చెయ్యటం ధర్మం కాదన్నాడు.

యుద్ధరంగంలో ఇంద్రజిత్తు మాయాసీతను కల్పించి అందరియెదుట వధించాడు. అది చూచి రాముడు ఇక తన జీవితమే వ్యర్థమని మూర్ఛపోయాడు. విభీషణుడు వచ్చి చెప్పేదాకా ఆమె మాయాసీత అని రామునికి తెలీదు. రామునికే గాదు. వానరసేనలో ఎవ్వరికీ తెలీదు. చివరకు వాయుపుత్రునికి గూడ తెలీదు. 'ఈ సీతాసంహార సన్నివేశంతో శత్రుపక్షాన్నంతా దుఃఖసాగరంలో ముంచి, తగిన వ్యవధి గడించి, నికుంభిల హోమం పూర్తి చెయ్యటానికే ఇంద్రజిత్తు పోయాడని, ఆ హోమం పూర్తి అయితే అతనిని సంహరించటం అసాధ్యమని, అందుచేత వెంటనే దానికి విఘ్నం కలిగించా' అని విభీషణుడు సలహా చెప్పాడు. తక్షణం రాముడు తమ్ముణ్ణి ఆపనికి నియోగించాడు

లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించి వచ్చిన తమ్ముణ్ణి అన్న గాఢంగా కౌగిలించుకొన్నాడు. శిరస్సు మూర్కొన్నాడు. శరీరమంతా తడివి అతనికి తగిలిన గాయాలను చూచి బాధ పడ్డాడు. తమ్ముని పరాక్రమాన్ని అతని సాహసాన్ని అనేక విధాల ప్రశంసించాడు. ఇక మనకు విజయం లభించినట్లే అని ఉప్పొంగిపోయాడు. సుషేణుని పిలిచి అతని గాయాలకు చికిత్స చేయించాడు.

ఇంద్రజిత్తు మరణంతో రావణుడు ఇంకా బలహీనుడయ్యాడు. కాని దెబ్బ తిన్న త్రాచులా విజృంభించాడు. తానే యుద్ధానికి వెళ్ళాలని నిశ్చయించాడు, అయినా అశేష రాక్షససైన్యాన్ని ముందుగా ఆ రాముని మీదికి పంపించాడు.

రాక్షసులు భయంకరంగా యుద్ధం చేశారు. వారి దెబ్బకు తాళలేక వానరులంతా రాముని శరణు వేడారు. రాముడు పెనుతుపానులా విజృంభించాడు. ప్రళయాగ్నిలా విజృంభించాడు. తెగేతలలు, విరిగే రథాలు, తునిగే ఆయుధాలు ముక్కలయ్యే శరీరాలు రాక్షసపక్షంలో అగుపిస్తున్నాయేగాని ఆ రాముడు అగుపించటం లేదు. ఆయన ఎక్కడున్నాడో! ఆయన బాణాలు ఎటునుండి వస్తున్నాయో! ప్రతిరాక్షసునికి రాముడు అగుపిస్తూనే ఉన్నాడట. అయినా ఎవ్వరికి అగుపించటం లేదట. ఆయన గమనవేగం అలా ఉంది. ప్రతిరాక్షసుని గుండెలో రామబాణం దూసుకు పోతూనే ఉందట. అయినా అది ఎటు వస్తున్నదో ఎవ్వరికీ తెలియటం

కూలిపోయింది. ప్రళయాగ్ని సోకిన పట్టణంలా భస్మమై పోయింది. లంక అంతా భయాందోళనలతో కంపించిపోయింది. రోదన ధ్వనులతో క్రుంగి పోయింది.

రావణుడు మహోగ్రుడయ్యాడు. మహోదర మహాపార్శ్వ విరూపాక్షులతో, మిగిలిన మూలబలంతో తానే యుద్ధానికి బయలుదేరాడు. వాడి శరాలతో వానరసేనను చీల్చి చెండాడు. అప్పుడు సుగ్రీవుడు విజృంభించాడు. నొసట పొడిచి విరూపాక్షుని నేల పడగొట్టాడు. ఖడ్గంతో మహోదరుడి తల నరికాడు. అంగదుడు మహాపార్శ్వుణ్ణి మట్టుపెట్టాడు. ఆ ముగ్గురు వీరులు మరణించటంతో రావణుడు మరీ రెచ్చిపోయాడు. తామసాస్త్రం ప్రయోగించి వానరులనంతా తరుమగొట్టి ఏకాయెకి రామలక్ష్మణుల మీదికే వెళ్ళాడు.

అది రామ రావణ యుద్ధం. రాముడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. రావణుడు ఆసురాస్త్రం వేశాడు. రాముడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. రావణుడు రౌద్రాస్త్రం వదిలాడు రాముడు గంధర్వాస్త్రం వేశాడు. రావణుడు సౌరాస్త్రం ప్రయోగించాడు. రాముడు శరవర్షంతో రావణుని ముంచాడు. లక్ష్మణవిభీషణులు గూడ రావణుని మీదికి విజృంభించారు. తన్ను పరిత్యజించి, తన శత్రువును ఆశ్రయించి తన మీదికే బాణాలు ప్రయోగించే తమ్ముణ్ణి చూచేసరికి రావణుని కడుపు మండి పోయింది. పట్టరాని కోపంతో విభీషణుని మీద మహాశక్తిని ప్రయోగించాడు. విభీషణునికి అడ్డంగా లక్ష్మణుడు తను ఎదినొడ్డాడు. శ్రీరాముడు సత్వరుడై లక్ష్మణుని మీదికి వచ్చే ఆ మహాశక్తిని సంబోధించి 'లక్ష్మణునకు శుభమగుగాక - నా తమ్ముని వధించే నీ ప్రయత్నం వ్యర్థమగుగాక !' అన్నాడు.

శక్తి ద్రేటుకు లక్ష్మణుడు పడిపోయాడు. రాముడు ఆ శక్తిని పట్టి రెండు చేతులతో విరిచాడు

శక్తిని విరిచే సమయంలో శ్రీరాముని మీద రావణుడు శరవర్షం కురిపించాడు. రాముడు లక్ష్మణుని సుగ్రీవ హనుమంతులకు అప్పగించి. ఆగ్రహావేశంతో విజృంభించి 'ఇక లోకంలో రాముడో ! రావణుడో ! మిగిలిపోవాలి' అని ప్రతిజ్ఞ చేశాడు. [illegible] ప్రయోగించాడు. ఆ శరసేనాన్ని రాముడు సహించలేక పెనుగాలికి [illegible] మేఘంలా [illegible] తొలగివెళ్ళాడట.

నెత్తుటి మురవలో నేలమీద పడి ఉన్న లక్ష్మణుని చూచేసరికి రాముని దుఃఖం కట్టలు త్రెంచుకొని పైకి పొంగింది. సోదరప్రేమ ఆయన హృదయాన్ని బలంగా ఆవరించుకొంది. లక్ష్మణునికే ప్రాణహాయం ఏర్పడితే ఇంకేమైనా ఉందా! అందుకే రాముడు వానరులందరితో ఈ యుద్ధం ఎందుకన్నాడు. సీత యెందుకన్నాడు. 'కావాలంటే ఏదేశంలోనైనా భార్యలు దొరుకుతారు కాని తోబుట్టువు దొరకడు గదా' అని దుఃఖించాడు. అంతటి మహావీరుడు మానసికంగా చలికిల బడ్డాడు.

సంజీవని ప్రభావంతో సౌమిత్రి లేచి కూర్చునేదాకా మళ్ళీ తనతో మాట్లాడే దాకా రాముని మనస్సు మనస్సులో లేదు. తమ్ముడు లేచి, 'అన్నా' ! అని సంబో ధించి 'రావణుని వధించి నీ ప్రతిజ్ఞ సార్థకం చేసుకో' అనగానే రాముడు ఆంతకంత ఉత్సాహంతో రావణుని మీద విజృంభించాడు. రావణుడు గూడ మరో రథం అధిరో హించి రాముని మీదికి వచ్చాడు. రథస్థుడైన రావణునితో భూమిస్థుడైన రాముడు పోరటం చూచి దేవేంద్రుడు తన రథం పంపాడు. అదిచూచి రావణుడు మరీ ఉగ్రుడయ్యాడు.

అది రామ రావణుల ముగింపు యుద్ధం మహాయుద్ధం. అద్వితీయం; అమోఘం; అసదృశం. ఆకాశానికి సమానం ఆకాశమే. సముద్రానికి సమానం సముద్రమే. ఆ రామరావణ యుద్ధానికి సమానం ఆ రామ రావణ యుద్ధమే. అది పగలు సాగింది. రాత్రి సాగింది. ఏ మాత్రం విశ్రాంతి లేకుండా సాగింది. రావణుడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. రాముడు గారుడాస్త్రంతో దాన్ని త్రిప్పి కొట్టాడు. రావణుడు మహాశూలాన్ని విసిరాడు. రాముడు మహాశక్తితో దాన్ని ముక్కలు చేశాడు. భయంకర బాణంతో రాముడు రావణుని శిరస్సు నరికాడు. అది మరల మొలిచింది. రాముడు మరల నరికాడు ఆది మరల మొలిచింది రాముడు నూటొ క్కసార్లు విరామం లేకుండా నరికాడు. అది నూటొక్కసార్లు వ్యవధానం లేకుండా మొలిచింది రావణుడు వికటాట్టహాసం చేశాడు.

రామునికి ఏమి తోచలేదు. యుద్ధం సాగుతూనే ఉంది. మాతలి శ్రీరామా ! రావణునికి అవసాన సమయం సమీపించింది. బ్రహ్మాస్త్రం ప్రయోగించు అన్నాడు. రాముడు అగస్త్యప్రోక్త ఆదిత్య హృదయాన్ని ముమ్మారు జపించి బ్రహ్మాస్త్రాన్ని వింట సంధించి, తన బలాన్నంతా ఘనీభవించి' ఆకర్ణాంతంలాగి ఆ రావణుని

మీద ప్రయోగించాడు. బ్రహ్మాస్త్రం రావణుని రొమ్ము చీల్చింది. అతడు మహా పర్వతంలా పడి మరణించాడు.

రాముడు నిట్టూర్పు విడిచాడు. వానరులు గంతులు వేశారు. సింహనాదాలు చేశారు. రాక్షసులు ఎలుగెత్తి ఏడ్చారు. భయపడి పరుగెత్తారు.

అది రాముని జీవితం చరితార్థమైన రోజు. రావణుని జీవితం ముగిసిన రోజు. సీతాదేవి చెర తొలగిన రోజు. సాధుజనులంతా సంతోషంతో ఊపిరి పీల్చిన రోజు.

రాముడు నిశ్చేష్టుడై నేల మీద బడ్డ రావణుని అట్టే చూస్తూ నిలబడ్డాడు. తమ్ముడు లక్ష్మణుడు, ప్రముఖ వానరులు రాముని ప్రక్క చేరారు. అంతా కళ్ళప్పగించి ఆ రావణ కళేబరాన్నే చూస్తూన్నారు. ముందు వైపు విభీషణుడు దుఃఖిస్తూ నిలబడ్డాడు. మండోదరి భర్త కళేబరం మీద పడి విలపిస్తూ ఉంది. అంతఃపురకాంతలంతా అన్నివైపుల రోదిస్తూన్నారు. అదొక భయంతర భీభత్స విషాదవాతావరణం.

విభీషణుడు రాముని వైపు తిరిగి 'స్వామీ! రావణుడు ఆహితాగ్ని, మహా తపస్సంపన్నుడు, వేదాధ్యయన తత్పరుడు ఆయన అంత్యక్రియలు నిర్వర్తించటానికి అనుమతి ఇవ్వండి' అని ప్రార్థించాడు

రాముడు ఒక అడుగు ముందుకు వేసి. ప్రసన్నవదనంతో, ప్రశాంతస్వరంతో విభీషణా! వైరం మరణంతోనే అంతమౌతుంది. ఆ తరువాత అది అనవసరం. ఇప్పుడు రావణుడు నీకెంతో నాకూ, అంతే. శాస్త్రోక్తంగా అతని అంత్యక్రియలు జరిపించు' అన్నాడు.

రావణుని అంత్యక్రియలు జరిగాయి.

విభీషణుడు లంకాభిషిక్తుడయ్యాడు.

అప్పుడు రాముడు హనుమవైపు తిరిగి విభీషణుని అనుమతితో నీవు లంక ప్రవేశించు. సీతకు నా విజయవార్త వినిపించు ఆమె సందేశం మాకు అందించు' అనేసరికి ఆ వానరేంద్రుడు వెంటనే వెళ్ళాడు. త్వరగా తిరిగి వచ్చి స్వామీ! సీతమ్మ మిమ్మల్ని చూడాలంటున్నారు' అన్నాడు వినయంగా.

ఎంతో ఎంతో ఆనందించ వలసిన ఆ రామచంద్రుడు కంట తడి పెట్టాడు. చిరునవ్వు నవ్వ వలసిన ఆ శ్రీ రామచంద్రుడు వేడి నిటూర్పు విడిచాడు.

విభీషణుని వైపు తిరిగాడు. 'సీతను శిరస్స్నానంచేసి సాలంకృతగా రమ్మను. అం
దుకు అవసరమైన ఏర్పాట్లు చూడు' అన్నాడు.

అది శ్రీరామచంద్రుని శిబిరం. విభీషణుడు సీతాదేవిని తోడ్కొని వస్తు
న్నాడు ఆమెను చూడాలని వానరులు, రాక్షసులు త్రొక్కిసలాడుతున్నారు. వేత్ర
హస్తులు వారిని దూరంగా తరుముతున్నారు అంతా అల్లకల్లోలంగా ఉంది. అప్పుడు
రాముడు విభీషణా! ఎందుకు వీరినంతా తరిమిస్తున్నావు. అంతామనవారే. స్త్రీకి
సదాచారమే చక్కని ఆభరణం. ఇంకేవీకావు. పైగా ప్రమాదవ్యసనసమరస్వయం
వర వివాహయాగాది సమయాల్లో పరపురుష దర్శనం స్త్రీకి దోషం గాదు. విశేషించి
నేనే ఇక్కడున్నాను. నా సమక్షంలో ఆమెను చూడటం అసలే దోషంగాదు.
అన్నాడు. రాక్షసులు, వానరులు, వారులు దీరి నిలబడ్డారు. విభీషణుడు సీతను
తోడ్కొని శిబిరంలోకి ప్రవేశించాడు.

ఎదుట కోదండ రాముడు. ఆయన ప్రక్కనే లక్ష్మణుడు. అటు ఇటు చేతులు
జోడించి సుగ్రీవ హనుమ జాంబవదాదులు.

అన్ని కష్టాల తరువాత, అంత ఎడబాటు తరువాత, ఆ సీతారాముల కలయిక!
ఎంత ప్రేమగా భర్త తన్ను ఆహ్వానిస్తాడని ఆమె ఆశించిందో! ఎంత ఆర్ద్రంగా
రాముడామెను పలుకరిస్తాడని అక్కడి వారంతా అనుకొన్నారో !

సీత సిగ్గుతో తలవంచుకొంది.

శ్రీరాముడు చిరాకుగా ముఖం ప్రక్కకు త్రిప్పుకొన్నాడు శిబిరమంతా
మౌనం. అందరి ముఖాల్లోనూ ఆశ్చర్యం. ఎంతసేపు ఈ మౌనం ?

సీత అల్లన శ్రీరాముని వైపు చూచింది. ఆ రాముడు కోపంగా 'సీతా!
రావణుని సంహరించాను. పురుషుడుగా నా ప్రతిజ్ఞ నెరవేర్చాను హనుమ సముద్ర
లంఘన ప్రయాస ఫలించింది. సుగ్రీవ సాహాయ్యం సార్థకమైంది. విభీషణ శరణా
గతి చరితార్థమైంది. నీ చెర తొలగి పోయింది. అనగానే ఆమె ఆనందంతో—ఆశగా
ఆయన వైపు చూచింది.

'ఇదంతా నీకోసంకాదు' అన్నాడు గుండెలో బాణం గ్రుచ్చినట్లు ఆ కోదండ
రాముడు.

ఈ శ్రమ అంతా ధర్మాన్ని రక్షించటానికి; వంశగౌరవాన్ని కాపాడటానికి;

అపకీర్తిని తొలగించటానికి. అంతే. చిరకాలం నీవు శత్రుగృహంలో ఉన్నావు. నీ శీలం శంకాస్పదం. నేత్రరోగిదీపాన్ని చూడలేనట్లే నేను నిన్ను సహించలేకు న్నాను. ఇంక స్వేచ్ఛగా నీ ఇచ్ఛవచ్చిన చోటికి నీవు పోవచ్చు' అనగానే ఆమె కళ్ళవెంట అశ్రుజలం ధారాపాతంగా స్రవించింది.

అయినా రాముడు అంతటితో ఆగలేదు. సీతా! కావాలంటే లక్ష్మణుడు నిన్ను పోషిస్తాడు. భరతుడు నిన్ను పోషిస్తాడు. సుగ్రీవుడైన నీపోషణ భారం వహిస్తాడు; అనగానే ఆమె కన్నీ తుడుచుకుంది. ఒకింత తలయెత్తి 'మహావీరా! ప్రాకృతునిలా నీ విట్లు మాట్లాడటం భావ్యంగాదు. ప్రమాణం చేస్తున్నాను నా చరిత్ర నిష్కళంకం. ఇంత కాలం కలసి జీవించి ఇదేనా నీవు నన్నర్థం చేసుకొన్నది. ఈ సంగతి ముందుగా చెప్పగూడదా. హనుమ చెపితే ఆ నాడే ప్రాణ త్యాగం చేసే దాన్ని నీకు నీ మిత్రులకు ఈ యుద్ధప్రయాస తప్పేది' అని సౌమిత్రి వైపు చూచి చితిపేర్చమంది.

సౌమిత్రి అన్నవైపు చూచాడు. అన్న ఆమోదసూచకంగా తల ఆడించాడు.

సీత అగ్ని ప్రవేశం చేసింది.

వానరులు, రాక్షసులు హాహాకారాలు చేశారు. అంతులేని దుఃఖం అనుభవించారు.

రాముడు మౌనంగా కన్నీళ్ళు విడిచాడు. అన్ని కష్టాలు ఎదుర్కొని. అంత విరహదుఃఖం అనుభవించి, అంతమంది సహాయంతో ఆ రావణుని సంహరించి, పోగొట్టుకొన్న అర్ధాంగిని పొందిన ఏ మానవుడైనా పొంగులెత్తి ఆనందంతో ఆమెను స్వీకరించి సుఖసంతోషాలు అనుభవించేవాడు కాని శ్రీరాముని ధర్మనిష్ఠ, మనోనిగ్రహం లోకనిందకు వెరచాయి. ఆమెకు అగ్ని పరీక్ష పెట్టాయి.

అందరు అప్పుడు దుఃఖాన్ని అనుభవిస్తూనే శ్రీరామునికి అంజలి ఘటించారు. కరుడు బ్రహ్మాదులు నూడ ప్రత్యక్షమై ఆ ధర్మమూర్తిని ప్రశంసించారట. 'రామా! నీవు విష్ణుమూర్తివి. సీత లక్ష్మీదేవి. దుష్ట రావణ సంహారానికే మీరు భూమి మీద అవతరించారు' అని అన్నారట.

అంతలో అగ్నిదేవుడు తీసుకొని వచ్చిన సీత ఆ రాముని ముందు నిలిచింది. అగ్నిహోత్రుడు ఎలుగెత్తి ఆమె పవిత్రతను ప్రశంసించాడు.

అపూర్వ అద్భుత దృశ్యం! అందరికీ ఆనంద పారవశ్యం! శ్రీరాముడు అప్పుడు చిరునవ్వు నవ్వాడు. సాదరంగా సీతను చూచాడు. ఆప్యాయంగా ఆమెను దగ్గరకు తీసుకొన్నాడు. అందరు వినేటట్లు అగ్నిహోత్రునితో 'వైశ్వానరా! సీత మహాపతివ్రత. ఆ సంగతి నాకు తెలుసు. ముల్లోకాల్లో ఆమెకు ఏ పాపము అంటదు. ఆ సంగతి గూడ నాకు తెలుసు. రావణుడెంత దుర్మార్గుడైనా అగ్నిజ్వాల వంటి ఆమెను కాకలేడు. ఆ సంగతీ నాకు తెలుసు. అయితే ఎంతో కాలం ఆమె అతని ఇంట ఉంది. ఏ పరీక్ష లేకుండ పరిగ్రహిస్తే నన్ను కాముకుడని అనుకొంటారు. లోలోపల ఏవేవో గుసగుసలాడుకొంటారు. అది తొందరపాటు నాకు, నా తండ్రికి, ఇక్ష్వాకు వంశానికే అపకీర్తి తెస్తుంది. అందుకే ఆమె అగ్ని ప్రవేశాన్ని ఆమోదించాను' అనేసరికి వానరులు, రాక్షసులు, దేవతలు అంతా ఒక్కసారి హర్షధ్వానాలు చేశారట. ఆ దశరథమహారాజు గూడ ఆనంద బాష్పాలు రాల్చాడట.

విడిపోయిన సీతారాములు ఒకటయ్యారు. అది సీతారాముల జీవితంలో చిరస్మరణీయమైన రోజు.

రావణ సంహారానికి, రాముని ధర్మనిష్ఠకు సంతుష్టుడై దేవేంద్రుడు ఏ వరం కావాలో కోరుకొమ్మంటే రాముడు తనకేమీ అక్కరలేదన్నాడు. తన కొరకై ప్రాణాలర్పించిన వానర వీరులంతా బ్రతికించమన్నాడు. వానరులుండే ప్రదేశాల్లో ఫలాలు, జలాలు సర్వకాలాల్లో సమృద్ధిగా ఉండేటట్లు చెయ్యమన్నాడు.

విభీషణుడు కృతజ్ఞతా పూర్వకంగా రాముని లంకకు రమ్మని, స్నానాదికాలు పూర్తి చేసుకొమ్మని, తన ఆతిథ్యం స్వీకరించమని ఆపైన అయోధ్యకు వెళ్ళమని అర్థిస్తే - అందుకు గూడ రాముడు అంగీకరించలేదు. భరతునిమీద, తల్లులమీద తన మనస్సు ఉందన్నాడు. వారిని చూచేదాకా తనకేదీ అక్కరలేదన్నాడు. అయితే వానరులంతా తనకొరకు విపరీతంగా శ్రమపడ్డారని, వారందరికి స్నానాదికాలు, సత్కారాలు సమకూర్చమని చెప్పాడు.

విభీషణుడిచ్చిన విమానాన్ని మాత్రం ఆయన అంగీకరించాడు.

సీతారామలక్ష్మణులతో, సుగ్రీవ విభీషణులతో, వానరులతో, రాక్షసులతో, పుష్పకం అయోధ్యకు బయలుదేరింది. రాముడు ఆ విమానం నుండి సీతకు యుద్ధ భూమి చూపించాడు. అందలి విశేషాలు వివరించాడు. వివిధ వన ప్రదేశాలు

చూపించాడు. జరిగిన సంఘటనలన్నీ వర్ణించాడు.

పుష్పకం భరద్వాజాశ్రమంలో ఆగింది. ఆనాడు చైత్ర శుద్ధపంచమి. అరణ్యవాసం ముగిసిన మరుసటిరోజు. రాముడు విమానం దిగి ఆ మహర్షికి నమస్కరించాడు. 'స్వామీ! అయోధ్య సుభిక్షంగాఉందా ? భరతుడు ప్రజాహితంగా పాలన సాగిస్తూన్నాడా? మా తల్లులు ముగ్గురు సుఖంగా ఉన్నారా ? అని అడిగాడు.

ఆ మహర్షి నీకు తెలియనిదేముంది అన్నట్లు చిరునవ్వు నవ్వి 'అంతా కుశలమే' అన్నాడు. భరతుడు నీ రాకకోరకు ఎదురుచూస్తున్నాడు. నీకు ఏం వరం కావాలో కోరుకో అన్నాడు.

'మహర్షీ ! వానరులంతా నావెంట వస్తున్నారు. వారి ఆహారానికి అయోధ్యా మార్గంలో ఉండే వృక్షాలన్నీ ఫలభరితాలు, మధుమయాలు అయ్యేటట్లు చెయ్యండి. అదే నాకు వరం' అని అడిగాడు రాముడు.

భరతుడు పద్నాలుగేళ్ళుగా రాజ్యపాలన సాగిస్తున్నాడు. అధికారం మీద అతడు మమకారం పెంచుకొన్నాడేమో ! అలాంటప్పుడు తానువెళ్ళితే ఎలాగు ? పైకి ఏమనకున్నా లోలో పాల బాధ పడతాడేమో । అధికార స్వభావం అలాంటిది. అది అతి త్వరగా మమకారాన్ని పెంచుతుంది భరతుడు బాధపడటం తన కిష్టం లేదు. అందుచేతనే రామచంద్రుడు ముందుగా హనుమను పంపాడు. భరతునికి తనరాక తెలుపమన్నాడు. ఆ మాట విన్నప్పుడు అతని ముఖంలో, కళ్ళల్లో, మాటల్లో, ఏ మాత్రం రాజ్య మమకారం వ్యక్తమైనా వెంటనే వచ్చి మార్గ మధ్యం లోనే చెప్పమన్నాడు.

రాముని మనోధర్మజ్ఞత నిరుపమానం.

పుష్పకం అయోధ్య చేరింది. అతి వైభవంగా భరతుడు స్వాగత సత్కారాలు ఏర్పాటు చేశాడు.

అది శ్రీరామ పట్టాభిషేకం. పద్నాలుగేళ్ళుగా ప్రజలంతా ఎదురుచూసిన పట్టాభిషేకం. అయోధ్యా కిష్కింధా లంకా రాజ్యాల ఆనందాభిషేకం. సాధు జన హృదయాల అమృతాభిషేకం. ఆ రామపట్టాభిషేకానికి మహర్షులంతా వచ్చారు. మునులంతా వచ్చారు. సామంతులంతా వచ్చారు. పౌర జానపదులంతా వచ్చారు. వానరులంతా వచ్చారు. రాక్షసులంతా వచ్చారు.

అయోధ్య ఆనందంతో నిండిపోయింది.

అయిదు వందల నదుల నుండి జాంబవంతుడు జలం తెచ్చాడు. తూర్పు సముద్రం నుండి సుషేణుడు తెచ్చాడు. దక్షిణ సముద్రం నుండి ఋషభుడు తెచ్చాడు. పశ్చిమ సముద్రం నుండి గవయుడు తెచ్చాడు. ఉత్తర సముద్రం నుండి నలుడు తెచ్చాడు. అభిషేకమంటపంలో అన్నీ సువర్ణకలశాలు; పుణ్యజల పూరాలు.

సీతా సమేతుడై శ్రీరాముడు రత్నమయ సింహాసనం మీద ఆసీను డయ్యాడు.

మంగళవాద్యాలు మనోహరంగా మ్రోగాయి. వేదధ్వనులు వీనుల విందుగా మిన్నుముట్టాయి.

వసిష్ఠ మహర్షి మున్నుగా వామదేవజాబాలికాశ్యపకాత్యాయనసుయజ్ఞగౌతమ విజయ మహర్షులు వేదోక్త మంత్రాలతో శ్రీరాముని అభిషేకించారు. ఆ తరువాత ఋత్విజులు అభిషేకించారు. అవల బ్రాహ్మణులు: కన్యకలు, మంత్రులు; పౌరులు; వివిధయోధులు — అభిషేకించారు.

శత్రుఘ్నుడు శ్వేతఛత్రం పట్టాడు. సుగ్రీవ విభీషణులు వింజామరలు వీచారు. ఎందరెందరో కానుకలు తెచ్చారు. కన్నులు మిరుమిట్లు గొలిపే రత్న రాసులు, వస్త్రాలు ; నానావిధాభరణాలు. అంతేగాదు. అశ్వసమూహాలు ; గజసమూహాలు ; అనేకరథాలు:

ఇక రాముడు చేసిన దానాలకు అంతేలేదు. మిత్రులకు చేసిన సత్కారాలకు మితిలేదు. సుగ్రీవునకు కాంచనమాల ఇచ్చాడు. అంగదునికి బంగారు బాహు పురులిచ్చాడు. హనుమకు ఎంతో ప్రియమైన తన ముక్తాహారాన్ని సీతాదేవి చేతి మీదుగా ఇప్పించాడు. విభీషణ జాంబవదాదులను, వివిధదేశాధీశ్వరులను మంత్రి సామంతాదులను ఘనంగా సత్కరించాడు.

మహర్షులంతా శ్రీరాముని బలపరాక్రమాలు ప్రశంసించారు. ఆశీర్వదించారు. అగస్త్యమహర్షి రాక్షసవంశక్రమాన్ని గూర్చి వివరించాడు. రావణుని పుట్టు పూర్వోత్తరాలు చెప్పాడు. ఇంద్రజిత్తు వృత్తాంతం వినిపించాడు. హనుమ జన్మ క్రమాన్ని, వాలి సుగ్రీవుల ఉద్భవాన్ని తెలిపాడు.

శ్రీరామచంద్రుడు మహర్షులందరిని సన్మానించి సాగనంపాడు. సుగ్రీవుని కౌగిలించుకొని వీడ్కోలు చెప్తూ - అంగద హనుమలను ఆర్ద్రహృదయంతో ఆదరించమన్నాడు. వారుచెప్పే సలహాలను గూడ ఆమోదించమన్నాడు. విభీషణుని కౌగిలించుకొని వీడ్కోలు చెప్తూ లంకను ధర్మబద్ధంగా పాలించమన్నాడు

అందరి యెదుట హనుమ ముందుకువచ్చి, అశ్రుసిక్త నయనాలతో ఆ రామచంద్రునికి ప్రణమిల్లి 'స్వామీ ! నా మనస్సు ఎప్పుడూ నీయందే నిలిచి ఉండేటట్లు, లోకంలో నీ చరిత్ర ఉన్నంతకాలం నా శరీరంలో ప్రాణాలు ఉండేట్లు, నీచరిత్రతో పాటు నలుగురు నా చరిత్రను గూడ అనుకొనేటట్లు అనుగ్రహించు' మని అర్థించాడు. 'రామా ! నీ దివ్యచరితామృతాన్ని గ్రోలి గాలి మబ్బును తొలగించినట్లు నా ఉమ్మలికను తీర్చుకుంటా' నన్నాడు.

హనుమ మాటలు వినేసరికి రాముని మేను పులకించింది. ఆయన ఆసనం మీదినుండి లేచాడు. ఆ హనుమను గాఢంగా కౌగిలించు కొన్నాడు. హనుమా ! అలా నీ వన్నట్లే అవుతుంది. కృతజ్ఞత మహోత్తమ మానవధర్మం. నీవు చేసిన ప్రతి మహోపకారానికి నా ప్రాణమిస్తాను' అని తనమెడలోని చంద్రహారం ఆ హనుమ మెడలో వేశాడు. మరొకసారి గాఢంగా కౌగిలించుకొన్నాడు. అందరికి అదొక మనోహరదృశ్యం.

పట్టాభిషేకానికి వచ్చిన వారినందరా శ్రీరాముడు సాగనంపాడు. చివరకు పుష్పకాన్ని గూడ కుబేరుని కడకు పంపించాడు. రాజ్యపాలన ఆరంభించాడు.

అది రామరాజ్యం. ప్రజాహిత రాజ్యం. ధర్మసామ్రాజ్యం. ప్రభువుగా రాముని పరమార్థం ప్రజాహితం. ధర్మం ఆయనకు ప్రాణాధికం. అందుచేతనే ఆ రాజ్యంలో ఒడుదొడుకులు లేవు. ఉత్పాతాలు లేవు. ఈతి బాధలు లేవు. జబ్బు పీడలు లేవు.

వేళ [illegible] [illegible] [illegible] [illegible]. రాముని జీవితం ఇప్పుడు [illegible] [illegible]. ఆయన [illegible]కి అవకాశం ఏర్పడింది.

అది సీ[illegible] [illegible] [illegible]. అందమైన ప్రదేశాలు అనేకం చూచారు. [illegible] [illegible] [illegible]. అలసి ఒక అశోకం క్రింద

కూర్చున్నారు. అప్పుడు సీతమ్మ ఆ రాముని అంకంలో వ్రాలింది. ఆయన ప్రియమార ఆమె కళ్ళల్లోకి చూస్తూ 'సీతా ! త్వరలోనే నీవు నన్ను తండ్రిని చేయబోతున్నావు. చాల సంతోషం. ఏ వరం కావాలో కోరుకో' అన్నాడు అప్యాయంగా.

'స్వామీ ! తాపసాశ్రమాలకు మళ్ళా వెళ్ళాలని ఉంది. ఒక్క రోజైనా అక్కడ గడపాలని ఉంది. ఆ పవిత్రప్రశాంత వాతావరణం అంటే నాకు ఎంతో ఇష్టం' అంది ఆమె అల్లన నవ్వుతూ.

'అలాగే' అన్నాడు రాముడు. 'రేపే నిన్ను మునిపల్లెకు పంపుతా' నన్నాడు ఆ మాట అనటంలోనే అప్రయత్నంగా ఆయన స్వరం తీవ్రమైంది. అందుకు ఆయనే ఆశ్చర్యపోయాడు. ఆవేదన పడ్డాడు.

అంతలోనే వేగుల వారిని కలిసేవేళ అయింది. వెంటనే రాముడు లేచి వెళ్ళాడు. విజయుడు, మధుమత్తుడు, కాళియుడు, భద్రుడు, సుమాగధుడు మొదలైన వాళ్ళంతా ఆయన చుట్టూ చేరారు. అడిగిన విశేషాలన్నీ చెప్పారు. అయితే భద్రుడు మాత్రం చేతులు జోడించి 'స్వామీ ! సీతను గూర్చి లోకం చిత్రంగా అనుకొంటున్నది' అన్నాడు. 'అరమరికల్లేకుండా, చెప్పు' అన్నాడు ఆ రాముడు. పరపురుషుని యింట బహుకాలం ఉన్న భార్యను మన ప్రభువు నిస్సంకోచంగా ఇంటికి తెచ్చుకొన్నాడు. ఆయనలాగే మనమూ మన భార్యలపట్ల ప్రవర్తించవచ్చు' అని ప్రజలు అనుకొంటున్నారన్నాడు భద్రుడు.

రాముని మనస్సు చివుక్కుమంది. తక్కిన వారి వైపు చూచి 'ఇది నిజమా' అన్నాడు. 'అవు' నన్నట్లు అందరు తల ఊపారు. ఒక్కసారిగ చేతులెత్తి మ్రొక్కారు.

రాముడు చివాలున లేచాడు అంతఃపురానికి వెళ్ళాడు. ప్రభుజీవితంలో ఆయనకిది ప్రథమసమస్య. పెను సమస్య. ఎంతకాలమో సీతా వియోగంతో ఆయన బాధపడ్డాడు. వానరులనంతాపంపి ఆమె కొరకు వెదికించాడు. ఉగ్రరణంలో ఆ రావణుణ్ణి, రాక్షసవీరుల్ని వధించాడు. సీతాదేవి చెర విడిపించాడు. ఆమెకు అగ్నిపరీక్షజరిపించాడు. పవిత్ర చరిత్రగా పరిగ్రహించాడు. పైగా ఇప్పుడామె గర్భవతి. పతిగా తననుండి ఆమె ఎంతో ప్రేమ, ఆదరణ ఆశిస్తూ ఉంది. అలాంటి

అయితే తాను ప్రభువు. ధర్మబద్ధంగా ప్రజలను పాలించే ప్రభువు. ప్రజాహితాన్ని కోరే ప్రభువు. ప్రజాభిప్రాయాన్ని గౌరవించే ప్రభువు. ఇప్పుడీ ప్రజాపవాదాన్ని ఏం చేయాలి ; భర్తృధర్మానికి, ప్రభు ధర్మానికి ఇదొక పెద్ద పరీక్ష. అయితే భర్తృ ధర్మం వైయక్తికం ; ప్రభుధర్మం సామాజికం.

రాముడు ప్రభుధర్మం వైపే మొగ్గాడు ప్రజాభిప్రాయాన్ని మన్నించాడు. భార్యను పరిత్యజించాలని నిర్ణయించాడు. వెంటనే తమ్ములను పిలిపించాడు. తన నిర్ణయాన్ని తెలిపాడు పాపం ! తమ్ములేదో మాట్లాడబోయారు.

'అపకీర్తిని దేవతలు నిందిస్తారు. కీర్తి త్రిలోకారాధ్యం. మహాత్ములు కీర్తి కొరకే జీవిస్తారు. అపకీర్తి భయానికి నేను ప్రాణాలనైనా వదులుతాను. తమ్ములనైనా వదులుతాను. సీతను వదలటం ఒక విశేషంగాదు' అని రాముడు అనేసరికి ఎవ్వరూ ఏమీ మాట్లాడలేక పోయారు. ఆయన లక్ష్మణుని వైపు తిరిగి 'రేపనే నీవు సీతను తీసుకువెళ్ళు. గంగానదికి ఆవలిగట్టున వాల్మీక్యాశ్రమ ప్రాంతంలో వదలిరా' అన్నాడు. అందుకు ఆ తమ్ముడు తలవంచాడు.

సీతాపరిత్యాగం జరిగింది.

శ్రీ రాముడు చింతాక్రాంతు డయ్యాడు. లక్ష్మణుడు తిరిగి వచ్చాడు. రాముడు ఆయనకు ఎన్నో ధర్మకథలు చెప్పాడు బహుశః తన మనోవేదన తగ్గించుకోటానికేమొ.

అంతలోనే యమునా తీరవాసులైన మహర్షులు వచ్చారు. లవణాసురుని వృత్తాంతం చెప్పారు. వాడిని వధించి తమబాధలు తీర్చమని అర్థించారు. ఆ మహర్షులకు రాముడు అభయ హస్తమిచ్చాడు ఆ పని శత్రుఘ్నునికి అప్పగించాడు.

లవణాసురవధ జరిగింది. ఆ రాజ్యానికి రాముడు శత్రుఘ్నుణ్ణే అభిషిక్తుణ్ణి చేశాడు. శత్రుఘ్నుడు అన్నను చూడాలని పన్నెండేళ్ళ తరువాత అయోధ్యకు వస్తే ఎక్కువకాలం ప్రభువులు పాలన వదలి ఎక్కడో ఉండగూడదని కాబోలు ఏడు రాత్రులు ఉండటానికిమాత్రమే అనుమతించాడు. 'అప్పుడప్పుడు నీవు అయోధ్యకు రావచ్చునని, అయితే ఇక్కడ ఎక్కువకాలం ఉండటం ఉచితం కాదని, పాలన

క్షత్రియ ధర్మమని, ఏలికలకు ఎడబాటు సహజమ'ని శత్రుఘ్నునికి చెప్పి పంపాడు

రాజ్యపాలనలో రాముని కలవరపరచిన అంశం బ్రాహ్మణకుమారుని బాల్య మరణం. ఆ అకాలమరణానికి కారణం అన్వేషించండని ఆయన వసిష్ఠవామదేవాది మహర్షులను, మంత్రులను, భరత లక్ష్మణులను, పెక్కుమంది నీతిశాస్త్రజ్ఞులను సమావేశపరచాడు. నారదమహర్షి త్రేతాయుగ ధర్మాలకు విరుద్ధమైన శూద్రతపస్సే అందుకు కారణమన్నాడు. అప్పుడు రాముడు అన్వేషణ సాగించి శంబూకుని వధించాడు. శంబూక వధకుసంతోషించి దేవతలంతా 'నీకేం వరం కావాల'ని శ్రీరాముని అడిగితే ఆ బ్రాహ్మణకుమారుడు బ్రతికితే చాలన్నాడు. అగస్త్యమహర్షి ఆతిథ్యం స్వీకరించి అయోధ్యకు తిరిగి వచ్చాడు

రాముడు రాజసూయయాగం సంకల్పించాడు. భరతుడు, రాజులజయించటంలో హింస జరుగుతుందని అనగానే ఆయాగానికి స్వస్తి చెప్పాడు. లక్ష్మణుని సలహాననుసరించాడు. అశ్వమేధయాగం చేశాడు.

అశ్వమేధయాగం రాముని జీవితంలో ఒకవిచిత్రమైన సంఘటన, అది కుశ లవులను రామునితో కలిపింది. సీతను ఆయన చెంత చేర్చినట్లే చేర్చి శాశ్వతంగా దూరం చేసింది.

గోమతీ తీరంలో— నైమిశారణ్యంలో అశ్వమేధ యాగశాలా నిర్మాణం జరిగింది అక్కడికి అన్ని దిక్కుల నుండి మహర్షులు వచ్చారు. మంత్రి సామంత పురోహితులు వచ్చారు వివిధ దేశాధీశ్వరులు వచ్చారు. సుగ్రీవాంగద హనుమాది వానరులంతా వచ్చారు విభీషణాది రాక్షసులంతా వచ్చారు ఎచ్చట చూచినా పర్ణశాలలే; గూడారాలే ! ప్రజాసమూహాలే. ప్రతిదినం వేద మంత్రాలు; దానసత్కారాలు; విందు విశేషాలు; నృత్య సంగీత వినోదాలు.

ఆయాగ మహూత్సవం సంవత్సరం సాగింది. యాగాశ్వం వెంట లక్ష్మణుడు వెళ్ళాడు

వాల్మీకి మహర్షి ఆ యాగానికి వచ్చాడు. ఆయన శిష్యులు కుశలవులు రామకథాగానం చేశారు. అది అన్ని కార్యక్రమాలకు తలమానికం శ్రోతలంతా ఉబ్బితబ్బిబ్బులూగారు శ్రీరాముడు ఆశ్చర్యపోయాడు. ఆనంద పరవశుడయ్యాడు. అది

తన కథ. రామకథ, ఆశ్రితుల తన కథ వింటూ ఉంటే తనకే తనువు పులకిస్తూ ఉంది. అది అంతరమ్యంగా ఉంది. గానం చేసిన కుశలవులు ఏవరో! మహామనోహరంగా ఉన్నారు. అచ్చం తన ప్రతిబింబాల్లా ఉన్నారు. వాళ్ళను చూస్తూ ఉంటే ఏదో ఆత్మీయత హృదయాన్ని అలముకుంటూ ఉంది. అనిర్వాచ్య మైన అనుభూతి ఏదో మనస్సును ఊపుతూ ఉంది. తన పోలికలున్నందుకో! తన కథ విన్నందుకో!

రాముడు నిలువెల్ల పులకించాడు ఆ మునిబాలకులను నిండుగా సత్కరించ మన్నాడు. లక్ష్మణుడు లెక్కలేనన్ని బంగారు కానుకలు తెచ్చాడు. అయితే ఒక్క మాటతో ఆ బాలకులు వాటిని తిరస్కరించారు. అందుకు రాముడు ఆశ్చర్యపడ్డాడు. ఆప్యాయంగా వారిని దగ్గరకు తీసుకొన్నాడు. ప్రక్కన కూర్చుండ బెట్టుకొన్నాడు. ప్రియాతిప్రియంగా 'ఈ కథ మీకెవరు చెప్పారన్నాడు.

మా గురువు గారు'

ఎవరో వారు?

వాల్మీకి మహర్షులవారు

ఆహా! అయితే మీ తల్లి దండ్రులు?

'మా తల్లి సీతమ్మ'

తండ్రి?

మౌనం

రాముని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఋగలు విసురిల ఆ బాలురను పంపించాడు. వెంటనే వాల్మీకి మహర్షి దగ్గరకేగి 'సీత పవిత్ర చరిత్రే అయితే, తన పాతివ్రత్యాన్ని రేపు అందరి ముందు నిరూపించుకొమ్మని చెప్పండి' అని చెప్పి పంపాడు.

మరునాడు మహాసభ. అది వసిష్ఠవామదేవాది పురోహితులు. జాబాలిచ్యవన విశ్వామిత్రాది మహర్షులు, పెక్కుమంది బ్రాహ్మణోత్తములు. వివిధ దేశాధీశ్వరులు, పౌరజానపదులు, వానర రాక్షసులు ఆసీనులైన సభ.

ఆ సభలోకి వాల్మీకి మహర్షి [illegible] సీతను వెంటబెట్టుకు వస్తున్నాడు. ఆయన వెంట వేదం [illegible] సీత [illegible] నడిచి వస్తున్నది. అందరు ఒక్కసారిగా హర్షధ్వానాలు చేశారు. వాల్మీకి మహర్షి [illegible] దీరిన ఆ

రాముడు ముందు నిలిచాడు. సభనంతా కలయ జూచాడు. 'శ్రీ రామా ! ఈ సీత పవిత్ర చరిత్ర. మహా పతివ్రత. కుశలవులు నీ కుమారులు. నా ఆశ్రమంలోనే జన్మించారు. ఇది సత్యం. ఈ సభా సమక్షంలో సగౌరవంగా నీ సతీ సుతులను స్వీకరించు' అని శాంత గంభీరస్వరంతో పలికాడు.

సదస్యులంతా పులకించారు.

సీత ముఖం వికసించింది.

శ్రీరాముడు 'మహర్షీ ! మీరన్నట్లు సీత పవిత్ర చరిత్రే. ఆ సంగతి నాకూ తెలుసు ఆమె అగ్ని పరిశుద్ధకూడ. అయితే అపవాదకారణంగా ఆమెను పరిత్యజించాను. అందుచేత ఆమె తన పాతివ్రత్యాన్ని ప్రమాణ పూర్వకంగా ఈ సభా సమక్షంలో నిరూపించుకుంటే గాని నేనామెను ప్రేమించలేను' అన్నాడు.

అందరి నిశ్శ్వాసాలు ఒక్క నిముషం ఆగాయి.

సీత వంచిన తల యెత్తనేలేదు. చేతులు జోడించి చెమ్మగిల్లిన కళ్ళతో ఒకింత ముందుకు వచ్చి 'అమ్మా ! భూదేవీ ! నేను రాముని కంటె అన్యుని స్మరించకుండా ఉన్నట్లయితే నీ హృదయంలో నాకు స్థాన మివ్వు. తల్లీ ! భూదేవి ! నేను త్రికరణ శుద్ధిగా శ్రీ రాముని పూజిస్తున్నట్లయితే నీ హృదయంలో నాకుస్థాన మివ్వు. మాతా ! భూదేవీ ! నా మాట సత్యమే అయితే నీ హృదయంలో నాకు స్థాన మివ్వు'— అనగానే భూమి బ్రద్దలైంది. అందుండి సింహాసనం వచ్చింది. భూదేవి సీతాదేవిని బాహుపులతో కౌగిలించి ఆ ఆసనం మీద కూర్చుండబెట్టుకొని అంతర్ధానమైంది.

అదొక అద్భుత దృశ్యం. అపూర్వ సంఘటన. అందరు ఆశ్చర్యంలో మునిగి పోయరు.

రాముడు సీతా ! సీతా , సీతా ! అని వాపోయాడు ఇక సీత లేదు. తిరిగి రాదు.

రాముడు ఎంత కాలమో కుమిలిపోయాడు.

కొంతకాలానికి కేకయరాజు యధాజిత్తు కోరికను పురస్కరించుకొని భరతుని, అతని పుత్రుల్ని గాంధార దేశం మీదికి దండయాత్ర పంపాడు. ఆ దేశాన్ని జయించిన తరువాత భరతపుత్రులైన తక్ష పుష్కరుల్ని అక్కడే అభిషేకించాడు, భర

లక్ష్మణుడు మొదటిదే మేలను కొన్నాడు లోనికి వెళ్ళాడు. ఆ మహర్షి రాకను అన్నకు వినపించాడు.

అయితే అన్నతో మాట్లాడుతూ ఉన్న ముని మధ్యలోలేచి వెళ్ళాడు. రాముడు దుర్వాసుని ఆహ్వానించాడు, దుర్వాసుడు 'రామా! నా వెయ్యేండ్ల తపస్సు పూర్తి అయింది. ఆకలి మండుతూ ఉంది అన్నం కావాలి అన్నాడు.

'అలాగే' అని అమృతోపమానమైన అన్నం వడ్డించాడు ఆ రాముడు.

దుర్వాసుడు తృప్తిగా తిని లేచి వెళ్ళాడు. రాముడు చింతాక్రాంతుడయ్యాడు. ఏకాంత సంభాషణకు ఎవరు అంతరాయం కలిగించినా వారిని అంతంచేస్తానని ప్రతిజ్ఞచేశాడు రాముడు తన అనుగు తమ్ముడు లక్ష్మణుడే ఇప్పుడు ఆజ్ఞ మీరాడు.

ఏం చెయ్యాలి ?

జీవితంలో సర్వసుఖాలు తన కొరకు త్యాగంచేసి, తనకు, తన భార్యకు సేవలు చేసి, ఈనాడుగూడ తనక్షేమం, తన రాజ్యక్షేమం కోరి తన ఆజ్ఞనుల్లంఘించిన అనుగు తమ్ముని లక్ష్మణునిక్షమించటమా ద్వారపాలకుడుగా అతనిని శిక్షించటమా ? లేక ఆజ్ఞనుల్లంఘించిన భ్రాతృప్రేమను ఆదరించటమా ? చేసిన ప్రతిజ్ఞను పాలించటమా ? పెద్ద ధర్మ సమస్య !

రామునికి ఏమీ తోచలేదు. ఆయన తనలోతాను నలిగి పోయాడు. అప్పటికీ తమ్ముడు లక్ష్మణుడు వచ్చి తన్ను శిక్షించమన్నాడు అయినా రాముడు నిర్ణయానికి రాలేక పోయాడు. మరునాడు సభ చేశాడు మంత్రి పురోహితులనంతా పిలిచాడు. తన సమస్యను వారి ముందు పెట్టాడు. ఎట్టకేలకు వసిష్ఠమహర్షి వాక్యానుసారం వైయక్తికమైన సోదరప్రేమకు స్వస్తి చెప్పి, సామాజికమైన ప్రభుధర్మానికి ప్రాధాన్య మిచ్చాడు ప్రభువుగా తాను చేసిన ప్రతిజ్ఞను పాలించాలని నిర్ణయించాడు సాధుజనులపట్ల మరణ దండన, దేశబహిష్కారం సమానమే గనుక ప్రియ సోదరుని (లక్ష్మణుని) బహిష్కరించాడు.

ఒక్కొక్కప్పుడు ప్రభుధర్మం మహాభయంకరం. పరమబాధాకరం. దానికి అనురాగాలుండవు ఆత్మీయతలుండవు. విసిరి వేసిన కత్తిలా ఎదుటివారిని తగలటమే దానిపని.

అర్ధాంగి ఇది వరకే రామునికి దూరమైంది. ఇప్పుడు అనుగు తమ్ముడు

దూరమయ్యాడు రాముడు భరతునికి పట్టంగట్టి అడవులకు వెళ్ళాలనుకొన్నాడు' ఆ విధంగా మనశ్శాంతి ఉంటుందనుకొన్నాడేమో !

కాని భరతుడు అందుకు అంగీకరించలేదు. అందుచేతనే కుశలవులను పట్టాభిషిక్తుల్ని చేసి (కోసల ఉత్తర కోసల దేశాలకు) సరయూ ప్రవేశం చెయ్యాలని శ్రీరాముడు నిర్ణయించాడు భరతుడు అన్నవెంట వస్తానన్నాడు. శత్రుఘ్నుడు పుత్రులకు పట్టంగట్టి అయోధ్య చేరుకొన్నాడు. సుగ్రీవుడు అంగదుని అభిషేకించి హనుమజ్జాంబవంతులతో మైంద ద్వివిదులతో, ఎందరెందరో వానరులతో అయోధ్యకు వచ్చాడు. విభీషణుడు గూడ వివిధ రాక్షసులతో అయోధ్యకు అయోధ్యకు చేరుకొన్నాడు. అయోధ్యావాసులంతా ఆ రాముని వెంట వెళ్ళటానికి అయత్తమయ్యారు. అంతా వరుసలు దీరి నిలబడ్డారు.

అప్పుడు రాముడు విభీషణుని వైపు తిరిగాడు. 'విభీషణా ! ఎంతవరకు ప్రజలుంటారో అంతవరకు లంకలో నీవుంటావు. ఎంతవరకు సూర్యచంద్రులుంటారో, ఎంతవరకు భూమి ఉంటుందో ఎంత వరకు రామ కథ లంకలో వ్యాపించి ఉంటుందో అంతవరకు నీవు రాజ్యం చేస్తావు అయితే ధర్మబద్ధంగా ప్రజలను పాలించు. జగన్నాధుని పూజించు' అన్నాడు.

ఆ తరువాత హనుమ దగ్గరకు వెళ్ళాడు. 'హనుమా ! నీకు జీవించాలని ఉంది నా కథ లోకంలో ఎంతకాలం ఉంటుందో అంతకాలం అది విని ఆనందిస్తూ ఉండు నా ఆజ్ఞలు పాలిస్తూ ఉండు' అన్నాడు.

జాంబవంతుణ్ణి మైంద ద్వివిదుల్ని చూచి 'విభీషణహనుమలతో పాటు మీరూ కలియుగారంభం దాకా ఉండం' డన్నాడు.

తన వెంట రావటానికి వరుసలు దీరి నిలబడ్డ జన్నాంతా ఒక్కసారి చూచాడు. ఆయన చిరునవ్వు నవ్వలేదు. కంట తడిపెట్టలేదు. పెదవి విప్పి మాటాడలేదు.

రాము డప్పుడు నిర్వికారుడు. అగ్నిహోత్రం, శ్వేతఛత్రం పట్టుకొని బ్రాహ్మణోత్తములు ముందు నడిచారు. తెల్లని పట్టు వస్త్రాలు కట్టుకొని, చేత దర్భలు పట్టుకొని, గాయత్రిని జపిస్తూ, అంతర్ముఖుడై ఆ రామచంద్రుడు నడిచాడు ఆయన వెంట భరత శత్రుఘ్న సుగ్రీవులు, ఆ తరువాత అయోధ్యా పురవాసులు. వెనుక

వానరులు, రాక్షసులు, వివిధ జంతువులు, పక్షులు అయోధ్యలో ప్రాణి అన్నది ఏదీ మిగులలేదు.

అపౌక మహాప్రస్థానం. మౌన మానవ మహా ప్రవాహం.

అందరు సరయూతీరాన్ని చేరుకొన్నారు. ఒక్కసారి రాముడు ఆ నదీ ప్రవాహాన్ని అలా తిలకించాడు. అడుగు ముందుకు వేశాడు. ఆ ప్రాణి ప్రవాహం నీటి ప్రవాహంలో కలిసి పోయింది. శ్రీరాముని సరయూ ప్రవేశం ముగిసింది.

బ్రహ్మదేవుడు రామునికి స్వాగతం పలికాడట. రాముడు తమ్ములతో గూడ వైష్ణవ తేజాన్ని పొంది శ్రీ మహా విష్ణువుగా వైకుంఠాన్ని అలంకరించాడట. సుగ్రీవుడు సూర్యమండలం చేరాడట. తక్కిన వారంతా తమ తమ తేజోరూపాలు పొందారట.

శ్రీమద్రామాయణంలో శ్రీరాముని జీవితం సంఘటనాత్మకం. పుత్రుడుగా, మిత్రుడుగా, శత్రువుగా, భర్తగా, ప్రభువుగా ఆయన ఎన్నో సంఘటనలు ఎదుర్కొన్నాడు ప్రతి సంఘటన వ్యక్తికి ఒక పరీక్ష: క్రొత్త అనుభవం. వ్యక్తి సంస్కారం వ్యక్తమయ్యేది, అతడు మహాత్ముడుగా మీది కెదిగేది, లేదా పాపాత్ముడుగా పతన మొందేది ఈ జీవిత సంఘటనల్లోనే.

శ్రీరాముడు ప్రతి సంఘటనలో పైకి ఎదిగాడు. తన మనస్సును దేహానికి, ఇంద్రియాలకు, స్వార్థానికి దూరం చేశాడు. ధర్మానికి ముడివేశాడు. మహాత్ముడుగా మీది కెదిగాడు. దశరథరాముడు అయోధ్యారాముడయ్యాడు. సీతారాముడు కోదండ రాముడయ్యాడు. కోదండ రాముడు పట్టాభిరాముడయ్యాడు. పట్టాభిరాముడు ఆత్మా రాముడయ్యాడు. అమృత రాముడయ్యాడు, ఆనందరాముడయ్యాడు.

శ్రీరాముని జీవితమేగాదు ఎవరి జీవితమైనా ఇంతే. మానవ జీవితానికే ఆ రాముని జీవితం ఒక మహాదర్శం అంతే.